# దివాకర్ల వేంకటావధాని జీవితం-సాహిత్యం




పిహెచ్.డి పరిశోధనా గ్రంథం



డా॥ గొళ్ళ కుమారస్వామి నాయుడు

# దివాకర్ల వేంకటావధాని
# జీవితం - సాహిత్యం

(పిహెచ్.డి పరిశోధనా గ్రంథం)

డా. గోళ్ళ కుమారస్వామి నాయుడు

ప్రచురణ



రిజిష్టర్డ్ నెం. 1/64

# DIVAKARLA VENKATAVADHANI JEEVITAM - SAHITYAM

BY

DR. G. KUMARASWAMY NAIDU

ప్రచురణ: 163

ప్రథమ ముద్రణ: 1998

ప్రతులు: 1000

కవర్ డిజైన్: శీలావి

ముద్రణ: శ్రీ బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్,
చిక్కడపల్లి, హైదరాబాదు

వెల: రూ 150

ప్రతులకు : యువభారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్తు
తిలక్‌రోడ్డు, హైదరాబాద్-500 001

మరియు

శ్రీమతి జి.బి. లక్ష్మి,
ప్లాట్ నెం. 40,41,
హస్తినాపురం కాలని సెంట్రల్ (పి.ఎన్.ఆర్)
హైదరాబాదు-500 074
టెలిఫోన్ : 4025132

---

ఈ గ్రంథం పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారి ఆర్థిక సహాయంతో ప్రచురింపబడినది.

# అంకితం

పూజనీయులైన తల్లిదండ్రులు

గోళ్ళ లక్ష్మయ్య నాయుడు

పార్వతమ్మ గార్లకు

ఆచార్య దివాకర్ల మెమోరియల్ ట్రస్టుకు రూ 25,000
ఆర్థిక సహాయం అందించిన ఉదారులు

వారి పెద్ద కుమారుడు

**దివాకర్ల సీతారామ శర్మ**

ఇంజనీర్ ఇన్‌ఛీఫ్ గారు ( రిటైర్డ్)

గ్రంథ ప్రచురణకు ఆర్థిక సహాయం అందించిన దాతలు

1) శ్రీమతి మహాలక్ష్మి భర్త చావలి రామమూర్తిగారు రూ. 5,000

2) శ్రీమతి వేంకటలక్ష్మి భర్త ఆచంట సుబ్రహ్మణ్యంగారు రూ. 5,000

3) శ్రీమతి ఆర్ గాయత్రి భర్త దీక్షిత్ గారు రూ. 5,000

4) ఆచార్య శ్రీమతి రాజేశ్వరి భర్త చుక్కా వెంకటయ్య గారు రూ. 5,000

5) శ్రీమతి ఏలేశ్వరపు అరుణశ్రీ

భర్త ఏలేశ్వరపు శేషతల్పశాయిగారు రూ. 5,000

సంస్కృత సాహిత్య రత్న విద్యాప్రవీణ
డా. కె. రాజన్నశాస్త్రి M.A., Ph.D., MOL
(రిటైర్డ్ రీడర్, ఉస్మానియా విశ్వవిద్యాలయం)
12-12-92, రవీంద్రనగర్
సీతాఫల్‌మండి, సికిందరాబాదు.

# అభినందన

దివాకర్ల వేంకటావధాని జీవితం - సాహిత్యం అను ఈ గ్రంథము నా పర్యవేక్షణలో ఉస్మానియా విశ్వవిద్యాలయమునుండి Ph.D పొందినది. దీని రచయిత డా. జి. కుమారస్వామి నాయుడు - పుట్టినది రైతు కుటుంబముననే అయినా సాహిత్య క్షేత్ర మున వ్యవసాయము చేయుచున్న కృషీవలుడీతడు. శ్రీమద్రామాయణ కల్పవృక్షములో శబరి పాత్ర అను గ్రంథము రచించి M.Phil పట్టా పొందినవారు. సరసహృదయుడు - భావుకుడు, విమర్శకుడు, వినయశీలుడు.

దివాకర్ల వేంకటావధాని జగమెరిగిన మహాపండితుడు. ఉస్మానియా విశ్వవిద్యాలయ తెలుగు శాఖాధ్యక్ష పదవికే అలంకారుడు. అమృత హృదయుడు - గుణమే తప్ప ఇతరులలో దోషమెత్తి చూపని సంస్కారవంతుడు - అనర్గళ వాగ్ధాటీ సమ్మోహిత జన సందోహుడు - వారికి నా యెడ అమిత వాత్సల్యము - వారి పర్యవేక్షణలోనే నేను Ph.D పట్టమును పొందితిని - ధ్వని సిద్ధాంతమును విశ్లేషించి మనుచరిత్రమున సమన్వయించితిని - ఈ సిద్ధాంత వ్యాసమే నా, ధ్వని - మనుచరిత్రము - నేను ఉస్మానియా విశ్వవిద్యాలయ - సంస్కృత పరిషత్తున 1964-66 రెండు సంవత్సరములు సాహిత్య రత్నాకరమును నౌకా-మందర వ్యాఖ్యలతో వైమర్శికముగా పరిష్కరణ గావించితిని. అప్పటినుండి డా. దివాకర్ల వేంకటావధానితో నాకు మైత్రీబంధమేర్పడినది. నాకు గల అలంకార శాస్త్ర పాండిత్యమును గుర్తించి శ్రీ అవధానిగారు నన్ను ధ్వని సిద్ధాంతముపై గ్రంథము వ్రాయుటకు నాకీ పరిశోధనాంశమును శ్రమించుటకు ప్రేరేపించి నన్ను కృతకృత్యులనుగా చేసిరి.

డా. దివాకర్ల వారితో నా సాన్నిహిత్యమితింత యనరాదు - వారెక్కడికి వెళ్లినను నన్ను వెంట తీసుకొని వెళ్లెడివారు. సాహిత్య సభలు ఆధ్యాత్మిక సభలు అన్నింటిలో నేను వారిని వెంబడించియే యుండెడివాడను. ప్రతి దినము సాయం సమయము వారి స్వగృహమున వారితో గడిపెడివాడను. వారి పర్యవేక్షణలో నేనెంతయో సాహిత్య సేవ చేసితిని.

డా. జి. కుమారస్వామి నాయుడు నా పర్యవేక్షణలో డా. దివాకర్ల వేంకటావధాని జీవితం - సాహిత్యం అను పరిశోధన గ్రంథమును రచించి వెలయించుట నాకెంతయో ఆనందమును కలిగించుచున్నది.

డా. జి. కుమారస్వామి నాయుడు ఈ గ్రంథమును రచించుటకు ఎంతయో కృషి చేసిరి. నిక్షిప్తములైయున్న వారి రచనలను సేకరించుటయే కాక వారి జీవిత విశేషములు తెలుసుకొనుటకై ఎంతయో శ్రమించిరి. కావుననే వారి ఈ రచన సమగ్రతను సంతరించుకున్నది. అయిదు ప్రకరణములుగల ఈ గ్రంథంలో డా. నాయుడు అవధానిగారి జీవిత విశేషములను బాల్యమునుండి చరమ దశ వరకు జరిగినవన్నింటిని క్రోడీకరించి విశదీకరించినారు. పద్యకృతులు వచన కృతులు సాహిత్య సమావేశాలు, ఆధ్యాత్మిక ప్రవచనాలు, సాహిత్య రూపకాలు, వివిధ ప్రసంగాలు అవి ఇవి యననేల అన్నింటిని శ్రీ నాయుడు తన సిద్ధాంతములో విశ్లేషించి వివరించినారు. ఇది శ్రీ నాయుడు గాఢ పరిశీలనా శక్తికి నిదర్శనము. పద్యకృతులను గూర్చి వచన కృతులను గూర్చి వివరించునపుడు ఆయా గ్రంథముల కథాంశమును కూడా సంగ్రహించి ఆయా పద్య వచన భాగములను వానిలోని నిగూఢార్థములను విశ్లేషించి చూపినారు. అనువాద గ్రంథములను మూల గ్రంథములతో పోల్చి అవధానిగారి అనువాద కౌశలాన్ని చాటి చెప్పినారు.

ఒక్క మాటలో చెప్పాలంటే ఈ గ్రంథము అవధానిగారి జీవిత విశేషములయొక్కయు సాహిత్యముల యొక్క సర్వస్వమనవచ్చును. అవధానిగారి సమగ్ర వ్యక్తిత్వమునకు అద్దము పట్టినది.

మహాపురుషుల జీవిత వ్యక్తిత్వములు తెలియుటచే భావి పౌరులు ఆదర్శపౌరులుగా మారుటకు నవకాశము కలదు. కావున ఈ గ్రంథము అందరికి అవశ్య పఠనీయము.

నా పర్యవేక్షణలో ఇట్టి అమూల్య గ్రంథమును కడు శ్రద్ధతో శ్రమయనక పరిశోధించి రచించి వెలయించిన డా. జి. కుమారస్వామి నాయుడు గారిని అభినందించుచున్నాను.

ఇట్లు

**కె. రాజన్నశాస్త్రి**

డా. జి.వి. సుబ్రహ్మణ్యం
రిటైర్డ్ తెలుగు ప్రొఫెసర్
స్కూల్ ఆఫ్ హ్యుమానిటీస్ మాజీ డీన్
యూనివర్శిటీ ఆఫ్ హైదరాబాద్,
హైదరాబాద్ 500 134.

# గురుపూజ

నీవు గురుఁడవు శిష్యుఁడ నేను తండ్రి!
నీదు వెలుఁగుల జిలుగును నెమ్మి మీఱ
పలుకులందున నిలిపిన బాలకుండ
బాట నీయది తడబడు పదము నాది.

దివాకర్ల వారిని తలచుకోగానే ఇరవయ్యో శతాబ్దపు పూర్వార్ధంలో రూపుకట్టిన ఆదర్శ ఆంధ్రాచార్యుని సజీవ చిత్రం ప్రత్యక్షమౌతుంది. కట్టులో, బొట్టులో, రీతిలో, నీతిలో, విద్వత్తులో, వినయంలో, ధారణలో, ధోరణిలో అచ్చమైన తెలుగుదనం వెలిగే ప్రతిభ వారిలో మూర్తీభవించింది. ఆనాటి ఆంధ్రాచార్యుడంటే జీతం కోసం తెలుగుపాఠం చెప్పి బయటపడే ఉపాధ్యాయుడు కాడు. అధ్యయన అధ్యాపనాలను జీవితవ్రతంగా చేపట్టే దీక్షితుడు. అతడు పద్యాన్ని భావయుక్తంగా చదవగలిగి ఉండాలి; పద్య కవిత వ్రాయగలిగి ఉండాలి; ప్రాచీన సాహిత్యంలో ఏ ప్రకియను గురించి అయినా సాధికారికంగా చెప్పగలిగి ఉండాలి; పరిశోధన చేయగలిగి ఉండాలి! బోధించేటప్పుడు గాని ఉపన్యసించేటప్పుడు కాని పుస్తకాన్ని చూచి పద్యాలను ఉదహరించరాదు. ధారణ ఆధారంగానే చదవాలి. శబ్దాల సాధుత్వాసాధుత్వాలను గురించి ప్రయోగ ప్రమాణాలతో నిర్దుష్టంగా నిరూపించగలగాలి; కావ్య ప్రయోగాలకు వ్యాకరణ శాస్త్ర సూత్రాలతో ప్రామాణికత్వం కలిగించే ప్రజ్ఞను ప్రదర్శించాలి; విద్యార్థులకు బోధించటంలో, విద్వాంసులతో చర్చించటంలో, ప్రజల కోసం ఉపన్యసించటంలో మెళుకువలను తెలుసుకొని ప్రదర్శించగలిగి వుండాలి. అధ్యాపకునిగానే కాక మహోవక్తగా కూడా రాణించాలి. వీటన్నింటికి తోడు నాటకాది దృశ్యకళల్లో పరిచయం కలిగి ఉండాలి. నాటకాలు వ్రాయాలి నాటకాలు వేయాలి. ఉద్యోగధర్మంలో జీతం పుచ్చుకున్నా గ్రంథాలకు పీఠికలు వ్రాయటంలో కాని, సాహితీ

సదస్సులలో పాల్గొనటంలో కాని ప్రతిఫలాన్ని ఆశించకూడదు. ఆదరాభిమానాలతో అభిమానులు ఇచ్చిన దానితో తృప్తిపడాలి. దయ, దాక్షిణ్యం, మానవతా దృక్పథం, శిష్య వాత్సల్యం, సాహితీ శీలం ఆదర్శ ఆంధ్రాచార్యుని గుణ పంచకం. ఈ లక్షణాలన్నింటికీ లక్ష్యప్రాయుడైన ఆంధ్రాచార్యులు ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు.

ఆయనకు శిష్యుడనైనందుకు ఆనందిస్తున్నాను. ఆయన జీవితంమీదా సాహిత్యంమీదా. పరిశోధన చేసినందుకు మిత్రులు డా. జి. కుమారస్వామి నాయుడు గారిని అభినందిస్తున్నాను. నాయుడుగారు రచించిన ఈ సిద్ధాంత వ్యాసాన్ని చదివితే దివాకర్లవారి వాఙ్మయమూర్తి ప్రసన్నమధురంగా మన మనస్సులో ప్రతిఫలిస్తుంది. అయిదు ప్రకరణాలలో చిత్రింపబడిన దివాకర్లవారి సాహితీ వ్యక్తిత్వం సరళంగానూ సమగ్రంగానూ ఆయన స్వభావాన్ని ప్రదర్శిస్తోంది. ఇది అక్షర పుష్పాలతో నాయుడుగారు చేసిన గురుపూజ!

డా. నాయుడుగారు మంచికవి, స్నేహశీలి, వ్యాసకర్త, పరిశోధకుడు, కార్యకర్త. ముక్కుసూటిగా పోవటం, ముక్తసరిగా చెప్పటం వారి స్వభావం. ఈ గ్రంథ రచనలో ఆ స్వభావం వలన శైలిలో ఒక నైశిత్యం ఏర్పడింది. అనవసరమైన విషయాన్ని ఎక్కడా పేర్కొనకుండా ఉండటం ఒక ఔచిత్యం. అవసరమైన వాటిని అనువైన క్రమంలో, అనుమానంలేని పద్ధతిలో ఆవిష్కరించడం ఒక నైపుణ్యం. దివాకర్లవారి ఉపన్యాసాలలో కాని, వ్యాసాలలో కాని విశ్లేషణ తదితర అంశాలకంటె బలంగా కనపడుతుంది. దివాకర్లపై రచించిన ఈ సిద్ధాంత వ్యాసాన్ని కూడా విశ్లేషణ ప్రవృత్తి ప్రధానంగా నాయుడుగారు రచించడం ఒక సాధర్మ్యం. అనుబంధాలు నాయుడుగారు సేకరించిన సామగ్రికి సజీవ సాక్ష్యాలు! తృప్తికరమైన భోజనం చేసిన అనుభవం కలిగిస్తుంది ఈ రచన!

ఈ పరిశోధనంతా ఒక యెత్తు. దివాకర్లవారి పేరుమీద ప్రతి యేటా ఒక సాహితీ మూర్తికి వేయి నూట పదార్ల నగదు సత్కారం చేయటం ఒక్కటీ మరొక యెత్తు. చెప్పేవారే కాదు నాయుడుగారు చేసి చూపిస్తారు! నాయుడుగారు కార్యశీలి, కార్యవాది. గురుమూర్తి అయిన దివాకర్లవారు డా. నాయుడుగారికి దివ్యాశీస్సుల నందించి అభ్యుదయ పరంపరను కలిగించాలని మనసారా ఆశిస్తూ, అభినందిస్తున్నాను!

- **జి. వి. సుబ్రహ్మణ్యం**

డా. తిరుమల శ్రీనివాసాచార్య
అధ్యక్షులు, యువభారతి

# ''సందర్శన సౌభాగ్యం''

''చుట్టూరా ఆవరించుకుని వున్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటే, ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా వెలిగించడం మంచిది'' అనే సూక్తియే ఆత్మగా ఆదర్శంగా గ్రహించి, మానవ సమగ్ర వ్యక్తిత్వ నిర్మాణానికీ సామాజిక ప్రగతికీ ఉత్తమ సాహిత్యం బలమైన సాత్త్విక సాధనమని భావించి, పాతకొత్తల భేదం లేకుండా యువభారతి కడచిన 33 సంవత్సరాలుగా వివిధ సాహిత్య కార్యక్రమాలను నిర్వహిస్తూ వస్తున్నది.

యువభారతి తన 33వ వార్షికోత్సవాల సందర్భంగా మహాకవులచే 'స్వీయకావ్యగానం', 'ఆధునిక కవితా తరంగిణి' ఉపన్యాస పరంపర, కీ.శే. ఆచార్య దివాకర్ల వేంకటావధాని, డా. ఇరివెంటి కృష్ణమూర్తిగారల జయంతి సభా కార్యక్రమాలను ప్రారంభించింది. భారత స్వాతంత్ర్య స్వర్ణోత్సవాల శుభ సందర్భాన్ని పురస్కరించుకుని, తెలుగు సాహిత్యంలోని విభిన్న ప్రక్రియా పరిణామ వికాసాలకు అద్దం పట్టే ఒక వ్యాస సంపుటిని 'సువర్ణ మహతి'గా అందించాలని సంకల్పించింది. సాహితీ మిత్ర, భారతీ మిత్ర, భారతీ భూషణ పథకాలు ప్రవేశపెట్టి సహృదయుల సహకారంతో యుగోచితంగా ముందుకు నడవాలని యథాశక్తి ప్రయత్నిస్తూనే ఉంది యువభారతి ఈనాటికీ. ఈ ప్రయత్న ఫలితంగా యువభారతి సహృదయ లోకానికి 163 గ్రంథాలను అందించగలిగింది.

ఆచార్య దివాకర్ల వేంకటావధాని మహోదయుల వ్యక్తిత్వం ప్రతిభా వ్యుత్పత్త్యభ్యాసాలకూ తెలుగు పద్య గద్య గేయ రచనకూ సంస్కృతాంధ్రాంగ్ల భాషా వైదుష్యానికీ త్రివేణీ సంగమం. ఆ మహనీయుని ధారణలో సముద్రం, వచోధారలో శ్రావణ జలదం ప్రతిఫలించేవి. 'అవధాని' శబ్దం వారిపట్ల సార్థకం. అవధాన విద్యావిశారదులుగా కావ్య-భాషా-వ్యాకరణ శాస్త్ర విద్వాంసులుగా అగ్రశ్రేణి పరిశోధకులుగా విమర్శకాగ్రేసరులుగా బహుగ్రంథ నిర్మాతలుగా ఆంధ్ర వాఙ్మయ చరిత్రకారులుగా మహోపన్యాస కళా ప్రపూర్ణులుగా తెలుగు జాతిని పులకింపజేసిన హిమగిరి శిఖర సమున్నత సారస్వత మూర్తులు దివాకర్ల వేంకటావధానిగారు.

మా 'యువభారతి' సంస్థకూ ఆచార్య దివాకర్ల వారికీ దాదాపు 20 సంవత్సరాల అనుబంధం. వారు మా 'లహరీ' ఉపన్యాస పరంపరకు సూత్రధారులై పాత్రధారులై ఒక 'సువర్ణ' యుగాన్ని సృష్టించారు. యువభారతి చరిత్రలో. 'మహతి'కీ, 'రచన'కూ వారు

న్యాసాలు వ్రాసి ఇచ్చారు. నన్నయ కవితా వైభవ వ్యాఖ్యాన పుస్తకమే కాకుండా నన్నయభట్టును గూర్చి ఒక ప్రత్యేక గ్రంథాన్ని మాకు అందించారు. ఇలా మాకు వారు 1986లో ఆకస్మికంగా కన్ను మూసేదాక, ఎంతో సహకారాన్ని అందించారు. వారి ఋణం ఎన్నటికీ తీరనిది. ఆ వరపురాని మహామనీషి మహర్షి జయంతి సభలను ఉడతాభక్తిగా ప్రతి ఏటా గురుపూర్ణిమనాడు నిర్వహించాలనీ, ఆ సందర్భంగా ఒక విశిష్ట సాహితీమూర్తిని రూ.1116/-లతో సత్కరించాలనీ సంకల్పించి ప్రారంభించింది యువభారతి. 20-7-1997 నాడు దివాకర్ల జయంతి సభా సందర్భంగా మొదటిసారిగా మహాకవి శ్రీమాన్ ఉత్పల సత్యనారాయణాచార్య గారిచే స్మారక ప్రసంగం చేయించి, వారిని సన్మానించింది ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రాంగణంలో.

ఒకనాటి విద్యార్థి దశనుంచి ఈనాటి అధ్యాపక దశ వరకూ డా. గోళ్ళ కుమారస్వామి నాయుడు గారు యువభారతితో అనుబంధం పెంచుకున్నవారు. వారు యువభారతి సాధారణ సభ్యులుగా, సహకార్యదర్శులుగా, ఉపాధ్యక్షులుగా, 'నందిని' సాహిత్య సంచికా సహాయ సంపాదకులుగా, యువభారతి సాహిత్య కార్యక్రమాలలో ప్రముఖ పాత్ర వహించినవారు. ఉత్సాహం, జిజ్ఞాస, సౌజన్యం, సౌహార్దం, శ్రద్ధ, వినయం, నిజాయితీ, సేవాభావం - ఇవన్నీ సముచిత రీతిలో వారి వ్యక్తిత్వంలో ప్రతిఫలిస్తాయి. ఆర్థిక భారాన్ని స్వయంగా వహిస్తూ తమ మూడు ప్రచురణలనూ మా 'యువభారతి' పక్షాననే వెలువరించిన ఉదారులు వారు. ''దివాకర్ల వేంకటావధాని జీవితము -సాహిత్యము'' అనే వారి ఈ పరిశోధనా గ్రంథాన్ని కూడా, ఈ సంస్థ పక్షాననే ప్రకటిస్తూ ఔదార్య సోపానాల ఆరోహణంలో మరొక మెట్టు పైకి ఎక్కారు వారు.

మిత్రులు డా. కుమారస్వామి నాయుడుగారు సత్కవులు. అందుకు అక్షర సాక్ష్యం వారి ''పువ్వులు నవ్వుతున్నాయి'' కావ్యం. వారు ప్రామాణిక పరిశోధకులు. ''శ్రీమద్రామాయణ కల్పవృక్షము - శబరి పాత్ర- ఒక పరిశీలన'' అన్న ఎం.ఫిల్ పరిశోధనా గ్రంథం వారి సమగ్ర పరిశీలనా నైపుణ్యానికి చక్కని నిదర్శనం. 'ఇక - ఈ పరిశోధనా గ్రంథం ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారి హైమాచల శిఖర మహోన్నత సాహితీ మూర్తికి పట్టిన మణిదర్పణం.

''దివాకర్ల వేంకటావధాని జీవితము - సాహిత్యము'' అన్న ఈ పరిశోధనా గ్రంథంలోని రచనా ప్రణాళిక సమగ్రంగా ఉంది. విషయ సేకరణలో వస్తు వర్గీకరణంలో వివిధాంశ వివరణంలో వినూత్న విషయ నిర్దేశంలో శ్రీ కుమారస్వామి నాయుడుగారు ప్రదర్శించిన శ్రద్ధాసక్తులు ప్రశంసాపాత్రాలు. పంచప్రకరణాలుగా పరచుకున్న ఈ గ్రంథంలోని ప్రథమ ప్రకరణం అవధానిగారి జీవితంలోని వివిధ ఘట్టాల వివరణం. ద్వితీయ ప్రకరణం అవధానిగారి రాజసందర్శన మధువనాది పద్యకృతుల పరిశీలనం. తృతీయ ప్రకరణం - ప్రకృతి విజయము, కిరాతార్జునీయము, కాదంబరి మున్నగు వచన కావ్యాల వివేచనకు

ంకితం. ఇక - ఆంధ్ర నాటక పితామహుడు, ప్రాజ్ఞన్నయ యుగము, ఆంధ్ర వాఙ్మయ చరిత్ర, సాహిత్య సోపానములు వంటి పరిశోధనా విమర్శ కృతుల విశ్లేషణం అంతా చతుర్థ ప్రకరణం. అవధానిగారి వ్యాస- ఉపన్యాస- పీఠికా - వ్యాకరణ - ఉదాహరణ కావ్య - సాహిత్య రూపకాది వివిధ ప్రక్రియా రచనల విశేష సందర్శనం పంచమ ప్రకరణం.

పంచమ ప్రకరణంలో అవధానిగారు చేసిన అవధానాలనూ రచించిన భువన విజయాది సాహితీ రూపకాలనూ సోదాహరణంగా శ్రీ నాయుడుగారు వివరించిన తీరు ఎంతో బాగుంది. విశేషించి ఈ సిద్ధాంత గ్రంథంలోని అనుబంధాలు ఐదూ వివిధ విషయ సమగ్రతకు ఎంతో దోహదం చేశాయి.

ప్రథమానుబంధంలో ''అవధానిగారిపై ప్రముఖుల అభిప్రాయాల''ను పేర్కొనడం, నాల్గవ, ఐదవ అనుబంధాలలోని - అవధానిగారి 'సామ్రాజ్య స్థాపన' అనే అముద్రిత రచనను వివరించడం, అవధానిగారు ఒక మిత్రునికి వ్రాసిన చివరి లేఖను కూడా పొందుపరచడం శ్రీ కుమారస్వామినాయుడుగారి పరిశోధనాసక్తికి ప్రబల నిదర్శనం.

అసంఖ్యాకంగా ఉన్న అవధానిగారి వ్యాసాలను గూర్చి, పీఠికలను గూర్చి ప్రత్యేక పరిశోధన జరగవలసిన అవసరమున్నదని డా. నాయుడుగారు అభిప్రాయపడటం వారి చిత్తశుద్ధిని చాటుతున్నది.

కవి సామ్రాట్ విశ్వనాథ, అల్లాఉద్దీన్ వింతలాంతరు, 30 రోజులలో తెలుగు మున్నగు రచనలు తమకు లభించలేదని చిత్తశుద్ధితో డా. నాయుడుగారు పేర్కొన్నారు.

అవధానిగారు వ్యాఖ్యానించిన 'కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహిత' వ్యాఖ్యాన విశేషాలను కొన్నింటినైనా సోదాహరణంగా ఎత్తి చూపవలసిన అవసరమున్నది. ఇలా వీటన్నింటినీ సంపాదించి, డా. నాయుడుగారు ఈ పరిశోధనా గ్రంథం మలి ముద్రణలో వివరిస్తారని ఆశిస్తున్నాను.

ఈ పరిశోధనకు పర్యవేక్షకులు డా. కె.రాజన్నశాస్త్రిగారు. వారు విద్వన్మూర్తులు. ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారికి అత్యంత సన్నిహితులు. దివాకర్లవారి జీవిత సాహిత్యాలకు సంబంధించిన అనేకాంశాలు డా. శాస్త్రిగారికి తెలుసు. వారి పర్యవేక్షణ వలన ఈ పరిశోధన గ్రంథానికి మరింత గురుత్వం సిద్ధించింది. మిత్రులు డా. రాజన్న శాస్త్రిగారిని ఈ సందర్భంగా అభినందిస్తున్నాను.

ఈ సిద్ధాంత గ్రంథాన్ని యువభారతి పక్షాన వెలువరించినందుకు మిత్రులు డా. కుమారస్వామి నాయుడుగారిని అభినందిస్తున్నాను. వారు ఇంకను పరిశోధనను సాగించి, సముజ్జ్వల భవిష్యత్తునందుకోవాలని ఆకాంక్షిస్తున్నాను.

ఆంధ్ర భాషా సాహితీ గురుమూర్తులు ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారిని గూర్చిన ఈ పరిశోధనా గ్రంథాన్ని సందర్శించే సౌభాగ్యం కలిగినందుకు ధన్యునిగా భావిస్తున్నాను.

# కృతజ్ఞతలు

''దివాకర్ల వేంకటావధాని జీవితం - సాహిత్యం'' అనే అంశంమీద పరిశోధన చేయడానికి అవకాశం కల్గించి ప్రోత్సహించి సిద్ధాంత వ్యాసాన్ని ముద్రించుకొనేందుకు అనుమతించిన ఉస్మానియా విశ్వవిద్యాలయం వారికి కృతజ్ఞతలు.

పరిశోధనను పర్యవేక్షించి ప్రోత్సహించి సముచితమైన సూచనలతో సిద్ధాంత వ్యాసాన్ని తీర్చిదిద్దిన సహృదయులు డా. కె. రాజన్నశాస్త్రి గారికి, సర్వవిధాల సహకరించిన ఉస్మానియా విశ్వవిద్యాలయ తెలుగు శాఖాధ్యక్షులకూ, అధ్యాపక వర్గానికి వందనాలు.

నా పరిశోధనకు అండగా నిలచిన ఆంధ్ర సారస్వత పరిషత్తు అప్పటి అధ్యక్షులు కీ.శే. డా. దేవులపల్లి రామానుజరావుగారికి, ప్రాచ్య కళాశాల ప్రిన్సిపాల్ డా. నాయని కోటీశ్వరిగారికి, అధ్యాపక వర్గానికి, కార్యాలయ సిబ్బందికి, ప్రత్యేక ధన్యవాదాలు.

దివాకర్ల వారింటికి వెళ్ళినప్పుడంతా ఆత్మీయంగా పలుకరించి విషయ సేకరణలో పూర్తి సహాయ సహకారాలనందించిన దివాకర్ల వేంకటావధాని గారి పెద్ద కుమారుడు శ్రీ దివాకర్ల సీతారామశర్మ ఇంజనీర్-ఇన్-చీఫ్ గారు; వారి సతీమణి శ్రీమతి ఇందిరగారికి; విషయ సేకరణకై బెంగుళూరికి వెళ్ళినప్పుడు అలభ్యమైన అవధానిగారి రచనలను కొన్నింటిని స్నేహపూర్వకంగా అందించి సహకరించిన డా. సి.రాజేశ్వరి గారికి; విశాఖపట్టణం వెళ్ళినప్పుడు వాత్సల్యంతో దివాకర్లవారి వంశానికి, జీవితానికి సంబంధించిన అనేక విషయాలను తెలియజేసిన దివాకర్ల వేంకటావధానిగారి సోదరులు దివాకర్ల రామమూర్తిగారికి హృదయపూర్వకమైన కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

దివాకర్లవారి సాహిత్య వ్యక్తిత్వాల గురించి వ్యక్తిగతంగా ఇంటర్వ్యూ చేయడానికి వెళ్ళినప్పుడు అరక్షణం తీరిక లేకున్నా ఎంతో ఆప్యాయతతో పలుకరించి గంటసేపు వెచ్చించి పరవశంతో అవధానిగారి సాహిత్య వ్యక్తిత్వాలను, అవధానిగారితో తమ అనుబంధాన్ని తెలియజేసిన ఆచార్య సి.నారాయణరెడ్డిగారికి, ఆచార్య బిరుదురాజు రామరాజు గారికి, ఆచార్య పి.యశోదారెడ్డిగారికి, ఉత్పల సత్యనారాయణాచార్యుల వారికి ఆచార్య ఎం. కులశేఖరరావు గారికి ప్రత్యేక వందనాలు.

గత రెండున్నర శతాబ్దాలుగా నా సాహితీ వ్యక్తిత్వాన్ని మలుపు తిప్పి రచనా రంగంలో ప్రోత్సహించి నా రచనలను యువభారతి ప్రచురణలుగా ప్రచురించిన యువభారతి సంస్థను, సంస్థ నిర్వాహకులను, సభ్యులను నేనెన్నడూ మరువలేను.

ఈ పరిశోధనా వ్యాసానికి పరిచయాలను రాసి యిచ్చిన పూజనీయ గురువులు ఆచార్య

జి.వి.సుబ్రహ్మణ్యంగారికి, డా. కె.రాజన్నశాస్త్రిగారికి, డా. తిరుమల శ్రీనివాసాచార్య గారికి నమస్సుమాంజలులు.

విషయ సేకరణలో తోడ్పడిన ఆచార్య రవ్వా శ్రీహరిగారికి, శ్రీ అయ్యదేవర పురుషోత్తమరావుగారికి, డా. చంద్రశేఖర్, శ్రీ పాండురంగయ్య గారికి, శ్రీమతి జయంతి, డి.ఎస్.ఎన్.మూర్తి, ఎం.ఎల్.నరసింహారావుగారికి, శ్రీమతి శారదగారికి కృతజ్ఞతలు.

ముఖచిత్రాన్ని అందంగా తీర్చిదిద్దిన శ్రీ శీలా వీర్రాజుగారికి, గ్రంథాన్ని సకాలంలో అందంగా ముద్రించి ఇచ్చిన బాలాజీ ప్రెస్ అధినేత శ్రీ బాలా ప్రసాద్‌గారికి కృతజ్ఞతలు.

ప్రూఫులు దిద్దడంలో సహాయం అందించిన డా. నిత్యానందంగారికి, డా. ఎస్.నారాయణరెడ్డిగారికి, శ్రీ కె.వి. కామేశ్వరరావుగారికి, శ్రీ ప్రేమకుమార్‌కు శ్రీ పాలడుగు ఆనందయ్య గారికి కృతజ్ఞతలు.

ఈ గ్రంథం అచ్చువేయడానికి ఆర్థిక సహాయాన్ని అందించిన పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారికి ప్రత్యేక ధన్యవాదాలు.

గ్రంథావిష్కరణ సభకు ముఖ్యఅతిథిగా విచ్చేసి గ్రంథాన్ని ఆవిష్కరించిన మాన్యులు డా. పి.వి. రత్నయ్య సాంకేతిక విద్యాశాఖా మాత్యులుగారికి, అధ్యక్షత వహించిన శ్రీ కె.వి.రమణ ఐ.ఏ.ఎస్, గారికి ప్రత్యేఅతిథిగా విచ్చేసిన శ్రీ డి. ఎస్.మూర్తి ఐ.ఎ.ఎస్ గారికి, సన్మాన గ్రహీత డా. కె .రాజన్న శాస్త్రిగారికి, గ్రంథ పరిచయం చేసిన ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారికి, ఆచార్య రాజేశ్వరిగారికి, నా దృక్పథంలో అవధానిగారు అనే అంశంమీద ప్రసంగించిన ఆచార్య ఎల్లూరి శివారెడ్డిగారికి, శ్రీ సీతారామశర్మ గారికి, శ్రీమతి ఆర్. గాయత్రిగారికి నమస్సులు.

ప్రూఫులు దిద్దడం మొదలుకొని పుస్తకావిష్కరణ వరకు అనుక్షణం సహకారాన్ని అందించిన యువభారతి మిత్రులకు ముఖ్యంగా అధ్యక్షులు డా. తిరుమల శ్రీనివాసాచార్యులు వారికి, కార్యదర్శి శ్రీ పరవస్తు కృష్ణ స్వామి గారికి, ఆచార్య వంగపల్లి విశ్వనాథం గారికి, కె.వి. కామేశ్వరరావు గారికి ధన్యవాదాలు.

ప్రచురణ పూర్వ విరాళాలు సేకరించడంలో తోడ్పడిన మిత్రులు శ్రీ డి.ఎల్.ఎన్. ప్రసాద్‌గారికి, ఎస్.వి. ప్రభాకర్‌రావు గారికి, ఎస్. నారాయణరెడ్డి గారికి, ఎస్. జయపాల్‌రెడ్డిగారికి, ఎస్ వెంకటేశ్వరరావుగారికి, ఎస్.ఎస్. ప్రసాద్‌గారికి ప్రత్యేక కృతజ్ఞతలు. తమ అవసరాలను మానుకొని అన్నివిధాల సహకరించిన మా శ్రీమతి జి.బి.లక్ష్మికి, కుమారులు నరేందర్‌బాబు, హేమాద్రి చౌదరికి ఆశీస్సులు.

# నామాట

తెలుగు భాషలో విస్తృతమైన పరిశోధనలు జరుగుచున్న నేడు ఒక్కొక్క సాహితీ మూర్తి మీదనే ఎన్నో పరిశోధనలు జరుగుతున్నాయి. ఒక సాహితీ వేత్త రాసిన ఒక గ్రంథంలోనే వివిధాంశాలమీద పరిశోధనలు జరుగుచున్న ఈ రోజుల్లో నేను ''దివాకర్ల వేంకటావధానిగారి జీవితం - సాహిత్యం'' అనే అంశాన్ని పరిశోధనకు ఎన్నుకున్నాను. విషయం కొంత విస్తృతమైనది కనుక కొన్ని పరిధులను విధించుకోక తప్పలేదు.

నా పరిశోధనాంశాన్ని ఐదు ప్రకరణాలుగ విభజించుకొన్నాను.

ప్రథమ ప్రకరణంలో దివాకర్ల వేంకటావధానిగారి జీవిత విశేషాలను వివరించాను. ఆయన జీవితం అధ్యయనపరులకు ఆదర్శప్రాయం. అధ్యాపకులకు అనుసరణీయం. వ్యక్తిత్వం ప్రశంసనీయం - అనే సత్యం బయల్పడింది.

ద్వితీయ ప్రకరణంలో పద్యకృతులను గురించి పరిశీలించాను. పద్యవిద్యలో ఆయన ప్రదర్శించిన కౌశలాన్నీ, శిల్పాన్నీ, శైలీ విశేషాలను సోదాహరణంగా వివరించాను. పద్యంమీద ఆయనకపారమైన అభిమానం అనే విషయం వెల్లడైంది.

తృతీయ ప్రకరణంలో గద్యకృతుల వివేచన చేశాను. గద్య రచనలో ఆయన ప్రదర్శించిన నైపుణ్యాన్ని చూపించాను. అవధానిగారు గద్య రచనను గ్రాంధికంలో రాసినా అది సరళ గ్రాంధికమని అందరికీ అర్థమయ్యే తత్త్వమందులో ఉందనే విషయం తేలింది.

చతుర్థ ప్రకరణంలో విమర్శకృతులను గురించి విశ్లేషించాను. పంచమ ప్రకరణంలో అవధానిగారు వివిధ ప్రక్రియలలో చేసిన కృషిని విలోకించడం జరిగింది. ఇందులోనే కొన్ని పరిధులను విధించుకోవలసి వచ్చింది. దివాకర్లవారు రాసిన వ్యాసాలు, చేసిన ఉపన్యాసాలు, సమకూర్చిన పీఠికలు అసంఖ్యాకంగా ఉన్నాయి. వీటిమీద ప్రత్యేక పరిశోధనలు జరగవలసిన అవసరం ఎంతైనా ఉంది. కనుక నేను వ్యాసాలను విభజించి మాత్రం చూపాను. ఉపన్యాసాల మొత్తంలో ముఖ్యమైన గుణాలను రేఖామాత్రంగా చూపించాను. పీఠికలలో ఉండే ప్రధానాంశాలను సమీక్షించి సాహిత్య విలువలను వివరించాను.

నా కృషి ఫలితాన్ని సహృదయుల ముందుంచుచున్నాను. గుణాలను గుర్తించి ప్రోత్సహిస్తే కృతార్థుడైనట్లు భావిస్తాను. కృతజ్ఞతలు తెలుపుకుంటాను.

- గోళ్ళ కుమారస్వామి నాయుడు

# విషయసూచిక

## చతుర్థ ప్రకరణం- విమర్శకృతుల విశ్లేషణ

## ప్రథమ ప్రకరణం

# దివాకర్ల వేంకటావధానిగారి జీవితం

### 1. వంశం:

ఒక వ్యక్తి జీవితాన్ని గురించి పరిశోధించేటప్పుడు అతని వంశాన్ని గురించి తప్పకుండా చెప్పాలి. దివాకర్ల వేంకటావధానిగారి వంశం పండిత వంశం. దివాకర్ల తిరుపతి శాస్త్రిగారు వేంకటావధానిగారికి పినతండ్రి. దివాకర్ల తిరుపతిశాస్త్రిగారు తిరుపతి వేంకట కవులలో ఒకరు. వీరు ఆశుకవితా ప్రదర్శనలతో ఆంధ్ర సాహితీ జగతిని ఉర్రూతలూగించి ఆంధ్ర వాఙ్మయ చరిత్రలో విశిష్ట స్థానాన్ని పొందారు.

దివాకర్ల అనునది వీరి ఇంటి పేరు. వీరు వైదికులు, వెలనాటివారు. కృష్ణయజుశ్శాఖకు చెందినవారు. వీరిది హరితస గోత్రం. ఆపస్తంబ సూత్రం. వీరి వంశానికి మూల పురుషుడు అంతర్వేది. అతని కుమారుడు పానకాలు. అతని పుత్రుడు వేంకటజోగి. ఆ వేంకట జోగి కొడుకు సుందరరామయ్య. ఈ సుందరరామయ్య కుమారుడు వేంకటావధాని ( ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారి తాత). ఈ వేంకటావధానికి శేషమ్మకు ఐదుగురు కుమారులు 1. సూర్యనారాయణమూర్తి 2. సోమయ్య 3. సుందరరామయ్య 4. తిరుపతిశాస్త్రి 5. కామేశ్వర శాస్త్రి. వీరు ఐదుమందిలో సుందరరామయ్యకు వేంకమాంబకు ఇద్దరు కుమారులు, ముగ్గురు కుమార్తెలు కలిగినారు. పెద్ద కుమారుడు దివాకర్ల వేంకటావధాని. రెండవ కుమారుడు దివాకర్ల రామమూర్తి. కుమార్తెల పేర్లు శేషమ్మ, వేంకటలక్ష్మి, బాలాత్రిపుర సుందరి. దివాకర్ల వేంకటావధానిగారి మొదటి భార్య మహాలక్ష్మి. ఈమె సంతానం కలుగకనే మరణించింది. రెండవ భార్య చంద్రావతిగారు. చంద్రావతీ దివాకర్ల వేంకటావధాని దంపతులకు ఇద్దరు కుమారులు, ఐదుగురు కుమార్తెలు. పెద్ద కుమారుని పేరు దివాకర్ల సీతారామశర్మ - ఇంజనీర్ ఇన్ చీఫ్, నీటిపారుదల శాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంలో ఉద్యోగం చేసి రిటైర్ అయినారు. ఈయన భార్య ఇందిర. వీరికి ఒక కుమారుడు, ఒక కుమార్తె. కుమారుని పేరు దివాకర్ల రాజశేఖర్. ఆస్ట్రేలియాలో ఇంజనీర్. ప్రస్తుతం ఆస్ట్రేలియా దేశంలో ఎక్కువ జీతం పొందుతున్న ఉద్యోగి. ఈయన భార్య శైలజ. కూతురి పేరు సుజాత. ఈమె భర్త కరుణాసాగర్. ఈయన ఇండోనేషియాలో ఇంజనీరు.

అవధానిగారి రెండవ కుమారుడు డా. దివాకర్ల లలితా భాస్కరశాస్త్రి. ఈయన భార్య డా. లక్ష్మీ పద్మిని. దంపతులిరువురు ఆస్ట్రేలియాలో ప్రముఖ వైద్యులుగా ఖ్యాతి గాంచినారు. వీరికిద్దరు కుమార్తెలు. చంద్ర - శాంతి.

దివాకర్ల వేంకటావధాని పెద్ద కుమార్తె పేరు మహాలక్ష్మి. ఈమె భర్త చావలి రామమూర్తిగారు. ఈయన నేషనల్ సేవింగ్సులో డైరెక్టరుగా పదవీ విరమణ చేశారు. వీరికి ఇద్దరు కుమారులు, ఇద్దరు కుమార్తెలు. కుమారుల పేర్లు - చావలి రామశేషయ్య, చావలి వేంకటావధాని. రామశేషయ్య ఫుడ్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా, ఖమ్మంలో ఉద్యోగం చేస్తున్నారు. కుమార్తెలు - వళ్ళీపూర్ణిమ, చంద్రమౌళీశ్వరి.

అవధానిగారి రెండవ కుమార్తె పేరు వేంకటలక్ష్మి. ఈమె భర్త ఆచంట సుబ్రహ్మణ్యం. స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్‌లో జనరల్ మేనేజరు. వీరికి కూడా ఇద్దరు కుమారులు, ఇద్దరు కుమార్తెలు. పెద్ద కుమారుడు ఆచంట రామమూర్తి అమెరికాలో ఇంజనీర్. రెండవ కుమారుడు ఆచంట ఆనంద్. ఎమ్.ఫార్మసి చేసి అమెరికాలో ఉద్యోగం చేస్తున్నారు. కుమార్తెలు- రామలక్ష్మి, చంద్రావతి. ఒకరు బొంబాయిలో, మరొకరు హైదరాబాద్‌లో ఉద్యోగం చేస్తున్నారు.

మూడవ కుమార్తె రొయ్యూరు గాయత్రిగారు. వీరు ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి ఎం.ఎ తెలుగు ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులై వివేక వర్ధనీ కళాశాల, హైదరాబాద్‌లో తెలుగు అధ్యాపకురాలుగా ఉద్యోగం చేస్తున్నారు. భర్త దీక్షిత్. ఈయన జియాలజికల్ సర్వే ఆఫ్ ఇండియా డైరెక్టరుగా ఉద్యోగం చేసి వాలంటరీ రిటైర్‌మెంట్ తీసుకుని జియాలజికల్ కన్సల్‌టెంట్‌గా ప్రాక్టీసు చేస్తున్నారు. వీరికి ఒక కుమార్తె. పేరు హిమబిందు - ఎం.బి.ఎ చదివారు. ఈమె భర్త - జంధ్యాల రవిశంకర్. హైదరాబాద్‌లో అడ్వకేటుగా ప్రాక్టీసు చేస్తున్నారు.

అవధానిగారి నాల్గవ కుమార్తె పేరు డా. ముక్కా రాజేశ్వరి - ఈమె తెలుగు ప్రొఫెసర్‌గా ప్రభుత్వ ఆర్ట్సు కళాశాల, బెంగుళూరులో ఉద్యోగం చేస్తున్నారు. రచయిత్రిగా, వక్తగా, విశిష్టమైన వ్యక్తిత్వం వున్న వ్యక్తిగా మంచి పేరు పొందారు. ఈమె భర్త ముక్కా వెంకటయ్య. ఎం. టెక్ బొంబాయిలో చేశారు. బెంగుళూరు ఇస్రోలో ప్రఖ్యాత ఇంజనీరు. వీరికి ఇద్దరు కుమార్తెలు - పెద్ద కుమార్తె శారద - అమెరికాలో ఇంజనీరు. రెండవ కుమార్తె చంద్రస్మిత - బెంగుళూరులో విద్యార్థి.

అవధానిగారి చివరి కుమార్తె పేరు - ఏలేశ్వరపు అరుణశ్రీ. ఈమె ఎం.ఎ తెలుగు చదివారు. భర్త - ఏలేశ్వరపు శేషతల్పశాయి. కార్పొరేషన్ బ్యాంక్ మేనేజరుగా ప్రస్తుతం

హైదరాబాద్‌లో పనిచేస్తున్నారు. వీరికి ఒక కుమారుడు. పేరు రాఘవేంద్ర. ఒక కుమార్తె. పేరు సవితా పూర్ణిమ. వీరిద్దరూ హైదరాబాద్‌లో విద్యాభ్యాసం చేస్తున్నారు.

అవధాని గారి తమ్ముడు దివాకర్ల రామ్మూర్తి మిసెస్ ఏ.వి.ఎన్ కళాశాల ప్రిన్సిపాల్‌గా పనిచేసి విశ్రాంతి తీసుకుంటున్నారు. ఇది ఇప్పటివరకు వీరి వంశక్రమం.

**తల్లిదండ్రులు :** వంశక్రమంలో చూపించిన విధంగా అవధానిగారి తల్లి వేంకమాంబ తండ్రి సుందరరామయ్య(2) వీరు మొదట పశ్చిమగోదావరి జిల్లాలో 'యండగండి' అనే గ్రామంలో నివసించేవారు. సుందరరామయ్య ప్రతిభాశాలి. వేదాలను తండ్రి దగ్గర నేర్చుకున్నారు. పంచకావ్యాలను అభ్యసించారు. పరమనిష్ఠాగరిష్ఠుడు. ఆర్థికంగా అంత స్థితిమంతుడు కాదు. బ్రతికింది పేద బ్రతుకైనా గౌరవానికి లోటు రానీయలేదు.

వేంకమాంబ పశ్చిమగోదావరి జిల్లా, ఆకుతీగపాడు అనే గ్రామంలో పుట్టింది. అవధాని గారు కూడా మాతామహి ఇంట అంటే ''ఆకుతీగపాడు''లో 1912వ సంవత్సరం జూన్ నెల 23వ తేదీ (పరీధావి ఆషాఢ శుద్ధ పౌర్ణమి గురుపూర్ణిమ నాడు మూల నక్షత్రంలో) జన్మించారు. అవధాని గారు ఈ దంపతులకు మూడవ సంతానం. అంతకు ముందు ఇద్దరు కుమార్తెలు పుట్టారు. సుందరరామయ్య గారు ఇతనికి తన తండ్రి పేరైన వేంకటావధాని అని పేరు పెట్టుకున్నారు. సుందరరామయ్య గారు తన సంతానానికంతటికి ఈ విధంగానే పేర్లు పెట్టుకోవడం ఒక విశేషం. పెద్ద కుమార్తెకు తన తల్లిపేరు శేషమ్మ అనిపెట్టుకున్నారు. రెండవ పుత్రికకు తన అత్తగారిపేరైన దుర్గా ప్రసాద వేంకటలక్ష్మి అనీ, నాలుగవ సంతానమయిన కుమారునికి రామమూర్తి అని తన మామ పేరు, అయిదవ సంతానమైన కుమార్తెకు తన యిష్టదైవం బాలాత్రిపురసుందరి అని నామకరణం చేశారు. దీనిని బట్టి సుందరరామయ్య గారికి తల్లితండ్రులపై, అత్తమామలపై ఉన్న గౌరవం వ్యక్తమౌతుంది.

సుందరరామయ్య గారు గుణవంతుడు, ధైర్యవంతుడు కానీ, ధనవంతుడు కాడు. పిల్లల పోషణ కోసం, వారి చదువుల కోసం ఎన్నో కష్టాలు పడ్డారు. ఆయన పురాణాలు చెప్పేవారు, షావుకారు పద్దులు రాసేవారు. భార్య వేంకమాంబ కూడా భర్తకు అన్నివిధాలా సహకరించేది. సుందరరామయ్య లౌకికవృత్తిని అవలంబించి సంసార నిర్వహణ సాగించారు. సర్వకర్మస్వతంత్రుడయిన వైదికమతావలంబి. నిష్ఠా గరిష్ఠుడు. సంపన్నుడు కాకపోయి నప్పటికీ సదాచార సంపన్నుడు. ఈ గుణాలు అవధాని గారికి కూడా అబ్బినవి. సుందర రామయ్య గారు పిల్లల పోషణ కోసం ఎన్నో కష్టాలు పడినట్లు వారి విద్యాభ్యాసం కోసం తరతరాలుగా బ్రతికిన ఊరిని కూడా వదలివెళ్ళినట్లు ఆయన రెండవ కుమారుడయిన రామమూర్తి గారు తెలియచేశారు.

## 2. బాల్యం - విద్యాభ్యాసం

అవధాని గారికి ఒక విధంగా మొట్టమొదటి గురువు తండ్రిగారనే చెప్పాలి. సుందర రామయ్య గారు తనకు మొట్టమొదటి మగ సంతానం అవధాని గారు కావటం చేత, చిన్నప్పటి నుండి ధారణ శక్తి కలిగి ఉండటం చేత, కొంత సంస్కృతం తానే నేర్పించాడు. ఆంధ్రనామ సంగ్రహం, రఘువంశం వల్లె వేయించాడు. చిన్నప్పటి నుంచి కూడా పినతండ్రిగారైన తిరుపతి శాస్త్రి గారి ప్రభావం అవధాని గారిపై కనిపిస్తుంది. చిన్ననాటి నుండే తిరుపతి వేంకటకవుల అవధానపద్యాలు కంఠస్థం చేసి తిరుపతి శాస్త్రి గారిని అనుకరిస్తూ, వేంకటావధాని చదివేవారు. అప్పటినుండే ధారణాశక్తి అలవడింది. పువ్వు పుట్టగానే పరిమళిస్తుందన్నట్టు అవధాని గారు చిన్నప్పటి నుండి మంచి ప్రతిభ కనబరచేవారు.

అవధాని గారి ప్రాథమిక విద్య ''యండగండి'' ప్రాథమిక పాఠశాలలో ప్రారంభమయింది. ఆ ప్రాథమిక పాఠశాలే తరువాత హైయ్యరు ఎలిమెంటరీ పాఠశాల అయినది. ఆ బడిలోనే అవధాని గారు ఒకటవ తరగతి నుండి ఏడవ తరగతి వరకు చదువుకున్నారు. అప్పుడే అవధాని గారు ఏకసంథాగ్రాహి అని నిరూపించుకున్నారు. తిరుపతిశాస్త్రి యండగండికి అప్పుడప్పుడు వచ్చేవారు. చిన్నవాడైన అవధాని గారి ధారణను చూసి ముచ్చటపడేవారు. అప్పుడు తిరుపతి శాస్త్రి గారు కాకినాడలో కాపురముండేవారు. ఆయన కొచ్చెర్లకోట రామకృష్ణారావు బహద్దూర్ వారి ఆస్థానంలో ఆస్థానపండితుడుగా ఉండేవారు. ఆయన 1919 ప్రాంతంలో దివంగతులయినారు. అప్పుడు అవధాని గారికి ఏడేళ్ళ వయస్సు. అప్పటికే ఆయన ధారణా శక్తి పద్య పఠనా పద్ధతి ప్రశంసలందుకున్నవి.

7వ తరగతి వరకు యండగండిలో చదువుకొన్న అవధాని గారు తరువాతి చదువు కోసం ''ఉండి'' కి వెళ్ళవలసి వచ్చింది. యండగండి కుగ్రామం కావడం చేత అక్కడపై చదువులకు అవకాశం లేకపోవడం చేత అక్కడ అవధాని గారికి చదువు చెప్పిన ఉపాధ్యాయుడు వీరబొట్ల నరసింహం గారి ప్రోద్బలంతో సుందరరామయ్య గారు కాపురం కూడా ''ఉండి''కి మార్చారు.

అవధాని గారు ఉండిలో మళ్ళీ ఏడవ తరగతి (రెండవఫారం)లో చేరవలసి వచ్చింది. దీనికి కారణం ఉండి హైస్కూలులో అప్పుడు ప్రధానోపాధ్యాయుడుగా నండూరి శ్రీరాములు గారుండేవారు. ఆయున చండశాసనుడు, అందుకే అవధానిగారు యండగండిలో ఏడవ తరగతి ఉత్తీర్ణుడైనా మళ్లీ పరీక్ష పెట్టి (రెండవ ఫారం) ఏడవ తరగతిలోనే (1925-1926 విద్యాసంవత్సరం) చేర్చుకున్నారు. ఆ రోజుల్లో పాఠశాలల్లో చదువు ఆంగ్లేయులు రూపొందించిన పాఠ్యప్రణాళిక ప్రకారం వుండేది. అప్పటి

విద్యార్థులకు వారి తల్లిదండ్రులకు ఆంగ్లభాష మీద మోజు, సంస్కృతాంధ్ర భాషలపై అభిమానం వుండేవి. పాఠశాలల్లో మొదటి భాషగా తెలుగు కానీ సంస్కృతం కానీ తీసుకోడానికి అవకాశం వుండేది. సుందరరామయ్యగారు సంస్కృతాభిమాని కనుక అవధానిగారిని మొదటి భాషగా సంస్కృతం చదువుకోమని ప్రోత్సహించారు. అవధానిగారు అట్లే చేశారు. అక్కడ అప్పుడు సంస్కృతం శ్రీ ఆదిభట్ల సూర్యనారాయణశాస్త్రిగారు చెప్పేవారు. సంస్కృతంలో చురుకుదనాన్ని చూపి అవధానిగారు ఆయనకు ప్రీతిపాత్రుడైనాడు. తరగతిలో అన్ని విషయాల (సబ్జెక్ట్స్)లో అవధానిగారే ప్రథములుగా ఉండేవారు. లెక్కలలో నూటికి తొంభై మార్కులకు తక్కువ ఎప్పుడూ రాలేదు.

అవధానిగారు పదవ తరగతి (ఐదవ ఫారం)లోకి వచ్చినప్పుడు ప్రధానోపాధ్యాయులు నండూరి శ్రీరాములుగారికి బదిలీ అయినది (1928-29 విద్యాసంవత్సరం). ప్రధానోపాధ్యాయుని వీడ్కోలు సభలో అవధానిగారు పంచరత్న పద్యాలు చదివారు. అవే అవధానిగారి తొలి పద్యరచన అని చెప్పవచ్చు. అవధానిగారి పద్యరచనకు, పద్యపఠనకు సభలోని వారందరూ ఆశ్చర్యపడినారట. ఆ పద్యాలు ఇప్పుడు అలభ్యం. అప్పటినుండి అవధానిగారు అప్పుడప్పుడు పద్యరచన చేసేవారు. ఉండిలోని ఆయుర్వేదవైద్యుడైన దిగవల్లి శ్రీరాములుగారి దగ్గర, ప్రధానోపాధ్యాయులుగా వచ్చిన ఉప్పులూరి సీతారామశాస్త్రిగారి దగ్గర పద్యాలు దిద్దించుకునేవారు. అప్పుడు అవధానిగారిది నూనూగు మీసాల నూత్న యౌవనం. ఆ రోజుల్లో పంచరత్నాలు, నవరత్నాలు రాసి చదివే పద్ధతి వుండేది.

అవధానిగారికి తొమ్మిదవ తరగతి చదివేటప్పుడే వివాహం అయింది. భార్య పేరు మహాలక్ష్మి. అప్పుడామె వయసు ఎనిమిది సంవత్సరాలు. ఒక విధంగా ఇది బాల్యవివాహం. ఆ రోజుల్లో బాల్యవివాహాలు బాహాటంగానే జరిగేవి. ఇది అవధానిగారి మొదటి వివాహం.

స్కూలు ఫైనల్‌లో అవధానిగారు గణితము. భౌతికశాస్త్రము ప్రత్యేక అంశాలుగా హిందూ దేశచరిత్ర, యూరపు దేశ చరిత్ర ప్రధానాంశాలుగా, సంస్కృతం మొదటి భాషగా, తెలుగు రెండవ భాషగా తీసుకున్నారు. ఆ రోజుల్లో ఉన్నత పాఠశాలలో విద్య ఆంగ్లంలో బోధించేవారు. ఆంగ్లం తప్పనిసరిగా అభ్యసించవలసి వచ్చేది. ఈ వాతావరణంలో విద్యాభ్యాసం చేసిన అవధానిగారు సంస్కృతాంధ్రాంగ్ల భాషలను చక్కగా అభ్యసించారు. ఆ పాఠశాలలో చరిత్రను శ్రీ ఎస్. వెంకట్రామ శాస్త్రిగారు బోధించేవారు. మళ్లీ పాఠశాల ప్రధానోపాధ్యాయుడు బదిలీ అయ్యాడు. ప్రధానోపాధ్యాయుడుగా శ్రీ విరాల బుచ్చిరామయ్యగారు వచ్చారు. ఆయన రసాయనశాస్త్రం చెప్పడంలో దిట్ట. శుద్ధ గ్రాంథికంలోనే మాట్లాడేవారు. ఇంగ్లీషు వ్యాకరణం కూడా ఆయన బోధించేవారు.

ఆరవఫారం (స్కూలు ఫైనల్) లో సంస్కృతం పేపరుకు సమాధానం సంస్కృతంలో

గాని ఆంగ్లంలోగాని రాయవలసి వుండేది. బడిలో సంస్కృతం చెప్పే ఆదిభట్ల సూర్యనారాయణ శాస్త్రిగారికి ఇంగ్లీషు రాదు. అందువల్ల సంస్కృతం క్లిష్ట సమస్యగా మారింది. సంస్కృతం మానడం అవధానిగారికి ఇష్టం లేదు. అందుకని భీమవరానికి ప్రతి శని ఆదివారాలు వెళ్లి, సంస్కృతానికి ఇంగ్లీషులో సమాధానాలు రాయడం శ్రీ దంతుర్తి సూర్యనారాయణగారి దగ్గర నేర్చుకున్నారు.

పరీక్షలు జరిగాయి. అన్ని పేపర్లు బాగానే రాశారు. కాని సంస్కృతంలో ఎన్ని మార్కులు వస్తాయో అని భయపడుతుండేవారు అవధానిగారు. అదే విషయం కలలో కూడా కలవరిస్తూ ఉండేవారట.

పేపరులన్నిటిన్ సరిగ ప్రీతిమెయిన్ లిఖియించినాడ ఏ
లోపము లేక సంస్కృతములోపల పేపరు కష్టసంయుతం
బైపరగన్ మనంబున భయంబగు తత్ఫలితంబు గూర్చి నే
నే పగదిన్ కృతార్థత వహింతునొ భారము నీదె భారతీ![1]

- అని కలవరిస్తూ ఉంటే వారి తండ్రి సుందరరామయ్యగారు నిద్రలేపి అడగగా తనకేమీ తెలియదనెనట. ఈ విషయం అవధానిగారి తమ్ముడు దివాకర్ల రామమూర్తిగారు తెలియజేశారు. దీనినిబట్టి అవధానిగారు స్కూలుఫైనలు చదివే రోజుల్లో ధారాళంగా పద్యాలు చెప్పేవారని తెలుస్తోంది. కలలో కూడా పద్యాలు చెప్పేవారంటే ఆయనకు పద్యమల్లడం ఎంత తేలికో పద్యవిద్య మీద ఆయనకు ఎంత మక్కువో కూడా తెలుస్తుంది.

స్కూలుఫైనల్‌లో అవధానిగారు చరిత్రలో అంతకు పూర్వం పాఠశాలలో ఎవరికీ రానన్ని మార్కులు సంపాదించి చరిత్రను సృష్టించారు. సంస్కృతంలో డెబ్బయికి పైగా మార్కులు సంపాదించారు. దీనినిబట్టి పరిశీలిస్తే అవధానిగారికి చిన్నప్పటినుండి చదువంటే ప్రాణం అని తెలుస్తోంది. ఈ శ్రద్ధకు ప్రతిభ తోడై బంగారానికి తావి అబ్బినట్టయింది.

పాఠశాలలో విద్యనభ్యసించే రోజుల్లో 'రాజమండ్రి'లోని హిందూ సమాజంవారి సహకారంతో న్యాయపతి సుబ్బారావుగారు నిర్వహించిన భగవద్గీతా పరీక్షలో ప్రథములుగా నెగ్గి పదిరూపాయల బహుమతిని గెలుచుకున్నారు. ఇది 1929వ సంవత్సరంలో జరిగింది. అవధానిగారిలో ఇది హైందవ ధర్మబీజాలను అంకురింపచేసింది. పాఠశాలలో విద్యాభ్యాసం చేసేటప్పుడే అవధానిగారి పద్యాలు భారతిలాంటి సాహితీ పత్రికలో ప్రచురింపబడేవి. 1929వ సంవత్సర అక్టోబరు సంచికలో 'శరన్మేఘము' అనే శీర్షికతో మూడు పద్యాలు ప్రచురించబడినాయి.

ఆకృతి జూచి చూచి జనులందఱు నిన్ రజతాద్రి వంచు న
ద్రేకముతో నుతించెదరదేమి పురాకృత పుణ్య వైభవ
ప్రాకట సిద్ధియోగద? కరంబును నీదగు నున్కి జేసి ము
ల్లోకములందు నెవ్వరికి రూఢిగ మోదము గల్గ జాలెడిన్. [2]

వంటి పద్యాలు ఈ దశలో అవధానిగారు రాశారు. ప్రథమశ్రేణిలో స్కూలు ఫైనల్ పరీక్షలో ఉత్తీర్ణుడైనా కమ్మని కవిత్వము రాయుకలిగినా అవధానిగారికి ఉన్నత విద్యనభ్యసించడానికి ఆర్థిక పరిస్థితులు అనుకూలించలేదు. సుందరరామయ్యగారికి సుతుని పైచదువులకు పంపాలన్న పట్టుదల సడలలేదు. తానెన్ని కష్టాలు పడినా పిల్లలు మాత్రం గొప్ప విద్యావంతులు కావాలని ఆయనెంతో శ్రమించారు.

ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులయిన విద్యార్థులకు విజయనగర మహారాజా కళాశాలలో ఉపకారవేతనం లభిస్తుందనీ, ఉచిత భోజన వసతి లభిస్తాయని తెలిసి ఒకవేళ అవి లభించకపోయినా వారాలు చేసి చదువుకోవచ్చు అనే ఉద్దేశంతో విజయనగరానికి కళాశాల చదువు కోసం అవధానిగారిని పంపారు. అవధానిగారు విజయనగరానికి వెళ్లారు. అక్కడి పరిస్థితులు ఆయనకు సరిపడలేదు. ఉచితభోజనాదులు లభించలేదు. వెంటనే ఇంటికి తిరిగివచ్చివేశారు. సుందరరామయ్యగారు కొంత నిరుత్సాహపడినారు. అయినా పట్టుదల మానలేదు. బందరులో హిందూ కళాశాలలో ఇంటర్ మొదటి సంవత్సరంలో 1930-31 విద్యాసంవత్సరంలో చేర్పించారు.

అప్పుడు బందరు హిందూ కళాశాలకు అధ్యక్షులుగా వారణాసి శ్రీనివాసరావు గారుండేవారు. ఆయన తిరుపతి వేంకట కవుల శిష్యుడు, అవధానిగారి ఆర్థిక పరిస్థితి తెలుసుకుని ఆయనను విశ్వనాథ సత్యనారాయణగారికి పరిచయం చేసి సహాయపడినారు. విశ్వనాథవారు అవధానిగారికి తన ఇంటిలో వసతి కల్పించారు. స్నేహితులతో చెప్పి వారాలు చేసుకుంటూ చదువుకునే ఏర్పాటు చేశారు. అవధానిగారు విశ్వనాథ సత్యనారాయణగారికి ప్రియశిష్యుడయినాడు. ఇంటర్ చదివే రోజుల్లో అవధానిగారికి విశ్వనాథ సత్యనారాయణ గారు 'ఏకవీర' నవలను డిక్టేట్ చేస్తే రాసిపెట్టారు. దానికి ప్రతిఫలంగా పదహారు రూపాయలు ఇచ్చారట విశ్వనాథవారు.

బందరులో అవధానిగారి చదువు బాదరబందీ లేకుండా జరిగిందనే చెప్పాలి. ముట్నూరు కృష్ణారావుగారితో ఇక్కడనే పరిచయం అయింది. మంచి సాహితీమిత్రుల పరిచయంతో ఉత్తమ అధ్యాపకుల ఆదరాభిమానాలతో బందరు భావిజీవితానికి పునాది అయిందని చెప్పవచ్చు.

దేశంలో రాష్ట్రంలో ఆ రోజుల్లో స్వాతంత్ర్యోద్యమం ముమ్మురంగా కొనసాగుతూంది. ఆ పోరాటాల వైపు అవధానిగారు ఆకర్షితులు కాలేదు. ఆయన పోరాటమంతా జీవితంతోనే. పేదరికం అభిరుచికి అడ్డుకాలేదు. ఉద్యమాల వైపు ఆయన నడవలేదు. అట్లని ఆయనకు జాతీయాభిమానం లేదని కాదు. ఆత్మదఘ్నంగా జాతీయాభిమానం ఆయనకు వున్నా నవనీతంలాంటి అతని మనస్సును సంఘర్షణలు ఆకర్షించలేదు.

అవధానిగారి భార్య మహాలక్ష్మిగారు ఇంటర్ చదివే రోజుల్లో కాపురానికి వచ్చింది. కాపురానికి వచ్చిన నాలుగునెలలకే ఆమె విషజ్వరం వల్ల మరణించింది. అవధానిగారిని ఈ విషయం అశనిపాతంలా బాధించింది. ఆత్మహత్య చేసుకుని జీవితాన్ని చాలించాలని కూడా భావించాడు. కాని ఆయన తల్లి ఆ ప్రయత్నం విరమింపచేసింది. విశ్వనాథవారి సాహచర్యంలో ఆయన మళ్లీ మనిషిగా మారాడు. చదువు కొనసాగించాడు. రచనా వ్యాసంగంలో నిమగ్నుడయ్యాడు. 1930-31 విద్యాసంవత్సరంలో ఇంటర్మీడియట్ పూర్తిచేశారు. పై చదువు కూడా అక్కడే కొనసాగించాలనుకున్నారు. కానీ విశ్వనాథ సత్యనారాయణ, కొడాలి సుబ్బారావు గార్ల సలహా సహాయాలతో ఆంధ్ర విశ్వవిద్యాలయంలో తెలుగు బి.ఏ ఆనర్సు చదవడానికి విశాఖపట్టణం వెళ్లారు.

విశాఖపట్టణంలో ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఆంధ్ర శాఖాధ్యక్షులుగా ఉన్న పింగళి లక్ష్మీకాంతంగారు బి.ఏ. ఆనర్సులో ప్రవేశానికి అవకాశం కల్పించి ప్రోత్సహించారు. అప్పుడు తెలుగు బి.ఏ. ఆనర్సు తరగతులు బొబ్బిలి హాలులో జరిగేవి. అవధానిగారితో పాటు ఆ తరగతిలో పెద్దింటి రామస్వామి, గొడవర్తి సూర్యనారాయణమూర్తి, పాటిబండ మాధవశర్మ, జోసెఫ్, దేవరాజు వేంకట కృష్ణారావు కుమారుడు సహాధ్యాయులుగా ఉండేవారు. పింగళి లక్ష్మీకాంతంకారు, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు, విద్వాన్ గంటి జోగి సోమయాజులు వంటి వారు అధ్యాపకులుగా ఉండేవారు.

పాటిబండ మాధవశర్మగారు అవధానికి మంచి ప్రాణస్నేహితుడయినాడు, చదువులో వీరిద్దరూ పోటీపడి చదివేవారు. అవధానిగారు పద్యరచన కొనసాగిస్తూనే ఉండేవారు. బందరులో రాసిన పద్యాలు విశాఖపట్టణంలో రాసిన పద్యాలు పరిశీలించి చూస్తే అవధానిగారు మానసికంగా కొంత కవితా పరిణతి చెందినట్టు కనిపిస్తుంది. భారతి అగస్టు 1932లో 'యోగనిద్ర' అనే శీర్షికతో.

అవనిజనింతు ధర్మమున కభ్యుదయంబు నశించి హాని సం
భవమయినప్పుడెల్ల బరిపంథుల దుష్టులనుక్కడంతు న
ష్ట విషయ ముద్ధరింతునని పల్కియు నయ్యది విస్మరించు వా
డవె? నిదురించు చుంటివా? విలంబ మొనర్చద వేల యాక్రియన్. [3]

- వంటి పద్యాలను బట్టి ఈ దశలో అవధానిగారి ఆధ్యాత్మిక చింతన వికసించిందనవచ్చు.

బి.ఏ ఆనర్సు రెండవ సంవత్సరం (1933) చదివేటప్పుడు అవధానిగారికి రెండవ వివాహం జరిగింది. ఆమె పేరు చంద్రావతి, ఆమె వెంపరాల వారి ఆడపడుచు. వివాహం అయినాక కూడా కొంత కాలం ఉచితంగా భోజనం లభించే వసతిగృహంలో వుండి విద్యాభ్యాసం చేసేవారు. అవధానిగారు ఆనర్సు రెండవ సంవత్సరం చదివేటప్పుడు శ్రీశ్రీ (శ్రీరంగం శ్రీనివాసరావు), పాత్రుని సోమయాజులు మొదలైనవారు ఆనర్సు మొదటి సంవత్సరంలో చేరినారు. అప్పుడే తెలుగు శాఖ ఒక పత్రిక ప్రారంభించింది. ఉపాధ్యక్షులుగా డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణగారు ఉండేవారు. ప్రో వైస్‌చాన్సలర్‌గా జయపురాధీశ్వరులు విక్రమదేవవర్మ ఉండేవారు. వీరిద్దరి ఆదరణ కూడా అవధానిగారికి లభించింది. దీనికి కారణం అవధానిగారి ప్రతిభ, ఆయనలోని సత్ప్రవర్తన వినయ విధేయతలు వంశగౌరవం.

బి.ఎ ఆనర్సు మూడవ సంవత్సరంలో అవధానిగారు మొట్టమొదట నాటకంలో వేషం వేశారు. అది విశ్వనాథ సత్యనారాయణగారు రచించిన 'నర్తనశాల' నాటకంలో భీముని పాత్ర, ఆకృతికి తగిన ఆహార్యమిది. శ్రీ పాటిబండ మాధవశర్మ ద్రౌపదీ వేషం ధరించారు. నాటకం చాలా రక్తికట్టింది. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో తెలుగుశాఖ ఆధ్వర్యంలో రాధాకృష్ణ పండితుని ఆహ్వానంపై విశ్వనాథ సత్యనారాయణ కవిబ్రహ్మను గూర్చి ఉపన్యాసమిచ్చిన సందర్భంలో ఈ నాటక ప్రదర్శన జరిగింది. ఇది 1933లో జరిగింది. ఆనర్సు మూడవ సంవత్సరం చదివేటప్పుడే విశాఖపట్టణంలో మొట్టమొదట కాపురం పెట్టడం జరిగింది. పాటిబండ మాధవశర్మగారి ఇంటిలో అవధానిగారి దంపతులకు వసతి లభించింది. మాధవశర్మ దంపతులు వీరిని ఎంతో ఆదరించారు.

ఈ రోజుల్లో నన్నయమీద, తిక్కనమీద అవధానిగారు రాసిన పద్యాలు భారతిలో ప్రచురింపబడినాయి. 'మహామంత్రులు' అనే శీర్షికతో తిమ్మరుసు, విజ్జలుడు, యుగంధరుడు మొదలైనవారిపై కూడా పద్యాలు రాశారు. అవికూడా భారతిలో ప్రచురింపబడినాయి. తెలుగు బి.ఎ. ఆనర్సులో అవధానిగారు ప్రప్రథములుగా ఉత్తీర్ణులైనారు. ఆంధ్ర విశ్వకళాపరిషత్తులో తెలుగు బి.ఎ ఆనర్సు మొదటి బ్యాచ్ వీళ్లదే. పరీక్షకులుగా ప్రఖ్యాత పండిత ప్రకాండులైన మానవల్లి రామకృష్ణ కవిగారు, గిడుగు రామమూర్తి పంతులుగారు, జయంతి రామయ్యగారు, రాజావిక్రమదేవవర్మగారు, వర్ఝుల చిన సీతారామశాస్త్రిగారు, వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఉన్నారు. వీరినందరినీ అవధానిగారి ప్రతిభ ఆశ్చర్యచకితులను చేసింది.

చదువులో ప్రప్రథముడుగ ఉత్తీర్ణుడైన అవధానిగారికి ఉద్యోగ విషయంలో కొన్ని చేదు అనుభవాలు చవిచూడవలసి వచ్చింది. కారణం అది తన చేతిలోని పని కాదు కదా.

అక్కడెన్నో రాజకీయాలు చోటుచేసుకొంటాయి.

సర్వేపల్లి రాధాకృష్ణ పండితులు తాను ఆంధ్ర విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులుగా ఉన్నప్పుడు అన్ని శాఖల్లో బి.ఎ. ఆనర్సులో ప్రప్రథములుగా ఉత్తీర్ణులైన వారికందరికి విశ్వవిద్యాలయంలో ఉపన్యాసకులుగా ఉద్యోగాలిచ్చి ప్రోత్సహించారు. కానీ తెలుగు శాఖలో మాత్రం అవధానిగారికి ఈ అవకాశం కలగలేదు. అది అవధానిగారికి బాధ కల్గించింది. అసలే పేదరికం ఆపైన సంసార భారం. వృద్ధులైన తల్లిదండ్రులు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఉద్యోగం దొరకలేదు. కానీ రాధాకృష్ణ పండితుడు అవధానిగారికి మిసెస్. ఎ.వి.ఎన్ కళాశాలలో అవకాశం కల్పించారు. అవధానిగారు 1934 జూలై మొదటి తేదీ తెలుగు పండితుడుగా ఉద్యోగ జీవితం ఆరంభించారు.

## 3. ఉద్యోగ జీవనం

విశాఖపట్టణంలో మొదట అవధానిగారు తెలుగు పండితులుగా ఉద్యోగ జీవనానికి శ్రీకారం చుట్టారు. జీతం అరవై (60) రూపాయలు. అయినా కొంతవరకు ఆర్థిక సమస్యలు తీరాయి. సంసారం సాఫీగానే జరిగింది. 1934వ సంవత్సరంలోనే అవధానిగారికి ప్రథమపుత్ర సంతానం విజయదశమినాడు జరిగింది. ఈ పిల్లవానికి సీతారామశర్మ అని నామకరణం చేశారు.

అవధానిగారు తెలుగు పండితుడుగా ఉద్యోగంలో చేరిననాటి నుండి తెలుగు పండితుడంటే గౌరవం పెరగసాగింది. అంతకుమునుపు తెలుగు ఉపాధ్యాయుడు పాఠం చెప్పేటప్పుడు తరచుగా గోలచేసేవారు. కానీ అవధానిగారు తెలుగు పండితుడుగా చేరినప్పటినుండి విద్యార్థులు తెలుగు పాఠాలను ఎంతో ఆసక్తితో వినేవారు. విద్యార్థులే కాదు ఇతర విషయాలు బోధించే ఉపాధ్యాయులు కూడా అవధానిగారి పాఠ్య ప్రవచనాలను ప్రక్కన ఉండి విని ఆనందించేవారని వారి తమ్ముడు రామమూర్తిగారు తెలిపారు. ఆయన బోధనలో విషయ వివరణ, వ్యాకరణాంశ వివరణ, పద్యాలు చదివే తీరు విని తన్మయత్వం పొందేవారు. పాఠాలు చెప్పడానికి అవధానిగారు ఒక మధుర ప్రణాళికను తయారు చేసుకొనేవారు. అందులో ఒక విచిత్రమైన హాస్య పద్ధతి చోటు చేసుకొనేది. ఎంత అల్లరి చేసే విద్యార్థిగాని వారి పలుకులకు తలయొగ్గి నమస్కరించి కూర్చునేవాడు. వారి సమయస్ఫూర్తి వ్యంగ్య సంభాషణ, చమత్కారోక్తులను గూర్చి ఇప్పటికిని ఎందరెందరో విచిత్రంగా ఆయన మా తెలుగు మాష్టారు అని సగర్వంగా చెప్పుకొందురు. [4] వారి అధ్యాపకత్వము ఆదినుండి ప్రశంసావహమనడానికి ఇది ఒక నిదర్శనము.

అవధానిగారు పనిచేసే కళాశాలకు షష్టిపూర్తి ఉత్సవాలు జరిగాయి. కళాశాల ప్రశస్తిని

కళాశాల దాతలైన అంకితం వారి ఉదార గుణాల గురించి రాసిన పద్యాలు పండిత లోకంలో ప్రశంసాపహమైనాయి. ఎ.వి.ఎన్ కళాశాలలో భారతీ తీర్థ మహాసభలు జరిగిన సందర్భంలో కవులు కావ్యగానం చేశారు. అవధానిగారు ఆశువుగా కొన్ని పద్యాలు నన్నయమీద చదివారు. నన్నయ అంటే అతనికి ప్రీతి మెండు. అవధానిగారి పద్యాలు విన్న విక్రమ దేవవర్మగారు ''నన్నయభట్టు తన్ను గూర్చి రాసికొనవలసి వచ్చినచో నింత సుందరముగ, ప్రౌఢముగ వ్రాసికొని ఉండడని''[5] అభినందించారట.

అవధానిగారికి చిన్ననాటి నుండి ఆది కవి నన్నయమీద అభిమానం మెండు. పద్యాలు రాసే నేర్పు వెన్నతో పెట్టిన విద్య. పైగా ప్రతిభావంతుడు ప్రశంసలకు కొదవేమిటి? ఆ సభలో శెట్టి నరసింహంగారు అవధానిని తన దగ్గరకు పిలిపించుకొని ఆనందాశ్రువులతో కౌగిలించుకొని ప్రశంసించారట. ఆ సభలోనే వెంకటావధానిగారికి ''కవిభూషణ'' అనే బిరుదునిచ్చి గౌరవించారు.

విశాఖపట్టణంలో కోసూరి చిన్మయాచారి అనే కంచర వర్తకుడుండేవాడు. అతనికి ఇద్దరు భార్యలు. అతను సాహిత్యాభిమాని, కవులను గౌరవించే స్వభావం కలవాడు. అతడు సాయంకాలాలలో కవితా గోష్ఠులతో కాలం గడిపేవాడు, తాను కృష్ణ దేవరాయలనని అతని ఆస్థానము భువన విజయమని అందులో పాల్గొను కవులు అష్టదిగ్గజాలని భావించెడివాడు. కృష్ణదేవరాయలకు వలె తనకు కూడా ఇద్దరు భార్యలని భావించెడివాడు. తన శక్తి మేరకు అప్పుడప్పుడు కంచుగ్లాసులను కవులకు బహూకరించెడివాడు. ఆ అష్టదిగ్గజాలలో అవధానిగారు అల్లసాని పెద్దన, ఈ భువన విజయమే తరువాతి కాలంలో రూపొందిన భువన విజయ సాహిత్య రూపకాలకు ప్రేరణ అని చెప్పవచ్చు.

విశాఖపట్టణంలో అవధానిగారి జీవితం కొంత హాయిగానే గడిచింది. కానీ ఆరోగ్యం అంత సహకరించలేదు. అవధానిగారిది ఆకారపుష్టేగాని ఆరోగ్య పుష్టి ఉన్న ఆకారం కాదు. ఆయనకు ఉదరకోశ సంబంధమైన జబ్బు ఉండేది. ఈ జబ్బు కారణంగా ఆయన డా. బెండపూడి పేర్రాజుగారి దగ్గరికి వెళ్లినప్పుడు ఆయనతో పరిచయం కలిగింది. డాక్టర్ పండితాభిమాని, సాహితీప్రియుడు, అవధాని గారిని గౌరవాదరాలతో చూసేవాడు. ఉచితంగా వైద్యం చేసేవాడు, అందుకు కృతజ్ఞతగా అవధానిగారు తన కృతి ''రాజసందర్శ''నాన్ని డాక్టరు పేర్రాజుగారికి అంకితమిచ్చారు. ఆ కృతి అంకితోత్సవం విశాఖపట్టణంలోని రాజా భానోజీరావుగారి దర్బారుహాలులో జరిగింది. పింగళి లక్ష్మీకాంతంగారు అధ్యక్షత వహించారు. ఈ పేర్రాజుగారి ప్రేరణతో ఉమరు ఖయ్యామ్ కృతి మధుశాలను 'ఫిడ్జిరాల్డు' ఆంగ్లానువాదాన్ననుసరించి తెలుగులోనికి అనువాదం చేశారు. కానీ దీని వ్రాతప్రతిని ఎవ్వరో తీసుకువెళ్లి తిరిగి ఇవ్వనందున అది ఇప్పుడు అలభ్య

రచనగా మిగిలిపోయింది.

విశాఖపట్టణంలో గ్రంథి పద్మరాజు అనే సంపన్న వైశ్యుని ఇంటిలో అవధానిగారు విరాటపర్వం పురాణ ప్రవచనం చేసేవారు, ప్రతిఫలంగా ఈ వైశ్యుడు అవధానిగారికి ఒక వెండి పళ్లెం బహూకరించారు.

అవధానిగారికి ఉదరకోశ వ్యాధి మళ్లీ ఎక్కువ అయినది. అయినా ఉపన్యాసాలకు వెళ్లడం సాహితీ కార్యక్రమాలలో పాల్గొనడం మానేవారు కాదు. ఎందరో డాక్టర్లు వైద్యం చేసి చూశారు. జబ్బునయం కాలేదు. చివరికి కింగ్ జార్జ్ హాస్పిటల్‌లోని 'కినీ' అనే ఆంగ్లేయ డాక్టర్ శస్త్ర చికిత్స చేసి అపెండిసైటిస్‌కు కారణమైన భాగాన్ని తీసివేశారు.

సహ అధ్యాపకుడూ ఆంగ్లోపన్యాసకుడూ అయిన టేకుమళ్ల రామారావుగారి సాహచర్యం వల్ల 18వ శతాబ్దానికి చెందిన కొందరి ఆంగ్ల రచయితలు లేహంట్జిస్టన్, స్కాట్, సరీవాల్టర్ రేలె, చార్లెస్ లాంబ్ వారి వ్యాసాలు తెలుగులోనికి అనువదించారు. కానీ ఇవి ఇప్పుడు అలభ్యం. ఆ వ్యాస శిల్పమే తరువాతి కాలంలో మంచి వ్యాసకర్త కావడానికి దోహదం చేసింది. హైందవ సంప్రదాయమన్న అవధానిగారికి మొదటినుండి ఎంతో అభిమానం. హిందూ సంప్రదాయం మీద అవధానిగారు అసంఖ్యాకంగా వ్యాసాలు రాశారు. ఉపన్యాసాలిచ్చారు. ఏ చిన్న పాఠశాల వారు పిలిచినా అది మారుమూల ప్రాంతం అయినా ఊపిరి సలపని పనులు ఎన్ని ఉన్నా మారు మాట్లాడకుండా ఆరోగ్యాన్ని కూడా లెక్కచేయకుండా ఉపన్యాసాలకు వెళ్లేవారు. ఉపన్యాసమే ఊపిరిగా వారు జీవించారు. ఉపన్యాస కళకు ఒక ఒరవడి రూపొందించారు. హిందూ సంప్రదాయాన్ని, సాహిత్యంలోని రసవత్తర ఘట్టాలను, సామాన్యులకు కూడా అర్థం అయ్యేటట్లు ఉపన్యసించగల నేర్పు అవధాని గారిది.

అవధానిగారికి భారతీయత అంటే భక్తి మెండు. ఆంధ్ర రాష్ట్రాభిమానం ఆత్మదఘ్నంగా ఉండేది. స్వాతంత్ర్య పోరాటంలో ప్రత్యక్షంగా పాల్గొనకపోయినా అంతర్గతంగా దేశమంటే ఎనలేని భక్తి ప్రపత్తులుండేవి. రాష్ట్రాభిమానంతో ఆంధ్రరాష్ట్రోద్యమానికి దోహదం చేసే ఉద్దేశంతో, మల్లాది రామచంద్ర శాస్త్రిగారి సోదరులు అయిదుగురూ, విశ్వనాథ సత్యనారాయణగారు ఇంకా కొందరు ఖ్యాతి గడించిన సాహితీమిత్రులు మొత్తం పదహారుగురు అవధానిగారితో సహా కలిసి ఆంధ్ర రాష్ట్రం నలుమూలలా సంచరించి ఆంధ్ర సంస్కృతి, వాఙ్మయాలపై నాటకాలాడి ఉపన్యాసాలిచ్చి ఆంధ్రులను ఉద్రేకపరిచి ఉద్యమోన్ముఖులు కావడానికి దోహదం చేశారు. భారత స్వాతంత్ర్యోదాహరణము, ఆంధ్ర రాష్ట్రోదాహరణము, వంటి ఉదాహరణ కావ్యాలు రచించారు. భారత స్వాతంత్ర్యోదాహరణ కావ్యాన్ని శ్రీ తెన్నేటి విశ్వనాథంగారికి ఆయన షష్టిపూర్తి సభలో అంకితం చేశారు.

తెన్నేటి విశ్వనాథం గారికి సంస్కృత భాష అన్నా వేదవాఙ్మయమన్నా అంతులేని అభిమానం. ఆయన సంస్కృతాన్ని స్వయంగా నేర్చుకున్నారు. కానీ ఆయనకు తృప్తి కలగలేదు. అవధానిగారిని పిలిపించుకొని ఆయనతో రోజూ రెండు మూడు గంటలు సంస్కృత వ్యాసంగం చేసేవారు. వేద రహస్యాలను తెలుసుకొనేవారు. తెన్నేటి విశ్వనాథంగారు ఆంగ్ల భాషా పాండిత్యంలో మంచి దిట్ట. ఈయన ఎం.ఎ ఆంగ్లంలో చదివారు. వేదాలను ఆంగ్లానువాదంతో చదివారు. కానీ ఆయనకు తృప్తి కలగలేదు. అందుకే అవధానిగారిని పిలించుకొని ఆయనతో సంస్కృత వ్యాసంగం చేస్తూ వేద రహస్యాలను గురించి చర్చించేవారు. తెన్నేటివారితో పరిచయం వల్ల అవధానిగారు తన ఆంగ్లభాషా పాండితికి పదును పెట్టుకున్నారు. అంతర్గతంగా ఉన్న రాష్ట్రాభిమానం దేశభక్తిని ఇనుమడింపజేసింది. వేదాలను తెలుగులోనికి అనువాదం చేయాలనే ఆలోచనకు అంకురార్పణం జరిగింది.

1912 నుండి 1940 వరకు అవధానిగారి జీవితాన్ని సమీక్షిస్తే ఈ దశలో అవధానిగారు చేసిన పోరాటం జీవన పోరాటం. విద్యార్జన కోసం ఆరాటం జీవన భృతి కోసం అన్వేషణ. ఆయన ప్రతిభ అనన్య సామాన్యమైనది. ఆయన అభిరుచి పరిస్థితులు, పరిచయాలు, ఇంటి వాతావరణమూ, ఆయనను పండితునిగా తయారుచేశాయి. అభిరుచికి తగిన విద్యనే అభ్యసించారు. విద్యకు తగిన వృత్తిలోనే స్థిరపడినారు. ప్రవృత్తికి వృత్తి దోహదం చేసింది. అందుకే ఆయన అధ్యాపక వృత్తిలో రాణించారు. ప్రవృత్తిని ప్రభవింపజేసి వెలుగులను వెదజల్లారు. విద్యార్థి దశనుండే రచనలు చేశారు. సాహితీప్రియులతో పరిచయాలు పెంచుకున్నారు. భారతిలాంటి పత్రికలలో రచనలు ప్రచురింపబడినాయి. వ్యాసరచనా పోటీల్లో బహుమతులందుకున్నారు. ''కవిభూషణ'' వంటి బిరుదులను పొందారు. ఉపన్యాసాలిచ్చి రాణించారు. అవధానిగారి జీవితంలో ఇది తొలి దశగా పరిగణింపవచ్చు.

ఈ దశలో అవధానిగారనే మొగ్గ ఆకుల చాటున హాయిగా ఎదగలేదు. ఎండకు ఎండి వానకు తడిసి వడగాటులకు సుడిగాలులకు నిలదొక్కుకుని వికసింపనారంభించింది. పరిమళాన్ని ప్రకీర్ణింపజేయడం ప్రారంభించిందని చెప్పవచ్చు.

1940-1951 వరకు అవధానిగారి జీవితంలో వికాస దశ అని చెప్పవచ్చు. ఈ కాలంలో అవధానిగారి వ్యక్తిత్వము, వక్తృత్వశేముషి వికసింపసాగాయి. అధ్యయన శీలం, పరిశోధనా దృక్పథం అవధానిగారిలో పాటుచేసుకున్నాయి. ''ధర్మవరం రామకృష్ణమాచార్యులు'' అనే శీర్షికతో విమర్శక వ్యాసం రాసి ఆంధ్ర విశ్వవిద్యాలయంనుండి మొట్టమొదట తెలుగులో ఎం.ఎ ఆనర్సు పట్టాన్ని సంపాదించారు. డాక్టరేటు చేయడానికి అక్కడి పరిస్థితులు అనుకూలించలేదు. ఈ రోజులలోనే కౌముది మహోత్సవము అనే సంస్కృత నాటకాన్ని అనువాదం చేశారు. తెలుగు పండితుని పదవినుండి అదే కళాశాలలో తెలుగు ఉపన్యాసక

పదవిని పొందారు. ఎన్నో వ్యాసాలు, కొత్త పుస్తకాలకు పీఠికలు రాయడం ఈ దశలోనే ఆరంభమైంది. బోర్డు ఆఫ్ స్టడీస్ అధ్యక్షులుగా మూడేండ్లు దక్షతతో నిష్పక్షపాతంగా నిర్వహించారు. ''కౌముదీ మహోత్సవము'' ఇంటర్మీడియెట్ తెలుగు పాఠ్య గ్రంథంగా ఎంపిక చేయబడింది. కానీ విశ్వవిద్యాలయంలో అధ్యాపకుడుగా ఉద్యోగం చేయాలనే కోరిక మాత్రం తీరలేదు.

1939నుండి సుమారు పది సంవత్సరాలు స్కూల్ ఫైనల్ వాళ్లకు ఇంటర్మీడియెట్ వాళ్లకు తెలుగు పాఠ్య గ్రంథాలకు నోట్సు (గైడ్సు) రాశారు అవధానిగారు. వారు ఒక్కరే రాయలేదు, కొంతమంది పండితులచే రాయించారు, సుమారు ఇరవైమంది తెలుగు పండితులు అవధానిగారి ఆధ్వర్యంలో రాసేవారు. వారికి వాక్యరచనా చమత్కృతులను, సరళశైలిని అవధానిగారు నేర్పేవారు. ప్రతి విషయం తాను స్వయంగా పరిశీలించేవారు. అవి కేవలం నోట్సుల్లా కాకుండా విమర్శ గ్రంథాల్లా ఉండేవి. తెలుగు పండితులకు మార్గదర్శకంగా ఉండేవి. అవధానిగారిది ఆర్థిక బాధలవల్ల చేసిన కృషియే అయినా అర్థ పరిజ్ఞానానికి, రచనా శిల్పంలో మెలకువలు తెలిసి కోవడానికి దోహదం చేశాయని వారే ఒకచోట చెప్పినారు. ''ఈ నోట్సులు వ్రాసి నేనెంతగా ధనాఢ్యుడను కాలేదు. ప్రకటనకర్తలు ధనవంతులయిరి. శ్రమమాత్రము మాకు మిగిలినది. ఉత్తముల ప్రశంసలుత్సాహకములయినవి. అంతియేకాని యొక్కటి ఉన్నది. నోట్సు వ్రాయుటవలన శబ్ద పరిజ్ఞానము, వ్యాకరణ పరిజ్ఞానము, గుణదోష వివేకత, విమర్శక శక్తి, మృదుశైలి, ప్రతి పదార్థాన్వయ ప్రజ్ఞ చక్కగా కుదురును. ఎందరో పద్యములు వ్రాయుదురు. శబ్దార్థములడిగిన చెప్పలేరు. అన్వయము పొసగదు. శబ్ద సాధుత్వమునెఱుంగరు. ఏ పద్యమునకయిన ప్రతి పదార్థ తాత్పర్యములు సక్రమ పద్ధతులతో కళా ద్రుత ప్రకృతిక పరిజ్ఞానముతో, విభక్తి సమన్వయముతో చేయలేరు. రచన సాగింతురు. అట్టివారు ముఖ్యముగా ఉపాధ్యాయులు. నోట్సు రెండు మూడు సంవత్సరాలు వ్రాసినచో వారికి బోధక శక్తి పెరుగును. శబ్ద జ్ఞానము హెచ్చును, ఒక శైలీ రచన లొంగును'' [6] అని అవధానిగారు చెప్పుచుండెడివారని దివాకర్ల రామమూర్తిగారు పేర్కొన్నారు.

దీనినిబట్టి అవధానిగారు నోట్సు రాయడానికి కూడా చాలా శ్రమించెడివారని తెలుస్తోంది. ప్రతిభకు, పాండిత్యానికి పదును పెట్టుకున్నారని కూడా చెప్పవచ్చు.

ఈ నోట్సులను అప్పుడు ఆంధ్ర విశ్వవిద్యాలయానికి ఉపాధ్యక్షులుగా ఉన్న కట్టమంచి రామలింగారెడ్డిగారు కూడా చూడటం జరిగింది. ఆయన రాసిన ''ముసలమ్మ మరణము'' అప్పుడు ఇంటర్మీడియెట్ విద్యార్థుల పాఠ్యగ్రంథంగా ఉండేది, దానికి అవధానిగారు తయారుచేసిన నోట్సులో ఇలా రాసి వుంది.

''ఈ ముసలమ్మ మరణము నవీన సాహిత్యమున కాదర్శము. ఇది విషాదాంత కావ్యము. విషాదాంతముగా వ్రాయు కావ్యములకిదియే నాంది. శ్రీ రెడ్డిగారు ప్రతిభాశాలురు. ఇందలిశైలి ఆంగ్ల రచయితల శైలి ననుకరించి యున్నది. భావములు ఆంగ్లమునుండి తెనుగున కనువాదమొందినట్లు తోచుచున్నవి. అందందు వ్యాకరణ దోషములున్నవి. శైలి నవ్యముగా నున్నది. ఇందు శ్రీ రెడ్డిగారి భావనా వైశిష్ట్యము ప్రదర్శితమగుచున్నది'' [7] అను దానిని రామలింగారెడ్డిగారు చూసిరి. రెడ్డిగారి మనుమడికి, ప్రభాసరాయ్ అనునతనికి , సంస్కృతం నేర్పుతూ ఉన్న అవధానిగారి తమ్ముని రామమూర్తిని పిలిపించి 'నా పుస్తకమును గురించి పింగళి లక్ష్మీకాంతం, మానవల్లి రామకృష్ణ కవి, వేటూరి ప్రభాకరశాస్త్రి మొదలైనవారు తిక్కనశైలివలే, ఎఱ్ఱనశైలివలే ఉన్నదనినారే! ఉపోద్ఘాతంలో ఆ విషయం ఉన్నది కదా! మీరు ఎందులకిట్లు రాసితిరనెను'' అందుకు రామమూర్తిగారు సహేతుకంగా వ్యాకరణ దోషాలను, ఆంగ్లభావానువాదాలను కొన్నిటిని చూపగా అందుకు రామ లింగారెడ్డిగారు సంతోషించిరట. ఈ విషయం రామమూర్తిగారు అవధానిగారితో చెప్పగ ఆయన బాధపడలేదు. ''పాఠ్యగ్రంథములగుట చేత గుణ దోషములను నుల్లేఖించి చూపవలసిన పని వ్యాఖ్యాతది. అందువలన అట్లుచేసితిమి. రెడ్డిగారు సరసులు కనుక కోపగించరైరి'' అనిరట, ఈ విషయంవల్ల అవధానిగారు నోట్సులను కూడా ఎంత పరిశోధనాత్మకంగా రాసేవారో వ్యక్తం అవుతున్నది.

ఈ నోట్సుల విషయమై ఆయన పెద్దకుమారుడు దివాకర్ల సీతారామశర్మగారి అభిప్రాయం ఈవిధంగా ఉంది. ''వారి విశాఖపట్టణ జీవితం చాలా కష్టంగానే జరిగిందని చెప్పాలి. ఆర్థిక పరిస్థితి అంత తృప్తికరంగా లేకుండటచే ప్రతి సంవత్సరం వేసవి సెలవులు మూడు మాసములు ఎస్.ఎస్.ఎల్.సి పాఠ్యభాగానికి '**Five Pandits**' అను పేర నోట్సు వ్రాస్తుండేవారు. పేరుకు '**5 Pandits**' అని ఉన్నప్పటికీ, 80 శాతానికి పైగా వారే ఆ నోట్సును రాసేవారు. ప్రకాశకుడు ముద్రించిన సుమారు 1000 కాపీలు ముద్రణ అయిన 15 రోజులలోపుగనే అమ్ముడు పోయేవి. ఆ రోజులలో ''5 పండిట్సు నోట్సు'' అంటే చాలా పేరు ఉండేది. ఆ కాలంలోనే వారు తరచుగా నిఘంటువులను చూడవలసి వస్తూ ఉండేది. తన పాండిత్య సంపాదనకు నిఘంటు పరిశీలనయే చాలా దోహదం చేసిందని వారంటూ ఉండేవారు; [8] అని పేర్కొన్నారు.

విశాపట్టణంలో అవధానిగారు కొన్ని చేదు అనుభవాలు కూడా చవిచూడాల్సి వచ్చింది. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఆరోజుల్లో అన్ని శాఖల ( డిపార్టుమెంట్సు) లో ప్రథమ శ్రేణిలో ప్రథములుగా ఉత్తీర్ణులైన వారికందరికి ఉపన్యాసకులుగా ఆయా శాఖల్లో ఉద్యోగాలిచ్చి ఉపాధ్యక్షులైన సర్వేపల్లి రాధాకృష్ణగారు ప్రోత్సహించారు. తెలుగు శాఖలో ప్రప్రథములుగా

ఉత్తీర్ణులైన అవధానిగారికి మాత్రం ఆ అవకాశం కల్పించలేదు. దీనికి కారణాలు అనేకం. ముఖ్యంగా అవధానిగారు విశ్వనాథ శిష్యుడు కావడం శాఖాధ్యక్షులుగా ఉన్న పింగళి లక్ష్మీకాంతం గారికి విశ్వనాథ సత్యనారాయణ గారికి అభిప్రాయ భేదాలుండటం, అర్హతలన్నీ ఉండికూడా విశ్వవిద్యాలయంలో అవకాశం దొరకలేదనే విషయం అవధానిగారిని చాలా బాధించెడిది. 1943 మార్చి 5వ తేదీ అవధానిగారి తండ్రి సుందర రామయ్యగారు దివంగతులయినారు. ఇదికూడా విశాఖపట్టణంలో జరిగిన విషాద సంఘటనే. ఆయన వేదపండితుడు. అవధానిగారికి వేదవాఙ్మయంమీద అభిమానం కలుగచేశారు. తండ్రి మరణానంతరం అవధానిగారు వేదాధ్యయనం మొదలుపెట్టారు. శ్రీ మహావ్రత చయనులగారి వద్ద నమక చమకములు దశశాంతులు అరుణము వల్లెవేశారు. శ్రీ తెన్నేటి విశ్వనాథంగారి సాహచర్యంతో వేదసారాన్ని గ్రహించారు. 1947వ సంవత్సరం వేదపండిత సభను స్థాపించి స్థాపకాధ్యక్షుడుగా వ్యవహరించారు. జీవితంలో చివరి క్షణం వరకు వేదాధ్యయనాన్ని వదలలేదు. యజుర్వేదానికి తెలుగులో వివరణ రాయడానికి పూనుకున్నారు. ఎంతో పరిశ్రమ చేశారు. తిరుమల తిరుపతి దేవస్థానం వారు దోహదం చేశారు. శ్రీ కృష్ణమూర్తి (మద్రాసు)గారు సహ రచయితలుగా సహకరించారు.

1948 జనవరి 30వ తేదీ మహాత్మాగాంధీ గారిని ''గాడ్సే'' హత్యచేశాడు. ఆ సందర్భంలో (రాష్ట్రీయ స్వయం సేవక్) కార్యకర్తలను కారాగారాల్లో పెట్టారు. అవధానిగారిని కూడా అనుమానించి జైల్లో పెట్టారు. 24 గంటలు మాత్రం జైలులో పెట్టారు. జైల్లో ఉన్న ఈ 24 గంటలు పచ్చి మంచినీళ్లు కూడా అవధానిగారు ముట్టలేదు. అవధానిగారి వైదిక మతావలంబన నిష్ఠ అలాంటిది.

1950లో ఉస్మానియా విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖలో ఉపన్యాసక పదవి కోసం అభ్యర్థి కావాలని ప్రకటన వెలువడింది. దానికి అవధానిగారు అప్లై చేశారు. విశ్వవిద్యాలయం ఇంటర్వ్యూకు పిలిచారు. ఆ ఇంటర్వ్యూకు వచ్చిన వారిలో కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు నిడదవోలు వెంకటరావుగారి వంటి ఉద్దండ పండితులు వచ్చారు. సెలక్షన్ కమిటీలో గంటి సోమయాజిగారు ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం వంటి ప్రఖ్యాత పండితులున్నారు. అవధానిగారు ఉపన్యాసక పదవికి అర్హులుగా వారు ఎంపిక చేశారు. పబ్లిక్ కమిషన్‌వారి ద్వారా ఈ ఎంపిక జరిగింది. కానీ అవధానిగారు వెంటనే ఉద్యోగంలో చేరలేదు. దీనికి కారణం హైదరాబాద్‌లో అప్పుడు పరిస్థితులు బాగలేకపోవడమూ, అవధానిగారి పిల్లలు విశాఖపట్టణంలో చదువుకొంటూ ఉండటము. 1950 ప్రాంతంలో హైదరాబాద్‌లో పరిస్థితులు ఉద్రిక్తంగానే ఉన్నాయి. 1947-48లో రజాకార్లు విజృంభించి నానా భీభత్సం సృష్టించారు. ఇది చరిత్రపుటల్లో ఆరని రక్తపుమరకలా నిలిచిపోయింది. కమ్యూనిస్టులు కూడా ఇక్కడ సాయుధ పోరాటం చేశారు. భూదానోద్యమం ఇక్కడే ప్రారంభమైంది.

1948 సెప్టెంబర్ 18వ తేదీ నిజాం నవాబు మిలిటరీకి లొంగిపోయాడు. నైజాం రాష్ట్రం భారతదేశంలో కలిసింది. సుమారు 625 సంవత్సరాలు కొనసాగిన మహమ్మదీయుల పాలన అంతమైంది. దక్షిణ భారతదేశంలో ఇంత సుదీర్ఘకాలం ఒక్క తెలంగాణా ప్రాంతం తప్ప మరే ప్రాంతం ముస్లింలచేత పరిపాలింపబడలేదు. ఈ ప్రాంతంలో జరిగినన్ని ఘర్షణలు మరెక్కడా జరగలేదు. కాకతీయుల కాలంలో ఎంతో వైభవాన్ననుభవించిన తెలుగు భాషా సంస్కృతి, కళలు క్రీ.శ. 1323 నుండి 1948 వరకు మహమ్మదీయుల పాలనకు లోనై ఎన్నో ఘర్షణలకు గురైనాయి.

1948లో నిజాం లొంగిపోయినా ఇక్కడ భయాందోళనలు మాత్రం పోలేదు. 1950 జూన్ 12వ తేదీ తాత్కాలికంగా ఏర్పడిన మిలిటరీ ప్రభుత్వం రద్దయింది. కమ్యూనిస్టు దమనకాండను ఎదుర్కొనే ఉద్దేశంతో ప్రజా ప్రతినిధులతో ఒక తాత్కాలిక ప్రభుత్వం ఏర్పడింది. శ్రీ ఎం.కె.వెల్లోడి ముఖ్యమంత్రిగా బూర్గుల రామకృష్ణారావుగారు శ్రీయుతులు ఎం.శేషాద్రి, వినాయక్‌రావు ఫూల్‌చంద్ గాంధీ, నవాబ్ జైన్ యార్ జంగ్ మొదలయినవారు మంత్రులుగా ఈ ప్రభుత్వం ఏర్పడింది. రజాకార్ల వల్ల కమ్యూనిస్టులవల్ల కలిగిన అరాచకాలను ఎదుర్కొనడానికి గట్టి బందోబస్తు ఏర్పాటుచేశారు. అయినా ప్రజల్లో ఆందోళనా భయభ్రాంతులు తగ్గలేదు. స్థానిక కాంగ్రెస్‌వారు కూడా కృషి చేశారు. అణగద్రొక్కబడిన ఆంధ్ర భాషాభివృద్ధికి గ్రంథాలయోద్యమం రూపుదాల్చింది. హితబోధిని, తెలుగు పత్రిక, నీలగిరి, గోలకొండ, ఆంధ్రాభ్యుదయం వంటి పత్రికలు బాగా సేవ చేయసాగాయి. కిన్నెర, కంఠాభరణము, సాహితీ మేఖల, సాధన సమితి, అణాగ్రంథమాల వంటి గ్రంథమాలలు కూడా స్థాపింపబడినాయి. ఆంధ్ర సారస్వత పరిషత్తు వంటి సంస్థలు కూడా ఆంధ్ర భాషా సేవకు నడుం కట్టాయి. జాతికి భాష ప్రాణం వంటిదని గుర్తించిన కాలమిది. 50 సంవత్సరాలకు పూర్వం హైదరాబాదులో ఉర్దూ ఇంగ్లీషు భాషలకు ఉన్న చెల్లుబడిలో శతాంశమైనను, తెలుగునకు లేదని, ఉమ్మెత్తల కేశవరావుగారు పేర్కొన్నారు. ఇటువంటి పరిస్థితులలో తెలుగు ఉపన్యాసకుడుగా ఎంపికైన అవధానిగారు ఒక సంవత్సరకాలం హైదరాబాద్‌కు వచ్చి ఉద్యోగంలో చేరలేదు.

## 4. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో అవధానిగారు

విశ్వవిద్యాలయంలో ఆచార్యులుగా చేయాలన్న కోరిక అవధానిగారిని విశాఖపట్టణంలో ఉండనీయలేదు. చివరికి 1951 జూలై 31వ తేదీ మిసెస్ ఏ.వి.ఎన్. కళాశాలలో కన్నీటితో వీడ్కోలు పుచ్చుకొని, విశాఖపట్టణం వదిలి, హైదరాబాద్‌కు ప్రయాణమై, 1951 ఆగస్టు 1వ తేదీన ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఉపన్యాసకులుగా చేరారు. అప్పటికి సంసారం విశాఖపట్టణంలోనే ఉండేది. రెండు సంవత్సరాలు లీవు తీసుకుని బాధా పరితప్త హృదయం

తోనే హైదరాబాద్‌కు వచ్చారు. అవధానిగారు హైదరాబాద్‌లో అడుగు పెట్టినప్పటినుండి ఆయన జీవితంలో మూడవ దశ ప్రారంభమైంది. మొదట ఆయన హైదరాబాద్ ఎంత ప్రమాదమనకున్నారో తరువాత అంత ప్రమోదాన్ని పొందారు.

తెలుగుదేశంలోని విశ్వవిద్యాలయాలలో ఉస్మానియా విశ్వవిద్యాలయం మొట్టమొదటిది. 1918లో స్థాపింపబడింది. 1919లో తెలుగుశాఖ ( డిపార్టుమెంట్) ఏర్పడింది. ఉస్మానియా విశ్వవిద్యాలయ తెలుగుశాఖకు తెలుగు సాహిత్యంలో ఒక విశిష్ట స్థానం ఉంది. రాయప్రోలు సుబ్బారావుగారు, ఖండవల్లి లక్ష్మీరంజనంగారు వంటివారు శాఖాధ్యక్షులుగా ఇక్కడ పదవీ బాధ్యతలు నిర్వహించారు. ఎంతోమంది కవులు విమర్శకులకిది పుట్టినిల్లు.

అవధానిగారు తెలుగుశాఖలో ఉపన్యాసకులుగా చేరినప్పుడు ఖండవల్లి లక్ష్మీరంజనంగారు శాఖాధ్యక్షులుగా ఉన్నారు. అవధానిగారు 1951నుండి 1957 వరకు ఉపన్యాసకులుగా 1957 నుండి 1964 వరకు రీడరుగా 1964నుండి 1974 వరకు ఆచార్యులుగా, శాఖాధ్యక్షులుగా 1974 నుండి 1975 వరకు ఎమినెంట్ ప్రొఫెసర్‌గా 1975 నుండి 1978 వరకు యు.జి.సి ప్రొఫెసర్‌గా పదవీ బాధ్యతలను నిర్వహించారు.

1951 నుండి 1952 వరకు అవధానిగారు హైదరాబాద్‌లో ఒక మిత్రుని దగ్గర ఉండేవారు. 1952లో సంసారాన్ని హైదరబాద్‌కు తరలించారు.

మొట్టమొదట బి.ఎ తరగతికి వెళ్లినప్పుడు ఆ తరగతిలో విద్యార్థులుగా ఆచార్య ఎం.కులశేఖరరావుగారు, కీ.శే. డా. ఇరివెంటి కృష్ణమూర్తిగారు, డా. పి.యశోదారెడ్డిగారు, సామ్రాజ్యలక్ష్మిగారు, మొత్తం నలుగురు విద్యార్థులుండేవారు. (సామ్రాజ్యలక్ష్మి రెగ్యులర్ స్టూడెంటు కాదు. పరిమిషన్ తీసుకుని క్లాసుకు వచ్చేవారు అని ఆచార్య పి.యశోదా రెడ్డిగారు తెలియజేశారు). వీరందరూ కూడా అవధానిగారు పాఠం ఒక మధురానుభూతి అనే అభిప్రాయాన్ని ముక్తకంఠంతో వెలిబుచ్చారు. అప్పుడు కళాశాలాధ్యక్షులుగా ఆచార్య దొరస్వామిగారు ఉండేవారు. అవధానిగారు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఉద్యోగంలో చేరడానికి వచ్చినప్పుడు జరిగిన సంఘటనవల్ల ఆనాటి ఆయన వేషభాషలు వ్యక్తం అవుతున్నాయి. ఈ సంఘటనను గురించి అవధానిగారు స్వయంగా చెప్పిన మాటలివి. ''నేను విశ్వవిద్యాలయంలో 1951 జూన్ నెలలో ప్రవేశించితిని. నేను పంచకట్టుకొని లాల్చీయు కండువాయు ధరించి ఆర్ట్సు కళాశాల సింహద్వారము నొద్దకు వచ్చితిని. లోపలికి వెళ్లుచుండగా ద్వారపాలకుడు నన్నాపి ఉర్దూ భాషలో ఎక్కడికి వెళ్లనున్నారని అడిగెను. నాకా భాషలో ప్రవేశము లేదు. అతని అంగ విన్యాసమును బట్టియు సందర్భనమును బట్టియు నతడట్లు అడుగుచుండెనని నేను భావించితిని. నేను తెలుగులో వచ్చిన పని తెల్పితిని. అతని కర్థము కాలేదు. అతడు ఆర్ట్సు కళాశాల సౌందర్యమును చూచుటకు

సాధారణముగా వచ్చుచుండు ప్రేక్షక వర్గములో నేను కూడా నొకడనని భావించి ఆ సమయమున లోనికి వెళ్లుటకు అవకాశము లేదని సూచించెను. నా వేషమును బట్టి నేనతని కుపన్యాసకుడుగా గోచరింపలేదు. నేనచ్చట నుద్యోగము చేయుటకై వచ్చితినని అతనికేమి తెలియును? నేను జేబులోనుంచి ఆర్డరు కాగితము తీసి అతనికి చూపితిని. అప్పుడు కళాశాలలోనికి వెళ్లుచున్న ఉపన్యాసకునిచే నదని చదివించి విషయము తెలుసుకొని అతడు నన్ను లోనికి పోనిచ్చెను''[9]. దీనిని బట్టి అప్పుడు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో వాచ్‌మెన్ కూడా తెలుగు మాట్లాడేవాడు కాదని చాలామందికి తెలుగు వచ్చేది కాదని తెలుస్తున్నది. అవధానిగారికి కూడా ఉర్దూ భాషతో అప్పుడు అసలు పరిచయం లేదని కూడా వ్యక్తమవుతున్నది. కళాశాల అధ్యక్షులైన ఆచార్య దొరస్వామిగారి సలహా మేరకు అవధానిగారు వేషం మార్చుకొన్నట్లు అవధానిగారే తెలియజేశారు. పంచ కట్టుకొని కోటు తలపాగా ధరించి రెండు సంవత్సరాలు కళాశాలకు వెళ్లినట్లు అవధానిగారు చెప్పుకొన్నారు. ఆ వేషధారణలో కళాశాలకు వెళ్లే ఉపాధ్యాయులతో తాను ఒకడినని కూడా తెలియజేశారు. తరువాత కాలక్రమమున దుస్తులకు సంబంధించిన మార్పులు చాలా వచ్చాయని ఆయన పేర్కొన్నారు.

అవధానిగారు ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు శాఖలో ఉపన్యాసకులుగా చేరినప్పుడు ఎం.ఏలో ఇరువురే విద్యార్థులుండేవారు. అందులో ఒకరు ఆచార్య సి.నారాయణరెడ్డిగారు, రెండవవారు ముద్దసాని రామిరెడ్డిగారు. ఆయన బి.ఎ, బి.ఎస్‌సి విద్యార్థులకు కూడా పాఠాలు చెప్పేడివారు. సాయం కళాశాల క్లాసులు వారానికి రెండు రోజులు తీసుకునేవారు. రాత్రి 9 గంటల నుండి 9.45 వరకు తెలుగు పీరియడు ఉండేది. ఈ సాయం కళాశాల అనుభవాన్ని అవధానిగారు ఈ విధంగా పేర్కొన్నారు. ''అప్పుడు నేను ఎం. ఏకును బి.ఎ, బిఎస్‌సి విద్యార్థులకును కూడా తెలుగు పాఠములు చెప్పుచుంటిని. అప్పుడప్పుడు సాయం కలాశాలకు కూడా పోవుచుంటిని. సాయం కళాశాలలో తెలుగు చివరి పీరియడు. అనగా 9 గంటలకు మొదలై 9.45 పి.ఎం వరకు, చాలామంది విద్యార్థులు 8.30కే ఇండ్లకు పోవుచుండిరి. నా క్లాసు వారమునకు రెండు రోజులు మాత్రమే యుండెను. ఆ రెండు రోజులు తెలుగు విద్యార్థులే కాక ఇతరులు కూడా వచ్చి తరగతిలో కూర్చొండుట జరుగుచుండెను. వారికి పాఠ్య గ్రంథముతో పాటు ఆంధ్రకవుల మహాకావ్యములను గూర్చి కూడా చెప్పుచుంటిని. అది వారికెక్కువ ఆహ్లాదకరముగా నుండెను. అదే ఇతర విద్యార్థులు కూడా తరగతికి వచ్చుచుండుటకు కారణము.''[10]

అవధానిగారి తెలుగు భాషాబోధన ఎంత మనోరంజకమో చెప్పడానికి ఇది ఒక చక్కని ఆధారం. ఆయన ఎప్పుడూ తనను గురించి తాను గొప్పలు చెప్పుకునేవారు కారు. కనుక ఇది ఆయన యథార్థానుభవం. ఆయన శిష్యులైన ఆచార్య కులశేఖరరావు, ఆచార్య

యశోదారెడ్డి, ఆచార్య సి.నారాయణరెడ్డిగార్ల అభిప్రాయాలు కూడా ఇందుకు ప్రత్యక్ష సాక్ష్యాలు.

అవధానిగారితోపాటు పబ్లిక్ సర్వీసు కమిషన్ ద్వారా ఎంపిక అయిన తెలుగు అధ్యాపకుడు మరొకరున్నారు. ఆయన పేరు వెల్లటూరి వెంకటరాఘవ శర్మగారు. ఆయన 1950లోనే తెలుగుశాఖలో చేరినారు. సంగీత సాహిత్యాలలో మంచి పాండిత్యము కలిగి వుండేవారు. ఆయన బెంగుళూరునుండి వచ్చారు. మంచి వక్త అని, విద్యార్థులకు మనో రంజకంగా పాఠం చెప్పేవారని ఆచార్య బి.రామరాజుగారు తెలియజేశారు. ఈయన రాఘవశర్మగారి వద్ద చదువుకున్నారు. అవధానిగారు తెలుగు శాఖలో చేరిన తరువాత కూడా ఈయన కొంతకాలం పనిచేశారు. తరువాత అనారోగ్య కారణాలవల్ల సెలవులమీద వెళ్లిపోయారు. ఆచార్య బి.రామరాజుగారు 1951నుండి పార్ట్‌టైం లెక్చరర్‌గా పనిచేసేవారు. తెలుగుశాఖలో అప్పుడు ఆచార్య కె.గోపాలకృష్ణారావుగారు పాటిబండ మాధవశర్మగారు మొదలైనవారు పనిచేసేవారు. అవధానిగారు, బి.రామరాజుగారు ఒకే గదిలో కూర్చునేవారు. 1951నుండి 1966 వరకు వీరిద్దరు కలిసి పనిచేయుట జరిగింది. అవధానిగారెప్పుడూ ఇతరుల మనసు నొప్పించేటట్లు మాట్లాడేవారు కాదని రామరాజుగారు తెలియజేశారు. అవధాని గారితో పరిచయమున్న ఎవరైనా ఈ విషయం అక్షర సత్యమని ఒప్పుకోక తప్పదు.

అవధానిగారి విద్యార్థులుగా అవధాని గారితో సహా అధ్యాపకులుగా పనిచేసిన ప్రముఖుల కొందరిని ఇంటర్‌వ్యూ చేయుట జరిగింది. వీరందరూ ఉస్మానియా విశ్వవిద్యాలయానికి సంబంధించిన వారు కనుక ఇక్కడ వారి అభిప్రాయాలను పేర్కొనిన తర్వాత ఉస్మానియా విశ్వవిద్యాలయానికి అవధానిగారు చేసిన సేవలు తెలియచేస్తాను.

ఆచార్య సి.నారాయణరెడ్డిగారు - విద్యార్థుల పట్ల ఆయనకు పుత్రవాత్సల్యం ఉండేది. ఏమండీ అనే మాట తప్ప మరొక వరుస ఆయన నాలుకమీదికి వచ్చేది కాదు, పండిన పాండిత్యం, నిండు వ్యక్తిత్వం, వీటికి తగ్గ సందర్భోచిత ఛలోక్తి, ప్రయోగ సామర్థ్యం, ఈ మూడు శక్తుల ఏకాకృతి దివాకర్ల వారి సమగ్రాకృతి.

సామాన్య పాఠాన్నయినా సూక్ష్మదృష్టితో పరిశీలించడం, సర్వవిశేషాలను సహనంతో బోధించడం మధ్యమధ్య విషయ భారంవల్ల కలిగే విసుగును విసిరేయడానికి చమత్కారంగా ప్రస్తావించడం. ఈ మూడంశాలు నన్ను బాగా ఆకట్టుకున్నాయి అని ఆయన విద్యార్థుల పట్ల చూపే వాత్సల్యాన్ని బోధనా పద్ధతులను గురించి వివరించారు.

సహ అధ్యాసకుడుగా, నేను ఒకనాటి విద్యార్థినయినా ఎప్పుడూ ఆయన నన్ను అధ్యాపకుడిగానే చూసేవాడు. నేను మాత్రం ''సార్'' అని నోరారా పిలిచేవాణ్ణి. కనబడితే లేచి నమస్కరించేవాణ్ణి అని తెలియజేశారు. (20-12-1990 నాడు అభిప్రాయ సేకరణకు వెళ్లినప్పుడు, ఆచార్య సి.నారాయణరెడ్డిగారు తెలియజేసిన అభిప్రాయాలు) ఆచార్య

ఎం. కులశేఖరరావుగారు : అవధానిగారి పాఠం ఒక మధురానుభూతిని కల్గించేది. అది ఒక విచిత్రానుభూతి. ఆయన ఎప్పుడూ విద్యార్థులను 'మీరు' అనేవారు తప్ప 'నీవు' అనేవారు కారు. నేను ఆరు సంవత్సరాలు ఆయన దగ్గర బి.ఎలో ఎం.ఏలో విద్యార్థిగా ఆ తరువాత పరిశోధనా విద్యార్థిగా చదువుకున్నాను. నన్ను మాత్రం ఆయన 'నీవు' అనేవారు. ఆయనకు నామీద ఉండిన వాత్సల్యం అటువంటిది. తరగతిలో విద్యార్థుల ముందు తెలియని విషయాన్ని తెలిసినట్లు నటించేవారు కాదు. తెలియని విషయాన్ని తెలుసుకొని చెపుతాననేవారు. ఇది అధ్యాపకునికి ఉండవలసిన గొప్ప లక్షణం అని ఆచార్య కులశేఖరరావుగారు తన అభిప్రాయాలను అనుభవాలను తెలియజేశారు. అవధానిగారి దగ్గర మొదటి పిహెచ్‌డి వీరిదే. (ఆయనతో 17-4-1991నాడు ఇంటర్‌వ్యూ చేసి రికార్డు చేసుకోవడం జరిగింది).

ఆచార్య పి. యశోదారెడ్డిగారు : అవధానిగారు మాకు వాఙ్మయ చరిత్రనూ, పద్యభాగమూ బోధించేవారు. ఆయన పుస్తకం చూడకుండా పాఠం చెప్పేవారు. ఇది ఒక విచిత్రానుభూతి కల్గించేది. పాఠం చెప్పే విధానం నన్ను చాలా ఆకర్షించింది. నేను పాఠాలు చెప్పేటప్పుడు ఆయనను అనుకరించేదానిని. లక్ష్మీరంజనంగారు పరిశోధనాత్మకంగా విమర్శనా దృష్టిలో పాఠం చెప్పేవారు. అవధానిగారు అలంకార యుక్తంగా బోధించేవారు. భాషను అలంకారయుక్తంగా చేయాలనే అభిప్రాయం ఆయనకుండేది. ఆయన ఎప్పుడూ తన అధికారాన్ని ప్రదర్శించేవారు కాదు. తెలుగు శాఖలో లక్ష్మీరంజనంగారిచేత నెలకొల్పబడిన పరిశోధనా రంగాన్ని అవధానిగారు పటిష్టం చేశారు. తెలుగులో ప్రాచ్య కళాశాలలను ప్రోత్సహించారు. ఎం.ఓ.ఎల్ ఆయన కాలంలోనే ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రాచ్య కళాశాలలోనూ, ఆంధ్ర ప్రాచ్య కళాశాల నల్లకుంటలోనూ ప్రవేశపెట్టారు అని తమ అనుభవాలను యశోదారెడ్డిగారు తెలియజేశారు. (7-8-1991 నాడు వీరిని ఇంటర్వ్యూ చేయడం జరిగింది)

వీరందరి అభిప్రాయం ప్రకారం అవధానిగారు ఉత్తమ అధ్యాపకుడనీ, పుత్రవాత్సల్యంతో విద్యార్థులను ప్రేమించేవారనీ, మనోరంజకంగా పాఠం చెప్పేవారనీ, అధ్యాపకులతో సహకార భావంతో మెలిగే వారనీ, సౌజన్యమూర్తి అనీ, బోధనా విషయంలో ఒక ఒరవడి దిద్దారనీ తెలుస్తోంది.

## 5. తెలుగు శాఖాధ్యక్షులుగా చేసిన సేవ

అవధానిగారు 1964 నుండి ఒక దశాబ్దం పాటు తెలుగు శాఖాధ్యక్షులుగా ఎంతో సేవ చేశారు. అవధానిగారి కృషి వల్లనే ఉస్మానియా విశ్వవిద్యాలయ తెలుగు శాఖ ఆధ్వర్యంలో

1965వ సంవత్సరం కళాశాలలో కొత్తగా చేరిన ఉపన్యాసకులకు ఉన్నత పాఠశాలలో పనిచేసే తెలుగు ఉపాధ్యాయులకు స్వల్పకాలిక సర్టిఫికెట్ కోర్సు నిర్వహింపబడింది. దీనివల్ల తెలుగు అధ్యాపకత్వంలోని మెలకువలను గురించి వారికి శిక్షణ ఇవ్వడం జరిగింది.

1966వ సంవత్సరం సెప్టెంబర్ 15వ తేదీ ఉస్మానియా విశ్వవిద్యాలయ తెలుగుశాఖ ఆంధ్ర సాహిత్య సదస్సును నిర్వహించింది. దీనికి అవధానిగారు అధ్యక్షత వహించారు. దీనివల్ల ఉస్మానియా విశ్వవిద్యాలయ పరిధిలో పనిచేసే అధ్యాపకులకు పరిశోధనా వ్యాసాలు చదివి చర్చించే అవకాశం లభించింది.

1967 సంవత్సరంలో వరంగల్లులో ఉస్మానియా విశ్వవిద్యాలయానికి అనుబంధంగా ఒక స్నాతకోత్తర విద్యా సంస్థను స్థాపించారు. అందులో తెలుగు ఎం.ఏ అదే సంవత్సరంలో ప్రారంభించారు. దీనికి అవధానిగారి ప్రోత్సాహం ఎంతైనా ఉంది. 1967వ సంవత్సరంలోనే ఆంధ్ర సారస్వత పరిషత్తు కళాశాలలోనూ ఆంధ్ర ప్రాచ్య కళాశాల నల్లకుంటలోనూ ఎం.ఓ.ఎల్ కోర్సు ప్రవేశపెట్టడానికి అవధానిగారు ఎంతో కృషి చేశారు. నేడు ఈ కళాశాలలో దీనిని ఎం.ఏ.ఎల్ అనుచున్నారు. ఒక్కొక్క కళాశాలలో 20మందికి చొప్పున అవకాశం లభిస్తుంది. ఇది తెలుగు ఎం.ఏతో సమానంగా పరిగణింపబడుచున్నది.

1968వ సంవత్సరం ఉస్మానియా విశ్వవిద్యాలయానికి స్వర్ణోత్సవాలు జరిగాయి. అప్పుడు దివాకర్లవారు తెలుగు శాఖాధ్యక్షులుగా ఉన్నారు.

అవధానిగారి కృషి ఫలితంగా 1971లో ఎం.ఫిల్ కోర్సును ప్రవేశపెట్టారు. అప్పటినుండి సుమారు 150మంది తెలుగులో ఎం.ఫిల్ పట్టాలను పొందారు. ఇంకా ఎందరో పరిశోధనా కృషి చేస్తున్నారు.

ఆంధ్ర మహాభారతం సంశోధిత ముద్రణ అవధానిగారి కాలంలోనే పూర్తి అయింది. ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం గారితో కలిసి అవధానిగారు దీనికి విపులమైన పీఠిక రాశారు. అవధానిగారు తానొక ప్రొఫెసర్‌ను అని హెడ్ ఆఫ్ ది డిపార్టుమెంట్ అని భావించక మారుమూల ప్రాంతాలకు కూడా పిలిచినదే తడవుగా వెళ్లి ఉపన్యాసాలద్వారా తెలుగు సాహిత్య ప్రచారం చేశారు. పండితులకే కాక పామరులకు కూడా తెలుగు సాహిత్యాభిరుచి కలిగేటట్లు చేశారు. తెలుగు సాహిత్యంలోని మాధుర్యాన్ని చమత్కారవంతంగా సంస్కారవంతంగా జనరంజకంగా చాటిచెప్పి తెలుగు ప్రజలపై ఒక చెదరని ముద్ర వేశారు. తిరుపతి వేంకటకవులు అవధానాలు ఆశుకవితల ద్వారా ఆంధ్ర సాహితీ సరస్వతిని సామాన్యుల ముంగిటికి తీసుకెళ్లారు. అవధానిగారు తన ఉపన్యాస కళ ద్వారా అంత పని చేశారు.

ఆచార్య దివాకర్ల వెంకటావధానిగారు ఉస్మానియా తెలుగు శాఖకు ఒక వన్నె తెచ్చారంటే అది వాస్తవ దూరం కాదు. ఆచార్య సి.నారాయణరెడ్డిగారు ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యంగారు వంటి వారి ప్రతిభకెంతో పదునుపెట్టారు. ఆయన వైదికమత ప్రచారానికి కంకణం కట్టుకున్నారు. గ్రాంథికంలో జీవించారు. తన రచనలద్వారా ఆంధ్ర భాషా సరస్వతిని అమూల్యాభరణాలతో అలంకరించారు. సారస్వతాన్ని ఉపాసించారు తపస్విలా జీవించారు. ఎన్నో సత్కారాలను సన్మానాలను పొందారు. బిరుదులను గ్రహించారు. సమకాలీన సాహితీవేత్తల ప్రశంసలనందుకొన్నారు. కృతికర్తగా పీఠికాకర్తగా ఆయన తెలుగు భాషకెంతో సేవ చేశారు.

ఉస్మానియా విశ్వవిద్యాలయంలో అవధానిగారు 27 సంవత్సరాలు ఉపన్యాసకులుగా, రీడరుగా, ఆచార్యులుగా శాఖాధ్యక్షులుగా డీన్‌గా, పదవీ బాధ్యతలు నిర్వహించారు. బోధనలో, శోధనలో వ్యాసరచనలో, ఉపన్యాస విన్యాసంలో కొందరికి ఆరాధ్యుడుగా కొందరికి అనుసరణీయుడుగా మరికొందరికి అభినందనీయుడుగా విచిత్రానుభూతిని కలిగించినవారుగా వర్తించారు. తన వ్యక్తిత్వాన్ని పరిమళింపచేశారు. పై అధికారుల ప్రశంసలు, సహచరుల సహాయ సహకారాలు, విద్యార్థుల అభిమానాన్ని పొందగలిగే విధంగా తనదైన ఒక మార్గాన్ని సృష్టించుకొన్నారు. సవినయ సౌజన్యమూర్తిగా, నడిచే విజ్ఞాన సర్వస్వంగా, మాట్లాడే గ్రంథాలయంగా ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఆయన ఎంతో ఎదిగారు. ఎందరి యెదలలోనో దివ్వెలను వెలిగించారు. ఎన్నో మెట్లు ఎక్కారు. ఎందరికో దారి చూపించారు. సముచితాన్నే కాని ఆయన ఎప్పుడూ సంకుచితాన్ని ప్రేమించలేదు. పరిస్థితులను తనకనుకూలంగా మార్చుకున్నారే తప్ప తనకు ఇష్టం లేని పరిస్థితులకు తలవంచలేదు. ''ఆంధ్ర వాఙ్మయారంభదశ నన్నయ భారతము'' అనే అంశంమీద పరిశోధన చేసి ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి పిహెచ్‌డిని 1957లో పొందారు మార్గదర్శకులు ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారు. చదువుల కోసం ప్రాకులాడినంతగా పదవుల కోసం ప్రాకులాడలేదు. ఆయన వేష భాషలు ఒక ప్రత్యేకతను సంతరించుకున్నాయే తప్ప పరిహాసానికి గురికాలేదు. ఆదర్శ ఆచార్యులుగా ఉస్మానియా విశ్వవిద్యాలయ తెలుగుశాఖలో ఒక కుసుమంలా పరిమళించారు. మధురఫలాలను పంచారు. మార్గదర్శకులుగా రాణించారు. ''అతడొక ఋషి, అతడు వాల్మీకి, కవికోకిలము, కవితావనమున సంచరించిన కవిసింహము, వినయము మూర్తీభవించిన విశారద, అతడు ధన్యుడు'' అని దివాకర్ల వారిని దివాకర్ల రామమూర్తిగారు ప్రస్తుతించారు.

'' శ్రీ అవధానిగారికి దైవభక్తి అధికము. విశాఖలో నుండగా వారెన్ని దేవాలయ సంప్రోక్షణ కార్యక్రమములలో పాల్గొనిరో చెప్ప వీలు కాదు. హైదరాబాద్ వెళ్ళిన తరువాత వారు దర్శింపని దేవస్థానములు లేవు. ఉపన్యసింపని దేవాలయ ప్రాంగణములు లేవు. సేవింపని

మతములు లేవు''[12] అని అవధాని గారి దైవభక్తిని గురించి వారి సోదరులు రామమూర్తి గారు వ్యక్తీకరించారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి విశ్రాంతి పొందిన తరువాత ఆయన తన సమయమంతా రచనావ్యాసంగానికి, వేదప్రచారానికి సంస్కృత భాషాభివృద్ధికి వినియోగించారు.

## 6. చివరి దశ

''వారి జీవితంలో చివరి పది పన్నెండు సంవత్సరములు శ్రీ విద్యాసేవా సమితికై అధ్యక్షులుగా ఉండి తమ సర్వస్వమును వినియోగించిరి. ఎన్నియో సంస్థలకు ఆహ్వానింపబడి శ్రీ విద్యావిశేషములను శ్రీదేవీ సహస్ర నామౌన్నత్యమును సౌందర్య లహరీ ప్రశస్తిని మధురముగా ఉపన్యసించెడివారు.''[13] అని వారి సోదరులు రామమూర్తి గారు తెలియచేశారు. అవధాని గారు ప్రతి శరన్నవరాత్రి ఉత్సవానికి శ్రీ విద్యాసేవాసమితి వారు ఏర్పాటు చేసే కేంద్రానికి వెళ్ళి ఆ పది రోజులు అక్కడనే ఉపన్యాసాలు ఇచ్చేవారు.

1982వ సంవత్సరం నుండి కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితకు తెలుగులో తాత్పర్యం రాయడానికి పూనుకున్నారు. శ్రీ రామవరపు కృష్ణమూర్తి శాస్త్రి గారితో కలిసి తెలుగు తాత్పర్యం రాయనారంభించారు. ప్రథమకాండము 1985లో తిరుమల తిరుపతి దేవస్థానములు- తిరుపతివారిచే ముద్రింపబడింది. దేవస్థానము వారి ప్రోత్సాహంతోనే ఇది రాయడానికి పూనుకున్నారు. అయితే రెండవ కాండంలో కొంత భాగం వరకు మాత్రం అవధాని గారు వేదార్థం తెలుగులో రాసినట్లు తెలియుచున్నది. సహవ్యాఖ్యాత శ్రీరామవరపు కృష్ణమూర్తి గారు ఈ విషయాన్ని యీ విధంగా పేర్కొన్నారు.

''నన్ను దేవస్థానము వారికి పరిచితుని చేసి తాము కూడా ఈ వేదార్థ రచనా వ్యాసంగమున భాగస్వామ్యమును వహించి ఈ కార్యక్రమము అవిచ్ఛిన్నముగా కొనసాగుటకు కారణభూతులను, ఇప్పుడు కీర్తిశేషులు అయిన కళాప్రపూర్ణ డాక్టరు శ్రీ దివాకర్ల వేంకటావధాని ఎం.ఎ. పిహెచ్.డి గారికి కృతజ్ఞతా పూర్వకములైన నమస్కృతులు. కీ.శే.వేంకటావధాని గారు వేదార్థ రచనా వ్యాసంగమున భాగస్వామ్యము వహించి ద్వితీయ సంపుటములో (2వ వాల్యూం) మూడు పాఠములను మాత్రమే వ్యాఖ్యానించి 1986 అక్టోబరులో దివంగతులయినారని తెలుపుటకు విచారించుచున్నాను. అనగా మొత్తము 82 ప్రపాఠములలోనూ మూడు ప్రపాఠకములు మాత్రమే (211పేజీలు) వ్రాసి బహుకార్య వ్యాపృతులగుట చేత పైన వ్రాయుట కవకాశము లేక అంతటితో ముగించినారు. ఆ మాత్రమే వ్రాసినట్లు 1986 జనవరి 23వ తేదీన తాము దేవస్థానముల వారికి ఒక లేఖ వ్రాసి యిచ్చినారు.''[14] అని చతుర్థ కాండము చతుర్థ సంపుటములో తెలియచేశారు. దీనిని బట్టి అవధాని గారు కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితలో రెండవ కాండములో కొంత

భాగము వరకు వ్యాఖ్యానకర్తగా వ్యవహరించినట్లు తెలియుచున్నది. మరి దేవస్థానము వారు మాత్రము చతుర్థ కాండము చతుర్థ సంపుటము అట్టమీద కూడా వ్యాఖ్యానకర్తలుగా శిరోమణి భాషాప్రవీణ తర్క వ్యాకరణ పూర్వోత్తర మీమాంసా విశారద శ్రీ రామవరపు కృష్ణమూర్తి శాస్త్రి కళాప్రపూర్ణ డాక్టరు శ్రీ దివాకర్ల వేంకటావధాని ఎం.ఎ.పి.హెచ్.డి. అని వేశారు. లోపలి పేజీలో మాత్రం కృష్ణమూర్తి గారే ఈ సంపుటికి వ్యాఖ్యానకర్త యని అచ్చువేశారు. బహుశా ఇది దేవస్థానం వారి ఉదారతకు ఉదాహరణ కావచ్చు. ఈ సంపుటం అవధాని గారి మరణానంతరం ముద్రింపబడింది. (1989)

అవధాని గారెంతో నిష్ఠాగరిష్ఠులు, శిష్టాచారపరాయణులు, భక్తి తత్పరరులు, నిత్య దేవతార్చనా నిరతులు, సుందరకాండ చదవకుండా భోజనం చేసేవారు కారు. అవధాని గారి తండ్రి దుర్గాదేవిని ఉపాసించేవారు. అవధాని గారికి కూడా ఆ గుణం అబ్బింది. పుట్టపర్తి సాయిబాబా గారికి ప్రథమ భక్తుడు. తాను రాసిన సుందరకాండను ఆయనకే అంకితం చేశారు. శృంగేరీ పీఠాధిపతులకు కూడా అవధాని గారు ప్రీతిపాత్రుడుగా ఉండేవారు.

## 7. అస్తమయం

ఆంధ్రావాఙ్మయాకాశంలో ప్రభాకరునిలా వెలుగొందిన ఆచార్య దివాకర్ల వెంకటావధాని గారు ఆరోగ్యము సరిగా లేకున్నను వార్ధక్యము పైబడినను లక్ష్యపెట్టక తన లక్ష్యసిద్ధికై క్షణం క్షణం విలక్షణమైన దీక్షతో ఋషిలా కృషి చేశారు. ఆయన తన ఉపాసనాకళ అయిన ఉపన్యాసాల కోసమే వెళ్లి తుది శ్వాస విడిచారు.

1986వ సంవత్సరం అక్టోబరు నెలలో భారతీయ విద్యాభవన్‌లో బొంబాయిలో జరిగే చండీయాగానికి తన ఆరోగ్యాన్ని లెక్కచేయకుండా మూడురోజులు ముందుగానే అక్కడికి చేరుకున్నారు. భారతీయ విద్యాభవన్‌లో వారి ఉపన్యాసం ఏర్పాటుచేయబడింది. బొంబాయిలోని ప్రముఖులు ఆ ఉపన్యాసానికి ముగ్ధులయ్యారు. ఈ ఉపన్యాసం సౌందర్య లహరిపై ఏర్పాటుచేశారు. అవధానిగారు ఆంగ్లంలో ఉపన్యసించారు. నిలబడి మాట్లాడలేక కూర్చుని మాట్లాడటం చూసి ఆ సభకు వచ్చిన డాక్టర్లు పరీక్షించారు. ఇటువంటి విజ్ఞాన ఖనిని ప్రపంచం కోల్పోకూడదని ఆయనను ఆరోగ్యవంతునిగా చేయాలని వారు తీర్మానించుకున్నారు. యజ్ఞం ప్రారంభం కావడానికి ముందు పరీక్షలు చేశారు. శస్త్రచికిత్స (ఆపరేషన్) చేయాలనే నిర్ణయానికి వచ్చారు. యజ్ఞం తరువాత ఈ చికిత్స చేయాలను కున్నారు. అవధానిగారు కూడా ప్రముఖులైన ఆ డాక్టర్ల సలహాను కాదనలేక పోయారు. నవమిరోజు అప్పుడు మహారాష్ట్ర గవర్నరుగా ఉన్న శంకర్‌దయాళ్ శర్మగారు యజ్ఞానికి రాగా అవధానిగారే ఆయనను స్వయంగా ఆహ్వానించి స్వాగతం పలికారు. విజయదశమి రోజు యజ్ఞం పూర్తి అయినది. ఆ తరువాత మరల ఆసుపత్రిలో చేరారు. 1986 అక్టోబర్

21వ తేదీన ఆపరేషన్ చేయడానికి డాక్టర్లు నిర్ణయించారు. ఆపరేషన్ థియేటర్‌లోకి అవధానిగారు వెళ్లారు. వెంటనే బయటికి వచ్చారు. అప్పుడు వారి సతీమణి చంద్రవతిగారు ఒక కర్ర కుర్చీమీద కూర్చొని వుంటే ఆమెను మెత్తటి సోఫామీద కూర్చోబెట్టి లోపలికి వెళ్లారు. ఇది వారి ప్రేమార్ద్ర హృదయానికీ సౌజన్యానికీ చివరి తార్కాణం. ఆపరేషన్ చేయడం జరిగింది. డాక్టర్లు ఆపరేషన్ సక్సెస్ అన్నారు. కానీ రాత్రి రక్తస్రావం కావడం మొదలయింది. నిపుణులైన డాక్టర్లు ఎంత ప్రయత్నించినా దానికి కారణం తెలుసుకోలేకపోయారు. రక్తస్రావాన్ని ఆపలేకపోయారు. అవధానిగారిని కాపాడలేక పోయారు. అక్టోబర్ 21వ తేదీ మంగళవారం రాత్రి 12 గంటలకు అవధానిగారు దివంగతులయ్యారు. తెలుగు సరస్వతి ఒక ముద్దుబిడ్డను కోల్పోయింది. తూర్పు తీరంలో పుట్టిన దివాకరుడు పడమటి తీరంలో అస్తమించాడు. భౌతికంగా ఆయన అస్తమించినా సాహితీ లోకంలో ఆయన ప్రభలు వెలుగులు చిమ్ముతూనే ఉంటాయి. ఆ వెలుగులను వెలికితీయడమే నా ఈ పరిశోధనా ప్రధానోద్దేశ్యము.

''జీవితము'' అనే ఈ ప్రథమ ప్రకరణములో నేను దివాకర్ల వెంకటావధానిగారి జీవన తరంగాలను మాత్రం చూపడం జరిగింది. తరువాతి ప్రకరణాలలో వారి సాహితీ వెలుగుల విలువ వెలువరింపబడుతుంది.

## 8. జీవితం - అనుబంధం (1)

### అంకితమివ్వబడిన కృతులు

1970లో తిరుమల శ్రీనివాసాచార్యులు ''ఉదయరాగము'' అనే ఖండకావ్యాన్ని అదే సంవత్సరంలోనే గాజుల వీరయ్య ''సాహ్రాబు - రుస్తుము'' అనే కావ్యాన్ని అంకితమిచ్చారు.

1971లో ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడుగారు ''లఘు సిద్ధాంత కౌముదిని అంకితమిచ్చారు. 1973లో అవధానిగారి షష్టిపూర్తి ఉత్సవ సందర్భంలో ఆచార్య జి.వి.సుబ్రమణ్యంగారు ''పిల్లలమర్రి పినవీరభద్రకవి'' అనే కృతిని అంకితం చేశారు. 1976లో జానుకవి గారు ''మానవత'' అనే కావ్యాన్ని, వేమూరి వెంకట కవిగారు ''కాదంబరి'' (కందపద్య పంచశతి)ని కూడా అంకితం చేశారు.

## 9. పొందిన బిరుదులు - లభించిన బహుమతులు

1938లో భారతీయ మహాసభల సందర్భంలో విశాఖపట్టణంలో విక్రమ దేవవర్మ ఆధ్వర్యాన ''కవిభూషణ'' బిరుదు అవధానిగారికి ప్రదానం చేయబడింది.

1977వ సంవత్సరంలో ఆంధ్ర విశ్వకళా పరిషత్తువారు ''కళా ప్రపూర్ణ'' బిరుదునిచ్చి సత్కరించారు.

1982 జనవరి ఏడవ తేదీన శ్రీరామలింగ సేవా సంస్థవారు ''విద్యానాథ'' అనే బిరుదు నిచ్చి గౌరవించారు.

1967-68వ సంవత్సరంలో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవధానిగారి 'సాహిత్య సోపానములు' అనే విమర్శ గ్రంథానికి బహుమతి ప్రదానం చేసింది.

## 10. సంస్థలతో సంబంధం

1. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీలో ఆయన మహోవక్తగా విశిష్టమైన పాత్ర నిర్వహించారు. 3-2-1973వ తేదీ సాహిత్య అకాడమీ ఆయనకు విశిష్ట సభ్యత్వమిచ్చి గౌరవించింది.
2. ఆంధ్ర సారస్వత పరిషత్తు (హైదరాబాద్)తో ఆయన సన్నిహిత సంబంధం కలిగి ఉండేవారు.
3. యువభారతి సాహితీ సాంస్కృతిక సంస్థలో అవధానిగారు గౌరవసభ్యులు.
4. నవ్యసాహితీ సంస్థలో 1952లో సభ్యులుగా ఉండి కృషి చేవారు.
5. సంస్కృత భాషా ప్రచార సమితికి 1978నుండి86 వరకు కులపతులుగా వ్యవహరించారు.
6. ఆర్ష విజ్ఞాన సమితిలో 1986 వరకు ట్రస్టులో సభ్యులుగా బాధ్యత నిర్వహించారు.
7. విజ్ఞాన దీపిక సాంస్కృతిక సంస్థద్వారా సాహిత్య రూపక ప్రదర్శనలిచ్చి ప్రశంసల నందుకున్నారు.
8. సురభారతి సంస్కృత భాషా సాహిత్యాలను ప్రచారం చేసే సంస్థ. ఈ సంస్థలో అవధానిగారు 1971నుండి 1976 వరకు ఎగ్జిక్యూటివ్ కమిటీ సభ్యులుగా వుండేవారు.
9. అబుల్ కలామ్ ఆజాద్ ప్రాచ్యభాషా సంస్థతో అవధానిగారికి సత్సంబంధముండేది.
10. ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రంలో సలహా సంఘ సభ్యులుగా అవధానిగారు ఉండేవారు.
11. కేంద్ర సాహిత్య అకాడమీ మెంబరుగా ఆరు సంవత్సరాలున్నారు. జ్ఞానపీఠానికి ఆంధ్రప్రదేశ్ సలహా సంఘ అధ్యక్షులుగా ఎంతో దక్షతతో వ్యవహరించారు. అవధానిగారు అధ్యక్షులుగా ఉన్న కాలములోనే విశ్వనాథ సత్యనారాయణగారికి జ్ఞానపీఠ బహుమతి వచ్చింది.

12. శంకర సేవా సమితి ద్వారా ఎన్నో ఆధ్యాత్మిక ఉపన్యాసాలిచ్చారు.

13. శ్రీ విద్యా సేవా సమితి స్థాపక అధ్యక్షులై చండీయాగము శరన్నవరాత్రి ఉత్సవాలు అనేక ప్రదేశాలలో నిర్వహించారు. ఇవి 1973 నుండి జరిగాయి. 1986లో బొంబాయికి కూడా ఈ ఉత్సవాలను నిర్వహించడానికి వెళ్లారు. ఇదే చివరి ప్రసంగం.

14. శ్రీ మద్భాగవత పరిషత్తును ఖండవల్లి లక్ష్మీరంజనంగారు 1979లో స్థాపించారు. అవధానిగారు సుమారు 20 ఉపన్యాసాల వరకు ఈ సంస్థ తరపున ఇచ్చారు.

15. బ్రాహ్మణ సమితి - జంటనగరాలలో బ్రాహ్మణ మహాసభ, ఎ. బి. సి. డి (ఆల్ బ్రాహ్మణ్స్ కమ్యూనిటీ డెవలప్‌మెంట్) లాంటి సంస్థలలో కూడా అవధానిగారు కృషి చేశారు. విశ్వహిందూ పరిషత్‌లో కూడా అవధానిగారు సభ్యులుగా వుండేవారు.

16. దివాకర్ల పబ్లికేషన్స్‌ను 1985లో అవధానిగారు ప్రారంభించారు. కొన్ని మంచి పుస్తకాలను ప్రచురించాలనే ఉద్దేశంతో ఈ సంస్థను స్థాపించి అధ్యక్షులుగా అవధానిగారే ఉండేవారు.

17. తెలుగు అకాడమీ వంటి ప్రభుత్వరంగ సంస్థలలో కూడ అవధానిగారు సభ్యులుగా ఉన్నారు. 1948నుండి 1986 వరకు సభ్యులుగా వున్నారు.

18. యూనియన్ పబ్లిక్ సర్వీసు కమిషన్ పరీక్షకులుగా కూడా అవధానిగారుండేవారు. (1972).

19. ప్రపంచ తెలుగు మహాసభ ఎగ్జిక్యూటివ్ కమిటీ సభ్యులుగా కూడా అవధానిగారుండే వారు.

20. యు.జి.సి.లో సభ్యులుగా అవధానిగారు నియమింపబడినారు.

21. బ్యాంకింగ్ సర్వీసు రిక్రూట్‌మెంట్ బోర్డు బెంగుళూరు (సౌత్ రీజియన్)లో కూడా సభ్యులుగా వ్యవహరించారు. (1982).

22. ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సు అండ్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్ లైబ్రరీ పర్చేజ్ కమిటీలో సభ్యులుగా 1982లో ఉండేవారు.

23. రామకృష్ణ మఠ్ హైదరాబాద్ ఫెలిసిటేషన్ ప్రెసిడెంట్‌గా 1982లో వ్యవహరించారు.

24. హెన్రీ మార్టిన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇస్లామిక్ స్టడీస్‌లో 1982వ సంవత్సరం సభ్యులుగా ఉన్నారు.

ప్రతిభావంతుడు ప్రతిచోట ప్రకాశిస్తాడు. సహృదయుడు సర్వత్రా గౌరవింపబడతాడు. మంచి మనసున్నవాడు ప్రతిచోటా మన్ననలందుకుంటాడు. ఈ గుణాలన్నీ మూర్తీభ

వించిన సౌజన్యమూర్తి కాబట్టి అవధానిగారు ఆయా సంస్థలలో రాణించి వానికి గౌరవాన్ని కలుగజేసి తాను గౌరవింపబడినారు.

## 11. పరిశోధకులకు మార్గదర్శకత్వం

దివాకర్ల వేంకటావధానిగారు ఖండవల్లి లక్ష్మీరంజనంగారి మార్గదర్శకత్వంలో 'ప్రాఙ్నన్నయ యుగము - నన్నయ మహాభారతము' అనే విషయాన్ని పరిశోధనకు ఎన్నుకొని 1957లో పి.హెచ్.డి పట్టాన్ని పొందారు. ఇది ఉస్మానియా విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖలో రెండవ పి.హెచ్.డి పట్టం. ఇది అవధానిగారు అత్యంత ప్రతిభతో పరిశోధించి ఎన్నో అమూల్య విషయాలను వెలుగులోనికి తెచ్చిన సిద్ధాంత వ్యాసం. ఇది రెండు సంపుటాలుగా ప్రకటింపబడినది. 1. ప్రాఙ్నన్నయ యుగము 2. నన్నయ భారతము. అవధానిగారి మార్గదర్శకత్వంలో పదిహేనుమంది (15) పిహెచ్‌డి పట్టాలు పొందారు. ఒకరు ఎంఫిల్ పట్టాను పొందారు. ఆ వివరాలు ఈ విధంగా ఉన్నాయి. పిహెచ్‌డి పొందినవారు.

| వరుస సంఖ్య | పరిశోధకులు | సిద్ధాంత వ్యాస విషయం | పట్టా పొందిన సంవత్సరం |
|---|---|---|---|
| 1. | పాటిబండ మాధవశర్మ | ఆంధ్ర మహాభారతం ఛందోలంకార రసశిల్పం | 1964 |
| 2. | ఎం.కులశేఖరరావు | ఆంధ్ర వచన వాఙ్మయం- ఉత్పత్తి వికాసాలు (18వ శతాబ్దం వరకు) | 1964 |
| 3. | కె.గోపాలకృష్ణారావు | ఆంధ్ర శతక వాఙ్మయం ఉత్పత్తి వికాసాలు | 1965 |
| 4. | జి.హేమలత | దక్షిణాంధ్ర వాఙ్మయములోని భాషా విశేషాలు | |
| 5. | తుమ్మపూడి కోటేశ్వరరావు | ఆముక్తమాల్యద-సౌందర్యం | 1967 |
| 6. | పి.యశోదారెడ్డి | తెలుగులో హరివంశములు | 1969 |
| 7. | ధూళిపాళ శ్రీరామమూర్తి | శ్రీమదాంధ్ర మహాభాగవతానుశీలనం | 1969 |
| 8. | అప్పజోడు వేంకటసుబ్బయ్య | ఆంధ్ర మహాభారతం - మానవ స్వభావ చిత్రం | 1971 |

| | | |
|---|---|---|
| 9. పి.సీతాకళ్యాణి | ఆంధ్ర సాహిత్యంలో చారిత్రక కావ్యములు (18వ శతాబ్దం వరకు) | 1973 |
| 10. పి.ఆర్.పరబ్రహ్మశాస్త్రి | ఆంధ్ర సారస్వతమునందు అద్వైత తత్త్వ కావ్యములు | 1973 |
| 11. రావిభారతి | కృష్ణదేవరాయ యుగం - ప్రబంధాలలోని భాష | 1975 |
| 12. జి.రామకృష్ణాయణం | పింగళి సూరన కావ్యములు | |
| 13. కె.రాజన్న శాస్త్రి | ధ్వని - మనుచరిత్ర | 1980 |
| 14. ఐ.వి.కాంతలక్ష్మి | ధూర్జటి కవులు | 1983 |
| 15. భట్టు సుశీల | తెలుగులో దేవీ భాగవతములు ములుగు పాపయారాధ్యులు | 1986 |

ఎం. ఫిల్

| | | |
|---|---|---|
| 1. యం.భారతి | తంజావూరు నాయకరాజుల కాలమునందలి ఆంధ్ర కవయిత్రులు రంగాజమ్మ | 1975 |

## 12. అవధానిగారిపై ప్రముఖుల అభిప్రాయాలు

దివాకర్లవారి వ్యక్తిత్వాన్ని వ్యక్తం చేసే ప్రముఖుల అభిప్రాయ సంకలనాన్ని ఇక్కడ పొందుపరుస్తున్నాను.

### దివాకర్ల రామ్మూర్తిగారు -

''అవధానిగారి సంసారము పెద్దది. ఆర్థికస్తోమత తక్కువ. అందుచే దారిద్ర్యం చాలా ఉత్తమ గుణములను నేర్పినది.'' 15. అని ఒక సందర్భంలో అన్నారు. (కానీ దారిద్ర్యము అందరికీ ఉత్తమ గుణాలను నేర్పదు. అది వ్యక్తిగతము, సంపన్న కుటుంబాలలో పుట్టి ఉత్తమ గుణాలను అలవర్చుకొన్న వారెందరో ఉన్నారు. దారిద్ర్యం మూలంగా దుర్మార్గులైన వారు కూడా ఉన్నారు. ఉత్తమ గుణాలు అలవడటం కుటుంబ సంస్కారంమీద, పెరిగిన వాతావరణం మీద కూడా ఆధారపడి వుంటుంది. అవధానిగారు బాల్యంనుండి వినయ విధేయతలు కలిగినవారని వారి జీవితంలోని ప్రతి సంఘటన తెలియజేస్తున్నాయి.)

## డా. దేవులపల్లి రామానుజరావుగారు -

''అవధానిగారు చాలా సాత్వికులు. ఎవరికీ సామాన్యంగా ఎదురుచెప్పరు. అట్లని మెత్తనివారు కారు. అవసరం వచ్చినప్పుడు తాము నమ్మింది ఘంటాపథంగా చెప్పేవారు. దానిని సాధించేవారకూ అవిరామంగా పనిచేసేవారు కూడా. నేను వారిలో కార్యకర్తగా గమనించిన గొప్ప గుణమిది''. [16] అని రామానుజరావుగారు పేర్కొన్నారు. దివాకర్ల రామ్మూర్తిగారే మరొకచోట - ''అవధానిగారి వైదికత, భక్తి, సంప్రదాయ విశ్వాసము, వినయము - సౌజన్యము, వదాన్యత పరులనొప్పనీయని పలుకు పొలుపు ప్రత్యేకముగా విమర్శింపదగినవి. అవైదికత్వము అవధానిగారికి అభిమతము గాదు. ఆచారపరత్వము వారికి ప్రీతి పథము. అట్లని అనుకూల పరిస్థితులలో సరిపెట్టుకోలేని సనాతనత్వము వారిది కాదు. వారు అంతర్ముఖులు. బాహ్య విషయముల యెడ లోకసంగ్రహణార్థము ప్రీతి చూపెడివారు. అంతఃశుద్ధి వారికి ప్రియతమము, ఇతరులనొప్పించుట వారి కసమ్మతము. తాను బాధపడియు నితరులకు ప్రీతి సమకూర్చుటయే వారి లక్ష్యము, వారి కనిష్టములయిన సన్నివేశములయందెన్నిటియందో వారు పాల్గొని ప్రధాన స్థానము వహింప వలసి వచ్చినను వారు తమ యనిష్ట ప్రదర్శనమెన్నడూ చూపినది లేదు'' [17] అని పేర్కొన్నారు. (ఇది యదార్థమనివారి వారి జీవిత దర్పణంలో ప్రతిబింబించడం మనకు దర్శనమిస్తుంది).

## ఆచార్య సి.నారాయణరెడ్డిగారు -

''చెట్టంత పెరిగిన గురువర్యులు, కానీ విద్యాసార ఫలభార వినమ్రతరులు, కొండంత ఎదిగిన బుద్ధి బాహు విక్రమము, కానీ కొండిక శిశువుల గుండె అద్దాలలో సైతం ఒదిగిపోగలిగిన సుహృన్మణులు'' [18] అని ఆచార్య సి.నారాయణరెడ్డిగారు ప్రవచించారు.

''సంప్రదాయం నిలిచే వుంటుంది హమేషా'' అని మనసా వాచా కర్మణా విశ్వసించిన దివాకర్లవారి అభిప్రాయాలు ఆవేశంతో కూడుకుని వుండవు. దూషణా వుండదు. వారు నెమ్మదిగా చెప్తారు. సీరియస్‌గా చెప్తారు. ఎదుటివాణ్ణి నమ్మించడానికి ప్రయత్నించరు. తన బాధ చెప్పుకుంటున్నట్లుగా వుండి ఎదుటి వాడితో ఆర్ద్రత కలిగింపజేస్తారు. ఇదే దివాకర్ల వారి విశిష్ట వ్యక్తిత్వము'' అని వచించారు శ్రీ ద్వా.నా.శాస్త్రిగారు. [19]

''అవధానిగారంటే అపార పాండితీ మూర్తి, అనంత ధారణాశక్తి, సమన్వితులు, కానీ వ్యక్తిగతంగా సన్నిహితంగా వారు మాట్లాడితే వారి ఆప్యాయత, వారి సౌజన్యం అనన్యమైంది. సహధ్యాపకులను, విద్యార్థినీ విద్యార్థులను వారు గౌరవంగా చూడటమే కాదు వారిని ఎప్పుడూ మీరు అని బహువచనంతో పలుకరించడమే గానీ ఏకవచన ప్రయోగం చేయగా నేను వినలేదు'' [20] అని పేర్కొన్నారు ఆచార్య ఎం.కులశేఖరరావుగారు.

''దివాకర్ల వ్యక్తిత్వం ఒక విశిష్టమైనది. ఆయన ఎంత విద్యావంతులో అంతటి వినయశీలురు. పిన్నలను కానీ పెద్దలను కానీ ఆయన సంస్కారంతో పలకరించే విధానాన్ని గమనిస్తే ఒక మర్యాదకు మార్గం దిద్దుతున్న మనిషిగా కన్పడేవారు. నైష్ఠికమైన ఆయన జీవనం, నైతికమైన ఆయన ఉత్తమ వర్తనం శత్రువులచేత కూడా గౌరవాదరాలను పొందుతుండేవి. ఆయనను చూస్తే గౌరవ భావం కలగడం అత్యంత సహజం. ఆయన మాట్లాడితే గురుభావం కలుగటం నిజం. మా అందరి దృష్టిలో ఆయన గురూణాం గురుః'' [21] అని నిర్వచించారు ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యంగారు.

''ఎవ్వరితోను వివాదమునకు దిగెడివారు కారు. అతి సౌమ్యముగా అతి వినయముతో ఎడదలో అచ్చుకొనునట్లు చెప్పెడివారు. అది వారి సొమ్ము. ఆ పలుకుల పొలుపులు వారి ప్రత్యేకత'' [22] అని అవధానిగారి తమ్ముడు రామమూర్తిగారు మరోచోట పేర్కొన్నారు.

''ప్రతి పని భగవదర్పితం చెయ్యడం, ఆంధ్ర భాషా సేవ భారతీయ సంస్కృతి సంపదలకు మూలకందములైన వేదములనుద్దేశించి తద్వారా హిందూమతోద్ధరణ కావించడమే వారి జీవితాశయం'' [23] అని పేర్కొన్నారు అవధానిగారి కుమార్తె శ్రీమతి గాయత్రీగారు.

''అవధానిగారి ధారణాశక్తి ఈ తరంలోని చాలామంది విద్యార్థినీ విద్యార్థులకు అనూహ్యం, అత్యద్భుతం, వారు ఒకమారు ఒక పుస్తకాన్ని కావ్యాన్ని, చూస్తే చాలు, దానిలోని పద్యాలను దాదాపు మూడు వంతులైనా అనర్గళంగా తిరిగి చెప్పగల ధారణాశక్తి వారిది. అది వారి పుస్తకావిష్కరణ సభలతో పరిచయం ఉన్నవారికి చాలామందికి అనుభవమే. మనుచరిత్రాది ప్రబంధాలు, భారతాది గ్రంథాలు వారికి కంఠపాఠాలే'' [24] అని ఆయన ధారణాశక్తిని గురించి లావణ్యంగా చెప్పారు డా. లావణ్య సరస్వతిగారు.

అవధానిగారి ఏకసంథాగ్రాహిత్వాన్ని శ్రీ నార్ల వెంకటేశ్వరరావు''దివాకర్ల వారిది ఫోటోగ్రాఫిక్ మెమరీ'' అని ఒకచోట పేర్కొన్నారు.

వీళ్లందరి అభిప్రాయాలను పరిశీలిస్తే మనకు అవధానిగారి వ్యక్తిత్వం ఎటువంటిదో వ్యక్తమౌతుంది. ఆయన వినయశీలం, విచక్షణాగుణం, నిరాడంబరత్వం, హిందూ మతోద్ధరణదీక్ష, సాత్త్విక స్వభావం, ధారణా పటిమ వీరి అభిప్రాయాల పూలమాలల్లో పరిమళిస్తున్నాయి.

అవధానిగారి వ్యక్తిత్వాన్ని గురించి General K.V.Krishna Rao (Retd), Governor of Nagaland గారు -

Through his prolific pen millifhouse and melodiaons of Telugu Language attained now dimensions of expressiveness. Indeed, Acharya Divarkarlas

was an outstanding case of harmonious bridging of the gulf between knowledge and its application. It was this unique feet with, perhaps more than anything else, contributed to his to warning stature as a creative venerable teacher - Philosopher.

- అని పేర్కొన్నారు. ఇది యథార్థం. ఆయన వ్యక్తిత్వాన్ని సాహితీవేత్తలే కాకుండా క్రమశిక్షణే ఊపిరిగా జీవించిన కృష్ణారావుగారు వంటి వారు కూడా ప్రశంసించారు.

ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు పరిపూర్ణమైన మానవునికి ఉండవలసిన సద్గుణాలను చాలావరకు అలవరచుకొన్నారు. అధ్యాపకత్వానికి ఆదర్శంగా నిలిచారు. ఉపన్యాస కళకు ఊపిరి పోశారు. ప్రాచీన కవుల కావ్యాలలోని మాధుర్యాన్నీ, కవుల నైపుణ్యాన్నీ, శిల్పాన్నీ తెలుగువారికి పంచారు. వ్యాసం, ఉపన్యాసం - రెండు నేత్రాలుగా జీవించారు. శాంత స్వభావం ఆయనలో తొణికిసలాడేది.



# ద్వితీయ ప్రకరణము
# పద్యకృతుల పరిశీలన

## 1. రాజసందర్శనము

దివాకర్ల వేంకటావధానిగారు మొట్టమొదట పద్యరచనతోనే రచనా వ్యాసంగాన్ని ప్రారంభించారు. విద్యార్థి దశలో ప్రధానోపాధ్యాయుల బదిలీల సందర్భాలలో భారతి వంటి పత్రికల్లో పద్యాలు రాసి మన్ననలందుకున్నారు. కవి సమ్మేళనాలలో పద్యాలు చదివి ప్రశంసలందుకున్నారు. అవధానాలలో ఆశువుగా అలవోకగా పద్యాలు చెప్పి మెప్పుల నందుకున్నారు.

కావ్యం రూపంలో మొదటిసారిగా 1948వ సంవత్సరంలో ''రాజ సందర్శనము'' అనే పద్యకృతిని రచించారు. తరువాత 1963లో ''మధువనము' అనే పద్యకావ్యాన్ని రచించారు. ''కలిపరాజయము'' ''త్రింశతి'' అనే కావ్యాలను 1972వ సంవత్సరంలో రచించారు. ''రాజ సందర్శనము'' అనువాద కావ్యము. బాణుడు సంస్కృతంలో రచించిన హర్షచరిత్రనుండి ఇతివృత్తం గ్రహింపబడినది. కావ్యరూపంలో వచ్చిన పద్యరచనలలో మొదటిది.

రాజ సందర్శనము నిర్వచన పద్యకావ్యం. వస్తువు చారిత్రికం. ఇతివృత్తంలో ప్రధాన పాత్రధారి 'బాణ మహాకవి'. బాణుడు మొట్టమొదట హర్ష చక్రవర్తిని సందర్శించుట ఇందులోని విషయం. అవధానిగారు ఈ కావ్యాన్ని 1946వ సంవత్సరం వేసవిలో పక్షం రోజుల్లో పూర్తిచేశారు. ఈ కావ్యాన్ని చెండపూడి పేరరాజుగారికి అంకితం చేశారు. ఇందులో కృతిపతి వంశవర్ణన పద్యాలు 27తో కలిసి రెండు వందల ఒక పద్యాలూ ఉన్నాయి. ఏడు భాగాలుగా విభజించారు. ఈ కావ్యాన్ని సంస్కృతంలో బాణుడు రచించిన హర్ష చరిత్రలోని కథను, భావాలను చాలావరకు గ్రహించి కథా విస్తృతికై కొంత భాగాన్ని కల్పించి రచించారు. ఈ రచనకు ప్రేరణ కలిగించింది తిరుపతి వేంకటకవులు రచించిన హర్షచరిత్ర. వేంకటకవులు హర్ష చరిత్రను వచనంతో అనువదించారు. ''నేను కొన్ని యేండ్ల క్రింద శ్రీ తిరుపతి వేంకటేశ్వరాంధ్రీకృతమగు హర్షచరిత్రము నింటరుమీడియటు విద్యార్థులకు పాఠము చెప్పవలసి వచ్చెను. అప్పుడందు బాణుడు హర్షచక్రవర్తిని దర్శించిన తెరంగెంతయు నా హృదయము నాకర్షించెను. అప్పటినుండియు నది వస్తువుగా గ్రహించి ఒక చిన్న కావ్యము

రాయవలెనని యెంచుచుంటిని. అట్లు చేయుటకు మొన్న కడిచిన వేసంగిలో గొంత యవకాశము లభించెను. అది పురస్కరించుకుని నొక పక్షము దినములలో నిది వ్రాసి ముగించితిని. ఏ దద్రచనమున బాణుని హర్ష చరిత్రమందలి కథను, భావములను కూడా చాలామట్టుకు గ్రహించితిని. కథా విస్తృతికై కొంత భాగము కల్పించితిని..'' [1] అని అవధానిగారు ఈ కావ్యంలోని తొలి పలుకులలో తెలియజేశారు. రాజసందర్శనంలోని ఇతివృత్తం చాలా చిన్నది. ఇందులో ఎక్కువ భాగం బాణుని మానసిక సంఘర్షణను వర్ణించుట జరిగింది.

తాను బాల్య చాపల్యంలో చేసిన పనులు రాజుకు తెలిసి తనను గౌరవించడని తనమీద పరులు ఈర్ష్యతో చెప్పిన కల్పితపు మాటల వలన హర్షుడు తనపై కోపముతో ఉన్నాడని యదార్థము గుర్తించి తన పాండిత్యాన్ని గౌరవించునో గౌరవించడో అనే సందేహం బాణునిలో ఈ కావ్యంలో ఆదినుండి అంతం వరకు కన్పిస్తుంది. ఇటువంటి మానసిక పరిస్థితిలో బాణుడున్నప్పుడే బాణుని మిత్రుడు హర్షభూపతి సోదరుడు అయిన కృష్ణభూపతి దగ్గరనుండి ఒక సేవకుడు వచ్చి బాణునకు ఒక లేఖను ఇస్తాడు. ఆ లేఖలో బాణుని వెంటనే బయలుదేరి హర్ష భూపతిని దర్శించమని ఉంటుంది. బాణునికా రాత్రి హర్ష భూపాలుని దర్శించుటా? వద్దా అన్న సందేహంతో నిద్రకూడా కరువౌతుంది. చివరికి వేకువ జామున కునుకుపడుతుంది. అప్పుడొక స్వప్నం కనిపిస్తుంది. ఒక రాజహంస పద్మపీఠంపై ఆసీనమై హంసలతో కొలువుండగా ఒక కొత్త హంస వచ్చి నమస్కరించగా రాజహంస చూసీచూడనట్లు ఉదాసీనంగా వున్నట్లు చివరికి గౌరవించినట్ల కలగంటాడు.

తెల్లవారి భార్యతో హర్షుని లేఖ విషయం, స్వప్న వృత్తాంతం చెప్పగా ఆమె నీవు హర్షుని దర్శించిన శుభం కలగగలదని సలహా ఇస్తుంది. బాణుడు కృష్ణభూపతి దగ్గరనుండి వచ్చిన సేవకునితో కలిసి శుభ శకునములు కలుగుచుండగా రాజ సందర్శనానికి బయలుదేరాడు. దారిలో ఒకరోజు విశ్రమించి రెండవరోజు రాజధానికి చేరుకున్నాడు. దుర్గద్వారం దగ్గర విశేషాలను చూసి ఆశ్చర్యపడతాడు. మరుసటిరోజు రాజదర్శనానికి వెళ్లి హర్షుని దర్బారును అతని రూపురేఖలను చూసి ఆనందాశ్చర్యాలతో రాజు తనను మన్నించునా? మన్నించడా అను సందేహంతో బాణుని మనసు ఊగిసలాడుతుంది.

బాణుడు హర్ష చక్రవర్తికి అభివాదం చేసి ఆశీర్వదించగా హర్షుడు చూసీచూడ నట్లుంటాడు. రాజు తనను అవమానించాడని వ్యథ చెందుతాడు బాణుడు. రాజు కొలువు చాలించి వెళ్లునపుడు కృష్ణభూపతి చెవిలో ఏదో చెప్పి బాణునివైపు స్నేహపూర్వకంగా చూసి వెళతాడు. ఆ రాత్రి బాణునితో కృష్ణభూపతి నీవు రేపు మరల రాజదర్శనానికి వెళ్లుము.

రాజు నిన్ను తప్పక గౌరవించునని చెపుతాడు. ఆ మరుసటి రోజు హర్షుడు బాణుని గౌరవించి తన చేరువనే ఉన్నతాసీనుని చేశాడు. పండితులు పొగిడిరి. ఆరోజునుండి రాజు బాణుడు పరస్పరము మిక్కిలి సన్నిహితులుగా మెలిగారు. ఇదీ సంగ్రహముగా రాజ సందర్శనములోని విషయము.

ఇందులో రసపోషణకు అవకాశం తక్కువ. అవధానిగారు దీనిని అలంకారిక శైలిలో రచించారు. వర్ణనలెంతో రమ్యంగా చేశారు. తన పాండితిని పద్యరచనా చమత్కృతిని ప్రదర్శించి సంభాషణా శైలితో సందర్భోచితంగా సామెతలను జాతీయాలను వాడి కథాగమంనలో ప్రసన్నతతో, సంభాషణల్లో నాటకీయతతో వర్ణనలతో ప్రబంధకవుల పోకడలతో, స్వరూప స్వభావంలో ఆధునికతతో ఒక మనోహర కావ్యంగా రచించారు. స్వతంత్ర కృతిగా రూపొందించారు.

బాణుడు సంస్కృతంలో హర్ష చరిత్రను గద్యకావ్యంగా రచించాడు. ఇది మూడు ఉచ్ఛ్వాసాల గ్రంథం. సుదీర్ఘమైన వర్ణనలతో సమస్య భూయిష్ఠంగా బాణుడు దీనిని రచించాడు. ఇది బాణుడు యౌవనంలో చేసిన తొలి రచన. యౌవన సహజమైన ఉత్సాహంతో శైలీ వర్ణనలతో కొంత కృతకంకనిపిస్తుంది. అవధానిగారు కూడా దీనిని తొలి పద్యకావ్యంగా రచించారు. అయినా కృత్రిమత్వం ఇందులో కన్పించదు. బాణుడు రచించిన మూడు ఉచ్ఛ్వాసములలో ద్వితీయ ఉచ్ఛ్వాసంనుండి అవధానిగారు ఇతివృత్తాన్ని గ్రహించారు.

బాణుని ద్వితీయోచ్ఛ్వాసం అగ్రహారవర్ణనతో ప్రారంభమౌతుంది. అవధానిగారు అగ్రహారవర్ణనం వదిలిపెట్టి బాణుని మానసిక సంఘర్షణతో మొదలుపెట్టినారు. విద్యను పాండిత్యాన్ని రాజసభలలో ప్రదర్శించినప్పుడే దానికి సార్థకత చేకూరుతుందనీ, విద్యావంతుడు కూపస్థమండూకంలా ఉండకూడదని అవధానిగారు తన కావ్యాన్ని ఆరంభించారు. అవధానిగారి మానసిక స్థితి ఇందులో ధ్వనిస్తుంది.

బాణుని స్వప్న వృత్తాంతం హర్షచరిత్రలో లేదు. ఇది అవధానిగారి స్వీయకల్పన. స్వప్న వృత్తాంతం భార్యతో చెప్పుట ఆమె అది శుభస్వప్నం అని సలహా ఇవ్వడం బాణుని ప్రయాణానికి సన్నాహాలు, దారిలో తినడానికి తినుబండారాలు కట్టి ఇవ్వడం, ఆమె చిరునవ్వు, వారిద్దరి సంభాషణ అవధానిగారు కల్పించారు. అవధానిగారి ఈ కల్పన ఎంతో సముచితంగా ఉంది. కవులకు పండితులకు కూడా భార్య సహకారం అవసరం. జీవిత భాగస్వామిని సహకారంతో గడిపిన జీవితం సుఖాంతమూ శుభాంతమూ అవుతుందన్న సత్యాన్నీ నమ్మకాన్నీ తెలియజేసేదిగా ఉంది. ఈ సందేశాన్ని పాఠకులకు తెలియజేయుటకై ఈ సన్నివేశాన్ని కల్పించి ఉండవచ్చు. బాణుని హర్షచరిత్రలో బాణుని చిన్న మేనత్త మాలతి అను ఆమె ప్రయాణానికి కావలసిన మంగళాలను సమకూర్చినట్లున్నది.

''పితుః కనీయస్యా స్వస్రా మాత్రేవ స్నేహార్ద్ర హృదయా
మాలత్యాఖ్యయా కృత సకల గమన మఙ్గళః '' [2]

- అని ఉన్నది. అవధానిగారికి ఇది రుచించలేదు. అక్కడ భార్యను ప్రవేశపెట్టి సరసమైన కల్పననూ విలువైన సందేశాన్నీ ఒక నగ్నసత్యాన్నీ అందించారు.

హర్షచరిత్ర ద్వితీయ ఉచ్ఛ్వాసంలో బాణుడు వివాహితుడను ప్రస్తావన మాత్రం కనిపిస్తుంది. కానీ అతని భార్య నిర్వహించిన పాత్ర ఎక్కడా కనిపించదు.

అరణ్య మార్గంలో ప్రయాణించే సమయంలో బాణుడు బాణునికి భార్య పంపిన తినుబండారములు తిని సేద తీర్చుకొన్నట్లు కల్పించారు.

హర్షచరిత్రలో గహనమైన అరణ్యాన్ని దాటి మల్లకూటమనే గ్రామం చేరి అక్కడ జగత్పతి అనునాతని ఆతిథ్యం స్వీకరించినట్లున్నది. మరుసటిరోజు మణిపుర సమీపంలోని అజిరవతియను నది ఒడ్డున విడిదిచేసి రాజభవనము సమీపించినట్లున్నది.

ఈ ప్రయాణంలో ఒకరోజు అరణ్యంలో భార్య పంపిన ఆహార పదార్థాలు తిని రెండవ రోజు దారిలోగల ఒక ఊరిలో విడిది గృహంలో బస చేసినట్లు కల్పించారు. భార్య పంపిన తినుబండారాలుండుటచేత అడవిలో కూడా విశ్రమించవచ్చునని రెండవరోజు అవి లేవు కనుక ఒక విడిది గృహంలో విశ్రమించారని అవధానిగారి భావన కావచ్చు.

సూర్యోదయ సూర్యాస్తమయాది వర్ణనలు హర్షచరిత్రలోను అవధానిగారి రచనలోనూ ఉన్నాయి. కానీ అవధానిగారి వర్ణనలు కథాగతికి అడ్డురాని విధంగా సరళంగా సరసంగా ఉన్నాయి.

దుర్గద్వారం వద్ద గల గుర్రాలను, గజములను, పరివారాన్ని వర్ణించే సందర్భంలో కూడా అవధానిగారు సంగ్రహంగా వర్ణించారు. అతిశయోక్తులను చాలావరకు తగ్గించారు. ఇదే విధానాన్ని హర్షుని సౌందర్యాన్ని అతడు ధరించిన ఆభరణాలను వర్ణించే సందర్భంలో కూడా అనుసరించాడు.

సరసత్వం, సామరస్యం ఉన్నవాటిని మాత్రం అక్కడక్కడ యథాతథంగా గ్రహించాడు. హర్ష చరిత్రలో హర్షునికి చామరలను వీచెడిలతాంగి అతని చెక్కుటద్దములలో ప్రతిబింబించి **ముఖ**మున ఉన్న సరస్వతి వలె ఉన్నదను వాక్యం ఉంది.

''విమల కపోల ఫలక ప్రతిబింబితాం చామరగ్రాహిణీం
విగ్రహిణీమిన ముఖ నివాసినీం సరస్వతీం దధానమ్'' [3]

అను వాక్యాన్ని అవధానిగారు..

కం॥ ''తెల్లని చామరములు గొని
యల్లన వీచెడి లతాంగి యాతని నును చె
క్కిళ్లను ప్రతి బింబితయై
చెల్లె న్వదనస్థ సఖిపలుకుల చేడియ యనగన్''

అని అందమైన కందపద్యంలో హృద్యంగా వర్ణించారు. యథాతథంగా గ్రహించిన సందర్భాలు చాలా తక్కువ. ఈ విధంగా అనువాద విషయంలో ఔచిత్యాన్ని పాటించి రాజసందర్శన కావ్యాన్ని సహృదయ రంజకంగా స్వతంత్ర కృతి అన్నట్లుగా రచించారు.

అలంకారాలలో అవధానిగారికి ఉపమాలంకారమంటే చాలా ఇష్టంగా ఈ కావ్యంలో కనిపిస్తుంది. చాలా సందర్భాలలో ఉపమాలంకారాన్ని వాడటం జరిగింది.

''శ్రీకరమైన విద్యసవరించి, జనస్తవనీయ పండితా
నీత విభూషితమ్ములవనీప సభాంతర సీమలంది య
స్తోక మతి ప్రభావములు చూపుట యుక్తముగాని కూపమం
డూకములట్టు లిల్విడక నొచ్చుట మెచ్చగునే బుధాళికిన్''[5]

ఇల్లు విడువక రాజసభలలో విద్యను ప్రదర్శించని పండితులను కూపస్థ మండూకాలతో పోల్చుట ఇందులో కనిపిస్తుంది.

ఇదేవిధంగా

''హృది విపరీత భారము వహించుట నాపయిరే డనుగ్రహా
భ్యుదయము చూపకున్న గొలువున్నిడు నప్పుడు స్నిగ్ధమూర్తియై
పొడిగొలిపెన్ ప్రసాద పరిపూర్ణ విలోకన మాలికల్ పడిం
బడి నదె చీకటి న్దివియు భంగి నొకించుక యాశగొల్పెడిన్''[6]

బాణుని మానసిక స్థితి వర్ణించే సందర్భంలో రాజు యొక్క చూపుల యొక్క మాలికలను చీకటిలో ఆశయనెడి దీపంతో ఉపమించి చెప్పుట ఎంతో సమంజసంగా ఉంది. ఇట్లే ఎన్నో సందర్భాలలో అవధానిగారు ఉపమాలాంకారాలను ప్రయోగించి తన రచనలకు అలంకారాన్ని చేకూర్చారు. ఇంకా ఈ చిన్న కావ్యంలో రూపక, స్మరణ, అతిశయోక్తి మొదలయిన అలంకారాలను వాడి రచనకు అందం చేకూర్చారు. చక్కని సామెతలు జాతీయాలు అవధానిగారి రచనలో అడుగడుగునా ఆణిముత్యాల్లా కనిపిస్తాయి.

బాణుడు హర్షుని దర్శనానికి వెళ్లి తన ప్రతిభా పాండిత్యాలను ప్రదర్శించాలనే నిర్ణయానికి

వచ్చాడు. కానీ ఎట్లు దర్శించాలి మిత్రుడైన కృష్ణభూపతి కూడా పిలువనంపలేదే? అనే ఆలోచనలో ఉన్న సందర్భంలో కృష్ణభూపతి వద్దనుండి ఒక దూత వస్తాడు.

''వెదుకంబోయిన తీవకాలదగిలె న్వింతయ్యె నేడంచు స
మ్మదమేపారగ నేగుదెంచి కనియెంబాణుండు వార్తాహరున్
వద నావేదితదూర భారగమన ప్రాప్తశ్రముండయ్యు న
భ్యుదయాశంసిదరస్మితున్, నృపతిలే ఖోద్యత్కరాం భోజునిన్'' 7

కృష్ణభూపతి తన లేఖలో ఇదే హర్షభూపతిని దర్శింపతగిన సమయమని రాసిన విషయాన్ని చదువుకొని ఈ అవకాశాన్ని జారవిడుచుకొనుట మంచిది కాదని తలపోసే సందర్భంలో ఈ సందర్భానికి ఉచితమైన సామెతను వాడారు.

''భూకాంతు దర్శనమున కి
దే కాలమటంచు వ్రాసె హితుడీ యదనుం
బోకార్చుకొన్న సిరిరా
మోకాలొడ్డిన ప్రకారముల్ తలకోవే'' 8

ఇదే విధంగా అవధానిగారు ఈ కావ్యంలో పూసగ్రుచ్చినట్లు మౌనమర్ధాంగీకారము - వంటి జాతీయాలను గూడ వాడి రచన అనే హారంలో మణుల్లాగ ప్రకాశించే విధంగా చేశారు.

కొందరు కవులు సామెతలను జాతీయాలను సందర్భోచితంగా వాడుతారు. అవి రచనలో మణిపూసల్లా ప్రకాశిస్తాయి. మరికొందరు కవులు సామెతలను జాతీయాలను కూర్చుటకై సందర్భాలను సృష్టిస్తారు. ఇవి రచనలో అతకక సహజంగా గంగిరెద్దుకు చేసిన అలంకారాల వలే ఉంటాయి. రచనకు వికారాన్ని చేకూరుస్తాయి. పూర్వకవులలో చేమకూర వేంకటకవి, కొరవి గోపరాజు మొదలైనవారు తమ రచనలలో సామెతలను అందంగా వాడినారు.

అవధానిగారికి సంభాషణాశైలి చాలా ఇష్టం. కథాగతిని సంభాషణా శైలిలో రచించి నాటకీయత శిల్పాన్ని పోషించడానికి అవదానిగారు యత్నించి కృతకృత్యులైనట్లు గమనించవచ్చు. కృష్ణభూపతి దూత ద్వారా పంపిన లేఖను చదువుకొని రాజదర్శనానికి వెళ్లవలయునా? వద్దా! అని తన భార్యతో ఆలోచించే సందర్భంలో..

''తన ఇల్లాలిని చెంతకుంబిలిచి కాంతా హర్షభూపాల ద
ర్శన ముంజేయగ రమ్మటంచు మనకృష్ణక్షోణినాథుండు దూ
తను బుచ్చెంగద తత్ప్రయత్నగత చింతాలోల చిత్తుండనై
వినుమా! రాత్రి చతుర్థ యామమున నే వింతౌకలం గాంచితిన్'' 9

అని తాను కన్న స్వప్న వృత్తాంతాన్ని పూసగ్రుచ్చినట్లు చెప్పగా అందుకు ధీనిధి అయిన అతని ఇల్లాలు -

పృథ్వీ పతి దర్శనయత్నమిప్డు శోభన పరిణామ మయ్యెడి ధ్రువంబుగ నంచు ప్రోత్సహిస్తుంది.

బాణుడు హర్షుని ఆస్థానం చేరుకున్నప్పుడు ద్వారపాలకుని హర్షుడు ఇతడా బాణుడు అని అడగగా --

''అంతట ద్వారాపాలుడు ధరాధిపచిత్తమితండు బాణుడన్నంతనే చక్రవర్తి మొగమ మవ్వంకకు ద్రిప్పి రక్త నే త్రాంతములు తెల్పగ వినాంత నిషణ్ణుడుమాల్వ రాజుతో నింత మహాభుజంగుడితడే సుమీ యంచు వచించె మెల్లగా'' [10]

బాణుని చూసి 'మహా భుజంగుడితడే సుమీ' అని హర్షుడు మాళవ రాజుతో మెల్లగా అనెను. మాళవరాజు కామాటకు అర్థం తెలవదాయెను. వేరే రాజులెవరూ నోరు విప్పలేదు. అంత బాణుడు, కామేభుజంగతా పరభూమిత్వర ప్రాణవాయు భుజగాధిప నిందామయ ములు నీవాక్కులు నామదినొనరించు లేదనాలికలముగ అని సమాధానం చెప్పాడు. బాల్య చాపల్యాన్ని తప్పుగా భావించవద్దన్నాడు. మేమట్లు విన్నామని హర్షుడన్నాడు. బాణునికి ఆసనం చూపలేదు కూర్చోమననూ లేదు. ఈ భుజంగ శబ్ద ప్రయోగం మూలంలో కూడా ఈ సందర్భంగా వాడబడి ఉన్నది. అవధానిగారదే మాటను వాడి ఆ వాతావరణాన్ని అనువాదంలో అందులోనూ పద్యకావ్యంలో కల్పించుట విశేషం. (భుజంగుడనగా కామకుడు బాణుడు చెప్పిన సమాధానం కావ్యాన్ని భుజంగతా, నాభుజమును ఎవతే పొందినది.)

నాటకరంగంలోని పాత్ర కదలికలవలె ఈ దృశ్యంలోని హర్షుడు పాఠకుని అంతరంగంలో సాక్షాత్కరిస్తాడు. పద్య రచనలో పట్టువిడుపులు తెలిసి ఆరితేరిన వారే ఈ విధమైన సంభాషణా శైలిలో నాటకీ శిల్పాన్ని పోషించగలరు.

వర్ణనల విషయంలో కూడా మూలానికి మెరుగులు దిద్దినట్లున్న అనేక సందర్భాలు ఈ కావ్యంలో కనిపిస్తాయి. హర్షుని రాజధానికి బాణుడు చేరుకున్నప్పుడు దుర్గద్వార విశేషాలను దూత అతనికి వర్ణించి చెప్పే సందర్భంలో...

''అనిలముచే జలించు తలలందలి తెల్లని చామరంబుల
య్యెన రథవాహ సంతతి ఎయింబడ దాల్చిన రెక్క జంటలో
యన వెలుగొందు హేషల సురాశ్వము సైతము పోరు సేయ ర
మ్మను నటులున్న రేని జవనాశ్వములన్ బరికించితే సుధీ
నిరతము కదలించెడి త త్ను రముల పటపట రథంబుతో చెడి రాజ్యేం
దిర నాట్యము చేయింపగ బరిగించెడి మద్దెలల శుభాస్వన మనగన్'' [11]

- అని గుర్రాలను, మదపుటేనుగులను, గొడుగులను, రాజపరివారములు, రాజుయొక్క రూపసౌదర్యమును రమ్యంగా వర్ణించారు అవధానిగారు. ఈ సందర్భంలో మూలంలో కూడా ఈ వర్ణన విస్తృతంగా ఉన్నది. పాఠకునికి విసుగు కలిగించేంత పెద్దదిగా ఉన్నది వచనానువాదం చేసిన తిరుపతి వేంకటకవులు ఇంచుమించు బాణుని వర్ణనలను యథాతథంగా అనువదించారు. అవధానిగారు అనవసర వర్ణనలను తగ్గించి ఔచితీమహితంగా వర్ణించారు. ఈ రాజ సందర్శన కావ్య రచనకు ప్రేరణ కలిగించింది తిరుపతి వేంకటకవుల అనువాదం. దానిని విద్యార్థులకు పాఠం చెప్పుటచే ఈ ఆలోచనకు అంకురార్పణం కలిగింది. వారిది వచనానువాదమైనా అక్కడక్కడ కొన్ని పద్యాలు కూడా రచించారు. బాణుడు సంస్కృతంలో గద్యంలో రాసినా కొన్ని శ్లోకాలను మధ్యమధ్యలో రచించాడు. అవధానిగారు ఈ కృతిని నిర్వచనంగా రచించారు. కానీ తిరుపతి వేంకటకవుల అనువాదంలోని కొన్ని పదాలను తన పద్యాలలో పొందుపరిచారు. వారు రాసిన ఒక పద్యాన్ని కొంత మార్పుచేసి వాడుకున్నారు.

తిరుపతి వేంకటకవులు హర్షచరిత్ర మొదటి భాగాన్ని 1920వ సంవత్సరంలో అనువదించారు. అందులోని ద్వితీయోచ్ఛ్వాసాన్ని తీసుకొని అవధానిగారు రాజసందర్శన కావ్యరచన చేశారు. అందులో ద్వితీయోచ్ఛ్వాసంలో మొదట ఒక పద్యం తిరుపతి వేంకటకవులు రాశారు.

క॥ భూపతులు దురవగాహులు
కూపములంబోలి జనులకుంగార్యంబె
లా నతి గుణ వద్ఘటక
ప్రా పకతంగాక సిద్ధినందుడ నంతన్'' [12]

ఈ కంద పద్యాన్ని అవధానిగారు తేటగీతిగా మార్చి ఈ విధంగా చెప్పారు.

''నరపతులు కూపములవోలె దురవగాహు
లగుట జనులకు, వారితో నతిపటుగుణ
కలిత సద్ఘటక ప్రాపకతనుగాక
యేల తనుయంత సిద్ధి వహించుబనులు'' [13]

తిరుపతి వేంకటకవులమీద దివాకర్ల వేంకటావధానిగారికి అపారమైన భక్తి అభిమానాలున్నాయి. రాజసందర్శనానికి వారి రచనే ప్రేరణ కలిగించింది. అందువలన కావచ్చు పై పద్యంలో వారు వాడిన పదాలు భావం చోటుచేసుకున్నాయి. తిరుపతి వేంకటకవులు వచనంలో వాడిన అలంకారాలను ఉపమానాలను కూడా అవధానిగారు చక్కగా పద్యాలలో పొందుపరిచి రచనలకు రమ్యతను చేకూర్చారు.

ఈవిధంగా దివాకర్ల వేంకటావధానిగారు ''రాజసందర్శనము''ను బాణుని కావ్య నాయకునిగా చేసి చారిత్రాత్మకమైన ఇతివృత్తాన్ని గ్రహించి కొన్ని మూలంలో లేని విషయాలను కల్పించి, కావ్య లక్షణాలను పొందుపరచి తన మనోభావాలకు దర్పణంగా బాణుని మానసిక చిత్రణను విశ్లేషించి ఒక నిర్వచన లఘుకావ్యాన్ని రూపొందించారు.

## 2. మధువనము

మధువనమనే పద్యకావ్యం సంస్కృతంలో వాల్మీకి రచించిన శ్రీమద్రామాయణంలోని సుందరకాండకు సంగ్రహ రూపం. అవధానిగారు దీనిని 1963లో రచించారు. సుందరకాండను ప్రతిదినం పారాయణం చేసే అలవాటు ఆయనకుండేది. అందలి ఇతివృత్తం ఆయనను బాగా ఆకట్టుకొన్నది. అందుచేత తెలుగులో పద్యకావ్యంగా రాయాలని సంకల్పించారు. సుందరకాండలో వానరులు మధువనంలో మధువులను గ్రోలి పండగ చేసుకొన్నారు. అవధానిగారు ఈ కావ్యానికి మధువనమనే పేరు పెట్టారు. ఆయన మాటలలో --

''శ్రీ మద్రామాయణమునందలి సుందరకాండమును బ్రతిదినము పారాయణము చేయుట నాకలవాటు. అందలి కథ ఇతివృత్తముగాగైకొని యొక కావ్యము వ్రాయవలయునని సంకల్పించి కొన్ని ఏండ్ల క్రింద కొన్ని పద్యములు మాత్రము వ్రాసియుంటిని. కడచిన వేసవి కాలములో గొంత యవకాశము లభింపగా మిగిలిన పద్యములు గూడా రచించి దానిని బూర్తిచేసితిని. పెక్కుపట్టుల నాదికవిభావములనే ఇందు సంగ్రహముగా వర్ణించితిని. మధువనమునకు సంబంధించిన సన్నివేశము కూడా నిందుండుట చేతను, ఆ పేరు సుందరముగా నుండుటచేతను కావ్యమున కాపేరు పెట్టితిని'' [14]

ఇది నిర్వచనంగా రచించిన పద్యకావ్యం. మధువన కావ్యంలో మొత్తం 262 పద్యాలున్నాయి. ఆరు భాగాలుగా విభజింపబడింది. ఆది కవి వాల్మీకి సుందరకాండను 68 సర్గలుగా 2797 శ్లోకాలుగా రచించారు. అవధానిగారు వాల్మీకి పదిసర్గలలో చెప్పిన ఇతివృత్తాన్ని ఒక భాగంగా పది శ్లోకాలకు ఒక పద్యంగా రచించినట్లు కనిపిస్తుంది. కానీ ఇది పరిమాణం దృష్ట్యా లెక్కలు కడితే వచ్చే సమాధానం తప్ప ప్రతి పది శ్లోకాలకూ ఒక పద్యం అని కానీ ప్రతి పది సర్గలను ఒక భాగంగా విభజించినాడనికాని అర్థం కాదు.

అవధానిగారు ఈ కావ్యాన్ని శ్రీ మద్దూరు సుబ్బారెడ్డిగారికి అంకితం చేశారు. ఇతను కర్నూలు వాస్తవ్యులు. 1963లో సుబ్బారెడ్డిగారు కర్నూలు జిల్లా పరిషత్తు అధ్యక్షులుగా, శాసనమండలి సభ్యులుగా ఉండేవారు. రామాయణభారత భాగవతాదుల మీద

సుబ్బారెడ్డిగారికి అపారమైన ఆదరణ కలిగి వుండుటచేత ఈ కావ్యాన్ని అతనికి అంకితం చేయుట జరిగిందని అవధానిగారు పేర్కొన్నారు.

వాల్మీకి రామాయణం సుందరకాండలోని ఇతివృత్తం మనోహరమైంది. భారతంలో విరాటపర్వం రామాయణంలో సుందరకాండ చదివితే శుభం కలుగుతుందనే నమ్మకం ప్రజల్లో వుంది. న్యాయాన్యాయాలకు ధర్మాధర్మాలకు జరిగిన పోరాటాలలో ఇవి వారధులుగా నిలుస్తాయి. అజ్ఞాతంనుండి జ్ఞాతంలోకి రావడానికి దోహదం చేస్తాయి. అందుకే ఇవి పుణ్యప్రదాలనే భావం ప్రజల్లో ఇంకా మిగిలి వుంది.

హనుమంతుడు ఈ కావ్య నాయకుడు. సుందరకాండలోని విషయాన్ని సంగ్రహపరచి అవధానిగారు మధువన కావ్యాన్ని ( నిర్వచనంగా) రచించారు.

## ఇతివృత్తంలో పాటించిన ఔచిత్యం

సుందరకాండ జాంబవంతుడు అంగదుడు హనుమంతుడు మొదలగు వానరులు దక్షిణాది సీతాన్వేషణ చేయుటతో ప్రారంభమవుతుంది. హనుమంతుడు సముద్రాన్ని దాటి లంకలో సీతను వెదుకుటకై బయల్దేరుతాడు. మైనాకుడతనికి ఆతిథ్యం ఇస్తాడు. నాగదేవత, సింహిక, లంకిణిల నిరోధాన్ని అధిగమించి లంకలో ప్రవేశిస్తాడు. వెన్నెల వెలుగులో నలుమూలల సీతను వెదకి చివరికి అశోకవనంలో ఆమెను కనుగొంటాడు. రావణుడు వచ్చి ఆమెకు రెండు నెలలు గడువిచ్చి బెదిరించి పోతాడు. రావణుడు వెళ్లిన తరువాత అశోక వృక్షం దిగివచ్చి సీతతో మాట్లాడి రాముడిచ్చి పంపిన అంగుళీయకమును ఆమెకిచ్చి ఆనవాలుగా ఆమె ఇచ్చిన సీమంత మణిని తీసుకొని అశోకవనాన్ని నాశం చేసి అక్షయ కుమారాది రాక్షస కుమారులను సంహరించి లంకాదహనం చేసి తిరిగి ఆకాశ మార్గంలో మహేంద్రగిరికి చేరుకుంటాడు. అక్కడ తన రాకకొరకు నిరీక్షిస్తున్న జాంబవదాదులకు తాను సీతను చూసిన విషయాన్ని చెప్పి కిష్కింధకు బయల్దేరుతాడు. వానరులుత్సాహంతో మధువనంలోని మధువును గ్రోలి వన పాలకుడైన రథి ముఖుని చావగొట్టి కిష్కింధకు వెళ్లి రామలక్ష్మణ సుగ్రీవాదులకు సీత విషయం తెలియజేయుటతో సుందరకాండ ముగుస్తుంది.

ఈ విషయాన్ని వాల్మీకి అత్యంత మనోహరంగా వర్ణించారు. ఐతే మూడుసార్లు పునరావృతం చేయుట జరిగింది. వాల్మీకి హనుమంతుడు లంకకు వెళ్లు సందర్భంలో అతడు తిరిగి మహేంద్రగిరికి చేరుకొను వరకు విపులంగా వర్ణించాడు. హనుమంతుడు తాను లంకకు వెళ్లివచ్చిన వృత్తాంతాన్ని జాంబవంతాదులకు చెప్పడంద్వారా రెండవసారి పునరావృతం అవుతుంది. తరువాత కిష్కింధకు చేరిన వానరులు రామలక్ష్మణులకు

సుగ్రీవాదులకు సీతను చూసి వచ్చిన విషయాన్ని సంక్షిప్తంగా చెప్పటంతో మూడవసారి చెప్పినట్లయినది.

విషయం మనోహరమైనదే అయినా మూడుసార్లు చెప్పించుట అవధానిగారికి నచ్చినట్లు లేదు. కాబట్టి హనుమంతుడు లంకనుండి తిరిగి వచ్చి జాంబవదాదులతో తన లంకాయాన విశేషాలను చెప్పడంతో కావ్యం ఆరంభించారు. కిష్కింధకు చేరిన తరువాత రామలక్ష్మణులకు కూడా హనుమంతుడు తాను సీతను చూసి వచ్చిన విషయాన్ని సంక్షిప్తంగా చెప్తారు. మధువనంలో కూడా వానరులు విహరించిన విధానాన్ని కూడా సంగ్రహపరచి అవధానిగారు ఎంతో ఔచితిని పాటించారు. అవసరమనుకొన్న సందర్భాలలో అవధానిగారు వాల్మీకిని యథాతథంగా అనుకరించారు. అనవసరం అనుకున్న విషయాలను అవధానిగారు వదిలివేసి మధువన కావ్యాన్ని ఒక సుందరకావ్యంగా రచించారు.

అవధానిగారి మధువన కావ్యం సీతను చూసి తిరిగి వస్తున్న హనుమంతుని వర్ణనతో మొదలవుతుంది.

ఈ దృశ్యాన్ని వాల్మీకి ఈ విధంగా వర్ణించారు.

శ్లో ॥ ''సచంద్ర కుముదం రమ్యం సూర్యకారండవం శుభం
తిష్యశ్రవణ కాదంబ మభ్రశైవాల శాద్వలమ్,
పునర్వసు మహాదీపం లోహితాంగ మహాగ్రహం
ఐరావతమహా ద్వీపం స్వాతీ హంస విలోడితమ్''[2]

వాతసంఘాత జాతోర్మిచంద్రాంశు శిశిరాంబుమత్
భుజంగ యక్ష గంధర్వ ప్రబుద్ధ కమలోత్పలమ్,
హనుమాన్మారుతగతి ర్మహానౌరివ సాగరం
అపార మపరిశ్రాంతః పుప్లువే గగనార్ణవమ్''[14]

చంద్రుడు తెల్లకలువగా సూర్యుడు నీరుకోడిగా పుష్యశ్రవణ నక్షత్రము పెనుమీనుగా అంగారక గ్రహము పెనుమొసలిగా ఐరావతము మహాద్వీపముగా స్వాతీనక్షత్రము హంసలుగా గాలి తాకిడిచే చంద్రకిరణములే చల్లని నీరుగా ఆయా వర్ణములతో నొప్పునాగులు యక్షులు, గంధర్వులే వికసించిన తామరలు కలువలుగా అపారమగు సముద్రము నలయకయే హనుమంతుడు వాయువేగముతో పెద్ద నావ సముద్రమును దాటినట్లు దాటెను - అని వాల్మీకి వర్ణించగ -

అవధానిగారు -

''నందిత వారిజాప్తరుచి మండలమౌ తను కాంతి దిక్కులం
జెందగ జేయుచు న్నయవిశేష నిశ్శీర్ణ మరుత్ప్రచారమై
ముందల మేఘమాలికల ముక్కలు చేయుచు నభ్రసాగరం
బందొక నౌకపోలిక దదాకృతి చెచ్చెర వచ్చుచుండగన్'' [15]

అని ఆకాశమార్గంలో వచ్చుచున్న హనుమంతుని సూర్యకాంతి ఆకాశ సముద్రంలో వస్తున్న ఒక నౌకగా ఉపమించారు.

వాల్మీకి సూర్యుణ్ణి నీరుకోడిగా చంద్రుణ్ణి కలువగా పోల్చి చెప్పినాడు. ఈ పోలికలు అవధానిగారికి నచ్చినట్లు లేవు. అందుకే వాటిని వదిలేసి ఆకాశమార్గాన్ని సముద్రంతో హనుమంతుని నావతో పోల్చిన విధానాన్ని మాత్రం గ్రహించారు.

ఈ విధంగా కనిపించిన ఆంజనేయుడు పెద్దధ్వనిచేస్తూ మహేంద్రగిరి మీద దిగి తన చుట్టూ చేరిన వానరులకు తాను సీతను చూసి తినన్న విషయాన్ని చెప్పాడు. వాల్మీకి ఈ విషయాన్ని -

''తతోదృష్టేతి వచనం మహార్థ మమృతోపమం
నిశమ్య మారుతేస్సర్వే ముదితా వానరా భవన్'' [16]

అప్పుడు గొప్ప అర్థము కలది అమృతమునకు సాటియైనదగు దానిని ''చూచితి'' అను హనుమంతుని మాటలు విని వానరులందరూ ఆనందించిరి.

ఈ భావాన్ని అవధానిగారు -

''అమృతంబట్టులు శీతల, మమితానంద ప్రదమ్మునతి రుచిరమునై
యమరిన వాతాత్మజువాక్యము వీనులబడిన యంత హర్షనివశులై'' [17]

- అని చిన్న కందపద్యంలో ఇంచుమించు యథాతథంగా చెప్పినారు. కొందరు సింహనాదాలు చేశారు. కొందరు తోకలు తిప్పారు, కొందరు గట్టిగా గర్జించారు, కొందరు హనుమంతుని స్పృశించారు. ఈ సందర్భంలో వానరులు చేసిన చేష్టలను వాల్మీకి వర్ణించినట్లే యథాతథంగా వర్ణించారు. సీతను చూసిన విధం చెప్పమని వానరులు హనుమంతుని అడిగారు. తాను అశోక వృక్షంలో సూక్ష్మరూపంలో దాగి ఉన్నప్పుడు రావణుడు వచ్చి సీతను చూసిన సందర్భంలో వాల్మీకి రెండు శ్లోకాలు రాశాడు. అందు మొదట శ్లోకంలో సీతా సౌందర్యాన్ని రావణుడు భావించిన తీరు వ్యక్తం అవుతుంది.

శ్లో॥ ''సతీమసిత కేశాంతాం సుశ్రోణీం సంహతస్తనీం
దిదృక్షు రసితాపాంగా ముపావర్తత రావణః''

శ్లో॥ అచ్ఛాద్యోదర మూరుభ్యాం బాహుభ్యాంచ పయోధరౌ
ఉపనిష్టా విశాలాక్షీ రుదంతీ వరవర్ణినీ'' [18]

నల్లని కేశములు గలది, చక్కని పిరుదులు గలది, బలిసినవై నడుచు వ్యవధానములేని స్తనములు గలది, నల్లనికను గొలకులు కలది యగు సీతను చూచుటకు రావణుడు వచ్చెను.

విశాలమగు కన్నులుగల యా యుత్తమ వనిత భయముతో తన తొడలచే నుదరమును, బాహువులచే స్తనములను కప్పుకొని యేడ్చుచు కూర్చుండెను. మొదటి శ్లోకం అప్రస్తుతంగా భావించాడు. అవధానిగారు రెండవ దానిని మాత్రం అనువదించి ఔచిత్యం కలుగజేశారు.

రావణుని రాకకు సూచకములైన శబ్దాలను విన్న సీత -

''ఆనినదంబు శ్రోత్రములయందు, బడంగనే దుఃఖితాత్మయై
యాననముంద్బొడల్ కడును యంగములన్ ముడుగంగజేయుచున్
ప్రాణములగ్గ బట్టుకొని బాష్పజలంబురలంగ గన్నులన్
దీనత రూపమందిన గతింబడి యండెను సీతయంతలో'' [19]

శోకమూర్తియైన సీత తన ముఖాన్ని తొడల మధ్య దాచుకొన్నదని మిగిలిన అవయవములను ముడుచుకొని ప్రాణాలు బిగబట్టి కన్నీల్లో కన్నీరు ప్రవచించగా దైన్యమే ఆకృతి దాల్చినదా అన్నట్లు వర్ణించారు. ఇదియెంతో ఔచిత్యమహితంగా ఉంది. మధువన కావ్యమంతా ఇదేవిధంగా అవధానిగారు అవసరం అనుకొన్నచోట్ల వాల్మీకి భావాలను యథాతథంగా స్వీకరించి అనవసరం అనుకున్న సందర్భాలలో పరిహరించి ఒక మధుర కావ్యంగా రచించారు. మధువన కావ్యంలో అక్కడక్కడ అందంగా పొదిగిన మణులవలె కొన్ని ఉపమరూపకాది అలంకారాలు కనిపిస్తాయి.

రామలక్ష్మణులు లేని సందర్భంలో రావణాసురుడు వచ్చి సీతను ఎత్తుకొని వెళ్లాడు. అశోకవనంలో ఉంచాడు. అప్పుడప్పుడు వచ్చి ఆమెకు తన గొప్పలు చెప్పి స్వీకరించమని వేధిస్తూ ఉంటాడు. ఆ సందర్భంలో సీత రావణుని మీద ఎంతో కోపంతో ఉండుట సహజం. కోపంతో ఉన్న వ్యక్తిని వేధిస్తే దూషించు ...ప్పనిసరి. తెలుగు భాషలోని చాలా తిట్టు మాటలలో అలంకారాలున్నాయి. ఇ... ...ానసిక పరిస్థితిలో ఉన్న సీతను వేధించిన రావణాసురుని సీత -

''ఆనతపైరులా దశరథాత్మజు ఆర్యుడు, బర్ణశాలలో
లేనపుడల్ప చోరునింవలెం గొని వచ్చియు నన్ను నీ యెదం
బూనెదొ విక్రమంచెదొ యపూర్వము చూపితినంచు గర్వమున్
గానక నీకు వారికిని గల్గనె సామ్యమొకంట నేనియున్'' [20]

అని రావణుని దొంగతో ఉపమించి దూషిస్తుంది. ఈ సందర్భంలో ఈ ఉపమాలంకారం ఉచితంగా ఉంది. ఈ విధంగా సందర్భోచితంగా అవధానిగారు అలంకారాలను వాడినారు. మధువన కావ్యంలో చక్కని సామెతలను జాతీయాలను అవధానిగారు వాడినారు.

ఒకరోజు శ్రీరాముడు సీతతొడపై తలనిడి నిద్రపోతున్నాడు. చెట్టుమీదనుండి ఒక కాకి వచ్చి సీత స్తనంమీద ముక్కుతో పొడవజొచ్చింది. సీత ఎంత వారించినా కాకి మళ్లీ మళ్లీ వచ్చి పొడుస్తున్నది. సీత రాముని నిద్రలేపి విషయం చెప్పింది. రాముడాగ్రహంతో కాకిపై బ్రహ్మాస్త్రం వేశాడు. అది ముల్లోకాలు తిరిగి చివరికి రాముణ్ణే శరణువేడింది. శరణన్న శత్రువునయినా కాపాడే గుణంగల రాముడు దానిని మన్నించి అస్త్రాన్ని దాని కుడికంటికి మరలించాడు. దాని కన్నుపోయింది. ఈ సందర్భంలో అవధానిగారు చావుదప్పి కన్ను లొట్టపోయిందనే సామెతను వాడి రచనకు ఔచిత్యాన్ని కలిగించారు.

''దక్షిణంబక మరి చావుదప్పి కన్ను
లొట్టబోయె నటన్న పల్కొప్ప నద్ది
నిన్ను దశరథ భూజాని నెమ్మనమున
సమ్మతించుచు బోయె సుస్థానమునకు'' [21]

ఈ సామెత పుట్టిన సన్నివేశం కూడా ఇదే అయి ఉండవచ్చు. పిచ్చుకపై బ్రహ్మాస్త్రమన్న సామెత కూడా ఈ సన్నివేశంనుండే పుట్టి వుండవచ్చును.

గుండెలు బ్రద్దలై, కన్నుల నిప్పులురాల, తూచ తప్పకుండా వంటి జాతీయాలను సందర్భోచితంగా వాడి రచనకు అందాన్ని సమకూర్చారు. సమయోచితంగా సామెతలను జాతీయాలను వాడి అవధానిగారు రచనకు ఒక వైశిష్ట్యాన్ని కల్గించుట గమనార్హం. పద్యరచనలో సామెతలను జాతీయాలను పొందుపరచుట కొంత కష్టంతో కూడుకొన్న పని. పద్యరచనలో పుష్కలమైననైపుణ్యం ఉంటేకానీ ఇది కుదరదు. అవధానిగారు పరిణితి చెందిన పద్య విద్యా పండితుడు, అందుకే సామెతలను జాతీయాలను సందర్భోచితంగా అవలీలగా వాడారు.

ఈ కావ్యంలో ఛందోవైవిధ్యం కూడా కనిపిస్తుంది. యుద్ధ వర్ణనలలో శార్దూల వృత్తాలను కరుణ రస పోషణ సందర్భాలలో ఉత్పలమాలా వృత్తాలను, సీస పద్యాలను, కంద పద్యాలను

అవధానిగారు వాడినారు. హనుమంతుడు సీతను వెదకుటకై లంకకు వెళ్లునప్పుడు సింహికను సంహరిస్తాడు, అప్పుడు శార్దూల వృత్తాన్ని వాడారు.

''ఘోరాకారను లోకకంట నతిక్రూరాత్మ నీసింహికన్
ధీరత్వంబున జంపి లోకముల కెంతే మోదముంగూర్చి తో
వీరా వాయుకుమార! నీకగుత లేలే కార్య సంసిద్ధియున్
శ్రీరమ్యాశిషముల్ దిగంతరములన్ విన్పించె నాకంతటన్'' [22]

లంకిణిని హనుమంతుడు ముష్టిఘాతంతో పొడిచిన సందర్భంలో కూడా శార్దూల వృత్తాన్నే వాడుట గమనార్హం.

''కోపంబాపు కొనంగ లేక యపుడా క్రూరాత్ముచే నుండియా
టోపంబొప్ప మదీయ హస్తములు రెండున్ లాగి నా విక్రమం
బే పుంజూప దలంచి ముష్టహతిగా రింపంగ నాదైత్య సం
తాపం బచ్చెరువున్ హృదించె గొనన్ దైన్యంబుతో నిట్లనెన్'' [23]

ఆహ్లాదం కల్గించే సందర్భాలలో ఉత్పలమాల లాంటి వృత్తాలను వాడారు.

''సుందరమైన ఈ మణిని జూడగ వత్సము జూచి వేద్య ప్ర
స్యందము నొందు ధేనువు క్రియన్ ద్రవించుచునాడు డెంద మా
నందమునొందు బెండ్లి తరుణంబున దీని ధరించి చె
న్నం దిన యావిదేహ వసుదాధివనందిని గాంచినట్లుగున్'' [24]

అందమైన కంద పద్యాలను అందులో వీనులకు విందు చేసే పదాలను వాడి శ్రావ్యతను చేకూర్చిన నేర్పు కూడా ఈ కావ్యంలో కనిపిస్తుంది. శోకతప్త హృదయంతో అశోకవనంలో ఉన్న సీతకు హనుమంతుడు తన రాకను తెలియజేసే సందర్భంలో ఇటువంటి శ్రావ్యమైన పద్యం రచించుట ఎంతో సమంజసంగా ఉంది.

''మెల్లని కంఠముతో నా
తల్లి వినన్ సూర్యవంశ ధాత్రీశుల పెం
పెల్లను గానము చేసితి
నుల్లము వికసింప నామెమూర్ధనానయ్యె'' [25]

హనుమంతుడు రాళ్లను కరిగించునట్లు గానం చేయగల గానకళా కోవిదుడు. అందుకే అవధానిగారు ఇంత కమ్మని పద్యాన్ని కూడా పొందుపరిచారు. కమ్మని సంగీతంతో సూర్యవంశరాజులయిన రామలక్ష్మణుల పెంపును వినిపించాడట. ఆమె ముఖంపైకెత్తి దానిని నాలకించింది.

అవధానిగారి సంభాషణలు సరసంగా, లలితంగా సామరస్యమహితంగా ఉంటాయి.

ఉదాహరణకు : -

హనుమంతుడశోకవనిలోని సీతను చూశాడు, ఆమెతో సంభాషించాడు, రాముడా నవాలుగ పంపిన ఉంగారాన్నిచ్చాడు. ఆమెనుండి ఆనవాలుగా శిరోమణిని స్వీకరించాడు. లంకాదహనం చేసి వచ్చాడు, ఆ విషయాన్ని వానరులతో చెప్పే సందర్భంలో -

''నిన్నువెడలు మంచు నే బంపలేను నీ
వరగకున్న రాముడరుగు దెందు
దారిలేదు, వాయుతనయ! నీవరిగి రా
వయ్యు, నన్ను గావవయ్య వేగ,
అని పల్కు నామె దీనా
నన మారిసి యాగ్రహంబునన్ దశకంఠున్
దును మంగ మేను వెంచితి
ఘన మగు పర్వతము వోలె గన్పట్టంగన్,
అనవిని యంగదుండు హనుమా! యదికూడను జేసి వచ్చితే?
యన హనుమంతు డప్పటికి నాగ్రహమున్నియమించు కొంటి మీ
దను గల కార్యభారము నెదందల పోయుచు నన్న, దక్కుగా
థను వివరించి మాకిడు ముదంబు నటంచనె జాంబవంతుడున్'' [26]

ఈ విధంగా రమ్య రసమయ సంభాషణలతో కథను నడిపిస్తూ కావ్యాలు రాయటం అందరికీ సుసాధ్యమయ్యే విషయం కాదు. తిక్కనాదులు ఏ కొందరో ఈ శిల్పాన్ని పోషించారు. కవిత చెప్పడంలో చేయి తిరిగిన కవులు మాత్రమే చేయగలరు. అవధానిగారు సంభాషణల ద్వారా, సన్నివేశ చిత్రణలద్వారా నాటకీయ శిల్పాన్ని ఈ చిన్న కావ్యంలో పోషించారు. మొత్తంమీద మధువన కావ్యమొక మధురకావ్యంగా పేర్కొనవచ్చు.

## 3. కలి పరాజయము

కలి పరాజయమను నిర్వచన కావ్యాన్ని అవధానిగారు 1971వ సంవత్సరంలో రచించారు. 1972 ఆగస్టులో ముద్రింపబడింది. కుంభీలాల్ అనే భక్తుని కోరిక మేరకు దివాకర్ల వేంకటావధానిగారు ఈ కృతిని హనుమంతునికి అంకితం ఇచ్చారు. ఇతివృత్తాన్ని భాగవతం నుండి గ్రహించారు. ఈ కావ్యం ఆరు సర్గలుగా విభజింపబడి వుంది. ఆరు సర్గల్లో (202) రెండువందల రెండు పద్యాలలో అవధానిగారు చెప్పారు. అంకిత పద్యాలుగా తొమ్మిది (శ్రీ) కుంభీలాల్‌గారిని గురించి మూడు పద్యాలు చెప్పబడినాయి. ఇవి కలుపుకుంటే మొత్తం

పద్యాలు (214) రెండువందల పద్యాలుగు. ఈ కావ్యంలో ప్రతి సర్గ చివర ముందువచ్చు సర్గలోని విషయం సూచింపబడి వుంది. అవధానిగారు తన కావ్యరచన గురించి తొలి పలుకులలో -

''హైదరాబాద్ కొత్తపేట వాస్తవ్యులు, కవిపండిత పక్షపాతులు నైన శ్రీ కుంబీలాల్‌గారు తమ యుపాస్య దైవమైన హనుమంతునికి తమ గ్రామమున నొక దేవాలయమును నిర్మింపజేసి నిత్య ధూపదీప నైవేద్యాదులకు దగిన ఏర్పాట్లు గావించి వుండిరి. ప్రతి సంవత్సరం హనుమజ్జయంతి సందర్భమున నిచ్చట విద్వద్గోష్టియు, కవిపండిత సన్మానమును జరుగుచుండును. గత సంవత్సరమచ్చటికి ఆహూతుడనై నేనరిగినప్పుడు శ్రీ కుంబీలాల్‌గారు హనుమంతుని పేర నంకితముగా నొక కావ్యమును రచింపుమని నన్ను గోరిరి. నేను శ్రీ మద్భాగవతమందలి పరీక్షిన్మహారాజు ధర్మదేవతను నిగ్రహించి కలి పురుషుని శిక్షించి, యతడు ప్రార్థింపగ నాయావసతులాతనికి జూపిన వృత్తాంతమును గ్రహించి యాకావ్యము రచించితిని'' [27] అని పెప్పినారు.

శ్రీ మద్భాగవతంలో ప్రథమస్కంధంలో పరీక్షిత్తు మహారాజు కలిని పారద్రోలిన విషయముంది. శ్రీకృష్ణ నిర్యాణం తర్వాత ధర్మరాజు పరీక్షిత్తుకు రాజ్యాభిషేకం చేసి మహాప్రస్థానం చేసిన అనంతరం కురుజాంగల దేశంలో కలి పురుషుడు ప్రవేశించాడని తెలిసి నిర్మూలించడానికి నిశ్చయించుకుంటాడు. దిగ్విజయ యాత్రచేసి నాలుగు సముద్రాల మధ్యగల భూభాగాన్ని జయిస్తాడు. సరస్వతీ నదీతీరంలో వృషభ రూపంతో ఒంటిపాదంతో ఉన్న ధర్మదేవతను సమీపంలోనే లేగలేని లేగటి కుఱ్ఱివలె శోభావిహీనయై కన్నీరు కారుస్తూ గోరూపంలో వున్న భూదేవిని చూశాడు. వారి సంభాషణ పరీక్షిత్తు విన్నాడు. కలి పురుషుడు వచ్చి ధర్మదేవతను తన్నుట చూశాడు. పరీక్షిత్తు కలిపై కత్తి దూశాడు. కలి గడగడ వణికిపోయి శరణు వేడగ అతనిని క్షమిస్తాడు. భూదేవిని ధర్మదేవతను ఓదార్చుతాడు.

శరణువేడిన కలి పురుషుడు నేను ఎక్కడ నివసించాలని అడుగగా పరీక్షిత్తు అతనిని ప్రాణివధ, స్త్రీలోలత్వం, ద్యూతం, మద్యపానం అసత్యం పలుకుట, మదమును పొందుట, కామాంధులగుట, హింసచేయుట వైర భావాలు పెంచుకొనుట అను ఈ తొమ్మిది ప్రదేశాలలో వసింపుమని చెప్పి కలిని తరిమివేస్తాడు, ధర్మదేవతకు లుప్తమైన తపస్సు, శౌచము, దయ అను మూడు పాదాలు ప్రదానం చేసి భూదేవికి సంతోషం కలుగజేస్తాడు. సంగ్రహంగా ఇది భాగవతంలో ఉన్న ఇతివృత్తం.

దీని గ్రహించి అవధానిగారు ఆరు సర్గలుగా విభజించి రచించారు. సమకాలీన సాంఘిక రాజకీయ సారస్వతాది పరిస్థితులను జోడించి విషయాన్ని పెంచి రచించారు. శ్రీకృష్ణుని

దేవతలు వైకుంఠానికి రమ్మని ప్రార్థించుట భాగవతంలో లేదు. ఇది అవధానిగారి కల్పన. ఈ విషయాన్ని 18 పద్యాల్లో ఉల్లేఖించారు. శరీర త్యాగం చేసిన శ్రీకృష్ణుని వద్దకు ఉద్ధవుడు వచ్చి నీవు ఈ లోకాన్ని విడిచి వెళ్లావు. ఇంక ధర్మరక్షణ చేసి కలిని నిర్మూలించు వారెవరు అని విలపించుట కూడా అవధానిగారు కల్పించినదే.

మూడవ సర్గలో కృష్ణ నిర్యాణ విషయం తెలిసి కలి ప్రవేశించి తానింక స్వేచ్ఛగా విహరించవచ్చు అని సంతోషించుట కూడా అవధానిగారు కల్పించినదే. ధర్మరాజును గురించి కలి పలికిన స్వగతాలు కూడా భాగవతంలో లేవు.

ధర్మరాజు పరీక్షిత్తునకు పదేశించిన రాజనీతి, పరీక్షిత్తును శ్రీకృష్ణుడు కాపాడిన విషయాన్ని పరీక్షిత్తు చెప్పుట మొదలైన విషయాలు కూడా అవధానిగారు కల్పించినవే. పంచమసర్గలో ధర్మదేవత భూదేవితో లోకంలో జరిగే దురంతాలు చెప్పుట, ధర్మచ్యుతిని గురించి తెలుపుట భాగవతంలో ఉన్నాయి. కానీ అవధానిగారు ఈ సందర్భంలో సమకాలీన సామాజిక పరిస్థితులను ప్రతిబింబింపజేశారు.

షష్టసర్గలో కలి పరాజయం పొందుట, అతను శరణువేడుట భాగవతంలో ఉన్నాయి. కానీ కలి నివసింపదగు ప్రదేశాలను పోతన తొమ్మిదింటిని నిర్దేశించగా అవధానిగారు కలి నివాసం చేయవలసిన ప్రదేశాలు నాలుగునకు కుదించారు. ఈ కావ్యంలో నాయకుడు పరీక్షిత్తు ప్రతినాయకుడు కలి పురుషుడు. నాయకుని విజయంతో కావ్యం పూర్తి అవుతుంది. కనుక ఇది శుభాంతకావ్యం. నాయకుడు ధీరోదాత్తుడు, ప్రతి నాయకుని క్షమించి వదలివేయుటలో ఇతని ధీరోదాత్త గుణం ప్రస్ఫుటమగుచున్నది. వస్తువు భాగవతంనుండి గ్రహింపబడినది. కనుక ఇది ప్రఖ్యాతం. అంగిరసం ధర్మవీరం, శృంగార, వీర, కరుణ రస పోషణ చేయబడినది.

## కావ్య లక్షణాలు :

''అదౌనమస్క్రియా శీర్వావస్తు నిర్దేశ ఏవనా'' అని లక్షణకర్తల నిర్దేశానుసారం కలి పరాజయ కావ్యం దైవస్తుతితో ప్రారంభింపబడింది. మహాకావ్యంలోగానీ ఖండకావ్యంలోగానీ నాయకుడు ఒక్కడే యుండవలయునను లక్షణానుబద్ధంగా ఈ కావ్యంలో పరీక్షిత్తు నాయకుడుగా వర్ణింపబడినాడు. నాయకునకుండవలసిన ఉత్తమ కులము, ధైర్యము ఉదారత్వం శౌర్యపరాక్రమాది గుణాలు ప్రతి నాయకుడైన కలిని పరాజితుని చేసి ధర్మ ప్రతిష్టించిన కీర్తి పరీక్షితునకున్నాయి. శృంగార వీర శాంతరసాలలో ఒకటి అంగిగా మిగిలినవి అంగరసాలుగా ఉండాలన్న లక్షణానికి సరిపోవునట్లు ఈ కావ్యంలో ప్రధాన రసంగా ధర్మవీరం అంగరసాలుగా కరుణ శృంగార వీర రసాలు పోషింపబడినాయి.

వర్ణనాత్మకమైనదే కావ్యం కనుక ఈ కావ్యంలో అనేక అంశాలు హృద్యంగా వర్ణింపబడినాయి. పుర, సముద్ర, శైల, ఋతు, సూర్యోదయ, చంద్రోదయ, సరః క్రీడా, వనక్రీడా, వసంత, రతిప్రసంగ, విరహ, పరిణయ, పుత్రోదయ నయ విరచన, దండయాత్రా, యుద్ధ, దౌత్య, ప్రభువర్ణనము అను అష్టాదశ వర్ణనలు గలది మహాకావ్యమని ఇందులో కొన్ని లేకపోయినా మహాకావ్యం కాకపోదని కావ్యాలంకార సంగ్రహకర్త పేర్కొన్నారు. అప్పకవి వీటికి మరో నాలుగు చేర్చి ఇరువది రెండు వర్ణనలుండాలన్నారు.

అలంకార శేఖరకారుడు ఇంకొంచెం ముందుకు వెళ్లి కావ్యంలో ముప్పై ఒక్క వర్ణనలుండాలన్నాడు.

చాలామంది అలంకారికుల మతంలో అష్టాదశ వర్ణనలు అందులో కొన్ని తక్కువ అయినా ఫరవాలేదు అనే విషయం తెలుస్తున్నది. అవధానిగారు కలి పరాజయము అష్టాదశ వర్ణనలు ముఖ్యంగా కాక విషయాన్ని వర్ణనాత్మకంగా పెంచి రచించిన సలక్షణ కావ్యం. ఈ కలి పరాజయం ప్రథమ సర్గలో వైకుంఠ నగరాన్ని వర్ణించారు. ఈ సర్గలోనే వైకుంఠవాసులు విష్ణువు కృష్ణుడయి భూలోకంలో పుట్టినందున వారు అనుభవించిన వియోగాన్ని చమత్కారంగా వర్ణించారు. లిప్తమొక యుగంగా నిరీక్షించినట్లు వర్ణించారు. విరహానికి అనుభవం నిరీక్షణ, క్షణమొక యుగంగా నిరీక్షించుట విరహాతిశయంలోనే వుంటుంది. విరహమనేది రెండు హృదయాలకు సంబంధించినది. అది ఇద్దరి స్నేహితులమధ్య కావచ్చు. ప్రేయసీ ప్రియులమధ్య కావచ్చు, భగవంతుని భక్తునికి మధ్య కావచ్చు. విష్ణులోక వాసులు విష్ణువు కొరకు ఎదురుచూచు విషయాన్ని వర్ణించిన సందర్భంలో అష్టాదశ వర్ణనలోని విరహ వర్ణన అను లక్షణాన్ని సాధించారు. ఇట్లే కృష్ణుని నిర్యాణ సమయంలో వృక్షచ్ఛాయలో అతడు శయనించినప్పుడు బోయవాడు బాణంతో అతని పాదాన్ని కొట్టిన సందర్భంలో వనవర్ణనను స్పృశించారు. విష్ణువు పాదాన్ని పోతనవలె అన్నమాచార్యునివలె భక్తిపారవశ్యంలో వర్ణించారు. శ్రీకృష్ణుని, ధర్మరాజును, పరీక్షిత్తుని వర్ణనలు రమ్యంగా చేశారు. చతుర్థసర్గలో పరీక్షిత్తుని జననాన్ని వర్ణించి పుత్రోదయ వర్ణనను సాధించారు. ద్రౌణివిశిఖ వహ్ని దగ్ధం కాకుండా కమల నయనుని కరుణ కలిమితో బ్రతికి బట్టగట్టిన పరీక్షిత్తుడు ''విచ్చిన తమ్మిరేకులకు విందులు పెట్టెడు కన్నుదోయితో'' రాజ్యలక్ష్మికి ఆటపట్టయిన యెదతో ఉన్న బాలపరీక్షిత్తుడు ధర్మరాజునకు అచ్చముగా అతని జనకుని విధంగా కనిపించాడు. పద్మవ్యూహాన్ని పన్ని అన్యాయంగా ద్రోణుడు అభిమన్యు వధకు కారకుడైన సందర్భంలోనూ అభిమన్యుని పరాక్రమాన్ని వర్ణించునప్పుడు కలిని పరీక్షిత్తుడు ప్రారద్రోలిన సందర్భంలోనూ యుద్ధవర్ణనను రేఖామాత్రంగా చేశారు. ధర్మరాజు పరీక్షిత్తునకు రాజనీతిని బోధించే సందర్భంలో ''నయవిరచన'' అనే వర్ణనను సాధించారు. ఈ విధంగా అవధానిగారు ఇతివృత్తంలో అవకాశం ఉన్న సందర్భంలోనే కాక కొన్ని సందర్భాలలో అవకాశాన్ని

కల్పించుకొని కూడా రసానుగుణంగా వర్ణనలు చేసి ధర్మవీర ప్రధానంగా, శృంగారాదిరస పోషణ చేసి కావ్యాన్ని ఉత్తమ కావ్యంగా రూపుదిద్దారు. ధర్మవీరం ప్రధాన రసంగా రచించపబడిన ఈ కావ్యంలో ఆదిమధ్యాంతాలలో రసపోషణ చేయబడింది.

ఉద్ధవుడు శ్రీకృష్ణుని వియోగానంతరం పొందిన బాధను ధర్మదేవతను రక్షింపుమని మునులు వేడుకొనిన సందర్భాన్ని ధర్మదేవతను కలి పురుషుడు నేలబడవేసి తన్నిన సందర్భాన్ని కూడా అవధానిగారు కరుణ రసాత్మకంగా వర్ణించారు. కలి పురుషునిపై పరీక్షిత్తు కత్తిదూసిన దృశ్యాన్ని వీర రసాత్మకంగా చిత్రించారు. కలి శరణువేడగ మన్నించిన సందర్భాన్ని శాంతరసాత్మకంగా రచించారు.

ధర్మరాజు, ఉద్ధవుడు, ధర్మదేవత, పరీక్షిత్తుల పాత్రలను ఉదాత్తంగా చిత్రించారు అవధానిగారు. కలి పురుషుని పాత్రలో ప్రతి నాయకునికి ఉండవలసిన దుష్టగుణాలన్నీ వర్ణించారు. దుర్మార్గులు అప్పుడప్పుడు విజృంభిస్తుంటారు. కలి పురుషునిలా, అయితే భగవంతుడు ఏదో రూపంలో వారి ఆగడాలను అరికట్టి దుష్ట శిక్షణ ధర్మరక్షణ చేస్తూ వుంటాడు. ధర్మాన్ని అధర్మం శరణు వేడక తప్పదు అనే నగ్నసత్యాన్ని ఉపదేశంగా ఈ కావ్య ప్రయోజనంగా కూడా కలి పరాజయ కావ్యాన్ని రచించారు.

## కావ్యము - సామాజిక స్పృహ

ప్రఖ్యాతమైన వస్తువును ఇతివృత్తంగా తీసుకొని అవధానిగారు సమకాలీన సాంఘిక, సారస్వత, రాజకీయ విషయాలు ప్రతిబింబించునట్లు ఈ కావ్య రచన చేశారు. ఈ కావ్యం 1971లో రచింపబడి 72లో ప్రచురింపబడింది. అప్పుడు దివాకర్లవారు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖాధ్యక్షులుగా ఉన్నారు. తన ఉపన్యాసాలతో రచనలతో సారస్వత సేవ చేస్తున్నారు. ఆదర్శ అధ్యాపకుడు విద్యార్థులకు పాఠాలు బోధిస్తూ విశ్వవిద్యాలయంలో విద్యార్థుల ప్రవర్తనాదులను ప్రత్యక్షంగా చూస్తున్నారు. ప్రజానాయకుల విషయాలను కూడా గమనిస్తున్నారు. సమాజంలో ప్రబలుతున్న స్వార్థచింతన, హింస, అవినీతి మొదలైన వాటిని గురించి మధనపడుతున్నారు. ఈ విషయాలు ఈ కావ్యంలో అక్కడక్కడ ప్రతిబింబించాయి.

''పరహింసా పరదార విత్తహరణ ప్రారంభ శౌండీర్య మే
పర మంబైన మృతమ్ముగాగ ని క సంభావింప రే? భూజనుల్
నర కుల్, ఛైద్యులు, గంసులున్ మరి మహీనాథాంకముల్ దాల్చియు
ద్ధరతన్ బ్రజ్వలదగ్ని వర్షముల దోర్ద్త్క్షోభ గల్గింపరే?''[28]

భూమిలోని జనులు పాలకులు అని ముద్రవేసి కొని నరకాసురునివలె శిశుపాలునివలె,

కంసునివలె, దుర్మార్గులయి పరహింస పరులు ధనాపహరణ వంటి విషయాలే ముతాలుగా పెట్టుకొని ప్రవర్తిస్తారు. అని వర్తమానకాలంలోని వాస్తవాలను అవధానిగారు ఈ పద్యంలో చెప్పినారు. ఇది శ్రీకృష్ణుని మంత్రి ఉద్ధవుని స్వగతంగా చెప్పినారు - ఇట్లే -

''అర్థకామ పరాయణమ్మయి సమస్త
జగము పెడత్రోవలంబట్లు, సాధుమార్గ
మపహసింపంగబడును సభాంతరముల
క్షుల్లక జనమ్ము ప్రాభవ శోభనందు''
''ఎవడధికారదండము వహించునో? యెవ్వడు దోర్మలాఢ్యుడో
ద్రవిణ సమగ్రుడెవ్వడో నతండె మహాత్ముడు లోకదృష్టితో
న విరళ భక్తిమీర గొనియాడుదురాతని వర్తనంబె ధ
ర్మమనుచు నెల్లవారు శ్రుతులున్ స్మృతులన్నియు వ్యర్థమైచనన్'' [29]

ఇవికూడా ఉద్ధవుని నోట చెప్పించిన మాటలే - అర్థ కామములు ప్రధానంగా భావించి చెడుమార్గంలో సమస్త జగము నడుస్తుంది. మంచి మార్గం పరహాసం పాలవుతుంది. ఏ మార్గాన నయితే ఏమి ఎవడైతేనేమి అధికారంలోకి వచ్చినవాడే మహాత్ముడు ఈ లోకం అతనినే పొగడును. అతడు నడిచిన మార్గమే ధర్మము వేదాలు ఉపనిషత్తులు నిష్ప్రయోజన మగుచున్నవని - అవధానిగారు తన ఆవేదనను కవితాత్మకంగా వెల్లడించారు. ఇది ఒక వర్తమాన సమాజచిత్రం.

''వేదములు జదివించెడి వేళ, వీని
జదవగా లాభమేమి మాకొదవునంచు
బ్రశ్నలను వైచి కొందరు బ్రహ్మచారు
లూరకయ పోదురవనీతి యుద్ధతులయి
మనసుల్ లగ్నము చేసి మాకడ బఠింపన్ గోరుచో, వేద శా
స్త్రుని కాయమ్ములు లేనట్లే కురుకులో వ్యన్నేశిమాణిక్య, మో
హన నైవేద్య విలాస గాత్రులయి ద్వార్థ పత్యచార్వాక ద
ర్శనముల్ నేర్పుడటంచు వత్తురు యథేచ్ఛన్ బ్రహ్మచారిబ్రువుల్'' [30]

ఇది విద్యారంగ చరిత్ర చిత్రణ, ఇక్కడే వేదములు అనుచోట పాఠములు అను అర్థం తీసుకొంటే సరిపోతుంది. ఈ చదువులు మమ్ములనేమి ఉద్ధరిస్తున్నాయనే అసంతృప్తి వర్తమానకాలంలో ప్రబలివుంది. ఆ యదార్థాన్నే ఈ పద్యంలో అవధానిగారు స్పృశించారు.

మరికొందరు విద్యార్థులు వీరు ఆకలి తీరిన వారు మరో రకం చదువులు బార్హస్పత్యము - చార్వాకము కావాలని కోరుతారట. ఇదికూడా వాస్తవ ప్రతిబింబమే. ఆధునిక కాలంలో

విద్యారంగం తెరమీద కనిపిస్తున్న దృశ్యమే.

''కూడుంగుడ్డల నీని విద్యలివి మీ కుంభాలవో మంజుల
క్రీడా పేతల మూర్తులీ శిశువులన్ వ్రీడా విహీనాత్ములై
పాడైపోవగా జేయనేటికిని కోపం బేర్పడన్ బారులె
గ్గాడన్ మొండిగ సైపగా వలసెనయ్యా విష్ణురాత ప్రభూ'' [31]

ఇది విద్యావిధానంపై విసిరిన మరో చణకు. చదువులు ఉపాధి కల్పనకు ఉపయోగం లేదే అను ఆవేదనయే కవితా రూపం దాల్చిన విధానం. వాత్స్యాయన కూచి మారకృతము కామశాస్త్రాలను గురువుల యెదుట బిగ్గరగా వ్యాఖ్యానింప బూనుకొను విద్యార్థులు కొందరట.

ధర్మరాజు పరీక్షిత్తునకు రాజనీతిని చెప్పే సందర్భంలో అవధానిగారు పాలకుల కుండవలసిన గుణాలను సరళంగా మానవ శ్రేయోభిలాషణీయంగా సర్వకాలాలకు పనికివచ్చే విధంగా ఉల్లేఖించారు.

''మణిమయ కిరీట ధారణ మాత్రనొకడు
రాజగునె పాలిత ప్రచారంబనమున
రాజగును గాక! యట్టి భూరమణుడెప్పుడు
భోగలంపటుడై మూఢబుద్ధి కాడు
ధర్మరక్షణ తత్పరత్వమువగాక
ప్రాజ్ఞుడెవ్వడాశించు నారకని పాత
హేతువైన రాచరికమ్ము, నెవడు రోయ
డంబు బింబిత శిశిచపలంబు బ్రతుకు.
మమతా బంధ విముక్తి స్వార్థతమమున్ మా యించి, న్యాయైకల
గ్నముగావించి మనస్సు దుష్ట జనశిక్షాదక్షతన్ ఓ
దము గాలించుచు లేశమేనియు నహంతం జెంతరానీని భూ
రమణుండేమిటు దక్కువారయ మునీంద్ర శ్రేణికిన్ మన్మడా'' [32]

కిరీటం పెట్టుకోగానే రాజైపోడు. ప్రజారంజకంగా పాలించగలిగినప్పుడు మాత్రం రాజగును. పాలకులెప్పుడు భోగలాలసులు కారాదు. ధర్మరక్షణకై, తెలిసినవాడు అధికారమును చేపట్టును. లేకుంటే రాజరికము నరకప్రాయమగును. స్వార్థమనే చీకటిని పారద్రోలి న్యాయంమ్మీద మనస్సును లగ్నం చేసి దుష్టజనులను శిక్షించేటట్లు సాధుజనులకు సంతోషాన్ని కలగజేయు రాజు ఋషితో సమానుడు అని ఇంకా ఎన్నో అమూల్యమైన

ఆచరణీయములయిన రాజధర్మాలను అవధానిగారు ఈ కావ్యంలో ప్రబోధించారు. పద్యరచనా విధానం ప్రశస్తంగా ఉన్నది. ప్రాచీన సాహిత్యంలో నిర్వచన కృతుల సంఖ్య తక్కువ, తిక్కన నిర్వచనోత్తర రామాయాణము వంటివి కొన్ని మాత్రమున్నాయి. అవధానిగారు రాసిన పద్యకృతులన్నీ నిర్వచన కృతులుగా రాశారు. ఆయన సరసము, ఆడంబర రహితము, సుందరము, సరళము అయిన శైలిలో పద్యకావ్యాలు రచించారు. సాహితీ విలువలుగల సలక్షణ కావ్యాలుగా వీటిని పరిగణింపవచ్చు. ఆధునిక యుగంలో పద్యప్రక్రియలో రచనలు చేసేవారి సంఖ్య తగ్గిపోయింది. వచనం విశ్వరూపం దాల్చింది. పద్యం గ్రీష్మ రుతువులో నదివలె సన్నబడిపోయింది. పద్యకవిత రాసే వాళ్లలో సలక్షణంగా రాసేవారి సంఖ్య మరీ తక్కువ. అటువంటి ఈ పరిస్థితుల్లో అవధానిగారి పద్యకృతులు ఒక విశిష్ట స్థానం పొందే అర్హత కలిగివున్నాయని చెప్పవచ్చు. ఎందుచేతనో కానీ అవధానిగారి పద్యకృతులు పేటికాంతర్గత మణులవలె ఉన్నాయి.

ఆయన గొప్ప పండితుడై కూడా సమాసాడంబరమును ప్రదర్శించిన సందర్భాలు చాలా తక్కువ. కృత్రిమమైన అలంకారాలకై ప్రాకులాడుట అరుదు. వ్యర్థ పద ప్రయోగం కనిపించదు. అర్థవంతంగా, నిర్దుష్టమైన రచనా విధానం అవధానిగారి పద్యకృతుల్లో దర్శనమిస్తుంది.

## 4. త్రింశతి

దివాకర్ల వేంకటావధానిగారు అప్పుడప్పుడు పత్రికలలో ప్రచురింపబడిన తన రచనలను అనగా ముప్పయి పద్యకృతులను త్రింశతి పేరుతో ఖండకావ్యంగా 1972వ సంవత్సరంలో ప్రచురించారు. ఈ కావ్య ప్రచురణకు కారణభూతులు అష్టావధాని శ్రీ భూతపురి సుబ్రహ్మణ్యశర్మగారు. ఈ కావ్యంలోని ఖండకృతులను ఐదు భాగాలుగా విభజించవచ్చు. ఈ కావ్యాన్ని శ్రీ వసుమతీ రామిరెడ్డి దంపతులకు అంకితం చేశారు. వారిమీద అవధానిగారికి గల ప్రీతి వాత్సల్యాలకు చిహ్నంగా అంకితమిచ్చారు. వారు హైదరాబాద్ నివాసులు.

''నేనప్పుడప్పుడాయా పత్రికలలో బ్రకటించిన పద్యకృతులు సుమారొక నూరున్నవి. వానిలో ముప్పది కృతులనెన్ని ఈ త్రిశంతిగా బ్రకటించుచున్నాను. వీనిలో గొన్ని భక్తి సంబంధులు, కొన్ని హిందువుల పండుగలకు సంబంధించినవి. కొన్ని దేశనాయకులకును గవులకును సంబంధించినవి. కొన్ని ప్రాసంగిక భావములకు సంబంధించినవి. మిగిలిన ఖండకృతులను కూడా కొలది కాలములోనే రెండవ భాగముగా ముద్రించునుద్దేశము కలదు.

''ఈ త్రింశతి నిట్లు ప్రకటించుటకు గారణభూతులు అష్టావధాని శ్రీ భూతపురి సుబ్రహ్మణ్యశర్మగారు. వీరికి నాయెడ అవ్యాజమైన మైత్రి'' [33]

ఈ త్రింశతిలోని ఖండికలను అవధానిగారు కావ్యకుసుమాలనీ, ఖండకృతులనీ పేర్కొన్నారు. అనుశీలిస్తే ఇది యదార్థమని తెలుస్తుంది. ఖండకృతుల లక్షణాలు కావ్యకుసుమాల గౌరవం కలిగి వున్నాయి. అవధానిగారు భక్తిని, సంప్రదాయాన్ని, సంస్కృతిని, గొప్ప నాయకులను, సత్కవులను గౌరవించే స్వభావం కలవారు. ఈ సమాజాన్ని భగవంతుడు, సత్సంప్రదాయాలు సత్సంస్కృతి, ధర్మము, సత్యము, కొందరు మహానుభావులు రక్షిస్తారనే నమ్మకం కలవారు ఆజన్మాంతం ఆ విశ్వాసంతోనే వారు జీవనాన్ని గడిపారు. ఈ నమ్మకాలే ఈ కవితా ఖండికలలో అంతఃస్సూత్రంగా దర్శనమిస్తాయి. ఆయా విషయాలమీద అవధానిగారికి గల భావాలకు ఈ ఖండికలు ప్రతీకలుగా కనిపిస్తాయి. శుభకామన ఉపదేశము, పద్యరచనా ప్రావీణ్యము ప్రతి ఖండికలోనూ దర్శనమిస్తాయి.

ఈ కావ్యంలో భక్తికి సంబంధించిన కవితా ఖండికలుగా 1. స్వాగతము, 2. లలితాస్తోత్రము 3. భగవానువాచ 4. శబరి 5. ఆవాహనము 6. విష్ణురాజా అను వానిని గ్రహింపవచ్చు.

ఈ శీర్షికలను బట్టి తెలుస్తుంది ఒక్కొక్క సందర్భంలో ఒక్కొక్కటి వ్రాయబడినవని. అవధానిగారు పుట్టపర్తి సాయిబాబాగారికి భక్తుడు. ఆయనను భగవదాంశిక సంభూతుడుగా భావించేవారు. శ్రీ సత్యసాయిబాబాగారు హైదరాబాద్‌కు వచ్చిన సందర్భంలో ఆయనకు స్వాగతం పలుకుతూ రాసిన పద్యాలే స్వాగతమనే ఖండికలోనివి. శ్రీ సాయిబాబాగారు ఆగమాంత మధురామృత మొల్కు పయోధరమూర్తి అనీ, అచ్చమైన హాసనవచంద్రికా మూర్తి అనీ, ఆర్యధర్మ సువువాసన లిచ్చు వసంతమూర్తి అనీ, ఆశ్రితులను తరింపజేయుటకై జన్మించిన బ్రహ్మమూర్తి అనీ కీర్తిస్తూ స్వాగతము పలికారు. బాబాగారిని సాయిశ్వరా! అని సంబోధించారు. తన కవితా స్ఫూర్తిని, బాబాగారి మూర్తిని ఇలా చిత్రించారు.

> ''వదనాంభోజ వసన్మధువ్రత తతి భ్రాంతి ప్రదంబైన యొ
> ప్పిదమౌ కేశ చయమ్ముతో నమరభూ భువన్మోహనాచ్ఛప్రభా
> స్పదమౌ దేహముతో బ్రభాతరవి భాస్వత్ కంచుకాభమ్ముతో
> నె దుటన్ నీవెసగన్ విరూపమని యంద్రేనా పరబ్రహ్మమున్'' [34]

సత్యసాయి బాబాగారి ఆకృతికి ఇది పద్యకవితాకృతి. ఈ విధంగానే ఆయన మాహాత్మ్యాన్ని వర్ణిస్తూ పన్నెండు పద్యాలు చెప్పారు అవధానిగారు ఈ ఖండికలో. బాబాగారి ప్రభావాలు బహుముఖాలు ఖండ ఖండాంతరాలలో ఆయన అఖండ ఖ్యాతి వ్యాపించింది. ఎందరో ఆయనకు దాసులుగా మారిపోయారు. పుట్టపర్తి ఒక పుణ్యక్షేత్రంగా

రూపొందింది. అటువంటి తరుణంలో అవధానిగారు తన కవితోక్తులతో బాబాగారికి స్వాగతం పలికారు. అవధాని ఎదలోనుండి పెల్లుబుకిన భక్తి ప్రపత్తులే ఈ కవితోక్తులు.

**2. లలితాస్తోత్రము** - ఈప్సితార్థాలనిచ్చి కృతార్థులను చేయు దేవత లలితాదేవి. ఆ దేవిని తన కవితా భక్తి సుమాలతో అర్పించిన విధానం ఈ ఖండికలో కనిపిస్తుంది. ''సర్వ సౌభాగ్యదాయిని అయిన లలితాదేవి పాదపద్మములకు బ్రహ్మాది దేవతలు కూడా మ్రొక్కెదరు. ఆమె పాదపంకజములకు మ్రొక్కెడి వారికి సర్వవిద్యా వైదగ్ధ్యము, వాక్పటుత్వము, సర్వసౌభాగ్యాలు కలుగును. నీ దయ నాపై ప్రసరింపజేయుము. నేను నీకు మ్రొక్కెదను'' అని అవధానిగారు లలితమైన పదాలతో అక్కడక్కడ దీర్ఘ సమాసాలతో లలితాదేవిని స్తుతించారు.

**3. భగవానువాచ** - కురుపాండవ యుద్ధారంభంలో అర్జునుడు యుద్ధ విముఖతను వ్యక్తం చేసిన సందర్భంలో పార్థసారథి ఆయిన శ్రీకృష్ణుడర్జునుని యుద్ధోన్ముఖుని చేయుట కోసం చేసిన ప్రబోధమే ఈ కవితా ఖండిక. ఇందులో ఐదు పద్యాలున్నాయి.

భగవానుడైన శ్రీకృష్ణుడు భగవద్గీతను అర్జుననకు భారత యుద్ధారంభంలో బోధిస్తాడు. ఆ భగవద్గీతకు ఉపోద్ఘాతం లాంటిదే ఈ భగవానువాచ అను ఖండిక.

భరతాన్వయసాగర పూర్ణచంద్రమా పరికీర్ణ లోరుజ్జ్వల హరిన్మథ్యమా! అని శ్రీకృష్ణుడు అర్జునుని సంబోధించి ఈ కౌరవులు దుర్మార్గులు, వీరిని వధించుట పుణ్యమే కాని పాపం కాదు. ధర్మమే కానీ అధర్మం కాదు. వీరు బంధువులే అయినా వీరు చేసిన పనులు మంచివి కావు. ఎవరు చేసిన కర్మ ఫలమును వారనుభవించవలయును. మనము నిమిత్తమాత్రులము అను విషయము ఇందలి సారాంశం. సారాంశం కంటే ఇందులో చెప్పుకోదగిన అంశమేమీ లేదు.

**4. ఆవాహనము** - ఈ ఖండికలో సరస్వతీదేవిని ఆవాహనం చేస్తూ పదిహేను పద్యాలు చెప్పారు. విశ్వవిద్యాలయాలలో విద్యార్థుల మనస్తత్వాలను విద్యావిధానాలను ప్రతిబింబించే విధంగా ఈ ఖండిక ఉంది. వర్తమాన కాలంలోని విద్యార్థుల ప్రవర్తనకు ఆవేదన చెంది ఈ ఖండిక రాసినట్లు కనిపిస్తుంది. రావమ్మావాణీ గిరాందేవీ నీ శరీరకాంతులు దిసెలునిండగ హంసవాహనమెక్కి భక్తులకు కన్నుల పండవచేయగరమ్మ విశ్వవిద్యాలయాలలో ప్రాచీన సంస్కృతిని సాంప్రదాయాలను నెలకొల్పుము. నీ దయవలన అమాయకుడైన వాల్మీకి ఆదికవి అయినాడు. బ్రహ్మదీర్ఘాయువును, విష్ణువు వైభవాన్ని శంకరుడు ఐశ్వర్యాన్ని, లక్ష్మి సంపదను, గౌరి శుభాలను కలుగజేస్తారు. కానీ ఎవ్వరేమిచ్చినా అవి బాహ్యవైభవాలే అంతర ప్రభను కలిగించే శక్తి నీకే కలదు. నీవు జ్ఞాన ప్రదాయినివి. నీవు వేదవాఙ్మయంలో పుట్టావు. నీవు సంచరించి యెదిగిన ప్రదేశాలు పురాణాలు నీవు విహారమునకు వెళ్ళు ప్రదేశాలు

కాళిదాసాది కావ్యోదాననాలు. అఖిల భాషా సాహిత్యాలు నీకాటపట్టయినవి. నాటనన్నిటిని వదలి రవ్వంతసేపు వచ్చి భక్తులను కాపాడుము అని ఖండిక సారాంశం.

''నిలయంబుల్ కద నీకు బద్మభవుతన్వీ విశ్వవిద్యాలయా
వళి యెల్లన్ భవదాధిపత్యమున శశ్వత్ జ్ఞాన యజ్ఞంబు వ
ర్ధిలునందన్ మతి మద్విపశ్చితులు భాత్వవ్రాతమై యెప్పుద
త్పల జాతంబెజగత్రయంబునకు సంధానించుగల్యాణముల్.
కనిపింతు వేదవాఙ్మయ విభాగములందునారాధ్యయైన ముత్తైదువట్లు
అగుపింతు దృశ్యకావ్య ప్రబంధములందు రసవిలాసార్ద్రయౌరమణిభంగి
గోచరింతాంగ్ల ప్రతీచీవచో వీధివ్యవహారవేత్రియా యువతిమాడ్కి
చూపట్టుదువుచైనజాపాన భాషలజిత్ర వేషోత్కయౌచలువ పోల్కి
కాని పింతాంధ్రవాఙ్మయోద్యానమందు
కలమధురవాణియా కలకంఠిపగది
నేశుభాకృతిదాల్చిన నేమితల్లి
సరసవాగ్వృత్తిపారవశ్యాను ఘటింప'' [35]

అని అవధానిగారు విశ్వవిద్యాలయాల్లో తాను దర్శించిన సరస్వతీదేవిని వర్ణించారు. ఇంకా అవధానిగారు సరస్వతీదేవిని తల్లీ నీ కృపచేత భారతదేశం ఒకప్పుడు శేముషీప్రభాస్థావరమై వెలిగింది. నేడు ఆ వైభవాన్ని కోల్పోయింది. ఒకప్పుడు నిన్ను జ్ఞానం కోసం ఉపాసించేవారు. ఇప్పుడు సంపద కోసం ఉపాసిస్తున్నారు. భారతదేశానికి రాజకీయ స్వాతంత్ర్యం మాత్రం వచ్చింది. మానసిక దారిద్ర్యం పోలేదు. నీవు వచ్చి ఈ పరిస్థితులను తొలగించుము అని ఈ ఖండికలో ఆవాహనము చేశారు.

**5. శబరి:** రామాయణంలో శబరి పాత్ర ఒక విచిత్రమైనది. ఆమె భక్తి పవిత్రమైనది. తెలుగులో రామాయణాలు అసంఖ్యాకముగా వచ్చాయి. ఆ రామాయణాల్లో శబరి పాత్రను కూడా రకరకాలుగా చిత్రించినారు. అవధానిగారు శబరి అను ఈ కవితాఖండికపై విశ్వనాథ సత్యనారాయణగారి రామాయణ కల్పవృక్షంలోని శబరి పాత్ర ప్రభావం గోచరిస్తుంది. విశ్వనాథవారు శబరి పాత్రను ఒక వినూత్న దృక్పథంలో సృజయించారు. అవధానిగారు విశ్వనాథవారికి శిష్యులు. కనుకనే విశ్వనాథ సత్యనారాయణగారి రామాయణ కల్పవృక్షంలోని శబరి పాత్ర ప్రభావం ఈ ఖండికపై ఉండుటలో వింతకాదు.

విశ్వనాథవారి శబరి, శ్రీరాముని చూసి నిన్ను చూసిన నాకు ఆకాశమును, సముద్రమును, వనములను చూసినట్లయినదంటుంది. రాముడు విశ్వరూపుడు అనే ధ్వని ఇక్కడి శబరి మాటల్లో వినిపిస్తుంది. అవధానిగారు కూడా రాముని రాకకై ప్రకృతి పరవశించినట్లు

రాముని శబరి భూపతితాకాశ శకలములాగా బృందారకాధీశరత్నములాగా, వనదేవతా నీలవేణిలాగా ఊహించినట్లు చిత్రించారు. నా మదనమోహన మూర్తి అని అవధానిగారి శబరి భావిస్తుంది. విశ్వనాథవారి శబరి కూడా రాముడ్ని ప్రాణనాథ అని సంబోధిస్తుంది. మధుర భక్తి ఇద్దరి శబరి పాత్రలలో సాక్షాత్కరిస్తుంది. రామాయణ కల్పవృక్షం ప్రభావం ఈ సందర్భంలో కనిపిస్తుంది.

6. విఘ్నరాజా : ఈ ఖండిక కొంత హాస్యరస్ఫోరకంగా అవధానిగారు రచించారు. భూనాదులను కీర్తిస్తే భూమినిస్తారు. విద్యానాథులను కొనియాడితే విద్యనిస్తారు. లక్ష్మీనాధుని కొనియాడితే ధనమిస్తారు. మరి విఘ్ననాయకుడవైన నిన్ను ప్రార్థిస్తే నీవేమిస్తావో అని భయము కలుగుతుంది అనీ అందరూ నిన్ను మొదట పూజిస్తారు కదా! మరి నీకు ''వెనకయ్య'' అనే పేరెందుకొచ్చింది? కుడుములు, లడ్డులు, గొంతుదాకా తినగ నీ కడుపు ముందుకొచ్చినది. దానిని చూసి చంద్రుడు నవ్వగా పార్వతీదేవి శపించింది. ఇది న్యాయమా! నీవు అంత అధికంగా తినవచ్చునా? వికృతమైన కడుపును చూస్తే ఎవరికి నవ్వురాదు? శివుడు నీ తలనరకగా ఏనుగు తలపెట్టినారు. ఆ తలపెట్టకముందు పిండితో చేసిన నీరూపమెంత సుందరమయినదో కదా? విఘ్నములను దుర్మార్గులు చేయు చెడు పనులకు కల్గించాలిగానీ, మంచి పనులను చెడగొట్టవచ్చునా, నీ శక్తి సామర్థ్యాలను దుష్టశిక్షణ శిష్టరక్షణకుపయోగించు. నీతో కొంత చనువుండుట చేత నేను నీకీ మనవి చేసితిని. అని ఒక విన్నపాన్ని నివేదించారు.

## పండుగలకు సంబంధించినవి:

1. ప్లవంగాబ్దమా 2. దసరా 3. దీపావళి 4. సంక్రాంతి 5. శివరాత్రి 6. త్రివర్ణపతాకము అనే శీర్షికలను ఈ విభాగంలో చేర్చవచ్చు.

**1. ప్లవంగాబ్దమా :** ప్లవంగనామ సంవత్సరం వచ్చినప్పుడు (1968) రాసిన పద్యకవితా ఖండికయే ప్లవంగాబ్దము, ప్లవంగనామసంవత్సరం 1968లో వచ్చింది. గతించిన పరాభవ నామ సంవత్సరం పేరు చూసి చాలా భయపడినాము. దేవుని దయవల్ల యేకీడు కలిగించకయే వెళ్లినది. పుణ్యాత్ముడవు నీవు వచ్చినావు, సూర్యుడు చీకట్లను పారద్రోలినట్లు మా భయాలను దుఃఖాలను పోగొట్టుము అని అర్థించారు. ఇంకా జరిగిన ఎన్నికలలో జనులు గుడ్డెద్దులు కాదని మంచిని గెలిపించి చెడును ఓడించారని కూడా ఒక పద్యంలో అవధానిగారు పేర్కొన్నారు. అనగా ఎన్నికలు జరిగినప్పుడే ఈ ప్లవంగ నామ సంవత్సరం వచ్చినదని తెలియుచున్నది. భారత సతీచారిత్రవల్లి పాతివ్రత్యపుల్లసుమము భారతీయ పురౌన్నత్యపాదపము వాడినదేగాని ప్రాణాలు గోల్పోలేదు. దానిని పల్లవింపజేయమని ప్లవంగాబ్దిని ప్రార్థించారు అవధానిగారు. ఇంకా వసంత కోకిలలు గానాలు చలి భరించలేక

జనులు శిశిరంలో ఉష్ణతాకలిత సతీకుచాశ్రయ సుఖంబునకు ఉవ్విళ్ళూరుట మొదలైన అంశాలను రసోచితంగా వర్ణించారు.

**2. దసరా** : ఇందులో 11 పద్యాలున్నాయి. కవులు పండుగల సందర్భంలో కవితలల్లడం ఆర్యాచీనం. ప్రాచీన కవులు కథాగతి సందర్భాలలో ఋతువర్ణనలు పండుగల వర్ణనలు చేశారు. కానీ పండుగలు వచ్చినప్పుడు ప్రత్యేకంగా రాయలేదు. ఆధునిక కవులు కూడా సంక్రాంతి, దీపావళి పండుగలను గురించి రాసిన వారనేకులున్నారు. దసరా పండుగను గురించి రాసినవారు తక్కువ. ప్రత్యేకంగా పండుగలను గురించి రాసే కవితా ఖండికలలో సమకాలీన సమాజంలోని స్థితిగతులు, పండుగయొక్క ప్రశస్తి ప్రాముఖ్యం వర్ణింపబడుతాయి. ఎవరి అభిరుచిని బట్టి వారు వర్ణిస్తారు. అవధానిగారు సంప్రదాయాభిమాని, వేద సంస్కృతిని ఉద్ధరించాలనే దీక్ష గలవారు. ఆయన సాధారణంగా పండుగ ప్రశస్తిని ముందుగా వర్ణించి తరువాత దేశస్థితిగతులను చెప్పి ఆ తరువాత దుష్టశిక్షణ శిష్టరక్షణ చేయుమని అర్థించడం అన్ని ఖండికల్లోనూ కనిపిస్తుంది.

దసరా పండుగకు స్వాగతం చెప్పి అవధానిగారు శరదృతువుతో కలిసి వచ్చెడి శ్యామలాంబా! సుఖములు కలుగజేయరమ్మ. ఒక సంవత్సరం అతివృష్టితో మరొకసారి అనావృష్టితో మరొకసారి మాయదారి రోగాలతో మాకు కష్టనష్టాలు కలుగుచున్నవి. లోకంలో సుఖసంపదలు కావలయునన్న పురుష ప్రయత్నానికి దైవసహాయం తోడు కావలయును. దైవ సహాయాన్ని నీవు సమకూర్చి కాపాడుము. శుంభనిశుంభులను దునిమి దేవతలను కాపాడిన నీవు లోకంలోని దుర్మార్గులను దునిమి శాంతిని కలుగజేయుము. నీ కరుణ చేతనే గదా అర్జునుడు ఒక్కడే కురువీరులను జయించాడు. రావణవధలో రామునికి నీవు తోడ్పడినావు. నీ తేజమఖండమైనది, మహిషాసురుని, చండముండాది రాక్షసులను నీవ చండాడినావు. భారతమాత పెంపునకు నీవు మూలకారణమై దౌర్జన్యపరులను, హింసాపరులను అణచి కాపాడుము. అని దసరా పండుగ సందర్భంగా కాళికాదేవిని అవధానిగారు అర్థించారు.

**3. దీపావళి** : ఇందులో పది పద్యాలున్నాయి. దీపావళిని గురించి ఆధునిక కవులనేకులు కవితలల్లినారు. చాలామంది దీపావళి ప్రగతికి చిహ్నమనీ, దీపం జ్ఞానానికి ప్రతీక అనీ వర్ణించారు. అవధానిగారు కూడా, అమ్మా దీపావళీ చీకట్లను తొలగించి వెలుగును ప్రసాదించుము, ఇందులో చీకట్లు అంటే అరాచకాలు అన్యాయాలని ధ్వని, వెలుగు అంటే ధర్మం, న్యాయం అని సంకేతం, బాహిరమైన చీకట్లను తొలగించుటకై విద్యుద్దీపాలున్నాయి. నీవు మా అంతరంగాలలోని చీకట్లను అజ్ఞానాన్ని తొలగించుము, కన్నులు లేనివారికి కలిగే చీకట్లు వేరు. కన్నులుండీ కూడా ఈర్ష్య, అసూయాద్వేషాలను చీకట్లు ఆకర్షిస్తున్నవి.

నీటికి మందూమాకు పనికిరావు. ఆత్మావలోకనము కలుగజేసి ఈ చీకట్లను తొలగించుము అని అర్థిస్తూ, ఇంకా

''ఉరురణవహ్నిలో గుములు చుండుట జేసియ శాంతిధూమముల్
తరచుగ గ్రమ్ముచున్న యవి; ధారుణి సర్వ దిగంతరమ్ములన్
దరకరమైన తక్తమమునన్సుభమార్గముగాంచ లేక త
త్తరపడు మానవాళి విశదంబగు వెల్గిడి యుద్ధరింపవే'' [36]

అని కోరుతూ మాకు అండగా ఉండి కాపాడుతావని మా ప్రాపంచికావస్థలను చెప్పితిని. మమ్ము కాపాడు సమయమాసన్నమైనది. ఇవే నీకు జోహార్లు అని దీపావళికి జోహార్ల ర్పించినారు.

**4. సంక్రాంతి :** ఇది 23 పద్యాలున్న ఖండిక. సంక్రాంతి పుష్యమాసంలో వస్తుంది. హేమంతరుతువులో మంచుబిందువులు ముత్యాలువలె మెరుస్తూ వుంటాయి. ఈ పండుగకు పల్లెటూళ్లు పరవశించిపోతాయి. తిరుపతి వేంకటకవులు, పింగళి కాటూరి వంటి జంటకవులు ఇంకా అనేకులు ఆధునికులు సంక్రాంతి పండుగనెంతో రసరమ్యంగా మనోహరంగా వర్ణించారు. అవధానిగారు ప్రకృతిశోభను పండుగ శోభతో మేళవించి వర్ణించుటతో పాటు దేశకాల పరిస్థితులను కూడా ఈ ఖండికలో ప్రతిఫలింపజేశారు. బంతిపూలతోరణములు, దీర్ఘములయిన రంగవల్లులు, గొబ్బిళ్లు, కోడిపందాలు, అల్లుళ్ల సంబరాలు, గంగిరెద్దుల వారి సన్నాయి మేళాలు, సాతాని అయ్యవారి సంకీర్తనలాదిగాగల సంక్రాంతి దృశ్యాలను కన్నుల ఎదుట సాక్షాత్కరించునట్లు వర్ణించారు. మరియు సంక్రాంతిని ''కృపా పారీణదుర్భావభేద విరోధంబులడంచి యాంధ్రులకు మధ్య దృద్ధిచేకూర్చవే'' అనీ, ''ఉదితద్వేషకృశాను హేతితతి యెట్లో కొంత శాంతించె సమ్మదమే పారె తెలుంగువారి యెదలలో నీరాక వలన శోభ, సామరస్యము కలుగచేసి శాశ్వతమయిన సుఖమును శ్రేయస్సును కలుగజేయుము అని వర్ణించారు. ఇంకా అన్ని ఖండికలలో కోరినట్లే ధర్మాన్ని రక్షించుమనీ, సంప్రదాయాన్ని కాపాడుమని పాతవన్నీ వదిలిపెట్టుటయే అభ్యుదయం కాదనీ కూడా వారు కోరినారు. యుద్ధ ఘోషలనుండి విముక్తి ఎప్పుడు లభించునో? అందరూ శాంతి, అహింస, సర్వసమత్వములను గురించి మాట్లాడేవారే కానీ ఆచరించువారు లేరు. నీవైనా ప్రజల మనస్సులలో ఇవి కలుగజేసి నీ నామ సార్థక్యం చేసికొమ్ము అని అవధానిగారు సంక్రాంతిని అర్థిస్తూ స్వాగతం చెప్పారు.

**5. శివరాత్రి :** ఇందులో పది పద్యాలు మాత్రమే ఉన్నాయి. శివరాత్రి శైవులకే గాక హిందువులకందరికీ గొప్ప పర్వదినం. ఎంతటి ఘోర పాపములు చేసినవారైనా శివరాత్రి

రోజు ఉపవాసం ఉండి రాత్రి జాగరణ చేసి శివుడ్ని ప్రార్థిస్తే ముక్తి పొందుతారనే నమ్మకముంది. కొన్ని పురాణాలలో శివరాత్రి మాహాత్మ్యం వర్ణింపబడింది. శ్రీనాథుని వంటి ప్రాచీన కవులు కూడా శివరాత్రి మాహాత్మ్యాన్ని కావ్యాలుగా రాసినారు. అవధానిగారు పది పద్యాలలో శివరాత్రి పర్వదినాన్ని గురించి చక్కగా విశ్లేషించారు. శివుడు కాలకూటాన్ని మింగిన రోజే శివరాత్రి. ఘోరపాపాలను పోగొట్టు గొప్పతనము ఒక శివరాత్రికే కలదు. చేయరాని పాపాలు చేసిన బోయవాడు, సుకుమారుడు శివరాత్రి గొప్పతనంవల్ల శివసాయుజ్యం పొందారు అని పురాణ కథలను ప్రోదిచేసి చెప్పారు. శివరాత్రినీ మాహాత్మ్యమును చెప్పనెవరితరము అని స్తుతించి మాకు ఆహారాన్ని సమృద్ధిగా ప్రసాదించి సంతోషాన్ని కలుగజేయమని శివరాత్రిని ప్రార్థించుటతో కావ్యం ముగిసింది.

**6.** త్రివర్ణపతాక : ఇందులో 16 పద్యాలున్నాయి.

> ''భారతమాతృదాస్యపదబంధము త్రుంగిననాటి మోదవి
> స్తార పరీమళమ్ములపసల్ ప్రకటించు శుభావహమ్మిద్ధి, త
> స్పోరకమై యదే వెలుగు పూజ్య పతాకము భారతీయ హృ
> న్నీ రధికిందు బింబమయినింగికి గ్రొత్త మెరుంగు దిద్దుచున్'' [37]

అని భారత జాతీయ పతాకమయిన త్రివర్ణపతాకాన్ని ప్రశంసిస్తూ ఈ ఖండికను ప్రారంభించారు. అవధానిగారు ఈ ఖండకావ్య సంకలనంలో గల అన్ని ఖండికల కంటే ''త్రివర్ణ పతాక''లోనే ఎక్కువ పద్యాలున్నాయి. ఇరవై ఏడు పద్యాలలో త్రివర్ణ పతాక ప్రశస్తిని, పవిత్రతను ఉన్నతిని, రూపొందిన పరిణామాన్ని త్రివర్ణాల ఔచితిని ప్రశంసించి అశోకచక్రానికి గల అర్థాన్ని విశ్లేషించి కవితాత్మకంగా వర్ణించారు.

భారతస్వాతంత్ర్య భాగ్యబంధురనౌక నెడరు లేకుండా నడుపు కొనుచు అనీ, అన్యోన్య వైషమ్య మువలడించి యొకంట చరియించు సత్త్వరాజసమో గుణములో! అనీ బలినొంచునపుడు మిన్నునిండగా వడుగు వామనుడెత్తునడుగుతామరసమో, అనీ శాంతిదేవత మత స్వార్థ పూరిత జగతీ చాపల్యమును మింగజూచు జిహ్వాగ్రహమో అనీ త్రివర్ణ పతాకాన్ని ఉపమించారు.

ఈ ఖండికలో భారతదేశ పూర్వరాజుల వైభవాన్ని స్వాతంత్ర్య పోరాటాన్ని కాంగ్రెస్సు స్థాపనను, దేశ నాయకుల త్యాగాలను, స్వాతంత్ర్యం సాధించిన విధానాన్ని భావావేశంతో వర్ణించారు. చిరకాలదాస్యమనే అంధకార నిరాశానిస్పృహలను తొలగించి విమల స్వాతంత్ర్య భానూజ్వలస్థిరకాంతిచ్ఛుట చూరయిచ్చుట కృతార్థీ భూతులంజేయు భాస్య రథధ్మధ్వజమా గ్రహింపుమ భవద్భక్త ప్రణామంబులున్'' అని భక్తుల ప్రమాణాలు

స్వీకరించుమని కావ్య సమాప్తి చేశారు. స్వాతంత్ర్య దిన సందర్భంగా ఈ పద్యాలు రాసినట్లుండుటచేత స్వాతంత్ర్య దినం కూడా గొప్ప పర్వదినం కనుక ఈ ఖండిక పండుగలకు సంబంధించిన విభాగంలో చేర్చబడింది.

## దేశ నాయకులకు సంబంధించినవి :

ఈ విభాగంలో బాపూజీ లాలా లజపతిరాయ్, జవహరు పండితుని నిర్యాణము, యుగంధరుడు, అశ్రుతర్పణము అనే శీర్షికలను చేర్చవచ్చు.

**1. బాపూజీ** - ఎంతో వైలక్ష్యణం గల పది పద్యాల ఖండిక. దీనిలో బాపూజీని వర్ణించిన తీరు ఎంతో వైలక్ష్యంతో కూడి ఉన్నది.

''యోగులకెల్ల యోగియగు నూర్జితుడాహరి వేదసార గీ
తా గురువయ్యు మున్నడపె దారుణ యుద్ధము రాజనీతితో
భూ గత రాజనీతి పరిపూర్ణుడవయ్యును నీవొకరక్త సం
యోగము లేని నూత్నరణమున్నడిపించితి తత్త్వబుద్ధితో'' [38]

గాంధీమహాత్ముని రాజనీతి శ్రీకృష్ణభగవానుని రాజనీతి కంటె గొప్పదని అభివర్ణించి గాంధీ నడిపించినది నూతనరణమని ఇది భగవంతుడు కూడా చేయని పని అని గాంధీపై తనకుగల ఉన్నతభావాన్ని ఉల్లేఖించారు. శత్రువులకు కూడా ప్రియుమైన వాడని, పరమమౌనులకు కూడా సాధ్యంకాని బ్రహ్మచర్యాన్ని అవలంబించిన వ్రతశీలుడనీ, గౌతముని కంటే కూడా అహింసామూర్తి అనీ, కరుణచిందెడి చూపులు కలవాడనీ, బాపుజీని వర్ణించారు.

**2. లాలా లజపతిరాయ్ :** ధైర్యాన్ని త్రికరణశుద్ధిని, పరహితత్వాన్ని, ఆవేశాన్ని, చక్కని ఉపమానాలతో కవితాధారతో ప్రస్తుతించారు అవధానిగారు. దేశంకొరకు ప్రాణాలర్పించి విద్యాలయాలు స్థాపించి ఎన్నో సంస్కరణలు చేసి ఉద్యమాలను నడిపించి పంజాబు కేసరి అని ఖ్యాతిగాంచినాడని లజపతిరాయ్ శతజయంతి సందర్భంగా రాసిన పద్యాలివి.

**3. జవహరు పండితుని నిర్యాణము :** నెహ్రూపైగల ఆదరాభిమానాలను వ్యక్తం చేస్తూ, ఆరదనుకొన్న ఒక దీపం ఆరిపోయింది. రాలదనుకున్న ఒక చుక్క రాలిపోయింది. అని ప్రారంభించి జవహరులాల్ మరణంవల్ల పట్టపగలే చీకట్లు కమ్ముకున్నాయనీ, లోకమంతా విషాదంలో మునిగిపోయిందనీ, తానే దేశమై దేశమే తానై ఎన్నో కష్టాలను ఓర్చుకొని స్వార్థం లేకుండా ధనమును తనువును త్యాగం చేసిన దేశభక్తుడనీ అటువంటి వాడు ఈ దేశాన్ని విడచిపోగా దేశమెంత తపిస్తున్నదోగదా అని కరుణ రసోపేతంగా ఈ

ఖండికను రచించారు. ఈ దేశానికి ప్రధానిపై అక్షరమైన కీర్తినార్జించి పెట్టిన నీవు దివి కరిగినావు ఆ దేశానికంత దేవుడే దిక్కు నీ తల్లీ భారతమాతా! నీ ప్రియపుత్రుడు నిన్ను విడిచి వెళ్లిపోయాడు. నిన్ను ఎట్లు ఓదార్చవలెను. అని ఈ ఖండికలో దేశాన్ని ఆవరించిన దుఃఖం ధ్వనించింది.

**అశ్రుతర్పణం** : జవహర్‌లాల్ తరువాత ప్రధానమంత్రి అయిన లాల్ బహదూర్ శాస్త్రిగారు కొద్దికాలంలోనే గొప్ప ఖ్యాతిని గడించారు. నెహ్రూ పద్దెనిమిది సంవత్సరాలు ప్రధానమంత్రిగా ఉంటే శాస్త్రి సుమారు పద్దెనిమిది నెలలు మాత్రం ప్రధానిగా ఉన్నారు. కానీ ఆ కొంత వ్యవధిలోనే పొట్టివాడైనా గట్టివాడని నిరూపించుకున్నాడు. తాష్కెంటు సంధి 1965లో జరిగినప్పుడు అక్కడే మరణించాడు. శాస్త్రిగారు మరణించినప్పుడుగూడ అవధానిగారు స్పందించి అశ్రుతర్పణం అనే శీర్షికతో ఐదుపద్యాలు రాసినారు. ''నీవు మరణింప జగము కాంతిని దొరంగె దురితగతి శాస్త్రి లాల్బహదూరుశాస్త్రి'' అని ఇంక భారత ప్రజలకెవ్వరు దిక్కు, ధర్మధేనువునకు దాతలెవరు? అని కరుణరసాత్మకంగా కవితాత్మకంగా సందర్భోచితంగా అశ్రుతర్పణం చేశారు.

## కవులకు సంబంధించినవి :

త్రింశతిలో అవధానిగారు ప్రాచీనులైన నన్నయ తిక్కనలగురించి ఆధునికులయిన కందుకూరి వీరేశలింగము విశ్వనాథ సత్యనారాయణలను గురించి కూడా చక్కని పద్యాలు రచించారు.

**నన్నయ్యభట్టు**: ఇది 10 పద్యాల ఖండిక అవధానిగారు ప్రాఙ్నన్నయ యుగంనాటి తెలుగు భాషా తీరుతెన్నులను, నన్నయ కవితా వైభవంలోని సారాన్ని పిండి ద్రాక్షారసంలాగా తెలుగువారి దోసిళ్లలో పోశారు. ఆంధ్రభాషకు ఆదిమ దశలో నన్నయ చేసిన కృషి అనన్యసామాన్యం. దానినే కవితామయంగా ప్రవచించారు. అసంస్కృతము, అనిశ్చిత రూపము, అయిన తెలుగునకు రమ్యాకృతి కలిగించి కర్కశశిలావళిలో రత్నసౌధం నిర్మించావు. గాఢమైన చీకట్లలో వెలుగు కల్పించుట, దుర్గమమైన అడవిలో రాజమార్గం నిర్మించుట ఎంత కష్టమో తొలినాళ్లలో భారతం రాయడం అంతకష్టము, వేద పారంగతుడనైన నీవు భారతం వ్రాయుటకు కంకణం కట్టుకొనుట రాజరాజు నిన్ను ప్రోత్సహించుట ఆంధ్రులు చేసుకొన్న పుణ్యం. ఆంధ్ర కవితాకన్యకు నీ మహనీయ శిక్షణ వలన పుట్టగానే యవ్వనం వచ్చింది. కాసరబీసరగా ఉన్న శబ్దాలను సంస్కరించి కవిత్వం వ్రాయుట నీకే చెల్లినది. తెలుగు కవులు నీవు వేసిన పునాదులపై సుందర మందిరాలను నిర్మించారు అని నన్నయను గురించిన అత్యంత మనోజ్ఞమైన ప్రశంస ఇందులో ఉంది.

**తిక్కన :** ఇందులో 9 పద్యాలున్నాయి. తిక్కనను కూడ ''నీ వాక్కులు వేదాల కంటే వన్నెకెక్కినవి. నలగని వాడని కవితా సుమాలతో మాలగట్టి తెలుగు సరస్వతి కంఠాన అలంకరించావు. నీ కవితాలతాంగి యతికైనా మోహాన్ని కల్గిస్తుంది. కోమలమైన శైలిలో పొల్లుపదాలను వాడకుండా దేశిమార్గంలో నీవు రాసిన కవిత మూలానికే వన్నె తెచ్చింది. యోగసాధన చేసి ఉత్తమ కావ్యసాధన చేసిన నిక్కపుభోగులు ఇప్పటికి ముగ్గురు. పోతన, తిక్కన, త్యాగయ్యలు. ఈ ముగ్గురు ఆంధ్రులపాలిట అమృతమూర్తులు అని తిక్కన కవితాగుణాలు ప్రశంసింపబడినవి. న్యాయానికి నన్నయలో తిక్కనలో కలవని చెప్పెడి గుణాలు అవధానిగారి కవిత్వంలో పుష్కలంగా కనిపిస్తాయి.

**శ్రీ కందుకూరి :** కందుకూరి వీరేశలింగంగారి గురించి గూడ అవధానిగారు చక్కని పద్యాలు రాశారు. ''నీవు పుట్టిన మహనీయము ముహూర్తంవల్ల తెలుగువారికి నవభానూదయమయింది. ఆంధ్ర సరస్వతికి నీవు సునిశిత బుద్ధితో తొడగిని ఆభరణాలు నేడుకూడా వింత సోయగాలతో మెరుస్తున్నాయి. గద్యతిక్కనవైన నీకు బహు నమస్కార శతము చేయుచున్నానని చెప్పారు.

**గురుదక్షిణ 13 పద్యాల ఖండిక -**

విశ్వనాథ సత్యనారాయణగారు అవధానిగారికి ప్రత్యక్ష గురువులు. ఆయన విద్యాభ్యాస సమయంలో ఎంతో సహాయం చేశారు. ఆయన షష్టిపూర్తి సందర్భంగా గురు'దక్షిణ' శీర్షికతో పదకొండు పద్యాలలో తన గురుభక్తిని, విశ్వనాథ వారి కవిత్వ వ్యక్తిత్వాలను ప్రశంసించారు. ఈ పద్యాలు విశ్వనాథ పద్యశైలిని అనుసరించి చెప్పడం గమనార్హం.

> ''భూత భవిష్యదాంధ్ర కవి పుంగవులందరి సత్కవిత్వపున్
> రీతులు తోచు నెవ్వని వరిష్ఠమహాకవితా ప్రబంధమం
> దాతత ధీతిర స్ఫుతబృహస్పతియైన కవీంద్రమౌళి కు
> ద్యోతిత షష్టిపూర్తికిన్ నతుల్ పచరింతుగురుత్వమూర్తికిన్'' [39]

వంటి పద్యాలు దీనికి తార్కాణం. అనర్గళమైన ధారతో అవధానిగారు విశ్వనాథననుకరిస్తూ అక్కడక్కడ కొన్ని పద్యాలు రాయడం మనం గమనింపవచ్చు. గురువు ప్రభావం శిష్యునిపై ఉండటం ఆశ్చర్యం కాదుకదా!

**ప్రాసంగిక భావాలకు సంబంధించినవి :**

ఈ విభాగంలో చైనా దురాక్రమణ, బ్రహ్మచర్యము, జాతీయైక్యము, ప్రణాళికలు, నాగార్జున సాగరము, ఆంధ్రరాష్ట్రము, కవి సమ్మేళనము, చంద్రమా, జరటోపదేశము అనుఖండికలను చేర్చవచ్చు.

కవులు తృణకణ చలనానికే స్పందించి హృదయాలను కదిలించే విధంగా కవిత్వం రాస్తారు. పై విషయాలన్నీ చక్కని కవితా వస్తువులు. అవధానిగారు ఆయా సందర్భాలలో తన ఎదలో కలిగిన స్పందనను కవితా రూపంలో రచించారు. ఈ ఖండకావ్య సంపుటిలో ప్రచురించారు.

భారతదేశాన్ని చైనా దురాక్రమణ చేసినపుపడు రచించిన పద్యాలే ''చైనా దురాక్రమణ'' అనే శీర్షికతో రాయబడిన పద్యాలు ఇందులో 18 పద్యాలున్నాయి. యుద్ధాలు, భూకంపాలు, వరదలు, కరువుకాటకాదులు వచ్చినప్పుడు దేశం, సమాజం విపత్కర పరిస్థితులలో ఉన్నప్పుడు సామాన్య మానవుడు కూడా స్పందిస్తాడు. సమాజ శ్రేయస్సునాశించే సత్కవులు ఆవేదన చెంది తమ వంతు సందేశాన్ని అందిస్తారు. ఆవిధంగా అవధానిగారు అందించిన సందేశమే ఈ పద్య కవితా ఖండిక. ఈ దురాక్రమణను అవధానిగారు ''బడిమొగులు లేక పడుపిట్ట పిడుగు'' అని త్యాగఫలమైన స్వాతంత్ర్య భారతీయులు ఈ చైనా యుద్ధం వలన కోల్పోయినట్టయితే తలెత్తుక తిరుగలేము. విజయమో వీరస్వర్గమో తేలిపోవాలి. విజయం ధర్మమూలం. మనకు తప్పకుండా విజయం కలుగుతుంది. దేశానికి ఆపద వచ్చినప్పుడు త్యాగమే సుఖాన్నిస్తుంది. విధాత మనకు అగచాట్లే రాసిపెట్టినట్లుంది. భేదభావాలను వదిలి దేశ రక్షణకు పూనుకొనండి. చైనావారు తేనెపూసిన కత్తులు, నీతిని రీతిని తప్పిన చైనా కౌరవులు పాండవుల చేతిలో నాశనం పొందినట్లు నాశం కాగలరు. చైనా అత్యధిక జనాభాగల దేశం. దానిని కౌరవ బలంతో పోలిచి చూడటం ఎంతో సమంజసంగా ఉంది. నెహ్రూ కడు సమర్థుడు. పడమటి దేశాలు మనకండగా ఉన్నాయి. దైవం ధర్మం మనకు తప్పకుండా విజయం కలుగజేస్తాయి. అని ప్రబోధించారు. దీనిలో దేశభక్తి ధ్వనిస్తుంది.

**జాతీయైక్యం :** ఇదికూడా చైనా దురాక్రమణకు పూనుకొన్న కాలంలో రాసిన ఖండిక. ఇందులో - ఐకమత్యమే మహాబలమను సూక్తి, దేశభక్తి, అవధానిగారి కవితాశక్తి మేళవింపు కనిపిస్తుంది. ఇందులో 2 పద్యాలున్నాయి.

చిరకాల వాంఛ అయిన స్వాతంత్ర్యాన్ని సాధించుకొని అభ్యుదయపథంలో నడిచే సమయంలో అసూయతో ముష్కరులు భారతదేశంపై దండెత్తి వచ్చినారు. గతంలో అనైక్యంవల్లనే దేశం పరహస్త గతమైంది. అది గుణపాఠంగా సమైక్యతా భావాన్ని పెంపొందించుకొని దేశాన్ని రక్షించాలి. కాశ్మీరంనుండి కన్యాకుమారి దాకా భాషలో వృత్తుల్లో భిన్నత్వం ఉన్నా భావాలలో ఏకత్వాన్ని పెంచుకోవాలి. పూసల్లో దారంలా అన్ని భాషల్లో సంస్కృత పద విన్యాసం అంతఃసూత్రంగా కనిపిస్తుంది. భారతదేశంలోని ఎక్కడ మట్టిని పట్టి చూసినా పరిమళిస్తుంది. సౌరభాన్ని పవిత్రతను వెదజల్లుతుంది. రాష్ట్రాలు

ప్రాంతాలు మతాలు వేరైనా భారతీయత ఒక్కటే అని చక్కని సందేశం ఈ ఖండికలో వుంది.

**ప్రణాళికలు :** 13 పద్యాలున్నాయి.

దేశాభివృద్ధికి దోహదం చేసే ప్రణాళికలు కావాలనీ, స్వాతంత్ర్యానంతరం ఈ ప్రణాళికల వలన ప్రజా వివాగహృదయాలలో మహోత్సవాలు ప్రబలాయి. పేదరికపు చీకటులను పారద్రోలి సంపదల వెలుగులు వ్యాపింపజేసే సూర్యుల సమూహం ఈ ప్రణాళికలు. పల్లెటూళ్లకు విద్యుద్దీపాలు విద్యాలయాలు ఆసుపత్రులు నీరు మొదలైన వసతులు కల్పించేవిగా ఈ ప్రణాళికలుండేవి. సత్ప్రణాళికలే గాంధీ మహాత్ముడు ఆశించిన రామరాజ్యాన్ని తేగలవని ఆకాంక్షించారు అవధానిగారు.

**నాగార్జునసాగరము :** 10 పద్యాలున్నాయి

కృష్ణవేణికి సమస్కృతులతో ప్రారంభించి నాగార్జుని బోధలను, శాతవాహనుల శౌర్యాన్ని, ఇక్ష్వాకుల తేజాన్ని, స్మరించి నాగార్జునసాగరు సౌందర్యాన్ని కమనీయంగా వర్ణించారు.

> ''కాదిది కృష్ణాపగకు మధ్య బంధమ్ము కటిసీమ రత్నమేఖల యేకాని
> కాదిది వట్టిరాకట్టడమ్మాంధ్రుల పాలి బంగారు పర్వతముగాని
> కాదిది జీవైకల్య నిర్మాణము, ముగ్ధకార్మిక శక్తి మూర్తిగాని
> కాదిది వాస్తువిశ్కల్పితా కారము మూర్తిదాల్చిన వారి బుద్ధిగాని'' [40]

**ఆంధ్ర రాష్ట్రము :** ఇందులో 15 పద్యాలున్నాయి.

ఆంధ్ర జనులనే తామరకు సూర్యోదయవలె ఆంధ్ర రాష్ట్రావతరణ జరిగింది. ఇది తెలుగు వారి మనోరథాల పంట. శాతవాహనులు, చాళుక్యులు, రెడ్డిరాజులు, విజయనగర రాజులు వసంత వర్ష శరత్తు, హేమంత ఋతువులయి తెలుగు వనానికి రామణీయకమును చేకూర్చారు. దివిలో బంతులుగా కూర్చొని రాజులు కవులు ఈ శుభ సమయంలో శుభాశీస్సులందిస్తున్నారు. కానీ ఐకమత్యం లేక వినాశ మార్గంలో పయనిస్తే ప్రక్కవారు మనలను చూసి పకపక నవ్విపోతారు. సోదరుల ప్రాణత్యాగంతో సిద్ధించిన ఈ రాష్ట్రాన్ని విభేదాలు వదలి అభివృద్ధికి పాటుపడాలి. అనే సందేశాన్ని తెలుగువారికి అందించారు.

**కవి సమ్మేళనము :** 11 పద్యాల ఖండిక

కవి సమ్మేళనానికి అధ్యక్షత వహించినప్పుడు రాసిన పద్యాలు. ముందు వరసలో ఆసీను లయిన సభ్యులకు నమస్కృతులు చేసి కవి సమ్మేళనంలో పాల్గొను కవులు ఎలాంటి

కవిత్వాన్ని వినిపిస్తారో కవితాత్మకంగా వివరించారు. కవి సమ్మేళనాలలో ఎలాంటి కవిత్వాన్ని వినిపించాలో కూడా దీనిద్వారా తెలుగు కవులకొక సందేశాన్నందించారు. కవులు మంజులవాగ్విలాసామృతులు, రసవేణులయి షడ్రసాంచితమైన విందులో నవరసాల యామెతలతో, ఆరు ఋతువులను సాక్షాత్కరింపజేయాలి. రసాలంకార సత్ఫలాలను అందించాలి. కావ్య రసాస్వాదనను అందించాలని కవులకొక చురక నంటించారీ ఖండికలో అవధానిగారు.

బ్రహ్మచర్యము : 5 పద్యాల ఖండిక

మానవులు ఏయే ప్రాయాలలో ఏయే నియమాలు పాటించాలో అవి ఆచరించకపోతే శక్తి నశిస్తుంది. బ్రహ్మచర్యంవల్ల శ్రీశుకుడు, భీష్ముడు మొదలయిన వారు ఘనత గాంచినారు. హృదయ కమలాన్ని వికసింపజేయుటకు విద్యా ధారణాశక్తకి ఇంద్రియ నిగ్రహములకు బ్రహ్మచర్యానికి మించినది మరొకటి లేదు అని బ్రహ్మచర్య ప్రాశస్త్యం దీనిలో కీర్తింపబడింది.

చంద్రమా : 13 పద్యాలున్నాయి

బాలచంద్రులనుండి కవి చంద్రులదాకా చంద్రుని అందాలకు నిన్నమొన్నటి వరకు ముగ్ధులయినారు. కానీ మానవుడు చంద్రలోకంలో అడుగుపెట్టిన తరువాత అభిప్రాయం మారిపోయింది. అయినా కొందరు కవులు చంద్రుణ్ణి వర్ణిస్తూనే ఉన్నారు. అది వేరు సంగతి. అందుకే అవధానిగారు కవులు వర్ణించే చంద్రుడు వేరని మానవుడు అడుగుపెట్టి కాపురం పెట్టబోతున్న చంద్రుడు వేరని సందేహపడుతున్నారు.

మానవులు ఎంతోకాలంగా నిన్ను రమ్మని పిలుస్తున్నారు. నీకు దయ కలుగలేదు. దిగరాలేదు. అందుకే వారు నీ దగ్గరికి వచ్చారు. అందాలకు ఆలవాలమనువారి నమ్మకం వమ్మయింది. దూరపుకొండలు నునుపన్న సామెత నిజమయింది. నీ దగ్గరనుండి అమృతమో వెన్నెలనో తెచ్చుకొందామనుకొన్న ఆశ నిరాశ అయింది. నీలో మాకు రాళ్ల రప్పలే లభించాయి. నీవు స్త్రీ అని పాశ్చాత్యులు, పురుషుడని భారతీయులు భావించారు. తీరా నిన్ను చూసిన తరువాత నీవు శిలాకారుడవనీ జడపదార్థమనీ తేలిపోయింది.

''అందాలరాశివంచలరియొక్కడు నిన్నుంజెలిమోముకుపమగా జెప్పినాడు,
నిర్మల వసుధానిధినంబొకడు నిన్నుదలమీద చూపుగా దాల్చినాడు
కడు ప్రసన్నుడవంచు నెదనెంచి యొకడు నిన్ బ్రమదకు దూతగా బంపినాడు
ఎల్లులు చల్లు బాణవంచొకడు నిన్నెడమనేత్రముగ వహించినాడు.

తీర చూడ శిలామయాకారుడవును
అపగతానిలవారివి ప్రాణరహిత
మూర్తి వత్సృషలా దురావుడవునగుచు
చంద్ర తెలిపితి వారి పెచ్చారితము'' [41]

- అని పురాణ గాథలలో చంద్రుని పాత్రను ప్రస్తావించి ఆధునిక కాలంలో చంద్రుని గురించి తెలిసిన రహస్యాలను పాండితీ ప్రకర్షతో భావనా పటిమతో వర్ణించారు.

**జరఠోపదేశము :** ఇందులో 6 పద్యాలున్నాయి.

జరఠము అనగా ముదిమి గలవాడు. ముసలితనంలో కలిగే జ్ఞానోపదేశమే ఈ జరఠోపదేశం. బ్రతుకు కోసం అనవసరంగా పరుగులు తీసినాను. బ్రతుకు కోసం నిలకడ లేకుండా పయనించాను. ఇప్పుడు శరీర పటుత్వం తగ్గింది. ఏ నిమిషంలో నేను నేలకొరుగుతానో తెలియదు. జగంమిథ్య అని తెలిసికోలేకపోయాను. కాల ప్రవాహాన్ని ఎవరూ ఆపలేరు గదా! బాల్య దశలో భావి జీవితం ఎన్నో కష్టాల మయమని తెలియదు. కాలం వృధా చేస్తున్నామని ఆ దశలో తెలియదు. శక్తి సామర్థ్యాలను చూపవలసిన కాలం ఇదియని తెలియదు. కాలం చెల్లిపోయిన తరువాత ఎంత దుఃఖించినా ప్రయోజనం ఉండదు. జ్ఞానం కలిగేలోపల వయస్సు చెల్లిపోతుంది. కాబట్టి మనిషికి ముందు జాగ్రత్త ఎంతయినా అవసరమని హెచ్చరిస్తూ ఒక ఉపదేశాన్ని అందించారు అవధానిగారు.

త్రింశతిలోని ముప్పయి ఖండికలతో శీర్షికలు అవధానిగారి వివిధ భావాల మాలికలు, అయినప్పటికీ అవధానిగారి కవితాధార, పాండిత్యం ఆయన తనకంటూ ఏర్పాటుచేసుకొన్న శైలి కవితా శిల్పం అంతస్స్రూత్రంగా దర్శనమిస్తాయి.

శీర్షిక ఏదైనా మొదట ప్రార్థన లేక ప్రశంస తరువాత వస్తువు యొక్క ప్రశస్తి తరువాత విషయ వివరణ చివర సందేశం ప్రతి ఖండికలోనూ మనకు కనిపిస్తాయి. సంప్రదాయాభిమానం ధర్మ రక్షణ దైవంమీద విశ్వాసం సమాజశ్రేయోభిలాష ఈ ఖండికల్లో పరిమళించే సుమాలు. ఆయన సృజనాత్మక రచనలకివి దర్పణాలు.

అవధానిగారు చేసిన రచనలలో అనువాద రచన లెక్కువ. సృజనాత్మక రచనలు తక్కువ. ఈ త్రింశతిలోని రచనలు మాత్రం అవధానిగారి సృజనాత్మకతకు, ఆయనకు ఆయా విషయాలమీద ఉన్న అభిప్రాయాలకు సునిశిత పరిశీలనకూ మనస్తత్వానికీ, సౌజన్యానికీ, పాండితీ పాటవానికీ ప్రతీకలని చెప్పవచ్చు.



# తృతీయ ప్రకరణం

# వచనకావ్యాల వివేచన

అవధాని గారి వచన రచన లసంఖ్యాకాలు, అందులో గ్రంథ రూపం దాల్చిన వాటిని గురించి మాత్రం ఈ విభాగంలో అనుశీలించాను. స్వతంత్ర కృతులు అనువాదాలు కూడా ఇందులో వున్నాయి.

## 1. ప్రకృతి విజయుము

తెలుగులో శాస్త్రీయ విషయాలను తెలియజేసే గ్రంథాలు లేవనే ఉద్దేశంతో మానవుడు సాధించిన విజ్ఞాన ప్రగతిని గురించి సరళ గ్రాంధిక భాషలో విద్యార్థులకు ఉపయోగపడే విధంగా రచింపబడిన గ్రంథం ప్రకృతి విజయము.

ప్రకృతిని మానవ ప్రకృతి యేవిధంగా తనకు అనుకూలంగా చేసుకొన్నదో ఆది మానవుని నుండి ఆధునిక మానవుని వరకు జరిగిన వైజ్ఞానిక పరిణామాలను ప్రగతిని సంక్షిప్తంగా ఈ కావ్యంలో సమీక్షించారు. దీనిని ఆరు అధ్యాయాలుగా విభజించారు. 1. విజయా రంభము 2. స్థలవిజయము 3. జలవిజయము 4. వాయువిజయము 5. ఆకాశ విజయమ 6. కాల విజయము.

**ప్రథమాధ్యాయం- విజయారంభం :** మానవుడు ప్రకృతిపై విజయాన్ని ఆరంభించి స్థితిని వచించారు. భూమండలం ఇప్పుడున్న ఆకృతిలోగానీ వైశాల్యంలోగానీ పూర్వ లేదనీ, జీవజాలం, వృక్షసంపద కూడా మొదట లేదనీ, ఆదిమ జీవులు నీటిలో ఉద్భవించాయనీ, మరికొన్ని శతాబ్దాల తరువాత స్థల జల భాగాలలో క్రొత్త జంతువులుత్ప అయినాయనీ, ఆ దశలో మానవుడు కూడా జంతువువలే ఉండేవాడని తెలియజేశారు.

''అప్పుడాతడసహాయుడై ప్రకృతి శక్తుల భీషణ విజృంభణము చూసి భయకంపతుడగ చుండెను, వానిని నిరోధించినగాని తాను బ్రపంచమున జీవించుట దుష్కరమని యాతడ గ్రహించెను. నాగరికత యనగానేమో సౌఖ్యమననేమో! యెరుంగని యా యజ్ఞాన దశనుండ మానవుడు క్రమముగా నాగరికుడును, సౌఖ్యవంతుడును నైన పరిస్థితుల వర్ణనమే మాన చరిత్రయందలి ప్రధాన విషయము''[1] - అని నిర్వచించారు. మానవునికి ఆలోచనా శక్తి మొదటినుండి ఉన్నది. ఆ ఆలోచనలను వ్యక్తీకరించుటకు కొన్ని శబ్ద సంకేతాలను

ఏర్పాటుచేసుకొన్నాడు. ఈ శక్తులతనికెట్లబ్బినవో ఎవ్వరు చెప్పలేకపోతున్నారు. సుఖ జీవనమునకై అతడు జీవితంలో పోరాడవలసి వచ్చింది. దానికితోడు రోగాలు కూడా అతనిని బాధించాయి. క్రూరమృగాలకు అతడు భయపడే వాడు. కర్రచేత రాతి చేత తనను తాను రక్షించుకునేవాడు. గదలాంటి ఆయుధాన్ని తొలుత తయారుచేసుకొన్నాడు. ఎంతోకాలం తరువాత అతడు నిప్పుయొక్క ఉపయోగాన్ని తెలుసుకొన్నాడు. బట్టలు లేకుండా ఎంతోకాలం జంతువులాగా జీవించాడు. ఇప్పుడున్నన్ని సౌకర్యాలుగానీ, పదార్థాలుగానీ లేకుండినను, అతడు తృప్తిగానే జీవించాడు. దీనికి కారణం ఆనాటి మానవుని మనోధర్మమే.

నిప్పును, సూర్యచంద్రులను గురించి ప్రకృతిని గురించి వింత వింత కథలను చెప్పుకొనుచుండెడివారు. నమ్మేవారు, మన దేశంలోనే కాక గ్రీకు దేశపు పురాణాల్లో నిప్పును గురించి ఉన్న కథను అవధానిగారు ఈ విధంగా ఉదహరించారు.

నిప్పు మొదట స్వర్గంలో మాత్రం ఉండేది. దానిని ''ప్రామీథియస్'' అనునాతడు మానవుల శ్రేయస్సుల కోసం నిప్పులేక భూలోకంలో మానవులు పడే బాధలను చూసి జాలిపడి స్వర్గలోకంనుండి నిప్పును దొంగిలించి మానవులకు తెచ్చి ఇచ్చాడు. అందులకై అతనికి దేవుడు కఠినశిక్ష వేశాడు. పగలు తీవ్రమైన ఎండకు రాత్రి అపరిమితమైన చలికి గురియైన ఒక కొండపై గొలుసులతో అతనిని బంధించి గద్దలు అతని ప్రేవులను పొడుచుకొని తినుటకనువుగా అతని ఉదరమును చీల్చి ఉంచాడు. ఆ శిక్షను పరోపకారి అయిన అతడు సంతోషంతో అనుభవించాడు. ఒకవేళ దేవుడతనిని వదిలి యుండినను ప్రాణుల సౌఖ్యం కోసం కొత్త విషయాలను అన్వేషించుటయందే కాలం గడిపియుండేవాడు. ఇటువంటి త్యాగాలు ఎందరో చేసిన తరువాతనే మానవునిలో విజ్ఞాన వికాసం జరిగింది. మానవుని పరిశీలనా దృష్టి వలననే కొత్త అంశాలు కనుగొనబడినవి. మానవుని సౌఖ్య సంవర్ధనం కంటే విజ్ఞాన సంవర్ధనకే పలువురు మహనీయులు ప్రయత్నించారు. ప్రపంచంలో అజ్ఞాత భాగాలను కనుగొనుటకు వారుచేసిన సాహసాలు త్యాగాలు ఎనలేనివి. క్రీ.శ. 1912వ సంవత్సరం ''స్కాట్స్'' అనునాతడు అతని సహచరులు మంచులో సాహసయాత్ర చేసి మరణించారు. స్కాట్స్ రాసిన డైరీ వలన ఎన్నో అమూల్య విషయాలు వారు మరణించాక ఒక సంవత్సరం తరువాత ఆ డైరీ దొరకుట చేత లోకానికి తెలిశాయి అని స్కాట్స్, ఓట్సు అను వారి సాహస గాథలను కూడ అవధానిగారు ఉదహరించారు. ఆంగ్లేయ ఖగోళ శాస్త్రజ్ఞుడైన 'హెర్శ్చెల్' మొదలైన వారి కృషిని కూడా ఈ ప్రథమ ప్రకరణంలో పేర్కొన్నారు.

విజయారంభదశలో మానవుడు క్రూర జంతువులను లోబరుచుకున్నాడు. కొన్ని ప్రకృతి రహస్యాలను తెలుసుకొన్నాడు. కొన్ని జంతువులను తనకు బానిసలుగా చేసుకొన్నాడు.

ప్రకృతి ఉపద్రవాలనుంచి కాపాడుకొనుటకు కొంత వరకు నేర్చుకొన్నాడు. కానీ మనిషిని చూసి మనిషి బెదరిపోతున్నాడు. దీనికి కారణం అతడు నిలువెల్లా విషంగా మారిపోవుట. విజ్ఞానంతోపాటు, ప్రకృతితోపాటు అతని నీతి బాహ్య ప్రవర్తనను అతః, ప్రకృతి జయించితే గాని అతడు నిర్భయంగా జీవించలేడు. అది సాధించ గలిగిననాడు ఈ లోకాన్ని నాకలోకంగా మనిషి మార్చగలడనే ఆకాంక్షతో ఈ ప్రకరణాన్ని ముగించారు.

మానవుడు ఆహార సంపాదన చేయ నారంభించాడు. ఒకచోటనుండి మరొకచోటికి రవాణా చేయనారంభించాడు. మొట్టమొదట అతనికి గుఱ్ఱము, కుక్క బరువులు మోయుటకుపయోగపడినాయి. తరువాత ఎద్దు ఆ స్థానాన్ని ఆక్రమించింది. మానవునికి చక్రాలతో నడిచే బండిని కనిపెట్టడానికి అనేక శతాబ్దాలు పట్టింది. దూర ప్రయాణాలు ప్రయాసతో కూడి ఉండేవి. గత శతాబ్దంలోనే ప్రయాణ సాధనాల అభివృద్ధి చేకూరింది. మొట్టమొదట బండి మరొకరి సహాయం లేకుండా నడవగలదని కనిపెట్టినవాడు ఫ్రెంచి దేశస్తుడు క్రీ.శ. 1769వ సంవత్సరంలో 'జోసెఫ్ క్యూనాట్'' అను ఫ్రెంచ్ దేశీయుడు కాపర్ బైలర్ (Copper Boiler)తో కూడిన ఒక త్రిచక్ర శకటాన్ని నిర్మించాడు. ఒక సంవత్సరం తరువాత ప్రయోగాత్మకంగా దానిని నడిపించాడు. నలుగురి మనుషులను కూర్చోబెట్టుకుని పారిసీ వీధులలో గంటకు మూడు మైళ్ల వేగంతో ప్రయాణం చేశాడు. కానీ నగర ప్రజలాతనిని అభినందించలేదు. నిందించారు. గేలి చేశారు. అతడు భూతభేతాళ గ్రహాలతో పొత్తు పెట్టుకున్నాడని కఠినంగా శిక్షించాలని అదనుకోసం ఎదురుచూశారు. దురదృష్టవశాత్తు ఆ యంత్రం ఒకనాడు ఒక గోడకు తాకింది. గోడ కూలింది. ఆ నేరానికి అతనికి కారాగారశిక్ష వేశారు. ఫ్రాన్సును రక్షించామని సంతోషించారు. బహుశా మొట్టమొదటి యాక్సిడెంటు అదే కావచ్చు). క్రీ.శ. 1781లో ''బార్డిస్టీవెన్సు'' జన్మించాడు. అతడు గని కార్మికుని కుమారుడు. నిరుపేద. ఆవిరి యంత్రాన్ని అతడు స్వశక్తితో కనుగొన్నాడు. ఆవిరి యంత్రాన్ని ఇనుప పట్టాలపై గంటకు పదిమైళ్ల వేగంతో నడిపించాడు. ఇంగ్లాండు దేశంలో అతని ప్రతిభను కృషిని మెచ్చుకోకపోగా విమర్శించారు. పత్రికలు, ప్రజా ప్రతినిధులు కూడా అతడి కృషిని హేళన చేశారు. రస్కిన్ వంటి మేధావి కూడా విమర్శించాడు. స్టీవెన్సన్ కృషి వల్లే ధూమశకటం కనుగొనుట జరిగింది.

రహదారుల విషయంలో రోమన్ దేశస్థులు ఇంగ్లాండు వారికి కూడా మార్గదర్శకులైనారు. ఇంగ్లాండులో రోడ్లు రెండువందల సంవత్సరాలకు పూర్వం అధ్వాన్నంగా ఉండేవి. అక్కడి భూవాతావరణం అటువంటిది. ఇంధనంతో నడిచే వాహనాలకు మొదట లోహపు చక్రాలుండేవి. తరువాత ''గుడియర్'' అనునాతడు రబ్బరు చక్రాలను గనుకొన్నాడు. ''జె.డి.డన్లప్'' అనునాతడు రబ్బరు చక్రాలతో గాలినింపి నడిపించుట కనుగొన్నాడు.

అప్పటినుండి వాహనాల వేగం హెచ్చింది. గంటకు రెండు మూడు మైళ్లు మాత్రం నడవగల యంత్రంతో ఆరంభించి వందలకొలది మైళ్ల వేగంతో ప్రయాణం చేయగల యంత్రాలను నిర్మించుట మనిషి నేర్చుకొన్నాడు. జీవిత ప్రయాణాన్ని సుఖమయంగా మార్చుకొన్నాడు. రవాణా సౌకర్యాలను కనుగొని స్థల విజయం సాధించాడు అని సమీక్షించారు అవధానిగారు.

విద్యార్థులకే కాక మానవ చరిత్రను తెలుసుకోవలయుననే విద్యాసక్తుల కిదియెంతో ఉపయుక్తంగా ఉంది. రచనా విధానమెంతో విశిష్టంగా ఉంది.

పెద్ద వర్షం కురిసినప్పుడు అడవులలోని చెట్లు మొదలైనవి నదులలో కొట్టుకురావడాన్ని చూసి నీటిలో వృక్షకాండములపై ప్రయాణించవచ్చుననే ఊహ మనిషికి కలిగి వుంటుంది. ఆ ఊహకు ఊపిరి పోసి తేలికైన కర్రలను తెప్పగా కట్టి దానిమీద నీటిలో ప్రయాణం చేశాడు మనిషి చెట్ల బోదెలను తొలచి దొప్పెలుగా చేసి తొలి రోజుల్లో నీటిపై మానవుడు ప్రయాణం చేసేవాడు. గంపలు లాంటి సాధనాలపై కూడా నీటిమీద ప్రయాణం చేసేవారు. నావల నిర్మాణంలో రోము దేశస్థులు మిగిలిన దేశాల వారికి ఆదర్శప్రాయులైనారు. తొలి రోజుల్లో తెడ్లతో నడిచే నావలను జీవిత ఖైదీలు నడిపించెడివారు. అది వాళ్లకు శిక్ష తెరచాపల నెత్తి నడిపించే నావలను రోమనులే కనుగొన్నారు. క్రీ.శ. 19వ శతాబ్ది వరకు వాయుశక్తికి బదులు ఆవిరి శక్తితో నడిపే నావలు రాలేదు. పూర్వకాలంలో హిందువుల నౌకా నిర్మాణం కూడా సుప్రసిద్ధంగా ఉండింది. ''పాయినీషియన్'' దేశస్థులు పూర్వకాలం సముద్రంలో సాహసయాత్రలు చేసి దూర ప్రయాణాలు చేసేవారు. బినోవా వాసియగు కొలంబస్ అమెరికా ఖండాన్ని కనుగొన్నాడు. వాస్కోడిగామా వెస్టిండీస్ దీవులను కనుగొన్నాడు. కెప్టెన్ కుర్ ఆస్ట్రేలియా దేశాన్ని కనుగొన్నాడు. ఇంగ్లాండుకు గొప్ప మేలు చేశాడు. 19 శతాబ్దంలోనూ నౌకా నిర్మాణాలతో అద్భుతమైన అభివృద్ధిని సాధించెను. 'సర్ హెన్రీ స్మగిల్' అనునాతనిచే కనుగొనబడిన నౌక గంటకు నూరు (100) మైళ్లు ప్రయాణం చేసింది.

క్రీ.శ. 1973వ సంవత్సరంలో 'బాల్మువెర్మి' అనే ఫ్రాన్సు దేశస్థుడు జలాంతర్గామిని గురించి తన రచనలో ప్రస్తావించారు. అమెరికా దేశస్థుడైన 'బుస్మెల్' మొట్టమొదటి జలాంతర్గామి అయిన యుద్ధ నౌకను నిర్మించాడు. వస్తువుల రవాణాకు వర్తమాన కాలంలో నౌకలు ఎక్కువగా ఉపయోగపడుతున్నాయి. అగాధాలయిన సముద్ర జలాలు కూడా మనిషికి వశమైనాయి. అతని అప్రతిమాన ధీశక్తికిదియొక మంచి నిదర్శనం అని జలవిజయాన్ని గురించి ప్రస్తుతించారు అవధానిగారు.

ప్రకృతిలో బలమైన శక్తి నీటిదే. ఆ నీటిపై మానవుడు విజయం సాధించుట అపూర్వ విషయమే. సముద్రం కంటే మానవ మేధస్సు అమోఘమైనది అతని యెడ అంతకంటే అగాధమైనదని ఈ విజయం వలన తెలియుచున్నది.

వసు మహారాజు రావణాసురుడు విమానాలలో ప్రయాణం చేసినట్లు హిందువుల పురాణాలలో కలదనీ, గ్రీకు దేశంలో కూడా ఒక తండ్రి కొడుకు విమానయానం చేసినట్లు కలదని మొదలు పెట్టారు. శాస్త్రీయ పద్ధతిలో ఏటియస్ మౌంట్ గోల్ఫియర్ అను సోదరులు ఆకాశానికెగిరే యంత్రాన్ని కనుగొన్నారు. వీరు ఫ్రాన్సు దేశస్థులు వారు ప్రయోగాత్మకంగా ఒక మేకను, కోడివి, బాతును అందులో వుంచి పైకి పంపారు. అది సుమారు పదిహేను అడుగుల పైకి ఎగిరి క్షేమంగా క్రిందికి దిగింది. తరువాత వారు మనుషులను పంపడానికి ప్రయత్నించారు. కానీ ఫ్రాన్సురాజు అందుకు అంగీకరించలేద. కానీ నేరం చేసి శిక్షను అనుభవించే వారిని పంపటానికి అంగీకరించారు. కానీ మొట్టమొదటి సారి గాలిలో ఎగిరిన గౌరవం నేరగాళ్లకు దక్కడం 'డిజోరియర్స్' అనే యువకునికి నచ్చలేదు. తానే ఆ సాహసానికి పూనుకొని రాజును ఒప్పించాడు. 1783లో అతడు రాజు కూడా విమానంలో ఆకాశంలోకి ఎగిరి త లి విజయాన్ని సాధించారు. కానీ 1785వ సంవత్సరంలో డిజోరియర్స్ అతని సోదరుడు విమానప్రమాదంలో మరణించారు. ఇది మొట్టమొదటి విమాన ప్రమాదం కావచ్చు. 1984 ఆగస్టులో ఇంగ్లాండు దేశస్థుడైన ''టైలర్'' కూడా విమానంలో కొంత దూరం ప్రయాణించాడు. 1984 సెప్టెంబర్ 15వ తేదీన ఫ్రాన్సు దేశస్థుడు ''లూవార్స్'' సుఖంగా అంతరిక్షంలో ప్రయాణించాడు. ఇతడు సుమారు 90 నిమిషాలు వాయు యానంలో సుఖంగా ప్రయాణించాడు. ఇదే సంవత్సరం ''బ్లాన్‌చార్డ్'' డెబ్బయి మైళ్ల దూరం విమానంలో ప్రయాణం చేశాడు. సముద్రంమీద గాలిలో మొట్టమొదట ప్రయాణం చేసిన గౌరవం ఇతనికే దక్కింది. ఇప్పటివరకు చేసిన ప్రయోగాలలో ఇంధనంతో నడిచే యంత్రాలేవీ లేవు.

యంత్ర సహాయంతో గాలిలో ఎగిరిన ఘనత రైటు సోదరులకు దక్కుతుంది. 1903వ సంవత్సరం చివరి భాగంలో పన్నెండు గుర్రాల శక్తిగల గాసోలైన్ యంత్ర సహాయంతో గంటకు ముప్పైమైళ్ల వేగంతో ప్రయాణం చేయగల ఒక విమానాన్ని తయారుచేసి ప్రయోగించారు. వారు ఎక్కువ చదువుకొన్నవారు కాకపోవడం చేత వారి ప్రయోగ ఫలితాలను లోకానికి వెల్లడి చేయలేదు. తరువాత వారి కృషిని గుర్తించి విశ్వవిద్యాలయాలు వారికెన్నో బిరుదులు బహుమతులు ప్రదానం చేశాయి. 1930 నాటికి విమానాల తయారీలో ఎంతో ప్రగతి సాధించారు. మొదటి ప్రపంచ యుద్ధంలో రెండవ ప్రపంచ యుద్ధంలో వీటిని విరివిగా ప్రయోగించారు. వినాశాన్ని సృష్టించారు. తరువాత విమానాలు ప్రయాణాలకు అనుకూలంగా మలుచకొని, పట్టణాలలో విమానాశ్రయాలు నిర్మించి దేశదేశాలకు శీఘ్రంగా ప్రయాణాలు చేస్తున్నారు. సరకులను రవాణా చేస్తున్నారు. మానవుడు సాధించిన మహా విజయాలలో వాయు విజయం అత్యద్భుతావహమైనది.

అవధానిగారు ఈ వాయు విజయాన్నిట్లు ప్రవచించారు. ''మానవుడు సాధించిన ఈ

యువజయమును పరిశీలించినచో మేధా సంపన్నుడైన యాతని ప్రతిభ కడ్డులేదనియు, దాని సాహయ్యమువలన నాతడాసధ్య కార్యమును గూడ ఉససాధ్యములు కావించుననియు దోపకమానదు. ఏ తద్విజయసిద్ధికై యాతడు కావించిన త్యాగము, పడిన కష్టములను గూడ మహత్తరములైనవే. ''కేశః ఫతేన హిపునర్మనతాం విభత్తే'' యను కాళిదాసుని సూక్తి ననుసరించి యాతడు పలలాభముచే, గ్లేశమును విస్మరించి నవనవోత్సాహమును బొందుచుండును, మానవ మేధావిధానములో నింకను నెన్ని యద్భుత రత్నములు కలవో కదా''[2] అని ముగించారు.

నక్షత్రముల పరిమాణాన్ని వాటి వయస్సును అవి భూమికి ఎంత దూరంలో వున్నాయో చంద్రుడేలాంటి గ్రహమో వివరించారు. సూర్యుడిప్పుడు యౌవ్వనానంతర దశలో ఉన్నాడని, బుధగ్రహం భూమికంటే చిన్నదనీ, అంగారక గ్రహంలో భూమి మీద వలె ప్రాణులు కనిపిస్తున్నాయనీ, శాస్త్రజ్ఞులు చెప్పిన విధానాన్ని విపులీకరించారు. అంగారక గ్రహం గురించి పరిశోధన చేసిన వారిలో డా. ''లవెలీ'' ప్రథమగణ్యుడు. మానవుడీ విషయంలో ఇంకా ఆరంభదశలోనే ఉన్నాడని అవధానిగారభిప్రాయడినారు.

మానవుడు గంటకు మూడుమైళ్ల ప్రయాణం చేసే దశనుండి నాలుగువందల మైళ్లు ప్రయాణం చేయుటకు ఎదిగాడు అంటే కాలవ్యయాన్ని తగ్గించుకొని కాలాన్ని జయించాడు. వస్తూత్పత్తి విధానంలో కూడా యంత్రాలనుపయోగించి కాలవ్యయాన్ని తగ్గించుకొనుచున్నాడు. విద్యుచ్ఛక్తి కనుగొని కాలాన్ని జయించాడు. విద్యుచ్ఛక్తిని కనుగొనడంలో ''బెంజామిన్'' మైఖేల్ ఫారడీ అనువారు కృషిచేశారు. ఎడిసిన్ కృషి మానవులకెంతో ఉపయోగపడుచున్నది. లార్తీకెల్విస్ కేబుల్ విధానాన్ని కనుగొన్నాడు. జగదీశ్చంద్ర బోస్ నిస్తంత్రీ విధానానికి నాందీ పలికాడు. కానీ ఫలితం సాధించింది జర్మనీ దేశస్థుడు హెర్జున్ బ్రౌన్లీ, ఇటలీకి చెందిన మార్కోనీ అనువారు. 1877లో ఎడిసన రేడియో, టేపురికార్డను కనిపెట్టాడు.

ఈ విధంగా మానవుడు యంత్రాలను కనిపెట్టి తక్కువ సమయంలో ఎక్కువ పనిచేసి కాలాన్ని జయించాడు. జీవితాన్ని సుఖమయంగా మార్చుకొన్నాడని విశదీకరించారు. ప్రకృతి మీద మానవుడు సాధించిన విజయపరంపరను తాను గొప్ప పండితుడైనా తన పాండిత్యాన్ని ప్రదర్శించకుండా సరళంగా సరసంగా సహృదయరంజకంగా పరిశోధనాత్మకంగా క్రమపద్ధతిలో వివరించారు. చెప్పినవి విజ్ఞానశాస్త్రం విషయాలైనా పాఠకునికి విసుగు కలుగకుండా కథలు చదివిన అనుభూతి కలుగునట్లు శాస్త్ర విషయాలు చెప్పిన నైపుణ్యం ఈ రచనలో దర్శనమిస్తుంది.

ఈ కావ్యంపై బ్రహ్మశ్రీ దుర్గా సుబ్రహ్మణ్య శర్మగారు ఈవిధంగా తన అభిప్రాయాన్ని తెలియజేశారు.

"శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు పండితులు గావున భాషనిర్దుష్టముగా నుండుటకు నాకు వింత కలుగలేదు. గాని దుర్గహములైన భౌతిక శాస్త్ర విషయములవారు ఇంత సుబోధకముగా జెప్పగలిగినందుకు బరమహర్షభరితుడనగుచున్నాను. ఆ గ్రంథమును నవలం బోలే జదివి విద్యార్థులు ప్రకృతి విజ్ఞానమును బొరయుదురనుట సందేహం లేదు"[3]

బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రులవారు, "ప్రకృతి విజయము జక్కగా జదివినాడను, అది తియ్యని దివ్యౌషధము వంటిది. లోకమున సాగుతున్న ప్రకృతి విజయం సర్వతోముఖముగా విజృంభించి పరమ పురుష ప్రాప్తి పర్యవసాయి కానుండుటను బరిస్మరించుచు ముచ్చటగొల్పినది. అది శాస్త్ర కథా కథనము"[4] అవధానిగారి రచనా శైలికి వీరు వెలిబుచ్చిన అభిప్రాయాలు చాలా సమంజసంగాను, సమర్థవంతంగాను ఉన్నాయి.

## 2. శ్రీ శివ భక్త విజయము :

భారతీయ తత్త్వ గ్రంథాలలో మానవుని మోక్షప్రాప్తికి జ్ఞానము, భక్తి, కర్మ అను మూడు ముఖ్య మార్గములు సూచించబడినవి. అందులో జ్ఞానకర్మ మార్గాలు పరిణత చేతస్కులైన మహాయోగులకు మాత్రం సాధ్యమయ్యేవి. భక్తిమార్గం సర్వజనానుసరణీయమైన సులభమార్గం. శ్రేష్టమైన మార్గం కూడా ఇదే అని చెప్పవచ్చు. "మోక్ష సాధన సామగ్ర్యాం భక్తి రేవగరీయసీ" అని కదా ఆర్యోక్తి. భక్తిమార్గాన్ని అనుసరించి మోక్షం పొందిన భక్తవరేణ్యులనేకులున్నారు. మానవులే కాక జంతువులు కూడా ఈ మార్గంలో ముక్తి పొందాయి. ఇటువంటి భక్తి మార్గాన్ననుసరించి శివసాయుజ్యం పొందిన భక్తుల కథలే ఈ శివభక్త విజయం.

"ఆంధ్రమున శివకేశవభక్తి సంపన్నులైన మహనీయుల చరిత్రములను దెల్పు సద్గ్రంధములు కొన్ని యున్నమాట నిజమే. వానిలో విష్ణు భాగవతుల చరిత్రలు తెల్పువని సంఖ్య హెచ్చు. భక్త విజయమనుపేర విష్ణు భక్త వరేణుల జీవిత చరిత్రములను గ్రంధములొండు రెండు ప్రకటితములైనవి. అట్లే శివభక్తుల చరిత్రములు కూడా సమగ్రముగా సేకరించి యొక్కచోట కూర్పువలయునని తలంచి భక్తులు అస్తిక్యశోభితులు ఉదారులు అయిన శ్రీ సబా శంకరయ్యగారు మమ్మాకార్యమునకు ప్రేరేపించియుండిరి. మేమును ఇహపర సాధకమైన యా పనికి బూని శ్రద్ధాసక్తులతో నీ శివభక్త విజయమును రచించియుంటిమి"[5]

- అని ఈ గ్రంథకర్తలు తెలియజేశారు. తెలుగు సాహిత్యంలో శివభక్తులను గురించి, శైల క్షేత్రాలను గురించి తెలియజేసే గ్రంథాలలో ఇదే బృహద్గ్రంథము. ఇంతమంది శివభక్తుల కథలుగల వచన గ్రంథం ఇప్పటివరకు వెలువడలేదు. ప్రథమ ప్రచురణ 1968 ప్లవంగ శివరాత్రికి విడుదలైనది. ఆ ప్రచురణ రచన చేసినవారు దివాకర్ల వేంకటావధాని, సూర్యనారాయణ మూర్తిగార్లు. ఇంతకుముందు తమిళంలోని ''పెరియ పురాణము''నే గ్రంథాన్ని తెలుగులోనికి శ్రీ పొం. సూర్యనారాయణమూర్తిగారు అనువదించారు. అందులో అరవై ముగ్గురు (63) శివభక్తుల కథలున్నాయి. అందులోనుండి కొన్ని కథలు, బసవపురాణమునుండి, పండిరాధ్య చరిత్రనుండి, శివపురాణమునుండి హరవిలాసము, కాశీఖండము, శివరాత్రి మహాత్మ్యము, శ్రీకాళహస్తిమహాత్మ్యము మొదలైన గ్రంథాలనుండి గ్రహించి వీరు ఈ శివభక్త విజయమును రచించారు.

శివభక్తిలోని శక్తిని భక్తిమార్గంద్వారా ముక్తిని సాధించే విధానాన్ని సామాన్య జనులకు కూడా బోధపడే విధంగా సరళంగా, రమ్యంగా రచించారు. చాలాకథల్లో శివుడు తన భక్తులకు వింత వింత పరీక్షలు పెట్టుట, దృఢచిత్తులైన శివభక్తులు ఆ పరీక్షల్లో విజయాన్ని సాధించి శివసన్నిధికి చేరుట జరుగుతుంది. అందుకే ఈ గ్రంథానికి శివభక్త విజయమనే పేరుపెట్టారు. ఇది ఎంతో అర్థవంతంగా సమంజసంగా ఉంది. నూట ఎనిమిది (108) మంది శివభక్తుల కథలిందులో వర్ణింపబడినవి. కొన్ని కథలు వివరణాత్మకంగా కొన్ని విశ్లేషణాత్మకంగా మరికొన్ని కథలు అద్భుత రసమహితంగా కూడా ఉన్నాయి. ప్రతి కథ శివభక్తుల వైశిష్ట్యాన్ని లోకానికి చాటుతుంది.

పేర్ల చివర 'నాయనారు' అనే పదం చేరిన భక్తుల కథలు (46) నలభై ఆరు, అయ్య అనే పదం చేరిన వారి కథలు (21) ఇరవై ఒకటి, భక్తురాండ్ర కథలు (8) ఎనిమిది, ఇతర కథలు (33) ముప్పైమూడు ఉన్నాయి.

గ్రంథానికి శివభక్త విజయం అనే పేరు పెట్టినా గ్రంథం చివర ద్వాదశ జ్యోతిర్లింగాల వృత్తాంతములను, పంచారామముల వృత్తాంతములను చేర్చినారు. ద్వాదశ జ్యోతిర్లింగముల చరిత్రలను రచించుటలో శ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రిగారి వ్యాసాల సహాయం తీసుకున్నారు. ఈ వ్యాసాలు శ్రీశైల ప్రభలో ప్రచురింపబడినవి. అతి సామాన్య జనులను కూడా ఆకర్షించుటకు చిత్రపటాలు కూడా పొందుపరిచారు ప్రచురణకర్తలు.

ఈ గ్రంథంలో శివభక్తులు చేసిన అద్భుతాలను అద్భుతంగా వర్ణించారు రచయితలు. ఈ కథలు భక్తికి, కుల, మత, లింగ, వయో భేదాలుగానీ, విద్యావివేకాలుగానీ అవసరం లేదనడానికి తార్కాణంగా ఉన్నాయి. తిరునీలకంఠ నాయనారు కుమ్మరివాడు. శివుడితనికి పెట్టిన పరీక్ష దానమడుగుట. తన సర్వస్వం సమర్పించుకొని అప్పటికి అతనికిచ్చిన మాటకు

ధనం సరిపోకపోవుట వలన తనను, భార్యను, కుమారుని త్రాసులో తూకం వేసి సమర్పించుకొంటారు. ఈ కథలో బలి చక్రవర్తి, శిబి చక్రవర్తుల కథలు ధ్వనిస్తాయి. ఈ కుమ్మరి భక్తునికి శివుడు ప్రత్యక్షమై వార్ధక్యాన్ని పోగొట్టి యౌవ్వనాన్నిచ్చి చివరకు తన సన్నిధి కలుగజేస్తాడు. ఇయల్పనాయనారనే భక్తుడు వైశ్యుడు. శివుడతనికి పెట్టిన పరీక్ష మారువేషంలో వచ్చి పతివ్రత అయిన అతని భార్య పొందు కోరుట. ఆ దంపతులందుకు సంతోషంగా అంగీకరించి శివసాయిజ్యం పొందుతారు. ఇళయాన్కుండి నాయనారు కృషీవలుడు నిరతాన్నదాన వ్రతుడైన శివభక్తుడు. ఇతని కథ రంతిదేవుని కథను తలపింపజేస్తుంది. శివుడు పెట్టిన పరీక్షకు అగ్నిప్రవేశం చేసిన భక్తుడు నందనారు. రక్తంతో దీపారాధన చేయ తలపెట్టినవారు కలయనాయనారు. చనిపోయిన బాలికను బ్రతికించిన భక్తుడు ముసిడి చేయు, ఒక భక్తుని కోరిక మేరకు తన భార్య కట్టుకున్న చీరను భక్తునికి సమర్పింప తలపెట్టిన భక్త శిఖామణి బసవేశ్వరుడు, లౌకిక వివేకం బొత్తిగా లేక వేశ్యామందిరం కొత్తరకం శివాలయం అని ఆమె వక్షోజాలు స్వయం భూలింగాలని పూజించిన భక్తుడు ముగ్ధ సంగయవంటి భక్తుల కథలు పవిత్రమైన భక్తి మార్గానికి మార్గదర్శకాలుగా వర్ణింపబడినవి.

గొడగూచి, బిజ్జ మహాదేవమ్మ, సూరసానమ్మ, గుడ్డవ్వ మొదలైన భక్తురాండ్ర కథలు, కాళము, హస్తి వంటి జంతువుల భక్తి కథలు కూడా ఇందులో వున్నాయి.

భక్తుల కథలే కాకుండా సుప్రసిద్ధ శివక్షేత్రాల మాహాత్మ్యాలు వివరాలు చరిత్రలు కూడా ఈ గ్రంథం చివర చేర్చబడినవి. సౌరాష్ట్రంలోని సోమనాథ లింగం (సోమనాథ దేవాలయం) శ్రీశైలంలోని మల్లికార్జున లింగం, ఉజ్జయినిలోన మహాకాలలింగం, మధ్యప్రదేశ్‌లోని ఓంకారేశ్వర లింగం, ఉత్తరప్రదేశ్‌లోని కేదారేశ్వరలింగం, కాశిలోని విశ్వేశ్వరలింగం, మహారాష్ట్రలో గోదావరి గట్టున ఉన్న త్ర్యంబకేశ్వరలింగం, కలకత్తాలోని చిత్తరంజన్ దగ్గరగల వైద్యనాథ లింగం, ఎల్లోరాలోగల ఘృష్ణేశ్వరలింగం తమిళనాడులోని రామేశ్వరలింగం, మహారాష్ట్రలోని భీమశంకరలింగం అనే ద్వాదశ జ్యోతిర్లింగాల గురించి వాటి పుట్టుపూర్వోత్తరాల గురించి వాని ప్రభావ ప్రాశస్త్యాలను గురించి కూడా ఈ గ్రంథంలో చెప్పబడినది.

తమిళనాడులో గల క్షితిలింగం, తేజోలింగ, జలలింగం ఆకాశలింగాలను గురించి, ఆంధ్రప్రదేశ్‌లోని వాయులింగం ఒరిస్సాలోని సూర్యలింగం, బెంగాలీ రాష్ట్రంలోని చంద్రలింగం, నేపాల్‌లోని పసుపతి లింగం, కర్నాటకలోని గోకర్ణేశ్వర లింగం, మహాబలేశ్వర క్షేత్ర మహాత్మ్యం, హిమాచలప్రదేశ్‌లోని అమరనాథ క్షేత్రం, మొదలైన అష్టమూర్తులను గురించి కూడా ఈ గ్రంథంలో వర్ణించబడినది. పంచారామాలను గురించి కూడా

వివరించబడివుంది.

ఈ గ్రంథంలోని భాషను గురించి రచయితలు ఈ విధంగా తెలియజేశారు.

''ఇందలి భాషను గురించి యొక విషయము చెప్పవలసి వున్నది. ఈ గ్రంథం పండితులకే కాక సామాన్య జనులకును ఉపకరింపవలెనను ఉద్దేశంతో నిందు సాధ్యమైనంత వరకు సులభం సుబోధమునైన భాష వాడబడినది. చాలావరకు అరసున్నలు. శకటరేపములు విడచి వేయబడినవి. సంగ్రహముగా నైన తెల్పి వారి మనస్సులలో భక్తి బీజాంకురములను మొలకెత్తింప జాలినచో మా ప్రయత్నము సార్ధకమైనదని సంతసింతుము'' [6]

ఈ గ్రంథం చదివిన తరువాత ఈ మాటలు యదార్థాలనిపిస్తాయి. కానీ అరసున్నలయితే వాడలేదు. శకటరేఫమును చాలా సందర్భాలలో వాడియుండుట కనిపిస్తుంది. వీరు నిర్దుష్ట రచనా దక్షులగుటచే గ్రంథమంతా ఒకే శైలిలో యేకధారగా నడచినది. ఇది ఎంతో ప్రశంసాహమైనది.

ఈ గ్రంథం రెండవ ముద్రణ 1976లో వెలువడింది. ఇందులో మరో ఆరు కొత్త అంశాలు చేర్చి (25) రెండువందల యాభై పుటలు అదనంగా పెంచి ప్రచురించారు. పెంచిన విషయాలు 1. అష్టమూర్తి క్షేత్రములు. 2. గోకర్ణేశ్వరము 3. అమరనాథ క్షేత్రం 4. భువనేశ్వరక్షేత్రం 5. కాళేశ్వర ముక్తేశ్వర క్షేత్రాలు 6. ఎనిమిది శతకాలు చేర్చారు. ద్వితీయ ముద్రణలో రచయితగా శాస్త్రుల విశ్వనాథశర్మగారి పేరు కూడా కనిపిస్తున్నది.

## 3. కిరాతార్జునీయము :

దీనిని అవధానిగారు 1968లో రచించారు. ఇది భారవి సంస్కృత కిరాతార్జునీయ కావ్యానికి తెలుగు అనువాదం. సంస్కృత పంచ కావ్యాలలో భారవి రచించిన కిరాతార్జునీయము ఒకటి. సంస్కృతంలో ఇది నారికేళ పాకమని పండితాభిప్రాయం. అవధానిగారి తెలుగు అనువాదం కూడా కదళీపాకం కంటే కొంచెం కఠినంగా ఉన్నది. రఘువంశము, కుమార సంభవము మొదలైన సంస్కృత కావ్యాలు తెలుగులోని కనువదింపబడినాయి. సంస్కృతంతో పరిచయంలేని తెలుగువారికి కూడా అందలి కవితా పాఠవాన్ని తెలియజ్తేన్నాయి. కానీ కిరాతార్జునీయ కావ్యాన్ని తెలుగులోనికి అనువాదం చేసిన వారరుదు. దివాకర్ల వెంకటావధానిగారికి చిన్నప్పటి నుండి భారవి కవిత్వంమీద అధికమైన అభిమానం ఉండుటచేత తెలుగువారికి భారవి కవితా చమత్కృతి సామర్ధ్యాన్ని తెలియజేయాలనే కోరిక చేత దీనిని వచనానువాదం చేశారు. సంస్కృత కిరాతార్జున కావ్యానికెందరో వ్యాఖ్యలు రచించారు. అందులో మల్లినాథసూరి వ్యాఖ్యానం అవధానిగారికి

బాగా నచ్చింది. అందుకే ఆ వ్యాఖ్యానాన్ని సంగ్రహంగా అనుసరించారు. ఇందులో ప్రధాన విషయం పార్థుడు తపస్సు చేసి పశుపతిని మెప్పించి పాశుపతాస్త్రం పొందుట. ఇందులో ఎన్నో వర్ణనలు చోటు చేసుకొన్నాయి. కథాంశంకంటే వర్ణనలే ఎక్కువ తన అనువాద విధానాన్ని అనువాద అవసరాన్ని గురించి అవధానిగారీ విధంగా తెలియజేశారు.

''కిరతార్జునీయమునెవ్వరో పద్యకావ్యముగా ననుసరించి యుండిరని వింటిమి. పద్యముగా గాక వచనముగా సంతరించినచో నీకావ్యమాంధ్రులకు మరింత సుబోధముగా నుండునను నుద్దేశమునను చిన్నప్పటినుండియు నాకు భారవి కవిత్వమునందు గల యభిమానము చేతను నేనిప్పుడీ వచనానువాదము కావించితిని. మూలమునందలి శ్లోకముల నన్నిటిని యథాతథముగా ననువదించితిని, గాని యష్టమసర్గమునందలి యతి శృంగార పూరితమైన కొన్ని శ్లోకములను బంచమ సర్గమునందలి యమక బందాత్మకములైన రెండు శ్లోకములను మాత్రము విడచి వైచితిని'' [7]

పరిశీలించి చూస్తే ఇది యథార్థమనడానికి సందేహం లేదు. అవధానిగారు చేసిన వచనానువాద రచనలైన కాదంబరి, శ్రీ విద్యాగద్య రామాయణము మొదలైన కృతులకంటే ఇది ప్రౌఢంగా పదగుంఫన శైలికి సన్నిహితంగా కనిపిస్తుంది. వచనానువాద కృతులలో ఇది మొదటిది కూడా. సంస్కృతంనుండి అనువదించిన వచన కృతులు. 1. కిరాతార్జునీయము (1966) 2. శ్రీ విద్యా గద్య రామాయణము (1976) 3. కాదంబరి (1981) ఇంగ్లీషునుండి అనువదించిన కృతులు 1. వేమనయోగి (1958) 2. పోతన (1972) 3. మలయాళ వాఙ్మయచరిత్ర (1978) 4. బల్గేరియా జనచరిత్ర (1979). ఇందులో వేమనయోగి, పోతన, మలయాళ వాఙ్మయ చరిత్ర అనునవి విమర్శకు సంబంధించినవి. కనుక వాటిని గురించి చతుర్థ ప్రకరణం విమర్శ కృతులు అనుభాగంలో చర్చించబడినది.

కిరాతార్జునీయము పద్దెనిమిది సర్గల కావ్యం. సంస్కృతంలో ఉన్న విధంగానే అవధానిగారు దీనిని పద్దెనిమిది సర్గలుగానే విభజించారు. భారవి మహాకవి ఏ ప్రాంతం వాడో కచ్చితంగా చెప్పలేముగానీ దక్షిణ భారతదేశానికి చెందినవాడని మాత్రం చెప్పవచ్చుననియు క్రీ.శ. అవరవశతాబ్దికి చెందిన వాడనియు విమర్శకుల అభిప్రాయం. ఇతడు రచించిన కిరాతార్జునీయము మాత్రం భారతదేశమంతా సుప్రసిద్ధమైనదిగా ప్రసిద్ధిపొందింది.

అవధానిగారు అనువదించిన తరువాత 1967లో కిరాతార్జునీయాన్ని శ్రీపాద వెంకట రమణ దైవజ్ఞశర్మగారు ఆంధ్ర వ్యాఖ్యానంతో రచించారు, ఆంధ్ర బాలసుధా వ్యాఖ్యానమను పేరుతో 1972లో డా. పాటిబండ మాధవశర్మగారనువదించారు. శ్రీపాద వేంకట రమణ దైవజ్ఞశర్మగారు, పాటిబండ మాధవశర్మగారు టీకాతాత్పర్యాలతో కూడిన వ్యాఖ్య రచించారు. అవధానిగారు అందులోని విషయాన్ని యథామూలకంగా అనువదించారు.

ఉదాహరణకు : -

శ్లో॥ విహాయ శాంతిం నృప ధామ తత్పునః
ప్రసీద సంధేహి వధాయ విద్విషామ్
వ్రజంతి శత్రూ నవధూయ నిస్పృహా
శమేన సిద్ధిం మునయో న భూభృతః (ప్ర.స. 42 శ్లో॥ )

శ్లో॥ పురస్సరా ధామవతాం యశోధ్వ ధనా
సుదుస్సహం ప్రాప్య నికార మీదృశమ్
భవాదృశాశ్చే దధికుర్వతే రతిం
నిరాశ్రయా హంత హతా మనస్వితా (ప్ర.స. 43 శ్లో॥ )

శ్లో॥ అథక్షమా మేవ నిరస్త విక్రమ
శ్చిరాయ పర్యేషి సుఖస్య సాధనమ్
విహాయ లక్ష్మీపతి లక్ష్మ కార్ముకం
బటాధరస్సన్ జుహుధీహి పావకమ్ (ప్ర.స.44 శ్లో॥ )

శ్లో॥ నసమయ సరిరక్షణం క్షమం తే
నికృతిపరేషు పరేషు భూరిధామ్నః
అరిషు హి విజయార్థినః క్షితీశా
విదధతి స్పోపధి సంధిదూషణాని (ప్ర.స.45 శ్లో॥ )

శ్లో॥ విధి సమయ నియోగాద్దీప్తి సంహార జిహ్మం
శిథిల వసు మగాధే మగ్నమాపత్పయోధౌ
రిపు తిమిర ముదస్యోదీ యమానం దినాదౌ
దినకృతమివ లక్ష్మీ స్త్వాంసమభ్యేతు భూయః (ప్ర.స. 46 శ్లో॥ )

పై ఐదు శ్లోకాల భావాలను అవధానిగారు -

''శమంబుచే శత్రుని రాసంబు కావించి సిద్ధం బొందువారు నిరీప్సులగు మునిపతులే కాని యవనీపతులు కారు. తేజశ్వి పురస్పరులును యశోధనులునగు భవాదృశులే యేతాదృశంబగు వికారంబు నొందియు నానందంబు పొందు దురేని అక్కటా మనస్విత్వంబింక నిరాశ్రయంబై నాశంబుంబొందుంగదా! అట్లు కాని రస్త విక్రముండవై

చిరంబు శమంబునే సుఖ సాధనంబుగా నిశ్చయింతునేని లక్ష్మీపతి లక్ష్యంబైన శరాసంబు నిరాసించి జటాధరుండనై యియ్యెట వీతలంబునండ యగ్నియందాహుతు లాచరించుచుండము. వైరులపకారతత్పరులకు చండ భూరి తేజుండవగు నీకు సమయ ప్రతీక్షణంబు క్షమంబు కాదు. విషగీషువులగు ప్రభువు లరివిషయంబున సోపధికంబుగా సంధి దూషణంబుల యాచరించుచుందురుగదా! దైవకాల నియోగంబు వలన నాసత్పయోధి మగ్నుండవును, దేశస్సంకోచ బిహ్వుండవును, శిథిల వసుండవును, రిపుతిమిర నిరాసంబుచే సుదీయ మానుండవు నగు నిన్ను దివసారంభమున దివాకరునివలె లక్ష్మి తిరిగి వరించుగాక'' [8]

ఈ విధంగా విషయాన్ని వదలక, వ్యాఖ్యాన రూపంలో చెప్పక, అనవసర విషయాలు జోడించక సూటియైన పదాలను వాడి అర్థవంతమైన వాక్యనిర్మాణంతో సుసంపన్నంబైన భాషాపటిమతో పండిత జనరంజకంగా మూలశ్లోకములను యథాతథంగా భావ గంభీరములైన ఉపమానాలతో జేలతీ బంధురంగా ప్రతినా మహితంగా అలంకారయుక్తంగా అవధానిగారు కిరాతార్జునీయమును పదునెనిమిది సర్గలు వచనానువాదం చేశారు. రాసిన కాలం ఆ ర్యాచనీమైన శైలి ప్రాచీనము.

## 4. శ్రీ విద్యాగద్య రామాయణము

దివాకర్ల వేంకటావధానిగారు రామాయణంమీద అపారమైన భక్తి గౌరవాలు కలిగి ఉండేవారు. ఆయన రామాయణంలో సుందరకాండను నిత్యం పారాయణం చేసేవారు. రామాయణం వేదతుల్యమనీ, రామాయణ భారత భాగవతాలు భారతీయ సంస్కృతికి మూలకందాలని భావించేవారు. భారతీయులందరు వాటిని చదివి, అంతటి ఆదర్శాలను జీవిత మార్గదర్శకాలుగ అనుసరించి ఇహపర సౌఖ్యాలను పొందాలనే ఉద్దేశం ఆయన కుండేది.

అవధానిగారి సాహిత్య సృష్టితో, ఉపన్యాసాల్లో సర్వత్రా కనిపించేగుణాలలో, సంప్రదాయా లను కాపాడాలనే తపన, భారతీయ సంస్కృతికి ఊపిరి పోయాలనే ఆకాంక్ష ముఖ్యంగా కానవస్తుంది.

అటువంటి ఆకాంక్షతోనే ఆయన శ్రీ విద్యాగద్య రామాయణాన్ని రచించారు. భాషావిషయంలో మెట్టు దిగివచ్చి అతి సామాన్యునికి కూడా అర్థం కావాలని విసంధిని పాటించారు. వ్యాకరణ నియమాలను కూడా కొన్నిటిని సడిలంచారు. సందర్భానుసారంగా వాల్మీకి శ్లోకాలనూ విశ్వనాథ సత్యనారాయణగారి శ్రీమద్రామాయణ కల్పవృక్షంలోని

పద్యాలను గ్రహించి ఇందులో పొందుపరిచారు. ఇది 1978లో రచింపబడినది.

''ఆదికవి వాల్మీకి శ్రీమద్రామాయణ రచనమున ప్రదర్శించిన ప్రతిభ శోక, పరిజ్ఞానములు నాన్వతో దర్శనీయములు, అందుకవితా కౌశలమెంత యున్నదో నీతిధర్మ తత్త్వ ప్రబోధమంతయున్నది. అది సంస్కృత భాషయందు రచితమగుటచే నాభాషలో స్వల్ప పరిచయమైన లేనివారు దానిని సమగ్రముంగా నవగాహన చేసుకొనుట కష్టము. అందుచే నందలి నీతి ధర్మాదులతో పాటు కవితా కౌశలము కూడా నాంధ్రులందరికీ నందించుటకై ఆధ్యాత్మిక ప్రచారమే పరమార్థముగా పెట్టుకొన్న శ్రీ విద్యా సేవా సమితివారు దానిని సులభ వచనమున నాల్గు సంపుటములుగా వెలువరింప సంకల్పించినారు. బాలఅయోధ్యకాండములతో కూడిన యిది ప్రథమ సంపుటము. వాల్మీకి రామాయణము నందలి కథా సంవిధానమునకు యిందు భక్తి శ్రద్ధలతో ననుసరింపబడినది. దీర్ఘములైన వర్ణనములు మాత్రమచ్చటచ్చట సంగ్రహింపబడినవి.

''వాల్మీకి రామాయణమున పాదుకా పట్టాభిషేకము కూడ అయోధ్యకాండముననే యున్నది. ఇందు భరతుడు మాతుల గృహమునుండి అరుదెంచి మాత్రమాత్యాదులతో శ్రీరాముని దర్శింప నయోధ్యనుండి బయలుదేరుటతో నాకాండము ముగింపబడినది. ఇందు పాదుకా పట్టాభిషేకము ద్వితీయ సంపుటము నందలి అరణ్యపర్వమున చేర్చబడినది. పాఠకుల సౌకర్యమునకై విసంధి పాటింపబడినది. వ్యాకరణ నియమములు కూడా కొన్ని సడలింపబడినవి. అధస్సూచికలలో కొన్ని సందిగ్ధార్థములు వివరింపబడినవి. అచ్చటచ్చట కథా సందర్భానుగుణముగా వాల్మీకి రామాయణమునందలి శ్లోకములును, తెలుగు పద్యములును ఉద్ధరింపబడినవి. తెలుగు పద్యములు కవి సమ్రాట్ డాక్టరు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి శ్రీ మద్రామాయణ కల్పవృక్షమునందలివి''[9] అని తెలియజేశారు.

ఈ విద్యాగద్య రామాయణాన్ని గౌరీదేవికి అంకితం చేశారు. శ్రీ జి.పుల్లారెడ్డిగారి ఆర్థిక సహాయముతో ముద్రింపబడింది. అవధానిగారికి వాల్మీకిపై భక్తితో కూడిన అభిమానం విశ్వనాథ సత్యనారాయణగారి మీది గురుభావం ఉన్నాయి. అందుకే వారి శ్లోకాలనూ పద్యాలనూ ఉద్ధరించారు. అనువాద కావ్యాల్లో ఈ విధంగా శ్లోకాలు పద్యాలు ఉద్ధరించిన సందర్భాలు తెలుగు సాహిత్యంలో కనిపించవు. అవధానిగారు చేసిన ఈ ప్రయోగం వినూత్నమైనది.

అయోధ్యకాండలో పదకొండు (11) వాల్మీకి శ్లోకాలనూ, పధ్నాలుగు (14) విశ్వనాథ వారి పద్యాలను ఉదహరించారు. ఇవన్నీ రసవత్తరమైనవే. ఉదాహరణకు ఒక సందర్భాన్ని ఇక్కడ ఉదహరిస్తాను.

అహల్య, దేవేంద్రుడు చేసిన తప్పుకు గౌతముడు వారిని శపించాడు. చాలామంది తెలుగు రామాయణ కర్తలు అహల్యను రాయిగా పడి వుండమని దేవేంద్రునకు శరీరమంతటను యోనులు కలుగుగాక అని శపించినట్లు రచించారు. కానీ వాల్మీకి రామాయణంలో మాత్రం ఇందుకు భిన్నంగా ఉంది. అహల్యను నిరాహారిగా వాయుభక్షయై ఎవ్వరికీ కనబడకుండా భస్మమున శయనించి తపమొనరించుచు వేయేండ్ల వసింతువుగాక అని శపించి దశరథాత్మజుడైన రాముడిక్కడికి వచ్చినప్పుడు నీవు పూతవై అతనికి ఆతిథ్యమొసంగి మరల నీ దేహమును ధరింతువు అని శాపవిమోచనను కూడా తెల్పాడు. దేవేంద్రుని వృషణహీనుని కమ్మని శపించాడు. ఈ విషయం విశ్వామిత్రుడు రామలక్ష్మణులతో చెప్పి అహల్యాశాప విమోచన చేయుమని రామునితో చెప్పుతాడు.

''విశ్వామిత్రుని పల్కులు విని రాముడు లక్ష్మణునితో కూడా ఆశ్రమము ప్రవేశించి తపః ప్రభావదుర్నిరీక్షయు, అతిమానుషరూపియు అయిన అహల్యను చూచెను వారట్లు ఆశ్రమము ప్రవేశింపగానే శాపాంతమును పొంది అహల్య వారి దర్శనమునకై వచ్చెను.

ప్రభుమేనిపై గాలి వచ్చినంతనే పాషాణమొకటికి స్పర్శవచ్చె
ప్రభుకాలిసవ్వడి ప్రాంతమైనంతనే శిలకొక్కదానికి జెవులుకలిగె
ప్రభుయేని నెత్తావి పరిమళించిన తోన యశ్మంబు గ్రాణేంద్రియంబునాందె
ప్రభు నీల రత్నతోరణ మంబుతాంగంబు కనవచ్చి నాతికి, గనులుగలిగె
ఆ ప్రభుండువచ్చి యాతిథ్యమును స్వీక
రించినంత సుపల హృదయ వీధి
నుపనిషద్విలాన మొలికి శ్రీరాము భ
ద్రాభిరామ మూర్తి యగుచు దోచె.

అని ఈ సందర్భమున కవి సమ్రాట్టులు శ్రీరాముడు ఆశ్రమమును చేరవచ్చిన కొలంది రాయియై పడివున్న అహల్యకు క్రమముగా ఇంద్రియములు సిద్ధించెననియు, తరువాత ఆమె మంగళాకృతి అయిన స్త్రీమూర్తి దాల్చెననియు చక్కగా వర్ణించి ఉండిరి'' [10] అని విశ్వనాథవారి పద్యాన్ని గ్రహించి వ్యాఖ్యానించారు అవధానిగారు.

వాల్మీకి శ్లోకాన్ని వ్యాఖ్యానించిన మరో సందర్భం ఇలా ఉంది. పితృవాక్య పరిపాలనకై రాముడరణ్యవాసం చేయడానికి నిర్ణయించుకొంటాడు. ఈ విషయం సీతకు తెలియజేస్తాడు. తానుగూడ అరణ్యవాసానికి వస్తానంటుంది సీత. రాముడామెను అయోధ్యలో ఉండమంటాడు. ఆమె అందుకు ఒప్పుకోదు, ప్రాణత్యాగం చేస్తానంటుంది, రాముడామెను అయోధ్యలో ఉంచడానికి అనేక విధాల ప్రయత్నిస్తాడు. సీత ఒప్పుకోదు.

రామునిమీద ప్రణయ కోపంతో -

శ్లో॥ ''కింత్వా మన్యత వైదేహ, పితామే మిధిలాధిపః
రామ జామాతరం ప్రాప్తం స్త్రీయం పురుష విగ్రహం'' ॥

(రామా పురుష విగ్రహుడవైన స్త్రీని నిన్ను అల్లునిగా పొంది మిథిలాధిపుడైనాతండ్రి నిన్ను గూర్చి ఏమని భావించును. సీత శ్రీరాముని గూర్చి ఇట్లు పల్కుట ఉచితమా అనుసందేహము పలువురికి కలుగవచ్చును, పైకి శ్లోకమునందలి భావమాక్షేపము వలే కనిపించును, వ్యాఖ్యాతలు కొందరీ విధమున తాత్వికార్థములు సూచించారు.

1. రామజ + అమాతరం + ప్రాప్య + స్త్రయం + పురుష + విగ్రహం.

అని పదచ్ఛేదము చేసినచో క్రీడార్థమవతరించిన పరమపురుష. మాతృవ్యతిరిక్త (సపత్నీమాత) అయినకై కనుద్దేశించి కలహ మిట్టుదయించునని నాతండ్రి తలించి యుండలేదు.

2. పురుషులను (భక్తులను) విశేషముగా ఆకర్షించునట్టియు, యోగులు కూడా రమించు ఆనందరూపుడవైనట్టియు, నిన్నల్లునిగా పొందినాతండ్రి పుత్రమిత్ర కళత్రాది రూపమైన ఈ లోకమును తుచ్ఛముగా భావించి పరమానంద రూపుడవైన నీవు నన్ను విడచిక్లేశపెట్టుట పాడికాదని భావము.

అని ఇతర వ్యాఖ్యాతల అభిప్రాయాలను కూడా ఈ సందర్భంలో వ్యాఖ్యానించారు. అనువాదంలో కానీ అనుకరణలోకాని ఈ విధంగా చేసినవారు తెలుగు సాహిత్యంలో అరుదు. కానీ అవధానిగారు మాత్రం వాల్మీకి మీది భక్తి భావాన్ని, విశ్వనాథ సత్యనారాయణగారి మీది గురుభావాన్నీ ఇతర వ్యాఖ్యాతల మీది గౌరవాన్ని ఈ విధంగా చాటుకొన్నారు.

అయోధ్యకాండలో వాల్మీకి శ్లోకాలను మూడు విశ్వనాథ సత్యనారాయణగారి పద్యాలను ఎనిమిది గ్రహించారు. శ్రీ విద్యా గద్య రామాయణం వాల్మీకి రామాయణానికి అనువాదం అనుటకంటే అనుసరణ అనుట సముచితం ఎందుకనగా వాల్మీకి రామాయణంలోని కథా సంవిధానాన్ని అవధానిగారు అనుసరించారు. వర్ణనలను తగ్గించారు. రామాయణంలో వాల్మీకి ప్రదర్శించిన కవితా కౌశలాన్నీ తెలుగు వారికి తెలియజెప్పడానికి ప్రయత్నించారు. రామాయణంలో నీతిని సులభమైన భాషలో అతి సామాన్యులకు కూడా తెలియజేయాలనే సత్సంకల్పంతో అవధానిగారీ శ్రీ విద్యాగద్య రామాయణాన్ని రచించారు.

ప్రథమ సంపుటంలో బాలకాండ అయోధ్యకాండలలోని ఇతివృత్తాన్ని చేర్చారు. కానీ అయోధ్యకాండలోని పాదుకాపట్టాభిషేక వృత్తాంతాన్ని రెండవ సంపుటంలో చేర్చారు.

అనాగా అరణ్యకాండలో కలిపినారు. అవధానిగారు మాత్రం భరతుడు తల్లులతో మంత్రులతో అయోధ్యను వదలి అరణ్యంలోని శ్రీరాముని దర్శించడానికి బయలు దేరుటతో అయోధ్యకాండను పూర్తిచేశారు. ఈవిధంగా చేయుట కూడా సమంజసంగా ఉన్నది. భరతుడు అయోధ్యను వదలిన తరువాత శ్రీరాముడు తిరిగ అయోధ్యకు వచ్చునంతవరకు తాను కూడా అయోధ్యలో అడుగుపెట్టడు, నగర వాసాన్ని రాజభోగాలను త్యజించాడు. యోగిలా జీవించాడు, అందుకే అవధానిగారు ఈ మార్పు చేశారు.

ఇది ప్రథమ సంపుటిలో కాండల విషయంలో అవధానిగారు చేసిన మార్పు. ఈ మొదటి సంపుటాన్ని అవధానిగారు 1976 వరకు సరియగు నలనామ సంవత్సరంలో రచించారు. అనగా తన అరవైనాలుగవ యేట రచించారు. అప్పుడవధానిగారు పండిన పాండిత్యంతో మూటగట్టుకొన్న అనుభవాల సిరితో లోకహితార్థం యేదైనా మంచి రచన చేయాలనే ఉద్దేశంతో ఉన్నారు. ఆ దశలో చేసిన రచనకాబట్టే లోకహితం కోసం పాండితీ ప్రకర్షను ప్రదర్శించక తన అనుభవాలను సమ్మిళితం చేసి వాల్మీకి రామాయణాన్ని గద్య రామాయణంగా రాయడానికి పూనుకున్నారు. కృతకృత్యులయినారు.

## 5. బల్గేరియా జనచరిత్ర

ఆంగ్లంలో హీరేన్ ముఖర్జీ రాసిన దానికి అవధానిగారు తెలుగులో అనువాదం చేశారు. బల్గేరియా దేశ ప్రజలయొక్క పోరాట పటిమను ఆ దేశ చారిత్రక రాజకీయ సాంఘిక చైతన్యము, నైసర్గి స్వరూపము ఈ వచనానువాద కావ్యంలో కనిపిస్తుంది. ఇది 1979లో ప్రచురింపబడినది.

బల్గేరియా చరిత్ర పదమూడు వందల యేండ్ల పురాతనమైనది. బల్గేరియాలో నేడు ప్రముఖ పారిశ్రామిక సాంస్కృతికకేంద్రమైన 'ప్లోడిల్' నగరము సుమారు మూడు వేలేండ్లకు పూర్వం ''యుయోల్పియస్'' అను త్రాసియన్ గ్రామంగా ఉండేది. క్రీ.పూ. 5వ శతాబ్దిలో త్రేషియాకు ముఖ్యపట్టణమాయెను. క్రీ.పూ. 341వ సంవత్సరమున అలెగ్జాండరు తండ్రి రెండవ పిలిప్ దానినాక్రమించాడు. దానికి 'పిప్పోపోలిస్' అను పేరు పెట్టబడింది. ఆ తరువాత రోమనులు జయించి దానికి మరో క్రొత్త పేరు పెట్టారు. ఈ ప్లోడిత్ నగరం బల్గేరియన్ చరిత్రకు సంబంధించి పెక్కు ప్రసిద్ధదశలొక విధంగా ఆకర్షమైన ప్రతిబింబంగా నొప్పారుచున్నది. బల్గేరియాకు రాజధానియగు 'సోఫియా' నగరానికి పూర్వకాలం ఉల్పియా సెర్టికా అను పేరుండేది.

ఆదిమ బల్గేరియనులచే నేర్పరచబడిన గిరిజన రాజ్యమునకు స్థాపకుడు ప్రసిద్ధుడైన ఖాన్‌కౌబ్రాట్ అతడు జీవితారంభ దశలో ''బైజాంటయన్లో' నివసించాడు. ఇతడు

జీవితారంభ దశలో క్రైస్తవ మతాన్ని స్వీకరించాడు. అతని మూడవ కుమారుడు 'అస్పరే'తోనే బల్గేరియన్ రాజ్యమారంభమైనది. సుందరమైన ఒక దేశం మాటిమాటికి అమిత బాధామయమైన కాలం గడపవలసి వచ్చింది. అది తన ఆత్మనెప్పుడు కోల్పోలేదు. దాని దేహం మాత్రం తరచుగా శుష్కించింది. అదృష్టవశమున నేడు బల్గేరియా సామ్యవాద ప్రగతి పథమున స్థిరంగా పయనిస్తున్నది. స్వాతంత్ర్యం కొరకు పోరాడే ప్రజలకది ఉత్సాహకరమైన ఒక చక్కని తార్కాణం అని ''పతనోన్నతులతో కూడిన దీర్ఘము ఉజ్వలమునైన చరిత్ర'' అనే భాగంలో తెలియజేయబడినది. ఇటువంటి పదిహేను విభాగలుగా ఈ బల్గేరియా జనచరిత్ర వింగడించబడినది. ''భూమి ప్రజలు'' అనే విభాగంలో బల్గేరియా బాల్కను ద్వీకల్పమునందలి ఆగ్నేయ భాగంలో గల చిన్న దేశం. దాని వైశాల్యం 110-000 చదరపు కిలోమీటర్లు. అది కొంచెమించుమించు దీర్ఘ చతురస్రాకారంగా ఉండును. దానికి తూర్పున నల్లసముద్రం, పడమట యుగోస్లావియా, దక్షిణాన గ్రీకు, టర్కీ దేశాలు, ఉత్తరాన రొమేనియాలు యెల్లలుగా ఉంటాయి. భూమి నిమ్నోన్నతమై వైవిధ్యంతో కూడి వుంటుంది. తీరమునందంతా సముద్రం కలిగి వుంటుంది. బల్గేరియా జనాభా ఎనిమిది మిలియన్లు దాటింది. వీరిలో 88 శాతం బల్గేరియన్లు. వీరి భాష స్లానిక్ వర్గానికి చెందింది. ఇది రష్యా, క్రోషియన్ భాషల సాదృశ్యం కలిగి వుంటుంది. టర్కీ బాతీవారు 8.6 శాతం ఉంటారు. అల్పసంఖ్యాకులలో వీరిది ప్రథమ స్థానం. క్రిష్టీల జనాభా 2.6 శాతం ఉంటుంది. ఇంకా టాబారులు, ఆర్మేనియన్లు, జ్యూలు గ్రీకులు కూడా ఉంటారు అని పేర్కొన్నారు.

మూడవ విభాగం ప్రారంభ విజయములలో - క్రీ.శ. 9-10వ శతాబ్దాలలో బల్గేరియా అత్యున్నత స్థితిలో ఉండేది. బల్గేరియా బైజాంటైన్ సామ్రాజ్యంతో అనేకసార్లు తలపడవలసి వచ్చింది. కానీ విజయాలనే సాధించారు. ఇప్పటివరకు వారికి పరిపాలనానుభవంగానీ ఒక లిపిగానీ, చెప్పుకోదగిన సంప్రదాయంగానీ లేవు. గిరిజన సంప్రదాయాలకు సంబంధించిన మూఢ విశ్వాసాలకంటే మించిన మతం గూడ వాళ్లకు లేకుండెను.

రానురాను వీరు క్రైస్తవ మతంవైపు ఆకర్షితులయి ఆ మతాన్ని స్వీకరించారు. కొంత బలవంతంగా కూడా ఈ మతాన్ని ప్రజలు అవలంబించారు. బోరిస్ అనే రాజుకాలంలో ఈ మతం స్థిరత్వంనొందింది. ''సిరిల్'' ''మెనోడియస్'' అను స్లావ్ ప్రవక్తలు సిరిలికి వర్ణసమామ్నాయాన్ని ప్రవేశపెట్టారు. వీరిద్దరు అన్నదమ్ములు. వీరి శిష్యుడు క్లెమెంటు, రచయిత ఋషి, వాస్తవికుడు, బల్గేరియా చరిత్రలో అమరుడు, అని ప్రారంభ విషయంలో తెలియజేశారు.

ఈ విధంగానే బల్గేరియాలో వచ్చిన బోగోమిల్ ఉద్యమంలో ప్రజల సంఘటిత శక్తిని,

నాలగవ భాగంలోనూ, రాజకర్షక వీరులైన ''ఇవాన్ అసెన్'' ''ష్వైలోటను'' గురించి ఐదవ విభాగంలో తెలియజేశారు.

సుందరమైన బల్గేరియా దేశానికి 14వ శతాబ్దాంతానికి క్షీణదశ వచ్చింది. అభ్యుదయం అరికట్టబడింది. అయినా బల్గేరియన్లు పూర్తిగా వినాశం కాలేదు. దేశం నలుబది చిన్న ముక్కలుగా చీలిపోయిన విధానాన్ని ఆ ఆపద్దశనధిగమించడానికి వ్యాపింపజేసే అన్వేషణలో ఈ దశలో నిమగ్నమై బల్గేరియన్ల స్థితిని తెలియజేశారు. ''సుందరదేశం యొక్క క్షీణత'' అనే ఆరవ విభాగంలో దీర్ఘదాస్యమనే ఏడవ విభాగంలో 15వ శతాబ్ది నుండి 18వ శతాబ్దం వరకు బల్గేరియన్లు అనుభవించిన కష్టాలు పన్నులను కట్టలేక పాలకుల బాధలు భరించలేక అరణ్యవాసాలకు వెళ్లిపోయిన విషయాలు వివరించబడినాయి. ఎన్ని కష్టాలు ఎదురైనా బల్గేరియన్లు స్వాతంత్ర్య పోరాటం మానలేదు. తిరుగుబాటు తత్త్వం వదలలేదు.

విద్య జాతీయ గౌరవాలకై చేసిన పోరాటంలో 'వైస్స' అను నాయకుని పాత్ర గురించి దేశంలో జరిగిన అల్లకల్లోలాల గురించి, రాజభటులకే జీతాలు లేక ప్రజలను దోచుకొన్న సంఘటనలను గురించి తెలియజేశారు. బల్గేరియా క్రీ.శ. 1780నుండి 19వ శతాబ్దిలో మొదటి దశాబ్దం వరకు ''కుర్దులీయుగము''ను అనుభవించింది. ఇది చాలా ఘోరమైన కాలం. నిరంకుశుడైన పాషా మరణానంతరం అరాచక పరిస్థితి క్రమంగా సన్నగిల్లింది. వైస్సీ అనే సన్యాసి వాడుక భాషలో సరళంగా శక్తివంతమైన రచనలు చేసి కర్షకులలో గొర్రెల కాపరులలో, కార్మికులలో దేశాభిమానాన్ని రేకెత్తించాడు, పోరాటానికి ప్రోత్సహించాడు. జన చైతన్యానికి ప్రథమాగ్ని కణాన్ని రగిలించాడు. ఇతని ప్రభావంతో ఎందరో దేశం కొరకు తమ మతం కోసం ప్రాణాలర్పించారు. జాతీయ పాఠశాలలు గ్రంథాలయాలు, ప్రార్థనామందిరాలు ప్రజలు స్థాపించుకోసాగినారు.

1876లో ఏప్రిల్ నెలలో బల్గేరియాలో గొప్ప తిరుగుబాటు జరిగింది. ఈ తిరుగు బాటులో వెలిస్కీ అనే మత ప్రచారకుడు నిర్వహించిన పాత్ర తొమ్మిదో భాగంలో చెప్పబడినది.

ఈ పోరాటం తరువాత 1878 మార్చి 3వ తేదీ బల్గేరియాకు స్వాతంత్ర్యం వచ్చింది. కానీ బల్గేరియా మూడు భాగాలుగా విభజింపబడింది. ఇది సోదర యుద్ధాలకు దారితీసింది. స్వాతంత్ర్యానంతరం కూడా బల్గేరియన్లు సుఖజీవనం చేయలేదు. అనేక సమస్యలతో సతమతమైనారు. పెద్దరాజ్యాల కుట్రలకు బలి అవుతూనే వచ్చారు. అయినా తమ విజృంభణ మాత్రం విస్తృతం చేశారు. 1985లో రుమేనియా బల్గేరియాలో కలిసింది.

1891లో డిమిటర్ బ్లాగోలిచే రూపొందించబడిన సామ్యవాదతత్త్వం శ్రామికుల్లో

అభ్యుదయ భావాలను కల్గించాయి. 1894లో రష్యాకు అనుకూలుడైన 'కోన్‌స్టానిన్ స్టోయిలోలోల్' మంత్రివర్గాన్ని ఏర్పాటుచేశాడు. 1911 వరకు పాలన సాగించాడు. 13సార్లు మంత్రివర్గాన్ని మార్చాడు. జార్జి డిమిటోలోల్ మార్క్సిస్టు సిద్ధాంతాలను నమ్మి ప్రచారం చేశారు. ఒక వ్యవసాయిక సంఘం కూడా స్థాపించాడు. ఇంతలో ప్రథమ ప్రపంచ సంగ్రామం వచ్చింది. జర్మనీ బల్గేరియా వనరులనన్నిటినీ పీల్చివేసింది. 1918 తరువాత బల్గేరియా అతి కష్టంమీద కోలుకొన్నది. 1929లో శ్వేత భీభత్సం పరాకాష్ట నందుకొన్నది. ఫాసిస్టులకు వ్యతిరేకంగా పోరాటం జరిగింది. 1931లో ఎన్నికలు జరిగాయి. అప్పుడు జనతా వర్గం అధికారంలోకి వచ్చింది. అప్పటికి దేశం ఆర్థికంగా దివాలా తీసి వుంది. 1932లో సోఫియా పురపాలక సంఘానికి జరిగిన ఎన్నికల్లో కమ్యూనిస్టులు గెలిచారు. ఫాసిస్టులకు వ్యతిరేకంగా పోరాడిన 'డిమిబావ్' చరితాత్ముడయినాడు. కానీ అతనికి బల్గేరియాలో ప్రవేశం కలుగలేదు. రష్యా ఆహ్వానించి ఆదరించింది. 1935 నాటికి మూడవ బోరిస్ బల్గేరియాకు ఏకైక పరిపాలకుడైనాడు. అతడు 1943లో మరణించాడు. ఎన్ని వ్యతిరేకతలెదురైనా రెండు ప్రపంచ యుద్ధాల కాలాల మధ్యలో పారిశ్రామికంగా కొంత ప్రగతిని సాధించింది. 1940 నుండి సుమారు మూడు సంవత్సరాలు బల్గేరియా హిట్లరుచే ఆక్రమించబడింది. దీనికి జర్మనీ వారు సాయం చేశారు. సమారు మూడున్నర సంవత్సరాల కాలం అతని అధీనంలో వుండినది. 1941 జూన్ 22వ తేదీ హిట్లరు సోవియట్‌పై దొంగవలె దండెత్తాడు. అప్పుడు బల్గేరియన్లు రష్యాకు సాయంగా చాలామందినిలచారు. డిమెట్రోల్ రంగప్రవేశం చేశాడు. అతడు రష్యానుండే బల్గేరియన్లను ప్రబోధించారు. 1944 మే నెలలో ఒక పెద్ద బల్గేరియన్ సేవా దళం యుగోస్లావియా పాక్షికులతో కలిసి బల్గేరియన్ ఫాసిస్టు సేనలతో పోరాటానికై డెమిట్రోల్ పేర పేర్కొనబడిన పెద్ద వ్యూహంగా ఏర్పాటైంది. 1944 సెప్టెంబర్ 5వ తేదీ యుఎస్ఎస్ఆర్ రాజతంత్రంతో కూడిన పాసిస్టు బల్గేరియాపై యుద్ధం ప్రకటించింది. 1944 సెప్టెంబర్ 9 ఉదయం పాదర్‌లాండ్ రంగ ప్రభుత్వ ఏర్పడినట్లు రేడియోలో వార్తలు ప్రసారం అయ్యాయి. 1945 నవంబర్ 5వ తేదీన దేశానికి తిరిగి వచ్చిన డెమిట్రోల్‌కు బ్రహ్మాండమైన స్వాగతం లభించింది. 1946 సెప్టెంబర్ 8వ తేదీ ప్రజాభిప్రాయాన్ని అనుసరించి రాజరికాన్ని తొలగించడానికి నిశ్చయించారు. డెమెట్రోల్ పాదర్‌లాండ్ ప్రభుత్వాన్ని స్థాపించాడు. 1947 ఫిబ్రవరి 10వ తేదీ పారిస్ నగరంలో శాంతిపత్రంపై సంతకం చేయడం జరిగింది. సోవియట్ యూనియన్ యొక్క అచంచల సాయంతో బల్గేరియా తన సరిహద్దులనన్నిటిని సమగ్రంగా నిలుపుకొని పాసిస్టు వ్యతిరేక వర్గంలో సంపూర్ణ సభ్యత్వం పొందింది. బల్గేరియన్లు నూతన స్వతంత్ర్య క్షితిజసిద్ధుల కోసం అన్వేషణతో కూడ ప్రయాణం సాగించింది. 1946 సెప్టెంబరులో బల్గేరియా ప్రజా గణతంత్ర రాజ్యంగా ప్రకటింపబడింది. 1946 అక్టోబర్‌లో ఎన్నికలు జరిగాయి. 1947 డిసెంబర్‌లో

ప్రజాగణతంత్ర రాజ్యం నూత్న పరిపాలనా విధానాన్ని ఆరంభించింది.

496000 మంది సభ్యులతో కూడి డిట్రోమిల్ నాయకత్వంలో 1948లో సమావేశమై ఐదవ చారిత్ర పక్ష మహాసభ రాబోవు 10, 20 సంవత్సరాల కాలంలో బల్గేరియాలో సామ్యవాదాన్ని నిర్మించడానికి సాధారణ విధానాన్ని రూపొందించింది. 1947లో ఫ్యాక్టరీలను బ్యాంకులను జాతీయం చేశారు. మార్క్సిజము, లెనినిజము పద్ధతులననుసరించి సాంస్కృతిక రంగాలను విప్లవాత్మక విధానాలను పెంపొందించడానికి కార్యక్రమాలు రూపొందించబడినాయి. 1949లో డిమిట్రోల్ మరణించాడు. అతనినుండి ప్రభుత్వాన్ని స్వీకరించిన కోలరోల్1950 ప్రాంతంలో మరణించాడు. బోడోర్ ఝుల్ కార్యదర్శి పదవిని గ్రహించాడు. 1957 నాటికి బల్గేరియా పారిశ్రామికోత్పత్తిని 76 శాతం సాధించింది. 1958 నాటి వ్యవసాయమైన భూమిలో 92 శాతం సహకార వ్యవసాయం క్రిందికి వచ్చింది.

1971లో బల్గేరియా కమ్యూనిస్టుల దశమ మహాసభ విజయనగరంలో సమావేశమైంది. స్వాతంత్ర్యం సాధించిన 22 సంవత్సరాలలో దేశం యొక్క స్వరూపమే మారిపోయింది. 1977 జనవరి నాటికి అంతకు మునుపు వ్యవసాయంతో యంత్రాలు వాడటానికి తెలియని బల్గేరియన్లు ఒక లక్షా పదివేల ట్రాక్టర్లు 20వేల కంబయన్లు మొదలైన యంత్రాలతో వ్యవసాయాభివృద్ధి సాధించసాగారు. 1973లోనే ఆరులక్షలా ముప్పయివేల (630000) టన్నుల ఎరువు తయారుచేశారు. హెక్టారుకు 130 కేజీల ఎరు వాడుతూ ప్రగతి సాధించారు. 1939లో వారి జాతీయాదాయం 2484-7 మిలియన్లు మాత్రమే. 1972 నాటికి వారి జీతీయాదాయం 11079.5 మిలియన్లు. ప్రతి పదివేలమందికి 120 మంది విశ్వవిద్యాలయ విద్యార్థులున్నారు. విశ్వవిద్యాలయ విద్యార్థులలో ఇది ప్రపంచంలో ప్రథమస్థానాన్ని ఆక్రమించింది.

ఇవి బల్గేరియా జనచరిత్రలోని కొన్ని ముఖ్యాంశాలు. అవధానిగారు అనువాదంలో ఎంతో విశిష్టమైన పద్ధతిని అనుసరించారు. ఇది చరిత్ర కనుక యదార్థాలను యథాతథంగా అనువదించారు. భాషకూడా చరిత్ర విషయాలు చెప్పడానికి అనువైన సరళత్వాన్ని కలిగి వుంది. అరసున్నలు శకటరేఫాలు అసలు కనిపించవు. అసలు గ్రాంధిక భాషా వాసనలే ఇందులో ఏ కోశానా లేవు. లిపి అనువాద పదాలు నామవాచకాల్లో మాత్రం కనిపిస్తాయి. ఇది తప్పనిసరి ఇంగ్లీషు పదాలు వాడిన సందర్భాలు చాలా తక్కువ. అవధానిగారి ఇతర వచనరచనలలోని భాషకు బల్గేరియా జన చరిత్రలోని భాషకు చాలా విలక్షణత కనిపిస్తున్నది. ఇది ఇంగ్లీషునుండి తెలుగులోనికి అనువాదం చేసిన రచన అందులోనూ చరిత్ర చరిత్రలో కూడా పరదేశీయ చరిత్ర దీనికి కారణం కావచ్చు. ''మృతవీరుల రక్తం పోసి పెంచినప్పుడు భావాంకురములు త్వరగా పెరుగును'' [12]

''స్వాతంత్ర్య సమరమ్ము ప్రారంభమగుచు
నొడ లెల్ల రక్తమ్ము నోడ్పుపితనుండి
వారసత్వంబుగా వచ్చి తనయునికి
కలత నొందిన తుదకి గాంచు విజయమ్ము'' [13]

వంటి పద్యాలు కూడ ఒకటి రెండిందులో పొందుపరచబడినాయి. ఇది పదానువాదము కాదు. భావానువాదము కాదు. విషయానువాదము. విషయం పొల్లుపోకుండా అనువాదం చేయబడిన అనువాద వచన కావ్యం బల్గేరియా జన చరిత్ర. పోరాటమే జీవనంగా జీవించిన బల్గేరియన్ల చరిత్రను తెలుగులోనికి అనువదించి తెలుగువారిలో కూడా క్రొత్త చైతన్యాన్ని కల్గించే యత్నం చేసిన అవధానిగారి కృషి అభినందనీయం.

## 6. కాదంబరి

కాదంబరిని సంస్కృతంలో బాణుడు గద్యకావ్యంగా రచించాడు. సంస్కృత వాఙ్మయంలో పద్యకావ్యాలతో సమానమైన గౌరవం గద్యకావ్యాలకు ఉంది. గద్యంలో రచించిన కాదంబరికి సంస్కృతంలో ఒక ప్రత్యేక గౌరవం బాణుని రచనా వైశిష్ట్యం వలన కలిగింది. గీర్వాణ గద్య కావ్యాలలో అగ్రస్థానం పొందింది అందలి వర్ణనలు వాక్యాలు నాతి దీర్ఘములు, భావాలతి ప్రౌఢము. ''కాదంబరీ రసజ్ఞానామా మరోసినరోచతే'' అను నానుడి సంస్కృత కాదంబరికి నేర్పడింది. సంస్కృతంలోనే దీనికి రెండు మూడు సంగ్రహ రూపాలు ఏర్పడినాయి. తెలుగులో కూడా మూడు నాలుగు అనువాదాలు వచ్చాయి. ఉ.వే.ఆ.ప్ర శ్రీమాన్ పండితి రఘునాథాచార్యులు తెలుగులోనికి కాదంబరిని సంగ్రహ కాదంబరి అనే పేరుతో అనువదించారు.

బాణుడు క్రీ.శ. 7వ శతాబ్దికి చెందినవాడు. హర్ష చరిత్ర, కాదంబరి అనునవి ఇతని ప్రసిద్ధ గద్య రచనలు. పార్వతీ పరిణయమనే నాటకము, చండీ శతకమును కూడా రచించాడు.

కాదంబరిలోని కథ ప్రఖ్యాతం కనుక నేను ఇక్కడ సంగ్రహంగా కూడా చెప్పడం లేదు. కాదంబరి కథ చాలా మనోహరమైనదే కానీ, ఇది మూడు జన్మల వృత్తాంతం. వర్ణనలెక్కువ. అద్భుతావ సంఘటనలధికం. అవధానిగారు తన అనువాదమును గురించి ఇట్లు తెలియ జేశారు.

''బాణుని కాదంబరి కథను సంగ్రహము కావించుటకై కొందరు మహనీయులు వర్ణనాదులను సంక్షేపించి దానికి సంగ్రహ రూపములను వెలయించి యుండిరి.

అట్టివారిలోలో షోలాపూరు నివాసులగు శ్రీ ఎన్.ఎన్.నవరేగారు కూర్చిన సంస్కృత కాదంబరీ కథ యొకటి. అందు వర్ణనాదులను చాలావరకు తగ్గించుట, గ్రంథమును నాలుగింట నొక పాలునకు గురించి యల్పకాల పఠనీయముగా నొనరించుట, అతి శృంగార రసపూరితములైన భాగములను సంక్షేపించుట, కథ మూలమునందట్లుగాక జరిగిన క్రమముననుసరించి తెలుపుట చాలావరకు బాణుని మూల కావ్యమందలి పదములచే యథాతథంగా నుపయోగించుట మున్నగునవి ప్రత్యేక లక్షణములు. దానిని ప్రధానంగా గ్రహించి సంగ్రహీకృతములైన ఇతరుల గ్రంథములను, బాణుని మూలమును వలసిన చోట్ల సంప్రదించుచు నేనీ యనువాదమును గానించితిని. బాణ మహాకవి కాదంబరి యందలి యద్భుతమైన కథను సులభపదములతో నాంధ్రలోకమున కందిచ్చుటయే నాయి యనువాదమునకు ప్రధాన ప్రయోజనము'' [13]

అవధానిగారు ఈ కాదంబరి వికలాంగుడైన చీమలమర్రి రామకృష్ణడను నాతనికి రచించి ఇచ్చారు. ఈ రామకృష్ణగారు ఇటువంటి పుస్తకాలను ప్రచురించి వాటి ద్వారా ఉపాధి కల్పించుకొనుచున్నానని తెలియజేశారు. 1981 ఏప్రిల్ నెలలో ప్రచురించబడింది.

''మూలం మల్లెపువ్వు అనువాదం అత్తరు'' అన్నాడు ఒక విమర్శకుడు. బాణ మహాకవి మూలం మల్లెపూవులా పరిమళించి శోభ కలుగజేస్తే అవధానిగారు అందులో సారాంశాన్ని తెలుగువారికి అందించిన విధానం అత్తరులా పరిమళిస్తోందని చెప్పవచ్చు. అసలు అనువాదాలు ఎందుకు చేయాలి? అని ప్రశ్నించుకుంటే ఒక భాషలోని విజ్ఞానాన్నీ, సారవంతమైన సారస్వతాన్ని మరో భాషా సమాజం వారికి తెలియజెప్పడానికి అనువాదాలు ఎంతో అవసరం. ప్రపంచంలో సుమారు (2000) భాషలున్నాయి. ఏ మానవుడు ఇన్ని భాషలను తన జీవితకాలంలో నేర్చుకోలేడు. కానీ ప్రపంచంలోని భాషలన్నింటిలోని విజ్ఞానాన్ని ఒక భాషను మాతృభాషగా వ్యవహరించే వాళ్ళు. తన భాషలోకి తెచ్చుకోవడం సాధ్యమే. తెలుగులో ఈ అనువాదానికి భాషాంతరీకరణమనీ, తర్జుమా అనీ అనువాదమనీ పేర్లున్నాయి. అనువాదం చేసే భాషను (Source language) మూల భాష అనీ, ఏ భాషలమోకి అనువాదం చేస్తామో దానికి (Targch Language) లక్ష్యభాష అనీ అంటారు. అసలు మన తెలుగు భాషలో ఆదికవి నన్నయ చేసినపని అనువాదమే. అనువాదం సాంస్కృతికవైజ్ఞానిక వినిమయ సాధనం. అనువాదాన్ని విషయాన్ని బట్టి నాలుగు విధాలుగా విభజింపవచ్చు.

1. సమాచారానువాదం
2. వచనసాహిత్యానువాదం

3. కవిత్వానువాదం

4. వైజ్ఞానిక సాంకేతిక పాఠనువాదం

అవధానిగారు చేసింది వచన సాహిత్యానువాదం. ఇది సాహిత్య సృజనకు సంబంధించిన కృషి. వచన సాహిత్యం మనుషుల అనుభవాలనూ, అనుభూతులను, భావాలను, ఉద్వేగ ప్రకటనలను, నుడికారాలను, పదాలను, అర్థచ్ఛాయాలను అర్థవిశేషాలను అనువాదం చేస్తారు.

అనువాదాన్ని విధానాన్ని బట్టి రెండు విధాలుగా వింగడింపవచ్చు.

1. మూలవిధేయానువాదం (Literal of faithful Translation)

2. స్వేచ్ఛానువాదం (Free or endomatic Translation)

ఇందులో అవధానిగారు చేసింది మూల విధేయానువాదం. ఇందులో ఉండవలసిన గుణాలు నాలుగు. 1. అనువాదం చదివినా మూలం చదివినట్లే ఉండాలి. 2. మూలంలోని రచనా విధానమే అనువాదంలో ప్రతిఫలించాలి. 3. మూలం వెలువడిన కాలం నాటి రచనలాగే అనువాదం వుండాలి. 4. మూలంలోని అస్పష్టతనూ, అర్థరహితమూ అయిన పలుకుబడిని అనువాదంతో ప్రత్యేకంగా అధోజ్ఞాపికలతో చూపించాలి.

ఈ గుణాలు అవధానిగారి అనువాద రచనలో బల్గేరియు జన చరిత్రలోనూ, కాదంబరిలోనూ పుష్కలంగా కనిపిస్తాయి. ఒక్కొక్కచోట స్వేచ్ఛానువాద లక్షణాలు కూడా కనిపిస్తాయి. సంస్కృత ఆంగ్ల ఆంధ్ర భాషలలో అవధానిగారు నిష్ణాతులు. అనువాదాలను సహజ సుందరంగా చేసి కృతకృత్యులయినారు. భాషా పఠనానికి పదును పెట్టుకోవడానికి కూడా అనువాద రచనలు ఉపయోగపడతాయి.

కాదంబరిలో అవధానిగారు ప్రదర్శించిన కథా కథన కౌశలము ప్రశస్తమైనది. వాడిన భాష సరళమై శైలి రమణీయమై ఉన్నది.



# చతుర్ధ ప్రకరణం

# విమర్శ కృతుల విశ్లేషణ

## 1. ఆంధ్రనాటక పితామహుడు

దివాకర్ల వేంకటావధానిగారు 1937వ సంవత్సరంలో ఎం.ఏ ఆనర్సు పట్టా కోసం ఆంధ్ర విశ్వవిద్యాలయానికి సమర్పించిన పరిశోధనా వ్యాసం. అదే సంవత్సరం ఆయనకు ఎం.ఏ ఆనర్సు పట్టా లభించింది. అప్పుడవధానిగారు విశాఖపట్టణంలోని మిసెస్ ఎ.వి.ఎన్. కళాశాలలో పనిచేయుచుండిరి. ఈ గ్రంథంలో ధర్మవరం రామకృష్ణమాచార్యుల నాటకాలను గూర్చి విశ్లేషణాత్మకంగా చర్చింపబడింది.

ధర్మవరం రామకృష్ణమాచార్యులవారికి గల ఆంధ్ర నాటక పితామహుడనే బిరుదునే అవధానిగారు తన గ్రంథానికి పేరుగ పెట్టారు. ధర్మవరం రామకృష్ణమాచార్యులు వృత్తిరీత్యా న్యాయవాది. ఆయన ప్రవృత్తిని మాత్రం నాటక రచనకంకితం చేశారు. ఆయన సుమారు ముప్పై నాటకాలకు పైగా రచించారు. బళ్లారిలో 'సరస వినోదిని' అను నాటక సమాజమును స్థాపించి బళ్లారినుండి మద్రాసు వరకు నాటక ప్రదర్శనలిచ్చి తెలుగు నాటక రంగానికి ఒక రూపు కల్గించారు. వీరు స్వయంగా నాటకాలలో వేషాలు వేసి ప్రేక్షకులను మెప్పించెడివారు. సంస్కృతాంగ్ల భాషలలో మంచి పాండిత్యంగల వారగుటచే సంస్కృతాంగ్ల నాటక లక్షణాలను బాగుగా పరిశీలించి నాటక రచన చేశారు. ఆంగ్ల నాటక లక్షణాలను అవసరమైన వాటిని పరిగ్రహించి సంస్కృత నాటక లక్షణాలలో కొన్నిటిని పరిహరించి కొన్ని లక్షణాలు అతిక్రమించి నాటకాలను రచించారు. రామకృష్ణమాచార్యులు కన్నడ భాషలో కూడా కొన్ని నాటకాలను రచించారు. ఈయన క్రీ.శ. 1853లో పరీధావినామ సంవత్సరం కార్తీక శుద్ధ ఏకాదశినాడు అనంతపురం జిల్లా తాడిపర్తి తాలూకా, ధర్మపురి అనే అగ్రహారంలో జన్మించారు. వీరి తండ్రి పేరు కృష్ణమాచార్యులు. సంస్కృతాంధ్రములలో మంచి పండితులు. బళ్లారిలో ఆంధ్ర పండితులుగ పనిచేశారు. తన తండ్రి దగ్గర రామకృష్ణమాచార్యులు సంస్కృతాంధ్రములనభ్యసించారు. తరువాత ఆంగ్లభాషను అభ్యసించారు. ఎఫ్.ఏ పరీక్షలో కృతార్థులైనారు. ఆదోని తాలూకా కచ్చేరీలో లేఖకుడుగా కొన్నాళ్లు ఉద్యోగం చేశారు. తరువాత న్యాయవాది పరీక్షలో కృతార్థులై న్యాయవాదిగ ఆమరణాంతము పనిచేసి అనన్యసామాన్యమైన కీర్తినార్జించారు. నాటకాలద్వారా కూడ యశోభూషితులైనారు. క్రీ.శ. 1912లో దివంగతులైనారు ( ఇది దివాకర్లవారు జన్మించిన సంవత్సరం కావడం విశేషం).

ధర్మవరం రామకృష్ణమాచార్యులు సంగీతంలో కూడా విశేష ప్రజ్ఞను ప్రదర్శించుచుండిరి. ఈయన రచించిన నాటకాల్లో పదునాలుగు మాత్రం ముద్రితమైనవి. వాటిని గురించే దివాకర్ల వేంకటావధానిగారు ఈ గ్రంథంలో విమర్శించారు. విమర్శ రచనలలో అవధానిగారి తొలి గ్రంథమిది. అవధానిగారు ఈ గ్రంథం రచించిన (1937) నాటికి నాటకాలమీద విమర్శనా గ్రంథాలు అంతగా వెలువడలేదు. రామకృష్ణమాచార్యుల నాటకాలను గురించి కోలాచలం శ్రీనివాసరావు నాటకాల గురించి, అనంతకృష్ణశర్మగారు తన నాటకోపన్యాసాలలో కొంత సమీక్షించారు. దివాకర్లవారు దానిని చూశారు. రామకృష్ణమాచార్యుల నాటకాలను గురించి పరిశోధన చేయాలనుకున్నారు. ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు అవకాశం కల్పించారు. ఆంధ్ర నాటక ఆరంభదశనుండి ఆంధ్ర నాటక పితామహుని నాటములలోని హాస్యము వరకు ఒక ప్రణాళిక సిద్ధం చేసుకొని పరిశీలించారు. అమూల్యమైన విషయాలనెన్నింటినో వెలువరించారు. ఈ రచనకు రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారి నాటకోపన్యాసాలు ఒజ్జబంతికాగా పింగళి లక్ష్మీకాంతంగారు మార్గదర్శకులుగనుండినారు. ధర్మవరం రామకృష్ణమాచార్యుల కాలంలోనే తెలుగు నాటకరంగమనే పూలమొక్క మారాకు వేసి మొగ్గ తొడిగింది. అవధాని గారు దాని పరిమళాన్ని తెలుగు ప్రజలకు పంచిపెట్టారు. ఈ గ్రంథంలో అవధానిగారు ఆంధ్ర నాటకముల ఆరంధ దశను గురించి ఆంధ్ర నాటక పితామహుని నాటకములు వాని మూలములను గురించి విషాదాంత నాటకాలను గురించి, నాటక వస్తువులను, నాటక నిర్మాణాన్ని, పాత్ర పోషణము, రసపోషణము, జీవిత తత్వాలను, సాంఘిక రాజకీయాది అంశాలు మొదలైన విషయాలను విశ్లేషించారు.

## ఆంధ్ర నాటకముల ఆరంభదశ

క్రీ.శ. 19వ శతాబ్ది వరకు ఆంధ్ర భాషలో నాటక రచన ఆరంభం కాలేదు. దీనికి అవధానిగారు చూపిన కారణాలు -

1. తెలుగులో రాయబడిన తొలి గ్రంథాలు అనువాదాలు, సంస్కృతంలోని పురాణాలను కావ్యాలను అనువదించిన తెలుగు కవులు నాటకాల జోలికి పోలేదు. సంస్కృత నాటకాలలో పాత్రోచితమైన భాషవాడి ఉండుట అనగా సంస్కృత ప్రాకృతమయమైనట్టిది. తొలి దశలో తెలుగులో వ్యావహారిక భాషను వాడుటకు వ్యాకరణాలు ఒప్పుకోకపోవుట.

2. కవుల దృష్టి వైదిక మతోద్ధరణమీద కేంద్రీకరింపబడుట సంస్కృత నాటకాలలో ఆగుణముగలవి లేకపోవుట.

3. తెలుగు కవులుగాని ప్రజలుకాని సంస్కృత నాటకాలను చూసి ఉండకపోవుట.

4. నాటకములను ప్రదర్శించడానికి కావలసిన నాటకశాలలు రంగస్థల పరికరాలు లేకపోవుట.

5. నాటకాలాడు వారికి సంఘంలో గౌరవ ప్రపత్తులు లేకపోవుట.

6. సంస్కృతంలోగల నాటక లక్షణాలను తెలుగులోనికి ఆలస్యంగా అనువదింపబడుటకు ఇవి కారణాలు. 16వ శతాబ్దంలో చిత్రకవి పెద్దన తన లక్షణ సారసంగ్రహంలో నాటక లక్షణాలను తెలిపాడు. 17వ శతాబ్దంలో ఎలకూచి బాలసరస్వతి ''రంగకౌముదిని'' రచించితినని చెప్పుకొన్నాడు. కాని అది అలభ్యం. దీనినిబట్టి 17వ శతాబ్దిలో రంగోద్ధరణ ప్రయత్నం జరిగిందనవచ్చు. 18వ శతాబ్దిలో కుందుర్తి వేంకటాచలం తాననేక నాటకాలు రచించానని చెప్పుకొన్నాడు. ఇవి కూడా దొరకుట లేదు. 19వ శతాబ్దిలో విజయనగర ప్రభువు ఆనంద గజపతిరాజు సంస్కృత నాటకాలను ప్రదర్శింపజేశారు. తెలుగుదేశంలో ఇవే తొలి నాటక ప్రదర్శనలు కావచ్చు. తరువాత మహారాష్ట్ర పార్శీ నాటక కంపెనీలు నాటకాలను ప్రదర్శింపసాగాయి. వారిని చూసి తెలుగువారు నాటక రచనకు పూనుకొన్నారు.

మొట్టమొదట కోరాడ రామచంద్రశాస్త్రిగారు వేణీ సంహార నాటకాన్ని అనువాదం చేశారు. తరువాత ''మధుకరీ మంజరీయము'' అను స్వతంత్ర నాటకాన్ని రచించారు. ఇది 1860లో రచింపబడినది. గురజాడ అప్పారావుగారి కన్యాశుల్కం 1897లో రచింపబడింది. ఇది తెలుగులో మొట్టమొదటి స్వతంత్ర సాంఘిక నాటకం. తెలుగులో మొదట ప్రదర్శింపబడిన నాటకం రత్నావళి. ఇది వీరేశలింగంపంతులుగారి రచన. వీరేశలింగంపంతులుగారు పరవస్తు వేంకట రంగాచార్యులు అనువాదం చేయ మొదలుపెట్టి ఆగిపోయిన అభిజ్ఞాన శాకుంతలాన్ని కూడా పూర్తిచేశారు. ఆంగ్లంనుండి ''కామిడి ఆఫ్ ఎర్రర్స్'' అనువాదం చేశారు. కొక్కొండ వెంకటరత్నం పంతులు, గురజాడ రామమూర్తి, వావిలాల వాసుదేవశాస్త్రి మొదలైనవారు నాటకరచనము చేబట్టారు. 1880లో ధర్మవరం రామకృష్ణమాచార్యులు సరస వినోదిని నాటక సమాజాన్ని స్థాపించారు. కోలాచలం శ్రీనివాసరావుగారు ''మనోరమాసభ''ను స్థాపించి నాటక రచన చేశారు అని అవధానిగారు ఆంధ్ర నాటక ఆరంభదశను సమీక్షించారు.

రెండవ అంశంగా ''ఆంధ్ర నాటక పితామహుని నాటకములు, వాని మూలము'' అనే దానిని రచించారు. సంస్కృత నాటక లక్షణాలను చెప్పిన వారిలో భరతుడు ఆద్యుడు. ఆంగ్ల నాటక లక్షణాలను చెప్పినవారిలో ''అరిస్టోటిల్'' ప్రథముడు. ధర్మవరం రామకృష్ణమాచార్యులుగారు సంస్కృతాంగ్ల నాటక లక్షణాలను తన నాటకాలలో సమ్మిళితం చేశారు. తొలి తెలుగు నాటకాలను నాలుగు విధాలుగా విభజించవచ్చు. 1. సంస్కృత నాటకానువాదాలు 2. ఆంగ్లనాటకానువాదాలు 3. స్వతంత్ర నాటకాలు, 4. చారిత్రక నాటకాలు.

రామకృష్ణమాచార్యుల వారి కాలం నాటికి సంస్కృతాంగ్ల నాటకానువాదాలు విస్తృతంగా వెలువడుచున్నాయి. ఆచార్యులవారు రెండు భాషలలోను పరిచయం ఉన్నవారు కనుక రెండు భాషల నాటక లక్షణాలను పరిశీలించారు. తన నాటకాలలో ఆ లక్షణాలను పొందుపరిచారు. కోలాచలం శ్రీనివాసరావు, సురవరం ప్రతాపరెడ్డి మొదలైనవారు కూడా ప్రాచ్య పాశ్చాత్య నాటక లక్షణ సమ్మిళితం చేసి నాటకాలను రచించారు.

ఆచార్యుల వారికి ఆంగ్లభాష మీద అభిమానం మెండు. అందుకే సంస్కృత నాటక లక్షణాలను అతిక్రమించారు. ఆంగ్ల నాటక లక్షణాలను అనుసరించినందువల్ల సంస్కృత నాటక లక్షణాలను అతిక్రమించినందువల్ల నష్టంగానీ లాభంగానీ లేదని అవధానిగారు పేర్కొన్నారు. ఈయన నాటకాలను విమర్శించేటప్పుడు సంస్కృతాంగ్ల నాటక లక్షణాలను దృష్టిలో వుంచుకున్నారు.

1875నుండి రామకృష్ణమాచార్యులు నాటక రచన చేబట్టారు. ''చిత్రనళీయము'' ''విషాద సారంగధరము'' మొదలైన రెండు మూడు నాటకాలు మాత్రం ఆయన జీవిత కాలంలో ముద్రింపబడినాయి. మిగిలినవి ఆయన మరణానంతరం ముద్రింపబడినాయి.

ఆచార్యులవారి నాటక వస్తువులన్ని ప్రఖ్యాతములే. ఒక ముక్తావళి మాత్రం కల్పితం. ''రోషనార- శివాజి'' చారిత్రక నాటకం, ముద్రితమైన ( మిగిలిన) పంద్రెండు నాటకాలలో ఐదు నాటకాలు భారతంనుండి గ్రహింపబడినాయి. ప్రమీలార్జునీయం, చంద్రహాస నాటకాలకు మూలం జైమిని భారతంలోని అశ్వమేథపర్వము. పాదుకా పట్టాభిషేకానికి వాల్మీకి రామాయణంలోని అయోధ్యకాండ మూలం. అజామిళ చరిత్ర, ప్రహ్లాద నాటకాలకు భాగవతం మూలం, వరూధినికి మనుచరిత్ర, మోహినీ రుక్మాంగదకు మల్లన రచించిన రుక్మాంగదచరిత్ర మూలం. ఈ విధంగా ఇతిహాస, పురాణ, ప్రబంధాలనుండి వస్తువును గ్రహించి నాటకాలను రచించారు. వస్తువులలో కొన్ని మార్పులు చేర్పులు చేసి స్వతంత్ర నాటకాలా అనునట్లు రచించారు అని అవధానిగారు పేర్కొన్నారు.

మూడవ అంశంగా విషాదాంత నాటకాలను గురించి విశదీకరించారు. సంస్కృత నాటక వాఙ్మయంలో విషాదాంత నాటకాలరుదు. కావ్యాలు, నాటకాలు, శుభాంతములుగా ఉండివలయుననే సిద్ధాంతమే దీనికి కారణం కావచ్చు. ఆంగ్ల నాటక వాఙ్మయంలో విషాదాంత నాటకాలకొక విశిష్ట స్థానం కలదు. విషాదాంతనాటక రచనలో రామకృష్ణమాచార్యులు షేక్స్పియర్‌ను అనుకరించారు. విషాదాంత నాటకాలు ప్రేక్షకుని హృదయంలో చెరగని ముద్ర వేయును. ప్రేక్షకుల సానుభూతిని పొందిన నాయకుడు మరణిస్తేనే విషాదాంత నాటకం. ప్రతి నాయకుడు మరణిస్తే అది విషాదాంతం కాదు. విషాదాంత నాటకంలో విశ్వజనీనత (Universality) ముఖ్యం. ఈ గుణం కలగాలంటే నాటక నాయకుడు

రాజవంశానికి చెందినవాడుగా ఉదాత్తగుణ సంపన్నుడుగా నుండవలెను. విషాంత నాటకాన్ని అతిమానుషములైన అంశాలను ప్రవేశపెట్టుట రెండవ లక్షణం. విధి (తలవ్రాత) (Sense of fate) ని ప్రదర్శించుట విశ్వజనీనతా భావోత్పత్తికి వేరొక కారణం. ఉపకథ (Sub-plot) వలన కూడా విశ్వజనీనతా భావం కలుగునని ఆంగ్లలాక్షణికులు తెలియజేశారు. విషాదాంత నాటకము గంభీరమై (Serious) కరుణ రసాత్మకమై యత్యుదాత్తముగ నుండును.

విషాదాంత నాటకం ప్రేక్షకునికి ఆనందం కలిగించుట ఎట్లు? అను విషయంలో పాశ్చాత్య విమర్శకులు వివిధాభిప్రాయాలను వ్యక్తం చేశారు. విషాదాంత నాటకాలలో నాయకుని దుఃఖానుభవములో ప్రేక్షకుడు పాలుపంచుకొని సానుభూతి (Self pity) కూడా పొంది ఆనందమును పొందును. గొప్పవారికే మరణం తప్పలేదు కదా! అని వైరాగ్య భావం ప్రేక్షకునిలో దుఃఖ విముఖత కలుగజేయును. కవి చేయు చమత్కారం వలన కూడా ప్రేక్షకుడానందమును పొందునను అభిప్రాయాలను వెల్లడించారు. విషాదాంత నాటక నాయకుడు (Tragic Hero) మోదాంతనాటక నాయకునికంటే నాటకంలో ప్రముఖ పాత్ర పోషిస్తాడు. విషాదాంత నాటక నాయకుని గురించి అరిస్టోటిల్ (Aristotle) ఇట్లభిప్రాయ పడినాడు. విషాదాంత నాయకుడు ఉదారగుణ పరిపూర్ణుడే అయ్యును మానవ సామాన్య దౌర్బల్యముచే నజ్ఞాతముకాని ఇంద్రియార్థ వివశుడైగాని ఏదో ఒక దోషాన్ని చేసినవాడుగా ఉండాలని అన్నారు. కాని షేక్స్పియర్ (Shakespear) ఇటువంటి నాయకులను చిత్రించలేదు. మనస్పూర్తిగా దోషములను చేసిన నాయకులనే సృష్టించాడు.

ఆధునికులైన కొందరు విమర్శకులు దోషములేని నాయకుడు కూడా విషాదాంత నాటకాలలో ఉండవచ్చునన్నారు. కానీ ఇది అంత ఆమోదయోగ్యంగా లేదు.

విషాదాంత నాటక నాయకుడు తాను చేసిన తప్పును గుర్తించి పశ్చాత్తాపంతో ఆత్మహత్య చేసుకొను సందర్భాలు కూడా కలవు. (Shakespear) నాటక నాయకులిట్టివారు కలరు.

ఇప్పుడిప్పుడు నాయకుడు లేని (Heroless) విషాదాంత నాటకాలు కూడా కనిపించుచున్నవి. విషాదాంత నాటకాలలో స్త్రీపాత్రలరుదుగా నుండును. ఒకవేళ ఉన్నా వారు స్త్రీ సహజమగు లాలిత్య గుణమును లేని వారై ఉందురు.

''విషాదాంత నాటకాలకు భావరంజకత్వమైన లయాన్వితమైన ఛందోగమనశైలి అవసరము'' ని విషాదాంత నాటక లక్షణాలను అవధానిగారు విపులీకరించారు.

విషాదాంత నాటకభేదాలు (Types of Tragedy)

1. గ్రీకునాటకాలు ఒక రకమైన విషాదాంత నాటకాలు

2. వీర్యాత్మకములు 3. భయాత్మకములు (Horror Tragedy) 4. సాధారణ గృహిణి జీవిత విషాదాంతములు (Domestic Tragedies) అని విషాదాంత నాటకాలను స్థూలంగా నాలుగు విధాలుగా విభజింపవచ్చు. విషాదాంత నాటకాలను (Shakespear) కాలంలోనే ఒక స్థిరత్వం యేర్పడింది.

తెలుగులో విషాదాంత నాటకాలు రాసిన వారిలో ఆద్యులు కృష్ణమాచార్యులవారేనని చెప్పవచ్చు. ఈయన రచించిన నాటకాలలో నాటకాంతంలో నాయకులు మరణించేవి నాలుగు. కానీ ఇవి నాలుగు విషాదాంత నాటకాలు మాత్రం కావు. రెండు మాత్రం విషాదాంత నాటకాల లక్షణాలు కలిగి వున్నది.

అజామిళ చరిత్రలో నాయకుడు నాటకం చివర ప్లేగువ్యాధితో మరణిస్తాడు. కానీ ఇది విషాదాంత నాటకం కాదు. ఇందులో విషాదాంత నాటక లక్షణాలు మృగ్యం.

అభిజ్ఞాన మణిమంతంలో చివర దుష్టబుద్ధి మరణించును. కానీ ప్రేక్షకులలో ఈ పాత్రపై సానుభూతి కలుగదు. కనుక ఇదికూడా విషాదాంతం కాదు.

పాదుకా పట్టాభిషేకము - ఈ నాటకానికి ఇతివృత్తము వాల్మీకి రామాయణమునుండి గ్రహింపబడినది. ఇందులో వాల్మీకి మహర్షియే (Split of Tragedy) విషాధాంతం యొక్క ఉత్కర్షను బహునిపుణముగా చిత్రించెను. ఆచార్యులవారు దీనితో విషాదాంత నాటక లక్షణాలనినుమడింపజేశారు. 'షేక్స్పియర్' 'యేగ్‌బెత్' నాటకములోని విషాదాంత నాటక లక్షణాలు పాదుకా పట్టాభిషేకంలో పొందుపరచబడినవని విమర్శకుల అభిప్రాయం. ఇందులో విషాద భావ పునరుద్యక్తం (Doubt Tragedy) లక్షణాలు గోచరించును. ఇంక మిగిలినవి విషాద సారంగధరము. ఆచార్యులవారి విషాదాంత నాటకాలలోనే కాక తెలుగు విషాదాంత నాటకాలలో అచ్చమైన విషాదాంత నాటకమని చెప్పదగినది. ఇది పది విషాదాంత నాటకములు చేసినంత పనిచేసినదని రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు ప్రవచించారు. ఇది (Shakespear) యొక్క రోమియో అండ్ జూలెట్ (Romio and Jeyliet) వలె అదృష్టంమీద ఆధారపడిన (Tragic of forteen) విషాద నాటకం. దీనిలో విషాదాంత నాటక లక్షణాలు పుష్కలంగా ఉన్నాయి.

ఆచార్యులవారి విషాదాంత నాటకాలలోని సామాన్య లక్షణాలు :

1. Shakespear విషాదాంత నాటకాలలో స్త్రీ పాత్రల ప్రాముఖ్యం తక్కువ. ఆచార్యులగారి విషాదాంత నాటకాలకు స్త్రీ పాత్రలే మూలం. ఇది ఆయన ప్రతిభకు తార్కాణం. చిత్రాంగి మందర మొదలైనవారు వీరి నాటకాలలో స్త్రీ పాత్రలు.

2. ప్రణయ గాధ విషాద భావాలకు అంత అనుకూలంగా ఉండదు. (Shakespear)

నాటకం (Romio and Juiliet)లో విషాదం తగ్గుటకు ఇదే కారణం, కాని ఆచార్యులవారి విషాదాంత నాటకాలతో ప్రణయం పుష్కలంగా ఉండికూడా విషాదాంతం ఇనుమడించుట గమనార్హం.

3. Shakespear విషాద నాటకాలలో బహిరంతస్సంఘర్షణలు (Inner and Conflicts) రెండూ కూడా ఉన్ననూ అతని నాటకాలకు వన్నె తెచ్చినది అంతరసంఘర్షణమే.

4. Shakespear నాటకాలలో నాయకులు పశ్చాత్తాపము పొందుట జరుగును. ప్రతి నాయకుడే నాయకుడైనప్పుడు పశ్చాత్తాపపడుట ఒక (Macbeth) మ్యాక్‌బెత్‌లో మాత్రం ఉంది. కానీ ఆచార్యుల దుష్టపాత్రలు సైతం పశ్చాత్తాప పడుట గమనించవచ్చు. చంద్రహాసలో దుష్టబుద్ధి, పాదుకాపట్టాభిషేకంలో కైక, మందర మొదలగు పాత్రలిందుకు ఉదాహరణం. ఇటువంటి వానివలన నాటక గాంభీర్యం కొంత కొరవడుతుంది.

5. ఆంగ్లంలో Neo Classic Drama, Romantic Drama అని రెండు విధాలుగా ఉన్నాయి. కృష్ణమాచార్యులుగారు ఇందులో రెండవ రకమైన Romantic Drama అనే అనుకరించెను. విశ్వజనీనతా భావం కోసం రాజకుటుంబంలోని వారినే నాయకులుగా తీసుకొనెను. విధి ప్రభావాలను కూడా చక్కగా సృష్టించి విషాదాంత నాటకాలకు పుష్టిని కలిగించారు.

6. ప్రాచ్యలాక్షణికులు నిషేధమని పేర్కొన్న మరణాదులను ఆచార్యులవారు రంగస్థలము మీద చూపించారు. దశరధుని మరణం చిత్రాంగి మృతి, సారంగధరుని కాలు చేతుల ఖండనం మొదలగునవి. ఇవి పాశ్చాత్య లక్షణానుసారం చిత్రింపబడినవి.

7. కరుణరసానికి హాస్యరసానికి పొత్తు కుదరదని ప్రాచ్య లాక్షణికుల మతం Shakespear కూడా విషాదాంత నాటాలలో హాస్య రసాన్ని తక్కువ పోషించాడు. ఆచార్యులవారు కూడా అట్లే చేశారు.

8. స్థలైక్యం పాటించుట అను నియమాన్ని ఆచార్యులవారంతగా పట్టించుకోలేదు. ఆచార్యుల విషాదాంత నాటకాలలో వస్తువైవిధ్యం కూడా కనిపించదు.

వీరి నాటకలలో విషాద సారంగధరము, పాదుకా పట్టాభిషేకము అను రెండు నాటకాలు మాత్రం పాశ్చాత్యులు చెప్పిన విషాదాంత నాటక లక్షణాలు కలిగి వున్నాయి. చంద్ర హాస నాటక ఖేదామోద సమ్మేళనం అని అవధానిగారు పాశ్చాత్య విషాద నాటక లక్షణాలు ఆచార్యులవారి నాటకాలలో ఉన్న విధానాన్ని విశ్లేషించి చూపించారు. ఇది ఎంతో సమంజసంగా ఉంది.

## ఆంధ్రనాటక పితామహుని నాటకములలోని వస్తువు

నాటకాలన్నిటిలో వస్తువు (Plot) చాలా ముఖ్యమైనదని పాశ్చాత్య లాక్షణికులందరు ఏకగ్రీవంగా ఒప్పుకున్నారు. నాటాలకు వస్తువు శరీరం. కవి దీనికి ప్రాణ ప్రతిష్ఠ చేయును.

అరిస్టోటిల్ - నాటక వస్తువు మిక్కిలి సంక్షేపముగా ఒకే మారు కూర్చుండి చదువుటకు గానీ, వినుటకుగానీ యనువుగా నుండవలెనన్నాడు. కల్పిత వస్తువు ప్రేక్షకులను బాగుగా ఆకర్షించును. ప్రఖ్యాత వస్తువులలో కూడా చిన్న చిన్న కల్పనలు చేయవచ్చును. కానీ ప్రధాన విషయాన్ని మార్చి చెప్పినచో ప్రేక్షకులు సహించరు.

పంచకార్యావస్థలలో ఆరంభము **(Exportion)** రచించునప్పుడు నాటక కర్త మిక్కిలి శ్రద్ధ వహించాలి. పాశ్చాత్య కవులు ఈ ఆరంభమును **Prologu**లను ప్రత్యేక ప్రక్రియద్వారా వ్యక్తం చేశారు. నాటకారంభము ద్వారమువలెనుండి సామాజికులను అందు ప్రవేశింపజేయునదిగా నుండవలయును.

**Mathew Anold** కావ్యవస్తువు మిక్కిలి ఉదాత్తముగా **(Sound subject Matter)** ఉండవలెనన్నాడు. ప్రాచ్యలాక్షణికులు కూడా వస్తువు ''మధురోదాత్తర సభావ నిరంతరము''గా ఉండవలెనన్నారు. నాటకమునకు సంవాదశైలి మాత్రమే వాడాలి. కథనశైలి నాటకానికనుకూలం కాదంటాడు.

ధర్మవరం రామకృష్ణమాచార్యులు ఒక ముక్తావళి తప్ప మిగిలిన ముద్రిత నాటక వస్తువులన్నీ ప్రఖ్యాతములు మిశ్రమములుగా ఉన్నాయి. 'ప్రమీలార్జునీయము' 'చిరకారి' అను నాటకాలలోని వస్తువు మూలకథ బీజప్రాయముగాగ కల్పితమధికము. 'ప్రమీలార్జు నీయము'ను జైమిని భారతంనుండి, 'చిరకారి'ని శాంతిపర్వంనుండి గ్రహించారు. 'రోషనార - శివాజీ' చారిత్రక నాటకము. ఇందులో కూడా కొంత కల్పన చేయబడినది. రోషనార ఔరంగజేబు సోదరి అని చరిత్రలో నుండగా ఆమె ఒక మహారాష్ట్ర బ్రాహ్మణ యువతికి పుట్టిన బిడ్డ అని ఆ బ్రాహ్మణ యువతి ఔరంగజేబుచే బలాత్కరింపబడినదని అప్పుడు రోషనార ఎనిమిది నెలల బిడ్డయని, ఆ స్త్రీ మరణించగా ఔరంగజేబాబాలికను కన్నపుత్రికవలె పోషించాడని ఆచార్యులవారు మార్పుచేశారు. రోషనార శివాజీని ప్రేమించి పెండ్లిచేసుకోవటము రెండింటిలోనూ సమానమే.

విషాద సారంగధర నాటకానికి మూలములు రెండు. ఒకటి ద్విపద కావ్యం, రెండవది పద్యకావ్యము. ద్విపద కావ్యంలో చిత్రాంగి చిత్రపటాన్ని సారంగధరునికై రాజరాజ నరేంద్రుడు తెప్పించి చూసి ఆమెను తానే వివాహమాడెనని కలదు. పద్యకావ్యంలో చిత్రాంగిని వివాహమాడిన తరువాతనే రత్నాంగికి సారంగధరుడు పుట్టినట్లు కలదు.

ఆచార్యులవారు ఈ రెండు మార్గాలకు భిన్నంగా ఒక వింత మార్గాన్ని అవలంబించారు. సారంగధరునికి కన్యలనన్వేషించే సందర్భంలో హిరణ్యకుడను బ్రాహ్మణుడు చంద్రకళ అను రాకుమార్తె. చిత్రపటాన్ని విభావసుడను బ్రాహ్మణుడు చిత్రాంగియను రాకుమార్తె చిత్రపటాన్ని తెచ్చారు. వారిద్దరి రూపలావణ్యములు సమానములై ప్రశంసనీయముగా నుండెను. వారిద్దరు తమ ఇంటనే ఉండవలయునను కోరికతో రాజరాజనరేంద్రుడు చిత్రాంగియను రాకుమార్తె చిత్రపటాన్ని తెచ్చారు. వారిద్దరి రూపలావణ్యములు సమానములై ప్రశంసనీయముగా నుండెను. వారిద్దరు తమ ఇంటనే ఉండవలయునను కోరికతో రాజరాజనరేంద్రుడు చిత్రాంగిని వివాహమాడి చంద్రకళను సారంగధరునికిచ్చి వివాహం చేసినట్లు కల్పించారు. ఈ కల్పనద్వారా (Deviation to improve Chareote) అను ఆంగ్ల నాక లక్షణాన్ని సాధించారు. 'పాదుకా పట్టాభిషేకము' నాటకములో కైకపాత్రలో కొంత మార్పు చేశారు. మంథరవలననే కైకపాడైనట్లు చిత్రింపబడెను. కైక తాను చేసిన పాపకార్యానికి పశ్చాత్తాపడినట్లు వాల్మీకి రామాయణంలో లేదు. కైకను మానవత్వ (Humanity) శోభితురాలుగ ఆచార్యులవారు వర్ణించారు. 'పాండవ వనవాసము' లో శకుని పాత్రలో ఉదాత్తతను కల్పించారు. చంద్రహాస నాటకంలో చంపకమాలిని పాత్ర విషయంలోను దుష్టబుద్ధి పాత్ర విషయంలోనూ మార్పులు చేశారు.

'మోహినీ రుక్మాంగద' నాటకంలో రుక్మాంగదుడు చేయు ఏకాదశి వ్రతంవలన నరకలోకం బీడుపోగా యముడు బ్రహ్మదేవుని దగ్గరికి, వెళ్లి దుఃఖించగా బ్రహ్మదేవుడు మోహిని యమకన్యను భూలోకానికి పంపి రుక్మాంగదుని వ్రతభంగం చేసెనని కలదు. కానీ ఆచార్యులవారు నరకలోకం కాలీ అయినందుకు యమధర్మరాజు సంతసించెననీ, అప్సరసలు కొందరు తమకు పనిలేకపోవుటచే బ్రహ్మదేవునితో మొరపెట్టుకోగా బ్రహ్మమోహినియను అప్సరసను భూలోకానికి పంపినట్లు యుక్తియుక్తంగా కల్పించారు.

వరూధిని నాటకంలో కథైక్యం కోసం చక్కని మార్పు చేశారు. అల్లసాని పెద్దన మనుచరిత్రలో కథైక్యం లేదనే అపప్రథ నాటకంలో తొలగించారు ఆచార్యులవారు.

ఈ విధంగా నాటక వస్తువులలో మూలభిన్నమైన కల్పన చేయడానికి కారణం కథలకు వన్నె చేకూర్చుట కొరకే ఈ కల్పనలను ఆరు విధాలుగా విభజించవచ్చు.

1. విపర్యాసము (Deviation to improve Charector) మొదటిది అనగా నాటకస్థములైన పాత్రల శీలములను బాగుపరచి సమర్థించుట.

2. మూల భిన్నములైన కల్పనలు (Deviation for the sake of Argument and unity) మూలకథలోని వివిధ సన్నివేశాలు కార్యకారణ సంబంధముగాని, ఐక్యముగానీ కొరవడి నప్పుడు దానిని సరిచేయుటకు చేయు కల్పనలు.

3. ప్రబంధాలలో పురాణాలలో బీజప్రాయంగా ఉన్న వస్తువులను విపులతరంగా చేయుట. (Deviation for the sake of Stage sutability and audience) నాటకానికి అనువైన కల్పనలను చేసి సామాజికుల అభిరుచికి దోహదం చేయుట.

4. పర్యాస సంవిధానం, పురాణ ప్రబంధాలలో కథలను కావ్య న్యాయమును పురస్కరించుకొని భిన్న కల్పనలు చేయుట.

5. హాస్యము కొరకు కథ ప్రకృతికి సన్నిహితముగా నుండటకును విషాదాదులైన కొన్ని భావాలకు త్కర్షాపకర్షలు కల్గించుటకు మూలములో లేని కొన్ని సృష్టించుట.

6. నాటకస్థములైన పాత్రల వివిధ భావాలను సామాజికులకు తెలియుటకై కొన్ని నూతన రంగాలను కల్పించుట. అను ఆరువిధాలైన మార్పులను అవధానిగారు చూపించారు.

వస్తు నిర్మాణము : పాశ్చాత్యుల పంచకార్యావస్థలకును, సంస్కృతలాక్షణికుల పంచ కార్యావస్థలకును మిక్కిలి దగ్గరి సంబంధము కలదు. సంస్కృత నాటకాలలో పంచ కార్యావస్థలైన ప్రవేశికకు (Exposition) సమానం. 2. ప్రయత్నమునకు (Growth), 3. ఆరంభమునకు (Incidence) 4. ప్రాప్త్యాశకు (Climax), నియతప్రాప్తికి (Denowment) సమానములు.

ఆచార్యుల వారి నాటకాలలో ఈ కార్యావస్థలన్ని యథాశాస్త్రంగా లేకపోవుటచే వాటిని కనుగొనుట కష్టమనే అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. వరూధిని, చిత్రనళీయము, చంద్రహాస, రోషనారలలోని పంచకార్యావస్థలను ఒక పట్టిక ద్వారా తెలియజేశారు.

ఆచార్యులవారు ఆంగ్ల నాటక సంప్రదాయముననుసరించి ప్రవేశికను రచించుట కొన్ని నాటకాల్లో కన్పించును అని కూడా ఈ భాగంలో అభిప్రాయపడినారు. నాటక పితామహుని నాటక నిర్మాణం. (Dramatic Design) అనే విభాగంలో సమానాంతరత్వము (Parallesisam)ను ప్రతి యోగము, (Controct)ను గురించి (Dramatic Irony) గురించి చర్చించారు.

సాహిత్యదర్పణకారుడు ఈ (Dramatic Irony)ని పతాకస్థానమును నాలుగు విధాలుగ విభజించాడని సంస్కృత నాటకాలలో ఈ పతాకస్థాన విషయాలనేక సందర్భాలలో ఉన్నాయని, ఆచార్యులవారు దీనిని విరివిగా వాడారని పేర్కొన్నారు.

అర్థ ప్రకృతులు, సంధులు, కార్యావస్థలు, మొదలగు లక్షణాలు వీరి నాటకాలలో గుర్తించుట కష్టమని కూడా అవధానిగారభిప్రాయపడినారు. ''నాటక రచనయందాచార్యుల వారు స్వతంత్రించిన వారే కాని ప్రాచ్య లక్షణములను గాని పాశ్చాత్య లక్షణములనుగాని

యథానియమముగా ననుసరించివారు కారు. ఆయన ప్రాచ్య లాక్షణికులు సూచ్యములని నుడివిన పెక్కు కథా భాగములను తమ నాటకములో దృశ్యములుగానే రచియించిరి. అంకములను రంగములుగా విభజించుట యందును. నాటకములను విషాదాంతములుగా చేయుట యందును, కొన్ని నాటకములలో మూడంకములను మాత్రమే రచించుట యందును, నాందీ భరత వాక్యాదుల పరిహరించుట యందును ఆయన స్వాతంత్ర్యము సర్వతోముఖముగ గన్పించును. ఆయన నాటకములలో సర్వశ్రావ్యము స్వగతము తప్ప జనాంతికము, అపవారితము, మొదలగు నియత శ్రావ్యము తెచ్చుటను గానరావు''[1] అని పేర్కొన్నారు.

పూర్వరంగాదులు అను విభాగంలో, నాందీకి ప్రస్తావనకు ఆయన భేదం పాటించలేదు. కానీ ప్రాచ్య పద్ధతులను పూర్తిగా వదిలివేయలేదు. సంస్కృత లాక్షణికుల అభిప్రాయం నాంది పూర్వరంగానికి చేరినది. నాంద్యంతమున స్థాపకుడనబడు రెండవ సూత్రధారుడు ప్రవేశించి వస్త్వాదుల సూచించుచు మారిష నటీ విదూషకాదులలో ఒకరితో చేసే సంభాషణ ప్రస్తావన అనబడును. పూర్వరంగం, నేపథ్యమున నిర్విఘ్నంగా నాట్య ప్రదర్శన జరుగుటకై రూపకాదులయందు చేయదగిన కృత్య విశేషం అని చెప్పబడి ఉన్నది.

కృష్ణమాచార్యులు వాడిన పూర్వరంగములకు సంస్కృతలాక్షణికులు చెప్పిన పూర్వరంగమునకు పోలికే లేదు. నామైక్యం తప్ప వేరే సంబంధం లేదు.

భరతుడు నాట్యశాస్త్రంలో ఈ పూర్వరంగమును గురించి మిక్కిలి విస్తరించి రాశాడు. కాని తరువాత ధనంజయుడుగాని విశ్వనాధుడుగాని ఈ పూర్వరంగ ప్రస్తావనే చేయలేదు. విశ్వనాధుడు తన కాలం నాటికే పూర్వ రంగ ప్రదర్శన ఆచారం లేదని స్పష్టంగా తెలిపాడు. కృష్ణమాచార్యులు చేసిన పూర్వరంగములు సంవాద రూపంలో (Dialogs form) ఉన్నవి.

ఆంగ్లంలో Shakespear Prologue అను ఒక చిన్న రంగాన్ని కల్పించుచుండును. ఈ Prologue సంస్కృత లక్షణాలలో చెప్పబడిన ప్రస్తావనా, విష్కంభ, ప్రవేశకాదులను పోలి ఉన్నదని చెప్పవచ్చు. ఉత్తర రంగము Epilogue ఒక విధంగా ఇది భరతవాక్యం వంటిది. దీనిని Shakespear తన నాటకాలలో కొన్నింటిలో ప్రయోగించెను. కృష్ణమాచార్యులు గారు తన నాటకాలలో కూడా Epilogueను వాడినారు. ఈయన దీనిని నీతి బోధకుపయోగించారు. వీరు నాటకాలద్వారా నీతిబోధ చేయాలనే తపన కలవారు.

అంకములు - రంగములు - సంస్కృత నాటక కర్తలు అంకములుగా విభజించుటే కాని రంగములుగా విభజించుట కనపడదు. రంగ విభజన ఆంగ్ల నాటకాల ప్రభావంతో తెలుగు నాటకాలలో ప్రవేశించింది. ఇది ఎంతో ఉపయుక్తంగా ఉన్నది. కృష్ణమాచార్యులవారు

అంకములను రంగములుగా విభజించారు. కొందరివి విష్కంభాలు వంటివందురు కానీ రంగాలు విష్కంబాలవంటివి కావు

ఆంగ్లనాటకాలు సాధారణంగా ఐదంకాలుగా రాయబడుచుండును. Shakespear తన నాటకాలనన్నింటిని ఐదంకాలుగా రచించాడు. కృష్ణమాచార్యులు కూడా తన నాటకాలలో పెక్కింటిని ఐదంకాలుగానే విభజించారు. కానీ ఈ అంకవిభజన పంచకావ్యావస్థల యొక్కగానీ, పంచసంధులయొక్కగానీ, అర్థప్రకృతుల యొక్కగానీ క్రమమునుసరించినది కాదని అవధానిగారభిప్రాయపడినారు.

నాటక సమయములు - అనే విభాగంలో కాలైక్యము, వస్త్వైక్యము దేశైక్యములను ఐక్యత్రయాలను గురించి చర్చించారు. సంస్కృతంలో కాళిదాసు గాని తెలుగులో కృష్ణమాచార్యులుగాని ఈ ఐక్యత్రయాన్ని పాటించినట్లు కనబడదని పేర్కొన్నారు.

ధర్మవరంవారి నాటకాలలో పాత్ర పరిపోషణననుగురించి విపులంగా అనుశీలించారు.

నాటకముయొక్క ప్రసిద్ధి చిరస్థాయిత్వవము పాత్ర చిత్రణ నైపుణ్యం మీదనే చాలావరకాధారపడి ఉండును. పాత్రచిత్రణ సంక్షేపం (Brevity) చాలా అవసరం. Shakespear రచించిన 'మేగ్‌బెత్' నాటకం సంక్షేపపాత్ర చిత్రణకు చక్కని తార్కాణం.

పాత్రల గుణశీలాలను సంభాషణలద్వారా తెలియచేయవచ్చు. దీనిని మూడు విధాలుగా విభజింపవచ్చు. 1. రెండు పాత్రల సంభాషణ సందర్భంలో పాత్రల స్వభావాలను గురించి మరొక పాత్రద్వారా తెలియజేయుట.

2. ఇతర పాత్రల స్వభావాలను గురించి మరొక పాత్రద్వారా తెలియజేయుట.

3. స్వగతాలద్వారా అవగతం చేయుట.

Shakespear పాత్రలు చాలా సందర్భాలలో స్వగతాలద్వారా స్వభావాలను తెలియ జేయును. కృష్ణమాచార్యులవారి పాత్రలు పైన తెలిపిన మూడు పద్ధతులద్వారా స్వభావాలను తెలియజేయుచుండును. ఆచార్యులవారు పాత్ర పోషణమునందారితేరినవారు. పాత్రల మానసిక తత్త్వమును సమగ్రంగా ప్రదర్శించుటలో నప్రతిమానమైన శక్తికలవారు.

సంస్కృత నాటక కవులు పాత్రలను కేవలం మంచివిగానూ, కేవలం చెడ్డవిగానూ వర్ణించుట కనబడును. పాశ్చాత్యులిట్లుగాక పాత్రలశీలములలో గుణాగుణములను కొంచెం కొంచెం మేళవింతురు. కృష్ణమాచార్యులవారు మంచి పాత్రల విషయంలో సంస్కృత కవులనూ, దుష్టపాత్రల చిత్రంలో ఆంగ్లకవులను అనుకరించారని చెప్పవచ్చు. రాముడు, సారంగధరుడు, రుక్మాంగదుడు, చంద్రహాసుడు మొదలైన పాత్రలలో నెరసొక్కటికూడా కనిపించదు.

ఆచార్యులుగారి విషాదాంత నాటకాలలోని నాయకులు దోషాచరణము యొక్క ప్రత్యక్ష ఫలములననుభవించినప్పుడు క్రియాశూన్యముగ నున్నవి. మోదాంతనాటకాలలో నాయికల కున్నంత ప్రాధాన్యము నాయకులకు లేదు. తరుణ దంపతుల ప్రథమ దర్శనము ఈయన నాటకాలన్నిటిలో మూసబోసినట్లు ఒకేవిధంగా ఉండును. నాయికల తల్లిదండ్రుల అడ్డుఆకలతో సంబంధం లేకుండానే ప్రేమ వ్యాపారములు పొసగింతురని అవధాని గారభిప్రాయపడినారు.

ఆచార్యులవారి నాటకాలలో సంస్కృత నాటకాలలోని విదూషక పాత్రలవంటి పాత్రలు మూడు కనిపిస్తున్నాయి. 1. యంసుమాలి 2. సుయోగుడు 3. శతానందుడు. వీరి నాటకాలలో స్త్రీ పాత్రలను మూడు విభాగాలుగా విభజింపవచ్చు.

1. పతివ్రతలు : సావిత్రి, చంద్రలేఖ, కళావతి, ముక్తావళి, సంధ్యావళి మొ.వారు.

2. గడుసుదనం గలవారు - మంథర, మల్లికసాని, తిలక మున్నగువారు.

3. పరిస్థితులను బట్టి దుష్టస్వభావులుగ మారినవారు - కైక, చిత్రాంగి, మోహిని మొదలైనవారు.

ఆచార్యుల వారి నాటకాలన్నీ ఇంచుమించు స్త్రీ పాత్రలొనరించు పనులమీదనే ఆధారపడి ఉన్నాయి. మొత్తంమీద దుష్ట శిష్ట పాత్రలను సుస్పష్ట రేఖలతో చిత్రించుటలో ఆచార్యులు అసమాన్య ప్రతిభ కలవారు. ఈయన చిత్రించిన చిత్రాంగి, సావిత్రి, దుష్టబుద్ధి తెలుగు నాటక వాఙ్మయంలో చిరంజీవులైనారు.

ఆంధ్రనాటక పితామహుని కవిత్వం - అనే ప్రకరణంలో నాటకాలలోని పద్యగద్యాలను గురించి చర్చించారు. సంస్కృత నాటకాల్లోని పద్యగద్యాల గురించి, ఆంగ్ల నాటకాల్లో విషాదాంత మోదాంత నాటకాల్లోని పద్యగద్యాలను గురించి Blank Verse వృత్తం గురించి పేర్కొన్నారు. సంస్కృత నాటకాలన్నీ పద్య గద్యాత్మకాలే. ఆంగ్ల నాటకాలు మోదాంతాలుగా ఆద్యాత్మకాలు ఖేదాంతాలు పద్యాత్మకాలుగా ఉన్నాయి. ఆచార్యులవారి నాటకాలన్నీ పద్య గద్య గేయాత్మకాలుగానే మోదాంత విషాదాంత నాటకాలను రచించారు. కీర్తనలు కూడ వీరి నాటకాల్లో చోటు చేసుకున్నాయి. మొదట రాసిన నాటకాలలో పద్య గద్యముల సంఖ్య సమముగా వున్నది. తరువాత పద్యాల సంఖ్య తగ్గి గద్యాల సంఖ్య హెచ్చినది. అముద్రితమైన అజామిళ చరిత్ర గద్య రూపంలో ఉన్నదట.

''ఈ నాటకములలో పద్యముల స్థితి మిక్కిల వింతగా నున్నది. పద్యమునకు బూర్వమున్న గద్యభాగములో సాధారణముగ నిందలియర్థముండుట సర్వత్ర గోచరించు చున్నది. ఒక్కొక్కప్పుడు పద్యములోని యర్థము దాని తరువాత వ్రాయబడిన వచనములో

వ్యక్తం చేయబడుటయు కలదు. దీనికి తోడు భావముతోనే నిండియున్న పాట యొకటి పద్య గద్యముల నడుమ ననుబంధముగా నుండును. మొత్తముమీదనొకే భావము పద్యముతోను, వచనములోను, పాటలలోను కూడ కానుపించుట యధికము''[2] అని ఆచార్యులవారి పద్య గద్య గేయాలను గురించి అవధానిగారు తన అభిప్రాయాన్ని వ్యక్తీకరించారు.

**ఛందస్సు** - అను ప్రకటరణంలో రామకృష్ణమాచార్యులు తమ నాటకాలలో సుమారు 45 రకాల ఛందస్సును వాడినారు. వీరు రాసిన పద్యాలు 750 అందులో సీస పద్యాలు రెండు వందలు, కంద పద్యాల సంఖ్య ఐదవ వంతుకు సమీపంగా ఉంటుంది. లయగ్రాహి, మానిని, కవిరాజ విరాజితము, సుగంధి, సురానంద, క్రౌంచపదము, ద్రుత విలంబితము మొదలైనవి వాడారు. వృత్తాలలో ఉత్పలమాలలను విరివిగా వాడారు. మత్తేభ, శార్దూలముల నించుమించు సమముగా నున్నవి. ఈయన పద్యాలలో సహజంగా నుండవలసిన మాధుర్యం కొరవడినదని అవధానిగారభిప్రాయడినారు.

కీర్తనలను కూడా ఆచార్యులవారు శోక తీవ్రత, గలచోటులను, భక్త్యావేశము గలచోట ప్రకృతి వర్ణనల సందర్భంలోనూ రాశారు. పాత్ర రంగంమీదికి రాగానే సమయానుకూలంగా ఒక కర్తీన రచించుట అలవాటు. ప్రణయ సంవాదుములను కూడా కీర్తనలలోనే రచించారు. ఈ కీర్తనలు సామాజికుల అభిరుచి పోషణ కొరకు, నటుల యనుకూలము కొరకు రచించినట్లు కనిపిస్తుంది.

**వచనము** - ఆచార్యులవారి నాటకాలలో పద్యాలకంటే గేయాలకంటే శక్తివంతమైనది వచనము.

**శైలి** - ''ఈయనకు ప్రబంధ కవుల శైలిపై అభిమానం ఎక్కువ. ఈ అభిమానం నాటకాలలోని పద్య గద్య గేయాలలో కనిపిస్తుంది. భావానికంటే శబ్దానికి ప్రాధాన్యం ఇవ్వడం గమనించవచ్చు. ప్రయత్నపూర్వకంగా శబ్దాలంకారాలు వాడుచుండును. వచనము మాత్రం రసవత్తరంగా ఉండును. కానీ పాత్రలనోట పలికించిన వచనములు పెద్ద యుపన్యాసములవలె నుండును. పద్యాలు పాత పద్ధతికి చెందినవే'' అని శైలిని గురించి అవధానిగారభిప్రాయ పడినారు.

ఆంధ్ర నాటక పితామహుని నాటకాలలోని జీవిత తత్వాన్ని సాంఘిక రాజకీయాధ్యాశయాలను హాస్యరస పోషణను గురించి అవధానిగారు విశ్లేషణాత్మకంగా వివరించారు.

ఆచార్యులువారి నాటకములను సర్వజనాదృతములు కావించుట విశేషము. ఆయన స్వయముగా నటుడు కావడము. సామాజికుల, నటుల అభిరుచిని జాగరూకతతో

గమనించి నాటక రచన చేయడము, అందువలన రంగసారస్వత ప్రయోజనాలన్నిటిని సాధించడానికాయన చేసిన ప్రయత్నం సర్వత్రా గోచరించును.

వీరి నాటకాలలో నీతి అంతర్వాహినిగా ప్రవహించుండును. అదికొరత నిశితముగానే సూచింపబడినను శిల్ప సౌందర్యానకెట్టి వైరూపమును గలిగించుట లేదు. ఇట్లు నైతికముగా శిల్ప సంఘటన యొనరించుట యాచార్యులవారి అపార కళావైదుష్యమున కర్హమైన తార్కాణము. ఈయన నాటక వస్తువులలో బీజము మొదలు పలాగమము వరకు నుండదగిన పరిణామావస్థలు పెక్కుచోట్ల కనిపింపవు.

ప్రబంధ కథలవలె ఆచార్యులవారి నాటక వస్తువులన్నియు రాజ కుటుంబములతో సంబంధించియున్నవే. ప్రబంధముల ప్రభావం పెక్కువిధాల ఈయన నాటకాలపై కనిపించుచున్నది. ఆచార్యులవారి నాటకాలలో సంవాదము కథన పద్ధతి సమపాళ్లలోనున్నవి. సంవాదము, నాటకమునకు ప్రాణము.

''ఆచార్యులవారి నాటకముల కాంధ్రదేశమున, గల యతి ప్రచారమే వానియందలి గుణబాహుళ్యమునకు గొప్ప నిదర్శనము. ఆంధ్రమున నాటకములే లేని రోజులలో పరివర్తనముల చేయుటకు గూడ పండితులు వెనుకాడుచున్న దినములలో, సంవిధ్యాచాతుర్యముతో విలసిల్లు స్వతంత్ర నాటకములెన్నిటినో రచించి ప్రదర్శింపచేసి యాంధ్ర వాఙ్మయమునకు పరోపకారమొనరించిన నాటక పితామహుడెంతయు స్తుతి పాత్రుడనుటలో సందియము లేదు''[3] అని ఆంధ్ర నాటక పితామహ బిరుదాంకితులైన ధర్మవరం రామకృష్ణమాచార్యుల నాటకాలను గురించి ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు నిర్వచించారు.

దివాకర్ల వేంకటావధానిగారికి పిహెచ్.డి పట్టా 1957లో వచ్చింది. వీరి పరిశోధన పరిశోధకులకు ప్రామాణ్యంగా, పరిశోధనా రంగానికి ప్రాణంగా నిలిచింది. ''ఆంధ్ర వాఙ్మయారంభ దశ - నన్నయ భారతము'' అనే అంశంమీద చేసిన కృషి ప్రశంసనీయమైనది. క్రీ.పూ. ఐదారు శతాబ్దాలనుండి క్రీ.శ. 11వ శతాబ్ది వరకు తెలుగు భాషలో వచ్చిన మార్పులను భాషా స్వరూప స్వభావాలను సోదాహరణంగా సిద్ధాంతీకరించారు. 1950 ప్రాంతంలో పరిశోధకుల సంఖ్య చాలా తక్కువ. ఇప్పుడున్నంత ప్రోత్సాహం, అవసరం అప్పుడు లేదు. అసలు మార్గదర్శకులుగా వ్యవహరించిన ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారికి కూడా పిహెచ్.డి డిగ్రీ లేదు. విషయ సేకరణకు ఎంతో శ్రమపడవలసి వచ్చేది. అవధానిగారెన్నో వ్యయప్రయాసలకోర్చి అమూల్య విషయాలను సేకరించి సిద్ధాంతీకరించి ఉస్మానియా విశ్వవిద్యాలయానికి సమర్పించారు.

# 2. ఆంధ్ర వాఙ్మయారంభదశ - నన్నయ భారతము

## ప్రథమ సంపుటము - ప్రాఙ్నన్నయ యుగము

దివాకర్ల వేంకటావధానిగారు 1957వ సంవత్సరం ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు పిహెచ్‌డి పట్టానికై సమర్పించిన సిద్ధాంత వ్యాసమే ఆంధ్ర వాఙ్మయారంభ దశ - నన్నయ భారతము. ఇది రెండు సంపుటాలుగ 1960వ సంవత్సరం ముద్రింపబడింది. మార్గదర్శకులుగా ఆచార్య ఖండవల్లి లక్ష్మీనరసింహంగారు వ్యవహరించారు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఉపన్యాసకులుగా పనిచేస్తూ అవధానిగారీ సిద్ధాంత వ్యాసాన్ని రచించారు. పరిణితి చెందిన పరిశోధనా తత్త్వం ఈ వ్యాసంలో కనిపిస్తుంది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం దీని ప్రచురణకు ఆర్థిక సాయం అందజేసింది. అవధానిగారు ఈ మొదటి భాగాన్ని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికే అంకితం చేశారు. ఇది ఎవరూ చేయని పని. ఎవరైనా ప్రభువులకంకితం చేశారే తప్ప ప్రభుత్వానికి అంకితం ఇవ్వటము తెలుగు సాహితీ చరిత్రలో మున్నెన్నడూ కనివిని ఎరుగని పని.

''ఆంధ్ర వాఙ్మయమున ప్రాఙ్నన్నయ యుగమున కజ్ఞాతయుగమనుపేరున్నది. అందలి వాఙ్మయ భాషా విశేషములను గూర్చి ఎక్కువగా దెలియకుండటయే దానికాపేరు వచ్చుటకు గారణము. ఇటీవల శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు, శ్రీ గంటిజోగి సోమయాజిగారు అభినవ వాగనుశాసన శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు, శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు కీ.శే. డా. చిలుకూరి నారాయణరావుగారు, కళాప్రపూర్ణ శ్రీ వర్ఝుల చిన సీతారామశాస్త్రిగారు మున్నగు భాషాతత్త్వజ్ఞులు ప్రాఙ్నన్నయ యుగమునందలి శాసనములను బరిశీలించి యందలి విశేషములను వెల్లడించి యున్నారు. వారి రచన లాధారముగా చేసికొనే నేను ఆ శాసనము లన్నిటిని బరిశీలించి యాంధ్ర భాషారంభ దశను గూర్చి ఈ రచన చేయబూనితిని''[4] అని అవధానిగారు తన రచనకాధారములైన రచనలను గురించి పేర్కొన్నారు. అవధానిగారు పేర్కొన్నవారందరూ సుప్రసిద్ధ భాషాతత్త్వవేత్తలు విమర్శకులు.

మొదటి సంపుటమైన ప్రాఙ్నన్నయ యుగములో ఆరుభాగాలున్నాయి. ప్రాక్చాళుక్య యుగమునందలి ఆంధ్రభాష, పూర్వచాళుక్య యుగమునందలి ఆంధ్ర వాఙ్మయ స్వరూపము చాళుక్య యుగమునందలి భాష, నన్నయకు పూర్వము ఛందస్సు, మార్గదేశీ కవిత్వములు, నన్నయ ఆది కవిత్వము, భారత రచనకు పూర్వరంగము, అను ఆరుఅంశాలను గురించి పరిశోధన చేసి ఆంధ్ర భాషా వికాస క్రమ పరిణామాన్ని సహేతుకంగా వివరించారు.

# ప్రాక్చాళుక్య యుగమునందలి ఆంధ్ర భాష

ఆంధ్ర భాష, ఆంధ్రదేశము, ఆంధ్ర జాతి అను మూడు శబ్దాలను గురించి చర్చించి ఆంధ్ర జాతియను శబ్దమే ప్రాచీనమైనదని నిరూపించారు. జాతి పరంగా ఆంధ్ర శబ్దము మహాభారతము ఐతరేయ బ్రాహ్మణములో వాడబడెనని పేర్కొన్నారు. చరిత్ర యుగమునకు పూర్వమునుండియు ఆంధ్ర జాతి బలవత్తరమై ప్రసిద్ధికెక్కియుండెనని తెలియజేశారు. దేశపరంగా ఆంధ్ర శబ్దము క్రీ.శ. తరువాతనే వాడబడినది. మైదవోలు తామ్ర శాసనముతో క్రీ.శ. 234లో మొదట పేర్కొనబడినది. ఆంధ్ర పదమును భాషాపరంగా వాడిన వారిలో నన్నయభట్టే మొదటివాడు.

తెలుంగులను జాతివారు మాట్లాడు భాష కాబట్టి దానికి తెలుంగు భాషయని పేరు వచ్చినది. తెలుగు పదం కూడా ముందు జాతిపరంగా తరువాత ప్రాంతపరంగా ఆ తరువాత భాషాపరంగా వాడబడినది.

క్రీస్తుపూర్వం ఐదారు శతాబ్దములనుండి తెలుగు భాష జనవ్యవహారంలో ఉండినదని ఊహించవచ్చు. తెలుగు భాష సంస్కృతజన్యం కాదు ద్రావిడ భాషాజన్యము. కానీ తెలుగు భాషలో సంస్కృత పదజాలం ఎక్కువ. ఈ పదజాలం చేసే ఇంద్రజాలం వలన కొందరు తెలుగు సంస్కృతం నుండి పుట్టిందని వాదించారు.

ద్రావిడ భాషలలో తమిళం ప్రాచీనమైనది. వానిలో ద్రావిడ భాషా పదాలధికం. కన్నడం కూడా తెలుగుకంటే ముందే ద్రావిడ భాషనుండి విడివడినది. తెలుగు ఆ తరువాత స్వతంత్ర రూపం దాల్చింది. కన్నడ తెలుగు భాషలలో సంస్కృత ప్రాకృత భాషాపదాలే ఎక్కువ.

ఆంధ్ర భాష భరతుని నాట్యశాస్త్రంలో పేర్కొనబడింది. కనుక ఆంధ్రభాష క్రీస్తు పూర్వమే వ్యవహారంలో ఉన్నదని ఊహించవచ్చు. అశోకుని కుమారుడు మహేంద్రుడు క్రీ.పూ. మూడవ శతాబ్దానికి పూర్వం జీవించాడు. అతడు ఆంధక అట్టకథ సింహళ దేశానికి తీసుకెళ్ళినాడు. అది సింహళ భాషలోనికి అనువాదం చేయబడింది. ఈ అంధక అను శబ్దము ఆంధ్రమే అని ఒక ఊహ. అందక అట్టకథ ఇప్పుడు లభించుట లేదు. క్రీ.పూ. 250వ సంవత్సరంనుండి క్రీ.శ. 250 వరకు ఆంధ్రదేశాన్ని పాలించిన శాతవాహన రాజుల కాలంలో వెలువడిన బృహత్కథ. గాథాసప్తశతిలో తెలుగు మాటలు కనిపించుచున్నవి. గాథాసప్తసతిలోని భాష మహారాష్ట్ర భాష అని అనధానిగారు పేర్కొన్నారు. గాథా సప్తశతిలో వాడబడిన అత్తా, పాడి, పొట్ట, పిలువ, కరణి, పలహీ, బోణ్డీ, మోడి, కుడ, కులు, ఊణ, బోల అను పది పదాలను గురించి పలు విధాల చర్చించారు. క్రీ.శ. ప్రథమ శతాబ్దిలోనే

తెలుగు సుస్థిర రూపం దాల్చి జనులలో ప్రచారంలో ఉండెడిది అనే అభిప్రాయం వెలిబుచ్చారు.

అమరావతి స్థూపమునందుగల ఒక రాతి పలకపై కనిపించు నాగలు శబ్దంలోని 'బు' తెలుగే, ఇది ంబు, మ్ము, ముగా రూపాంతరం చెందినది. ఈ అమరావతీ స్థూపం క్రీ.శ. ప్రథమ శతాబ్దిలో నిర్మింపబడినది. శాతవాహనులు, ఇక్ష్వాకులు, బృహత్ఫలాయనులు, ఆనంద గోత్రికులు, విష్ణుకుండినులు, తూర్పు చాళుక్యులు వీరందరూ ఆంధ్రులే. వీరు వేయించిన శాసనాలలో తెలుగు పదాలు ఉదహరించి అనుశీలించారు.

''క్రీస్తుపూర్వంనుండి క్రీ.శ. 7వ శతాబ్దిలో గొంత భాగము వరకును అనగా (తూర్పు చాళుక్యులాంధ్ర దేశమునాక్రమించుకొను వరకును) ఆంధ్రదేశమును పాలించిన రాజుల శాసనము లేనియు నాంధ్ర భాషలో వ్రాయబడి యుండలేదు. అవి కొన్ని ప్రాకృతము నందును, గొన్ని సంస్కృతమునందును గొన్ని సంస్కృత ప్రాకృతములందును గానబడు చున్నవి. కాని దీనియందు పేర్కొనబడిన కొన్ని గ్రామ నామములును, కొన్ని ధ్వనులను, అక్షరములును, పదములును, ప్రత్యయములును, తెలుగు భాష పరిణామ స్వరూపము లను గూర్చి కొన్ని విశేషములను వెల్లడించుచు నా భాష క్రీస్తు శకమునకు బూర్వము నుండియు జనవ్యవహారమున నుండెననుటకు దృష్టాంతములుగా నున్నవి''[5] అని పేర్కొన్నారు.

ద్రావిడ భాషకు మాత్రమే పరిమితమైన శకట రేఫముతో కూడిన పదాలు పెక్కు శాసనాలతో కనిపించుచున్నాయి. పఱవ, పణ, మొదలగు తెలుగులో శకటరేఫముతో కూడిన గ్రామ నామములు నేటికినీ కలవు. పెణుక పఱు, పామఱు, నిడుమఱు మొదలయిన పదాలు చాళుక్య శాసనాలలో కనిపించుచున్నాయి.

తెలుగు కన్నడములలోని పట్టుధాతువు పఱుధాతువునుండి వేర్పడినది. గోడు - కుదురు - పాక - పాడు, అను పదాలు కూడా శాసనాలలో కనిపించుచున్నాయి. ఇవికూడా ద్రావిడ భాషాపదాలే. పాక - అను పదానికి తెలుగులో గుడిసె, శాల అను అర్థాలున్నాయి. ఒకప్పుడు పాకగా ఉన్నవి తరువాత ఊర్లైనవాటికి నేటికీ చివర పాక శబ్దం కనిపిస్తున్నది. చిత్తూరు జిల్లాలో కాణిపాక, లేక కాణిపాకం, అనే ఊరు పనుపాకం అనే ఊరు కూడా ఉన్నది.

తమిళములో ''పాక'' శబ్దానికి సముద్ర తీర గ్రామము అని అర్థము. పాడు - అను శబ్దము చివరగల ఊర్లు ఆంధ్రదేశంలో కలవు. ఉలవపాడు, కంకిపాడు, దోసపాడు మొదలగునవి. పాటి శబ్దమె పాడు శబ్దంగా మారినట్లు కనిపించును. పాటి శబ్దానికి తమిళంలో పట్టణం, పల్లె అను అర్థాలున్నాయి. కన్నడంలో కూడ పాడి పాడు పదాలున్నాయి.

'రేవు' అను పదం మాత్రం తమిళ, కన్నడ, ఆంధ్ర భాషలన్నింటిలోనూ దిగు స్థలము (Landing Place) అనే అర్థంలో కనిపిస్తున్నది. ఈ విధంగా ఊర్ల పేర్లను గురించి విపులమైన చర్చచేసి తరువాత శాసనాలలో కనిపించే వ్యక్తుల పేర్లు, బిరుద నామముల మొదలైన వాటిని గురించి వివేచించారు.

గోలశర్మ, కొట్టిశర్మ, దొడ్డిస్వామి వంటి వ్యక్తుల పేర్లలోని పూర్వపదాలు తెలుగని మరియు మహాతలవర, తలవరి, తలారి, వంటి బిరుదు నామములకు తెలుగునకు గల సంబంధమును వివరించారు. మరియు ఆర్.డి.హెచ్ అను ధ్వనికి సంకేతమైన 'ఱ్ల' అన్న అక్షరాన్ని గురించి కొన్జు, మాద్రా మంటి పదాలను తాలవ్యకరణము, అనుస్వారమును, బహువచన ప్రత్యయమును, కొన్ని సమాసాలను గురించి చర్చించి -

''ప్రాక్చాళుక్యయుగమునందలి శాసనములలో గానవచ్చు పెక్కు గ్రామ నామములు క్రీ.శ. ప్రథమ శతాబ్ది నాటికే ఇతర ద్రావిడ భాషలనుండి విడివడి దేశమున వ్యవహరింప బడుచుండెనని యూహించుటకు దోడ్పడుచున్నవి. గాథాసప్తశతీ యందలి తెలుగు పద్యములీ విషయమునకు బలమొసంగుచున్నవి. ఇట్లు క్రీ.శ. ఆరంభము నాటికే తెలుగు జన వ్యవహారమున నుండెనని చెప్పుటకు వీలు కలుగుచున్నను లభ్యములైన పదములు పెక్కు గ్రామ నామములగుటయు, ప్రాకృత శ్లోకములనడుమ వాడబడినవిడి పదములగుటయు నప్పుడు తెలుగు వాఙ్మయ మేమైన నుండెనో లేదో ఉన్నచో నెట్లుండెనో చెప్పుటకవకాశము లేకున్నది. ఇంతకంటే ప్రాక్చాళుక్య యుగమునందలి తెలుగును గూర్చి యేమియు జెప్పజాలము''[6] అని ప్రాక్చాళుక్య యుగములోని తెలుగు భాషా స్వరూపాన్ని శాసనాధారాలతో నిరూపించారు. తమిళ కన్నడ భాషలతో తెలుగు పదాలకు గల సంబంధాన్ని కూడా తెలియజేస్తూ అనేక ఉదాహరణలిచ్చారు. ఈ నిరూపణ విషయంలో పూర్వం కొంత కృషి జరిగి ఉన్నా అవధానిగారు వివరించిన పద్ధతి చాలా సమంజసంగా ఉన్నది.

## 2. పూర్వచాళుక్య యుగమునందలి ఆంధ్ర వాఙ్మయ స్వరూపము

పూర్వచాళుక్యులు రేనాటిచోళులు తెలుగుదేశాన్ని పరిపాలించిన కాలంలో కొన్ని శాసనాలు తెలుగు భాషలో రాయించినారు. సంస్కృత భాషలో రాయబడిన శాసనాలలో గూడ గ్రామ సీమాదులను తెలియజేసే సందర్భాలలో తెలుగు భాష వాడబడినది. క్రీ.శ. 6, 7, 8 శతాబ్దాలలో కొన్ని తెలుగు శాసనాలు వచనంలో రాశారు. కానీ వీటిలో పదాలు కొన్ని అతి ప్రాచీన రూపాలతో ఉన్నాయి. అవి దురవగాహములుగా కనిపించుచున్నాయి. కానీ అవి ఇతర ద్రావిడ భాషా పదాలతో సన్నిహిత సంబంధం కలిగి తెలుగు భాషా పరిణామక్రమాన్ని తెలియజేస్తున్నాయి. ఈ కాలం శాసనాలలో సంస్కృత ప్రభావం కంటే ప్రాకృత ప్రభావం అధికంగా కనిపిస్తుంది.

క్రీ.శ. 7వ శతాబ్ది ఆరంభంలో భారతదేశానికి హ్యూయాన్‌త్సాంగు దక్షిణ దేశంలోని బౌద్ధ క్షేత్రాలను దర్శించుటకు వచ్చాడు. అతడు ధాన్యకటకానికి నైఋతిలో ఉన్న చుళియ (Chali-ya) చోళదేశాన్ని చూశాడు. చోళులు పాలించిన రాజ్యమే చుళియ కావచ్చు. తొలి తెలుగు భాషా శాసనాలు వేయించిన గౌరవము పూర్వచాళుక్యులకు గాక రేనాటి చోళులకు దక్కుతుంది. రేనాటి చోళులు తూర్పు చాళుక్యులకు సామంతరాజులుగా నుండిరి. తూర్పు చాళుక్య యుగములో లభించే ఆంధ్ర వాఙ్మయమంతా శాసనాత్మకమైనదే.

ఈ శాసనములను దేశ భాషాభిమానం వలన కొందరు తెలుగులో రాయించినా పూర్వ సంప్రదాయమునను సరించి చాలామంది సంస్కృతంలో కూడా రాయించినారు. ఈ సంస్కృత శాసనాల్లో దాతగ్రహీతల పేర్లు వంశ వర్ణనలు సంస్కృతంలోనే రాసేవారు కానీ గ్రామాల పేర్లు ఇవ్వబడిన స్థలాల పేర్లు ప్రదేశాల పేర్లు తెలుగులో రాసినారు. దీనికి కారణం దానం చేయబడిన గ్రామ క్షేత్రాల సంగతి సంస్కృతం రాని సామాన్య జనులకు కూడా తెలియవలయునను ఉద్దేశము కావచ్చు. గ్రామాలకు సంబంధించిన వివరణ అంతాకూడా తెలుగులో రాయడం గమనార్హం.

ఉదా: అస్యావధయ; పూర్వత; కేతనడిపియ చెరువు నడుమటి కట్ట. ఆగ్నేయత, మ్రోయకర్తియం బాలరియు రణస్త్రి పూండియు ముయ్యలి కుట్టున వెలంగ గుణ్ణ పడమటికట్ట, దక్షిణత, పెంజెరువు కట్టడిగుత్రోనైరి (ఋ) త్యత, కరిపత్తియు, నేత్రియు, సీమైవ సీమా; వెశాన్యత; ఎర్జియు న్తుకర్తియు రణస్థిపూండియు ముత్య కుట్టి విమాలాదుని రణస్థిపూండి తామ్రశాసనము, దీనిని బట్టి ''దక్షిణత, పెంటెరువు కట్టడిగ్గుత్రోవ'' మున్నగునవి కేవలం తెలుగు వాక్యములని తెలియుచున్నది. అందుచే నీసంస్కృత శాసనములు సైతమప్పటి తెలుగు భాష స్వరూపము నెరుంగుట కించుక తోడ్పడునుటలో సందేహము లేదు''[7]

ఈ కాలంలో వేసిన శాసనాలను మూడు విధాలుగా విభజింపవచ్చు -

1. గద్యమయ శాసనములు

2. పద్యమయ శాసనములు

3. పద్యగద్యమయ శాసనములు.

గద్యపద్యోభయములు గద్య పద్యాలతో కూడిన వానిని చంపకులనెడివారు. ఇది కన్నడ సాంప్రదాయం ప్రకారం తెలుగున ప్రవేశించినది. పద్యశాసనాలలో మొదటిది అద్దంకి శాసనం. ఇది క్రీ.శ. 848 ప్రాంతం నాటిది.

క్రీ.శ. 6వ శతాబ్ది చివరి భాగమునుండి పూర్తిగ తెలుగుభాషలో రాసిన శాసనాలు

కన్పిస్తున్నాయి. 6, 7, 8 శతాబ్దాలలో వేయబడిన శాసనాలలో ప్రాకృత భాషా ప్రభావ ఎక్కువగా కనిపిస్తుంది.

కాలం గడిచిన కొలది ప్రాకృతభాషా ప్రభావం తగ్గి సంస్కృత భాషా ప్రభావం ఎక్కువైనట తెలుగు శాసనాలలో కనిపిస్తుంది. తత్సమ పదాలెక్కువై అంతకుముందటి శాసనాల కంటే ఇవి కొంత సుబోధకములుగా కూడా ఉన్నవి. ఈ శాసనాలలో అచ్చటచ్చట భూ తద్ధర్మములందలి క్రియలు కనిపించును. కానీ సమాపక క్రియలు లేని వాక్యాల సం హెచ్చు.

వైదంబరాజుల కాలమునాటి వీరి పరాక్రమ స్మారకములైన శాసనాలనేకములు, ఏ (ఏగె అను దానికి పూర్వరూపం) పడియె, మున్నగు భూతకాల క్రియల ముగియుచున్నవి. వీటి చివర ద్రుత స్వరమునకు లోపం చేయుటవల్ల ఇవి పద్యమ శాసనములేమోయను భ్రాంతి కలుగుచున్నది. కొన్నిచోట్ల తచ్ఛబ్దానుగత క్రియాజ విశేషణములే క్రియలుగా వాడబడుచుండును, సంస్కృతమున ఇట్లే శబ్దమాపక్రియ వాడుట కలదు. ఇట్టి కూర్పు ఇట్లే ఆంగ్లంలో కూడా (Appositional Constructic అను పేరున్నది.

శాసనాలే కాక నన్నయకు పూర్వం కొందరు కవులు కావ్యాలు కూడా రాశారు అని అం కంద పద్యాలు కొన్ని ప్రబంధ రత్నావళిలో ఉదహరింపబడినాయి.

పంపమహాకవి తెలుగులో నన్నయకు పూర్వమే జినేంద్ర పురాణమును రచించెను. కన రత్న త్రయములోని పొన్నకవికి సర్వదేవుడనే పేరుండెననియు అతడే ఆది పురాణము కూడా రచించి యుండెనని నేలటూరు వేంకట రమణయ్యగారు తెలిపారు. పొన్నకవి పంప మహాకవివలె తెలుగువాడే. అతడు శాంతి పురాణంలో తాను వేంగీదేశముల కమ్మనాటికి చెందిన పుంగనూరు గ్రామ వాసినని చెప్పుకొని యున్నాడు. ఇతడు క్రీ 10వ శతాబ్దికి చెందినవాడు. ఇతడు రచించిన ఆది పురాణంలోని రెండు పద్యాలు మా ప్రబంధ రత్నావళిలో ఉదహరింపబడినవి. రేచన రచించిన కవిజనాశ్రయము కూ నన్నయకు పూర్వమే రచింపబడినట్లు అవధానిగారభిప్రాయపడినారు. భారత రచన నన్నయకు తోడ్పడిన నారాయణభట్టు కూడా తెలుగులో కవిత్వం చెప్పినట్లు నందంపు శాసనం వలన తెలియుచున్నది.

నన్నయ్యకు పూర్వం సామాన్య జనుల కానందం చేకూర్చుచు పాండిత్య నిరపేక్షము పాటలు, పదాలు, ఏలలు, జోలలు మున్నగు రచనలు కోకొల్లలుగా ఉండిన ఆధారాలున్నాయని అవధానిగారు తెలియజేశారు. పాల్కురికి సోమనాథుడు పండితార

చరిత్రలో అనేక రకాల పదాలను పేర్కొన్నాడు. దీనినిబట్టి నన్నయకు పూర్వం కొంత దేశి కవిత ఉండినట్లు తెలియచున్నది. అవధానిగారు పూర్వచాళుక్య యుగంలోని తెలుగు భాషనీ విధంగా సమీక్షించారు. ''నన్నయ్యకు బూర్వమున్న కవిత్వమిట్టిదని వస్తురసాలంకార వివేచన చేసి విమర్శించుటకు దగినయాధారము లేవియు లభింపక పోయినను అప్పుడాంధ్రమున నేదోకొంత కవిత్వముండెననుటకు మాత్రం నిదర్శనములు గోచరించుచున్నవి. ఈ కవిత్వమును శాసన కవిత, పదగేయరూపమైన దేశికవిత, మార్గపద్ధతికి చెందిన కావ్య కవిత అని మూడు తెరుంగులుగా విభజింపవచ్చును. ఇందు శాసన కవిత యారంభమున దేశ మార్గమునకును దరువాత (అనగా పదమూడవ శతాబ్దినుండి) మార్గపద్ధతికిని (విరియాల కామసాని గూడూరు శాసనము) చెందినదిగా గానవచ్చుచున్నది. పదగేయ కవితకు సోమనాథుడు పేర్కొన్న గీతములును, బదములును, ఉదాహరణములు, కావ్య కవిత్వమునకు పద్యాదులకు జైన కవులు రచించిన కావ్యములు తార్కాణము. ఇవియు క్రీ.శ. 10వ శతాబ్ది యుత్తర భాగమున రచింపబడినవే. దీనినిబట్టి దెలుగున గవిత మొదట చాళుక్య రాజుల ప్రేరణ ప్రోత్సాహములచే దేశి రూపముగా నారంభమైనదనియు దరువాత గన్నడ కవుల ప్రభావముచే మార్గకవిత కూడా గొంత వెలువడి నన్నయ భారతమున సమగ్ర రూప సౌష్టవము నొందెననియు తెలియుచున్నది. ఈ రెండు రకముల కవితయు నారంభమునుండి నేటివరకు దేశకాల మతాది పరిస్థితులననుసరించి యొకప్పుడొక దానికిని మరొకప్పుడొకదానికిని దోహదము చేకూరుచుండనధికముగనో యల్పముగనో సాగుచునో యున్నది. అందు నన్నయకు బూర్వమందలిదియుండియు నుపలబ్ధము కాకపోవుటచే బ్రకటయుగూఢమునైన సరస్వతీ నది వోలె మనపాలి కసత్ప్రాయమేయై పొడగట్టుచున్నది''[8]

## 3. చాళుక్య యుగమునందలి భాష

ప్రాక్చాళుక్య యుగమున కేవల గ్రామ నామముల రూపమున గానవచ్చిన తెలుగు భాష చాళుక్య యుగారంభమున ప్రాకృత భాషా సంపర్కమును పొంది తరువాత క్రమంగా తత్సమ పదజాలాన్ని కూర్చుకొని క్రీ.శ. 11వ శతాబ్దినాటికి నన్నయ భారత భాషలో సదృశమయిన భాషగా పరిణమించిందని, నన్నయ అందలి లోపాలను సవరించి దానిని లాక్షణికమును శ్రుతిమనోహరమునయిన ఉత్తమ భాషగా సంస్కరించెను. క్రీ.శ. 6, 7, 8 శతాబ్దులలోని తెలుగు శాసనములు వచనమునందే యున్నప్పటికీ అందలి పదాలు కొన్ని దురవగాహములుగాను దక్షిణ దేశ భాషలందలి పదములతో సన్నిహిత సంబంధము కలిగి తెలుగు భాషా పరిణామ ప్రకారాన్ని సూచిస్తున్నవి. అవధానిగారుదహరించిన కొన్ని పదస్వరూపాలను ఇక్కడుదహరిస్తున్నాను.

అణపోతులు - (ఆజ్ఞప్తి) పుణ్యకుమారుని మాలెపాడు శాసనం

ద్భగరాజు - (ద్భగిరాజు) యువరాజు చోళ మహారాజు ఇందుకూరి వాసనం

బెజయిత్తభటురళు (విజయాదిత్య భట్టారక) కపిలేశ్వరపుర శాసనం క్రీ.శ. 740 మొదలైన పదాలు ప్రాకృత మూలములై నన్నయ భాషలో మనకు పరిచయమైన రూపాలలో అప్పటికి స్థిరపడక తెలుగు లోనికి వచ్చు మార్గంలో నున్నట్లు కనిపించును. అందుకే ఇవి అంత సులభముగా అర్థమగుట లేదు. కనుక వీటిని వింత పదములని అవధానిగారు పేర్కొన్నారు. అందులో కొన్ని ఈ విధంగా ఉన్నాయి.

## కొన్ని వింత పదములు

నివబుకాను -
ఇరువది యాదినాలు మరుతుర్లు — ఎర్రగుడిపాడు శాసనము క్రీ.శ. 6వ శతాబ్ది

రట్టగుళ్లు
ఎణుంబొాది
ఇర్లకామ — విప్పర్ల శాసనము క్రీ.శ. 641
గాణంబు

పేడ్లుము
బోళ
ముడ్లు — లక్ష్మీపురశాసనము క్రీ.శః 685 - 705
కడువండ్లు

బాణ
అస్పి — యుద్ధమల్లుని బెజవాడ శాసనము
మణ్ణిమొల్క

మణ్ణిమొల్క — (ముంక) చిన్త (మణ్ణి)

రూప వైవిధ్యమును పొందిన దేశ్య పదములు

| | | |
|---|---|---|
| ఏబడి | - | చోళ మహారాజు ఉరుటూరి శాసనం క్రీ.శ. 7వ శతాబ్దం |
| ఏభది | - | వెల్దుర్తి శాసనం |
| ఎమ్మదియే | - | తిప్పలూరి శాసనం |
| ఎంభాది | - | వెలుదుర్తి శాసనం - క్రీ.శ. 8వ శతాబ్ది |
| లేని | - | ఉరుటూరు శాసనం |
| తేనికి | - | సాలెపాడు శాసనం |
| దేనికి | - | నెం. 403 - 1904 |
| దినికి | - | నెం. 401 - 1904 |
| రచ్చినవాౘను | - | ఉరటవారు అగస్త్యేశ్వర దేవాలయ శాసనం |
| | | చిలంకూరు దిమ్మగుడి శాసనం |
| డచ్చిన - డచిన | - | పెట్లూరి శాసనం |
| వ్రచ్చిన | - | ఉరుటూరి శాసనం |
| అరసినవారి | - | బూడిద గడ్డపల్లి శాసనం |
| తక్క_నీపురోల | - | పుణ్యకుమారుని తిప్పలూరి శాసనం |
| వైడుంబత్రోలు | - | మురుసుపల్లి శిలాయము |
| గొట్టిప్రోలు | - | మొదటి అమ్మరాజు మచిలీపట్టణ తామ్రశాసనం |
| తాంబుల్ | - | విజయాదిత్య చోళుని తామలూరు శాసనం |
| తబుణ్లు (తమ్ముడు) | - | కపిలేశ్వరపుర శాసనం - క్రీ.శ. 740 |

**బహువచన రూపములకు కొన్ని ఉదాహరణములు**

| | | |
|---|---|---|
| ఊర్లండు | - | జయసింహ వల్లభుని విప్పర్ల శాసనం |
| పాౘనూరు | - | సత్యాదిత్యుని మాలెపాడు శాసనం |
| కపిలగోవు | - | |
| గవిలల | - | చోళమహారాజు సూర్యగ్రహణ కాల శాసనం |
| కవిళ | - | విష్ణువర్ధనుని సాలెపాడు శాసనం |
| గవిళల | - | నెం. 401 - 1904 |
| కపిలశాను | - | నెం.403 - 1904 |
| పెండ్లంబు (భార్య) | - | ఎస్ - 1 - 1 + 508 |
| పెండ్లాంబులు - నెం | - | 408 - 1904 |

మొదలగు పదాలను అనేక శాసనాలలో నుండి ఉదహరించారు. రూపవైవిధ్యముతోనే కాక రూపవైవిధ్యముతో వర్ణక్రమ దోషముతో కూడిన శబ్దములను కూడా ఉదహరించారు. ఈ విధంగానే విభక్తులు, విభక్త్యంగములు, సర్వనామములు, సంఖ్యా వాచకములు, క్రియలు, తద్ధర్మ కార్థకాలు, విధ్యర్థకాలు, ఆశీరాద్యర్థకములు, తద్ధితరూపాలు, సముచ్చయార్థకాలు, సంధులు, సమాసాలు మణిప్రవాళములు మొదలైన రూపాలకు ఉదాహరణలిచ్చి విపులంగా చర్చించి క్రిందివిధంగా సమీక్షించారు.

''ఈ విధంగా చాళుక్య యుగమునందలి శాసనములలోని భాషను బరిశీలించి చూడగా మొదట స్థిరత్వము లేక యాయా ప్రాంతమునందలి వాడుకలోని వైవిధ్యమును బట్టి భిన్న రూపములలో నుండిన శబ్దములే క్రమముగా 11వ శతాబ్ది నాటికి స్థిర రూపములను బొడవనారంభించెననియు, నిప్పటి తెలుగును చూచినచో చాలవింతగా గనబడును. దురవగాహములుగా దోచు పదములు పెక్కు నన్నయ నాటికి బూర్వ గ్రంథములద్వారా మనకు బరిచితములగు రూపుములను బొందినవనియు, మొదట బ్రాకృత పదబహుళమైన భాష క్రమముగా సంస్కృత పదములను జేర్చుకొని నన్నయ భారతమునందలి భాషకు సన్నిహితమైన స్థితిన బడిసిన దనియు తెలియవచ్చుచున్నది. కొరవి శాసనమునందలి వచనశైలియు, కావుసాని గూడూరు శాసనవమునందలి పద్యశైలియు నన్నయ భారతమునందలి గద్యపద్యముల శైలితో దులతూగుచున్నవనుటలో నతిశయోక్తి లేదు. తన నాటికీవిధముగా బరిణత రూపమగుచున్న భాషను బరిశీలించి యందింకను నిల్చియున్న కొన్ని వికృతులను వైకల్యములను దొలగించుటచే దానికి మహాకావ్యోచితమును సమగ్ర సుందరమునైన రూపమును దీర్చిదిద్ది నన్నయ భారతాంధ్రీకరణోద్యమమునకు బూనుకొనెను''9 అని అవధానిగారు ఈ క్రపరణంలో ఎన్నో పూర్వ శాసనాలనుండి అసంఖ్యాకమైన పదస్వరూపాలను ఉదహరించి వాటి పరిణామదశలను, వ్యాకరణాంశములను వివరించారు. చాళుక్య యుగమునందలి భాషను గురించి ఇంత విశ్లేషణాత్మకంగా చర్చించినవారు తెలుగు సాహిత్యంలో చాలా అరుదు. చాళుక్య యుగంలోని తెలుగు భాషా స్వరూప స్వభావాలను కొండను అద్దంలో చూపించినట్లు స్పష్టీకరించారు. ఈ కృషి ప్రశంసనీయమైనది.

## 4. నన్నయకు బూర్వము ఛందస్సు

చాళుక్య యుగమున క్రీ.శ. 10వ శతాబ్దికి బూర్వము కేవలం దేశ కవిత్వం మాత్రం ఉండెనని తరువాత దేశిమార్గ కవిత్వములు రెండును వ్రాయబడుచుండెనని శాసనములవలన, తెలియుచున్నది.

పద్యములు వృత్తములు, జాతులు అని రెండు విధములు, వృత్తములు అక్షర గణబద్ధములు. నీటిని సంస్కృతమునుండి గ్రహించారు. జాతులు సాంస్కృతికములని దేశ్యములనియు రెండు విధాలు. సంస్కృత జాతులు మాత్రాసంఖ్యా నియమముగల నాలుగు పాదాలతో గూడియుండును.

దేశ్యజాతులు మాత్రాగణబద్ధములైన పాదములతో గూడియుండును. పాదనియమము మొదటి నీనికి లేకుండెను. సంస్కృత వృత్తములననుసరించి నీటికి పాద నియమము తరువాతి కాలంలో యేర్పడియుండును. దేశ్యజాతులు - జాతులు, ఉపజాతులు అని మరల రెండు విధములు. జాతులలో వృత్తములలోవనే యతిప్రాస నియములుండు ఉపజాతులలో యతి ఒక్కటే యుండును. యతికిబదులు ప్రాస యతి కూడా వాడవచ్చును.

సంస్కృతమున యతి నియమము లేదు. కన్నడములో కూడ యతి నియమ నిర్బంధము లేదు. తమిళములో యతి కొన్నిటిలోనియతమైనను కొన్నిటిలో వైకల్పికమే. తెలుగున మాత్రము యతి నియమము వృత్తములలో తప్పనిసరిగా ఉన్నది. మొత్తంమీద ఈ ప్రోవళ్లు సంస్కృత ప్రాకృత సంప్రదాయ సిద్ధములగు గేయ రచనలలో ''శీర్షిక'' మనునదే ఒక రకమైన సీస పద్యముతో సరిపోవుచున్నదని అవధానిగారు పేర్కొన్నారు. భరతుడు ఈ శీర్షమును నాట్య శాస్త్రములో ప్రస్తావించినాడు. జాతులలో చేరు 'మధ్యాక్కర' 'తరువోజ' మొదలైన పద్యాలు నాలుగు పాదాలుగ స్థిరపడుటకు కారణం సంస్కృత ప్రభావమే. కొందరు పండిత కవులు దేశీయ ఛందములతో సవరించి వాడుటచే సంస్కృత భాషలో కవిత్వము చెప్పినను సంస్కృతములో దేశీయ ఛందములను, దేశీ సంప్రదాయములను ప్రవేశపెట్టినారు. క్రీ.శ. 9వ శతాబ్దివాడైన పోతుదేవసూరి యశస్తిలక చంపువున కొన్ని రగడలు చెప్పియున్నాడు. సంస్కృతంలో రగడలకు ప్రచారం లేదు. అందులో దక్షిణాది సంస్కృత కవులే ఈ రగడలను వాడియుండుట గమనార్హం. దీనినిబట్టి రగడలు సంస్కృత భాషలోనికి దక్షిణ దేశ భాషల (ద్రావిడి) భాషలనుండి వెళ్లినవనవచ్చును. క్రీ.శ. 1022వ సంవత్సరంలో రాజరాజు పట్టాభిషేకానంతరం భేతన భట్టు రాసిన కోరమిల్లి శాసనములో సంస్కృత శ్లోకాలు, గద్యభాగము వ్రాసిన తరువాత ఒక రగడ కనిపించుచున్నది. దీనిలో (28) ఇరువది ఎనిమిది పాదాలున్నాయి. ఈ రగడ నన్నయకు పూర్వం రగడలు రాయబడుచుండెననుటకు తార్కాణం. కన్నడ భాషలో నాగవర్మ, అతనికి పూర్వుడైన పంపకవి రగడలను వాడియున్నారు. పంపకవి లలిత, మందానిల రగడలను వాడినాడు. ఇవి తెలుగులోగల ''మధురగతి'' ద్విరదగతి, తురగవల్లనగతి రగడలకు సరిపోవును.

నన్నయ నన్నెచోడుడు రగడలను వాడలేదు. అనంతడు తొమ్మిది విధాలైన రగడ

లక్షణాలను తెల్పియున్నాడు. అప్పకవి రగడలనేక విధములని చెప్పెను. కాని తొమ్మిది విధములైన రగడలకు మాత్రం లక్షణం చెప్పాడు. కన్నడంలో దీనిని ''రఘట'' అంటారు. అని రగడలను గురించి అవధానిగారు పేర్కొన్నారు. ఈ విధంగానే షట్పదులను కళికలను, ఉత్కళికలను, ఉదాహరణముల లక్షణాలను క్షుణ్ణంగా చర్చించారు. దేశిరచనా భేదాలన్నీ నన్నయకు పూర్వమే ఉన్నట్లు పేర్కొన్నారు.

కందపద్యాలు కూడా నన్నయకు పూర్వముండినట్లు అవధానిగారభిప్రాయపడినారు. క్రీ.శ. 953 ప్రాంతంనాటి సర్వదేవుని ఆది పురాణంలో క్రీ.శ. 980 ప్రాంతంలో ఉండిన అయ్యనభట్టు రచించిన అరూంబాక శాసనకావ్యంలో సంస్కృత శ్లోకాల మధ్య తెలుగు ఛందస్సు అగు యతి ప్రాసలతో కూడిన కంద పద్యములను సంస్కృత భాషలో రాయబడిన దానిని అవధానిగారు దహరించారు.

కందుకూరి శాసనంలో ఒకటి, ధర్మవర శాసనములో ఒకటి, సీసపద్యములున్నవనీ అందులో కందుకూరి శాసనంలోగల సీస పద్యములో కొంత భాగం లుప్తమైనది. ధర్మవర శాసనములో సీసపద్యం తరువాత ఆటవెలది చెప్పబడియున్నది. ఇది అవకలి సీసం, ఈ ఆటవెలదిలో ప్రాసయతి వాడబడినది. దీనినిబట్టి నన్నయకుముందు ఆటవెలది, తేటగీత, సీసపద్యములుండినట్లు చెప్పవచ్చును. ఉపజాతులకు సంబంధించి సీసపద్యము, ఆటవెలది, తేటగీతులు కన్నడంలో కూడా నన్నయ్యకు ముందునుండే ఉన్నవి. తెలుగులోని ఆటవెలది తేటగీతి తమిళములో ''వెణ్బా' పద్య బేదముతో సరివచ్చును.

నన్నయకు పూర్వం తరువోజ పండరంగని అద్దంకి శాసనంలోను మధ్యాక్కర యుద్ధమల్లుని బెజవాడ శాసనంలోను పనం చూడవచ్చు. అని తెల్పుతూ కన్నడంలోని మధ్యాక్కరలకు తెలుగులోని మధ్యాక్కరలకు గల భేదసాదృశాలను అవధానిగారు వివరించిన వివరణక్రమం ఇది.

రెండు భాషలలోను అక్కరలు ఐదు విధములుగానున్నవి.

| క్రమసంఖ్య | తెలుగు | గణములు | కన్నడము | క్ర.సంఖ్య |
|---|---|---|---|---|
| 1. | మహాక్కర | 7 | పిరియక్కర | 1 |
| 2. | మధ్యాక్కర | 6 | దొరియక్కర | 2 |
| 3. | మధురాక్కర | 5 | నడునణక్కర | 3 |
| 4. | అంతరాక్కర | 4 | ఎడెయక్కర | 4 |
| 5. | అల్పాక్కర | 3 | కిరియక్కర | 5 |

తెలుగున మధ్యాక్కర రెండవది. కన్నడములో మధ్యాక్కర మూడవది. ''నడునణక్కర'' అనగా మధ్య ఉండే అక్కర అని యే ఆ కన్నడ పదానికి అర్థం దీనినిబట్టి చూడగ కన్నడములోని పేర్లే సార్థకముగా నున్నది. గణముల సంఖ్యను బట్టి చూచినచో కన్నడమున మూడవది సరిగా మధ్యనున్నది.

నన్నయ 39 మధ్యాక్కరలను ఒక మధురాక్కరను వాడియుండెను. తిక్కన అక్కరలను వాడలేదు. ఎఱ్ఱన అరణ్యపర్వశేషమున మాత్రము కొన్ని అక్కరలను వాడెను. తరువాతి కవులక్కరలను ఉపయోగించినట్లు కనబడదు.

నన్నయకు పూర్వం కొన్ని శాసనాల్లో వృత్తగంధి గద్యములని చెప్పదగిన భాగములు కనబడుచున్నవి. గద్యం మూడు రకాలని వామనుడు కావ్యాలంకార సూత్రములో పేర్కొన్నాడు. 1. వృత్తగంధి 2. చూర్ణము 3. ఉత్కళికాప్రాయము పద్యపాదముతో ప్రారంభమైనది వృత్తగంధి.

అనావిద్యలలిత పదము అనగా దీర్ఘ సమాసములేని లలిత పద రచన ఉత్కళిక, దీనికి వ్యతిరేకమైనది ఉత్కళికాప్రాయము. అనగా దీర్ఘ సమాసాలతో కూడినది. నన్నయ భారత భాగంలో ఈ మూడు రకాలైన గద్య భేదములు ఉపయోగింపబడి ఉన్నాయి.

''కవిజనాశ్రయ కర్త గురువైన నాడీంద చూడామణియొక ఛందస్సు వ్రాసినట్లు కనబడుచున్నది. కవి జనాశ్రయమందును నాగవర్మ ఛందోంబుధియందును గూడ జయదేవాదుల ఛందోగ్రంథములు పేర్కొనబడినవి. గుణగ విజయుదిత్యుడొక ఛందోగ్రథమును వ్రాసినట్లు యాస్పిరగలమ్‌కార్‌కైన వలన తెలియుచున్నది. ఈ ఛందో గ్రంథములు కొన్ని తెలుగునకును గొన్ని కన్నడమునకును సంబంధించి యుండవచ్చు. అవియే భాషకు సంబంధించినవైనను నన్నయకు బూర్వము వెలసినట్టివే. కాని యవి యేవియు నిప్పుడు లభ్యములు కామిచే నన్నయకు బూర్వమందలి ఛందస్సును గూర్చి యెరుంగుటకేవిధముగను దోడ్పడజాలకున్నవి'' [10] అని నన్నయకు పూర్వముండిన ఛందస్స్వరూపాన్ని అవధానిగారు వ్యక్తీకరించారు. ఈ వ్యక్తీకరణ పద్ధతి ఎంతో సమంజసంగా ఉన్నది. నన్నయకు పూర్వమున్న ఛందస్సును గురించి చెప్పుటకు ఆధారాలు తక్కువ అయినా అవధానిగారు వీలైనన్ని ఎక్కువ ఆధారాలతో సోదాహరణంగా ఈ విషయాన్ని వివరించారు.

## 5. మార్గదేశీ కవిత్వములు

సంస్కృత కవులు కవిత్వంలో మార్గదేశీ విభేదాలు పాటించినట్లు కనిపించదు. సంగీతశాస్త్ర గ్రంథాలలో సంగీతమును మార్గమని దేశీయని రెండు విధాలుగా

విభజించారు. ఈ సంప్రదాయమును బట్టి కన్నడ కవులును, వానిని బట్టి నన్నెచోడుడును కవిత్వములో కూడ ఈ భేదమును ప్రవేశపెట్టి యుందురని అవధానిగారభిప్రాయపడినారు.

''మృగ్'' (వెదుకుట) ధాతువునుండి మార్గశబ్దం ఏర్పడినది. దశరూపకకర్త నాట్యలక్షణాలను చెప్పే సందర్భంలో నృత్యము - మార్గ పద్ధతికి చెందినదని, నృత్తము దేశి పద్ధతికి చెందినదని స్పష్టీకరించెను. Prof. Hass అను మార్గమును Higher Style అని దేశిని Lower Style అని నిర్వచించారు.

సంగీత విషయంలో కనిపిస్తున్న మార్గదేశి భేదాలను భాషలకన్వయించి చూచినప్పుడు సంస్కృత భాష కవిత్వం మార్గవిధానానికి, ఆంధ్ర కర్నాటకాది భాషల కవిత్వం దేశి విధానానికి చెందునని స్ఫురించును. పండితులు లక్షణబద్ధంగా రాసిన కవితను మార్గమని, సామాన్యజనులు లక్షణంతో సంబంధం లేకుండా చెప్పిన కవిత్వాన్ని దేశి అని చెప్పవచ్చు.

తమిళంలో క్రీ.శ. 2వ శతాబ్దినుండి గ్రంథ రచన సాగినట్లు తెలియుచున్నది. ఇరైనార్ తమిళంలో ఆదికవి, కన్నడంలో నృపతుంగుడు రాసిన కవితాజామ్గాం ప్రాచీనమైనది. ఇతని కాలం క్రీ.శ. 815 - 877, తెలుగులో నన్నయ క్రీ.శ. 11వ శతాబ్దం.

నన్నెచోడుడు మార్గదేశి పద్ధతులను కన్నడంనుండి గ్రహించి ఉండవచ్చు. క్రీ.శ. 7వ శతాబ్ది నుండీ కన్నడ భాషలో మార్గదేశీ పద్ధతులున్నాయి. సంస్కృత భాషా పదాలకు దేశీ విభక్తులు చేర్చి మనమిప్పుడు తత్సమములనుచున్న శబ్దములవంటి శబ్దా శబ్దాలను కూడా కన్నడంలో వాడుచుండిరి.

క్రీ.శ. 13వ శతాబ్ది వరకు కూడా సంస్కృతంలో పాండిత్యం సంపాదించిన వాడే పండితుడు. తెలుగులో ఎంత మంచి కవిత్వం చెప్పినా గుర్తింపు ఉండెడిది కాదని విన్నకోట పెద్దన తనకావ్యాలంకార సంగ్రహంలో పేర్కొన్నాడు.

కవులు కొందరు మణిప్రవాళ భాష కూడా వాడినారు. నన్నెచోడుడు తాను దేశికవినని చెప్పుకొన్నా మార్గపద్ధతికి చెందిన కవిత చెప్పిన సందర్భములు కూడా ఉన్నవి. నన్నయ మార్గకవియను చెప్పుకొన్నా అతని కవిత్వంలో దేశికవితా రీతులగుపించును. కాని కొంచెం తక్కువపాళ్లలో గోచరించును. నన్నెచోడుని తరువాత దేశి మార్గపద్ధతుల కవితల ప్రస్తావన చేసినవాడు నృపధూర్జటి భీమయ పండడు. ఇతడు నన్నెచోడునకు కొంచెమీవలివాడు. అతని పద్యమొకటి శాసనపద్యమంజరిలో కనిపించుచున్నది. ఆ తరువాత పాల్కురి సోమన దేశి మార్గాల కధికప్రాముఖ్యమిచ్చెను. తిక్కని కవిత మార్గదేశి సమ్మిశ్రమము. అది సలక్షణము, సరసమైన కూడిక, ఆ తరువాత దేశి కవితకు ఆదరణ తగ్గినది. నేటివరకు కూడా దేశి కవితరాయు కవులరుదుగా నున్నారు.

నన్నెచోడుడు చెప్పిన దుర్మార్గకవిత, మణి ప్రవాళ రచనా విధానము నన్నయకు పూర్వమే కృషించి జాడలేకుండా పోయెను. కన్నడంలో కూడా ఎక్కువ కాలం నిలబడలేదు. కానీ మళయాలంలో మాత్రం నేటికి కూడా నిలిచే ఉన్నది.

తెలుగులో దేశి కవిత తిక్కన పాల్కురికి సోమన, నన్నెచోడుల కాలంలో కొంత ప్రగతిని సాధించింది. ప్రబంధ కవుల కాలంలో పూర్తిగా అంతరించింది. నాయకరాజుల కాలంలో యక్షగానాల రూపంలో కొంచెం నిలదొక్కుకున్నది. ఆధునిక కాలంలో దీనిపై నిరసన భావం సర్వత్ర కనిపిస్తున్నది. దాని భవిష్యత్తు నూహించుట కష్టమని అవధానిగారు అభిప్రాయపడినారు.

## 6. నన్నయ ఆదికవిత్వము

భారత రచనకు పూర్వరంగము నన్నయకున్న ఆదికవి బిరుదము అర్వాచీనమెగానీ ప్రాచీనము కాదు. ఎఱ్ఱన తిక్కనాదులు నన్నయను ఆ విధంగా పేర్కొనలేదు. మారన మాత్రం ''అట్టి విద్యారమణీయు నాంధ్రకవితాగురు నన్నయభట్టు గొల్చెదన్'' అని తన మార్కండేయ పురాణంలో పేర్కొన్నాడు. నన్నయకు పూర్వం పద్మసర్వదేవాదులగు పండితులు కొన్ని కావ్యాలు రాసినట్లు కొందరు చెప్పుచున్నారు. శాసనా పద్యాలుండనే ఉన్నవి. దేశి పద్ధతికి చెందిన పాటలు పదాలు విరివిగా నుండెననుటకు ఆధారాలున్నాయి. నన్నయకు పూర్వం భీమనభట్టు బేతనబట్టు, ఆయనభట్టు మొదలైనవారు పండితులై కవులై కొన్ని శాసనములను రచించారు. కావ్యాలు రచించారు. కావ్యాలు లభించుట లేదు. నన్నయకు పూర్వముండిన కవులు వారు దేశి పద్ధతిలో కవిత చెప్పిన కారణం చేత పండితులాదరించలేదు.

నన్నయ రచించిన కావ్య భాషచే, భావములచే వస్తువుచే, వర్ణనాధిక్యముచే కవితా వైశిష్ట్యంచే పవిత్రతచే మహోదాత్తమై యలరారుట కూడా నన్నయకు ఆదికవియను ప్రభ తెచ్చిపెట్టినది. దొరికిన గ్రంథాలలో నన్నయ రచనయే మొదటిది కాబట్టి అది ఆది కావ్యమైనది. భారతం వంటి యుత్తం కావ్యమాకస్మికంగా నవతరించెననుట విశ్వసనీయం కాదు. కానీ భారతం వంటి యుద్గ్రంథం రచనకు కావలసిన భాష ఛందస్సు మొదలైనవి అంతకు పూర్వం లేవు. భాష స్థిరత్వం పొందలేదు. ఆదర్శ గ్రంథాలు లేవు. రాజరాజు భారత రచనను చేయమన్న కోరికను తిరస్కరించుటకు నన్నయకు మనస్కరించలేదు. కనుక భారత రచవకు పూనుకొన్నారు. నన్నయ అనుభవించిన కృత్యాద్యవస్థ అంతరంగ బహిరంగములకు రెంటికి సంబంధించినది. అతడంధకార బంధురము నగమ్యమునైన

యడవిలో నఖిలజన సుగమమైన సుపథమును కష్టపడి కల్పించెను.

తొలి రోజుల్లో సంస్కృత భాషయందలి పద్యాలను, పద్ధతులను దేశ భాషలలోనికి జొప్పించుటయెట్లు? అనునదే పండితులకును లాక్షణికులకును ప్రధాన సమస్యగా నుండెను. నృపతుంగుడు కన్నడ భాషలో చేసిన సంస్కారములను నన్నయ తెలుగు భాషలో చేశారు.

సంస్కృతములో అజంత హలంత నామములను, విశేషణములను, తెలుగునకు తెచ్చుకొనునప్పుడు వాని చివర నెప్పుడేయే ప్రత్యయాలను జేర్పవలయునో నిర్ణయించి దేశి పదాలలో వానిని కూడా కలిపి రచనచేయు పద్ధతిని నెలకొల్పినాడు. అంతకుముందు కూడా ఈ పద్ధతి అక్కడక్కడ పరిణామ దశలో నుండెను. నన్నయ దానికొక స్థిరత్వాన్ని కల్గించాడు. నారాయణభట్టు మున్నగు మిత్రుల సహకారాన్ని పొంది మణిప్రవాళ భాషాభిమానులైన కవులకు నచ్చజెప్పి తెలుగులో తత్సమబహుళమైన భాష మాత్రమే కావ్యోచితమని సిద్ధాంతీకరించాడు.

బహువచన విభక్త్యాదిప్రత్యయములను స్థిరీకరించు సందర్భంలో కూడా నన్నయ సుప్రతిభ కానవచ్చుచున్నది. ఉదాహరణకు : మహారాజుర్ల, రెండు తోటళు, ఊరిస్వామల్ మలినుర్రై, అలపాక బోళ్ మొదలయిన పదాలలో ళు, ళీ, కళీ, కలు, లు, ల్, రు అనునవి బహువచన ప్రత్యయములుగ కనిపించుచున్నవి. వీటనన్నిటిని సంస్కృతీకరించి స్థిరీకరించుటయే నన్నయ విశిష్టత విభక్తి రూపాలు - వాఱను, గొరల్పయ, పాడుచి, కొమరు సామికి, పసులకు, మొదలైన వాటికి కూడ నన్నయ, సాధురూపములు కల్పించాడు.

'ఱ్ల' అను వింత అక్షరాన్ని నన్నయ తొలగించాడు దీనిని పెక్కుచోట్ల 'ఱ' డ, ళ అను అక్షరాలుగా మార్చెను. 'ఱు' అను దానిని గూడ నన్నయ వదలిపెట్టెను.

నన్నయకు శబ్ద శాసనత్వమును గలిగించిన ప్రధాన కారణాలలో అతడవ్యస్థితమైన తెలుగు శబ్దములకొక వ్యవస్థనేర్పరిచి వానికి రూప స్థైర్యం కల్పించుట ఒకటని నిస్సందేహంగా చెప్పవచ్చు. బహుళమైన గసడదవాదేశము చాళుక్యుల శాసనాలలో నిత్యముగ కనిపించు చున్నది. సంధి విషయంలో సంధి నిత్యము, వైకల్పికము బహుళము అయిన చోట్లను నిర్ణయించి ఆ నిర్ణయం ప్రకారమే ప్రయోగించెను. యడాగమ విషయంలో ఇదే పద్ధతిని పాటించెను. అంతకుమునుపు అసమాపక్రియలుగా ఉన్న వానిని నన్నయ సమాపక క్రియలుగా వాడిన సందర్భాలు అనేకం నన్నయ భారతంలో కనిపిస్తాయి. నన్నయ కర్మార్థక వాక్యాలకు ప్రాచుర్యం కల్గించెను. ద్రావిడ భాషలన్నిటిలో ఇట్టి ప్రయోగము కలదు.

## ఛందోవిషయం

నన్నయకు పూర్వం మాత్రాఛందస్సుకు సంబంధించిన జాత్యుపజాతులే ఎక్కువగ వాడబడుచుండెనని చెప్పవచ్చును. వీటికితోడు గణబద్ధ ఛందమునకు చెందిన పలువృత్తములను సంస్కృతంనుండి గ్రహించి వాడెను. బహుసంఖ్యాకములైన సంస్కృత వృత్తాలనుండి ధారాళమైన గమనంగల శార్దూల, చంపక, ఉత్పలమాల మొదలైన వృత్తములను గ్రహించుట నన్నయ ఛందః పరిజ్ఞానమునకు చక్కని తార్కాణం. నన్నయ ఈ విషయంలో కన్నడ కవులైన పంపాదులననుకరించెను. చంపూ కావ్యంగా రాయడంలో కూడా కన్నడ కవులనే అనుకరించెను. అనువాద ప్రతిని ఎన్నుకొనుటలో కూడా నన్నయ తనకు లభించిన తాళపత్ర ప్రతులన్నింటిని పరిశీలించి ప్రక్షిప్తాలను తొలగించి దీర్ఘమైన వర్ణనలను తగ్గించి, భారత రచనకు శ్రీకారం చుట్టాడు అనే అభిప్రాయాన్ని అవధానిగారు నన్నయ కృత్యాద్యావస్థను దర్శించి వ్యక్తీకరించారు. చివర ఈ విధంగా సమీక్షించారు.

''భారత రచన కారంభించుటకు ముందు నన్నయ పూర్వరంగము నెంతో శ్రమపడి సవరించుకొనవలసి వచ్చెను. ప్రతిభాశాలియు బాండిత్య సముద్రుడును గావున నాతడు దానినెంతో సమగ్రముగా సుమన ప్రశంసాపాత్రముగా నిర్వహింపజాలెను. ఈ ప్రయత్నములో నాతనికి సమానవయ, ప్రతిభా పాండిత్యములుగల నారాయణభట్టు తోడగుట భారత సంగ్రామమున బాండవుల విజయమునకు నారాయణునితోడ్పాటువలె నాంధ్ర భారతావతరణమునకెన్నో విధముల సౌలభ్యము చేకూర్చెను. అందుచేతనే నన్నయ తన మిత్రుని సాహాయమును భారతావతారికలో గృతజ్ఞతాపూర్వకముగా సంస్మరించి యుండెను. రాజరాజునకు గలిగిన భారతాంధ్రీకరణాసక్తి, నన్నయ యతిప్రతిభ, నారాయణుని సాహయ్య సంపద యనుగంగా యమునా సరస్వతీ స్రవంతులు మూడును గూడి యాంధ్ర భారతమును త్రివేణీ సంగమమునకు రూపొంసంగినవి. అది యాంధ్ర మహాజనుల కఖిల పురుషార్థ సాధనమై యలరారుచున్నది'' అని అవధానిగారు అన్న పలుకులెంతో అర్థవంతంగా ఉన్నాయి.

## 3. ఆంధ్ర వాఙ్మయారంభదశ - నన్నయ భారత రీతులు

ద్వితీయ అనునది సంపుటము, ఈ సంపుటాన్ని అవధానిగారు తన తల్లిదండ్రులకంకిత మిచ్చారు. మొదటి సంపుటి 'ఆంధ్ర వాఙ్మయారంభదశ - ప్రాఙ్నన్నయయుగము'ను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి అంకితం చేశారు. ఒక గ్రంథాన్ని రెండు సంపుటాలుగా ముద్రించుట సాధారణంగా చాలామంది చేయుపనే. కానీ ఒక్కొక్క సంపుటాన్ని

ఒక్కొక్కరికి అంకితమిచ్చుట అనునది అరుదు. అవధానిగారికి ప్రభుత్వంమీద తల్లిదండ్రులమీద గల భక్తిగౌరవాలకిది చక్కని తార్కాణం. నన్నయ కవితను నన్నయ ప్రతిభను స్తుతిస్తూ కొన్ని పద్యాలు కూడా ఈ సంపుటిలో అవధానిగారు రచించారు. ఇది నన్నయమీది గౌరవాదరాలకు చిహ్నం.

ఇందులో నన్నయ అనువదించిన సంస్కృత భారత ప్రతిని గురించి నన్నయ అనువాద పద్ధతిని, నన్నయ అవతారికను, కవితారీతి శైలి, భాషావిశేషాలను, ఛందస్సును, నన్నయ చిత్రించిన రాజరాజును చాళుక్యుల కాలంనాటి రాజకీయ మత సిద్ధాంతాలను, నన్నయ ఆంధ్ర శబ్ద చింతామణి, అరణ్యపర్వ శేషములకర్తృత్వ విశేషాలను పరిశీలించి, వితర్కించి సోదాహరణంగా అవధానిగారు వివరించారు. ఈ పరిశోధనలో ఒక ప్రసన్నమైన పద్ధతిని అనుసరించారు. నన్నయ భారత రచనవలె అవధానిగారి పరిశీలన ప్రశస్తనీయముగనున్నది. చరిత్రకు సంబంధించిన అమూల్య విషయములను తొలి దశలో సాహిత్యంలో చోటు చేసుకున్న సారవంతమైన రచనా మార్గంలోని విశేషాలను అవధానిగారెంతో కృషి చేసి క్రమబద్ధీకరించారు.

7. నన్నయ అనువదించిన సంస్కృత భారత ప్రతి - అనే ఈ ప్రకరణంలో అవధానిగారు వ్యాసుని కాల నిర్ణయాన్ని గురించి చర్చించారు. శ్రీ సి.వి.వైద్యగారు తన సంస్కృత వాఙ్మయ చరిత్రలో వ్యాసుడు భారత యుద్ధానంతరం క్రీ.పూ. 3102 ప్రాంతంలో భారత రచన చేశాడని దానిని క్రీ.పూ. 1400 - 1200 మధ్యకాలంలో వైశంపాయనుడు జనమేజయునకు వివరించి ఉంటాడని క్రీ.పూ 250 ప్రాంతంలో సూతుడు నైమిశారణ్యంలో శౌనకాదులకు చెప్పియుండుననే అభిప్రాయపడినారు. అవధానిగారు ఈ అభిప్రాయాన్ని అంగీకరించలేదు.

వ్యాసుడు, వైశంపాయనుడు, సూతుడు కూడా ఇంచుమించు ఒకే కాలంవారని అవధానిగారు అభిప్రాయపడినారు. వ్యాసుడు కురుపాండవులకు సమకాలికుడనే అభిప్రాయం సమంజసమైనదన్నారు. భారతంలో శ్లోక సంఖ్య సి.వి.వైద్యగారు ఇరవైనాలుగువేల శ్లోకాలన్నారు. మాక్డొవెల్ ఎనభైవేల ఎనిమిది వందలు (80,800) అని అన్నారు. లోక ప్రతీతి మాత్రం నూరు పద్యాలు లక్ష శ్లోకాలుగా ఉన్నది. ఈ చివరి అభిప్రాయంతోనే అవధానిగారేకీభవించారు.

కొన్ని ఉత్తరాది, దక్షిణాది ప్రతులలో భారతం 60 లక్షల శ్లోకాలని అందులో 30 లక్షల శ్లోకాలు దేవలోకంలో, 15 లక్షల శ్లోకాలు పితృలోకంలో, 14 లక్షల శ్లోకాలు రక్షోయక్షలోకంలో, 1 లక్ష శ్లోకాలు భూలోకంలో కనబడుచున్నవని చెప్పే శ్లోకాలున్నాయి కాని ఇవి కల్పితాలు.

మహాభారతాన్ని వ్యాసుడు వైశంపాయనాదులకు చెప్పెను. వైశంపాయనుడు జనమేజయునకు చెప్పెను. శౌతి ఆ కథను శౌనకాదులకు చెప్పెను. వ్యాసరచితమైన భారతం ఈ విధంగా కాలక్రమాన పెక్కు మార్పులు చెందినది. వ్యాసుడు చెప్పుచుండగ విఘ్నేశ్వరుడు రచించాడనుట విశ్వసనీయం కాదు. వ్యాసుని కాలంలోనే ఒకరిద్వారా మరొకరికి మూడు సార్లు చెప్పబడెను. అప్పుడే మార్పులు జరిగియుండును. వ్యక్తులను బట్టి భిన్న రూపములు కలిగి యుండును రాతప్రతులలో కనిపించుమార్పులు ఈ క్రింది విధంగా ఉన్నాయని అవధానిగారు పేర్కొన్నారు.

1. వర్ణక్రమ భేదములు, 2. పాద పూరకములైన తు, చ, వై, హి, తల; తదా, ప్రతి, పరి మొ. 3. పదవ్యత్యములు, 4. పర్యాయపదములు 5. అర్థభేదములు కలిగింపని చిన్న వాక్యాలు, 6. సంఖ్యలయందలి భేదములు, 7. అధ్యాయ పర్వ విభజనయందలి భేదములు, 8. కౌరవులు మొదలగువారి పేర్లు పట్టికలో భేదములు, 9. వంశక్రమములలో భేదములు, 10. కథావస్తువున మార్పు కలిగింపని కూర్పులు, 11. కథా పునరుక్తులు యుద్ధాది వర్ణనలో భేదాలు 12. శృంగారరస సన్నివేశ వర్ణనలలో భేదములు, 13. కొన్ని విషయాలను చేర్చుట కొన్ని విషయాలను తొలగించుట, 14. కథా వస్తు విపర్యము.

ఇన్ని భేదాలు భారత ప్రతులలో కనిపించుటచేత యేది ప్రతి మూల గ్రంథానికి సన్నిహితమైనదో తేల్చుట కష్టము, ఔత్తరాహిక ప్రతులకంటే దాక్షిణాత్య ప్రతులే మూలమునకు సన్నిహితముగా ఉన్నాయి. నన్నయ అనుసరించిన ప్రతి కూడా దక్షిణాధి ప్రతులతో కూడా దగ్గరి సంబంధమున్నది. కానీ నన్నయ ప్రధానముగా గ్రహించినది ఉత్తరాది ప్రతియే అని అవధానిగారభిప్రాయపడినారు. దక్షిణాది ఉత్తరాది ప్రతులలో గల శ్లోకాల సంఖ్యను, కథలలో ఉపాఖ్యానాలలో గల భేదాలను ఉల్లేఖించి సంస్కృత భారతంలో లేని విషయాలు నన్నయ భారతంలో చోటుచేసుకొన్నాయని ఉదాహరించారు. రెండు సంవత్సరాలు నన్నయ అనువదించిన భారత ప్రతి కోసం విస్తృతమైన అన్వేషణ చేసి తుదకు ఫలానా ప్రతిని నన్నయ గ్రహించినాడనే నిర్ణయానికి రాలేక నన్నయ యేదో ఒక ప్రతిని గాక కొన్ని ప్రతులను పరిశీలించి అనువాదము చేసెననియు నన్నయ చేసినది మూలానువాదం కాక స్వేచ్ఛానువాదం కావటం చేత ఇది వెయ్యి సంవత్సరాలనాటి సంగతి కావటం చేత తాళపత్ర ప్రతులిన్ని రోజులుండుట కష్టము కనుక నన్నయ అనుకరించిన ప్రతికి మరల ప్రతులు తయారు అయి వుండును. వాటిలో మార్పులు జరగడానికి అవకాశం ఉన్నది కనుకను నన్నయ అనుకరించిన ప్రతి ఇదియే అని చెప్పజాలమన్నారు.

ఈ విషయంలో అవధానిగారు చేసిన కృషి అనన్యసామాన్యమైనది. ప్రశంసనీయమైనది, సారస్వత లోకానికెంతో యుపయుక్తమైనదని కూడా చెప్పవచ్చు. తెలుగు సాహిత్యం అనువాదంతో మొదలైనా ఆ అనువాదాన్ని మనవారు స్వతంత్ర కావ్యాలు అనునట్లు

రచించారు. దీనికి మార్గం చూపిన వాడు నన్నయ. ఆయన వేసిన బాటలోనే తెలుగు కవులు పయనించారు.

## 8. నన్నయ అనువాద పద్ధతి

అనువాదం స్థూలంగా మూడు విధాలు. 1. కథానువాదం 2. భావానువాదం 3. పదానువాదం అనే విభాగాన్ని ఏర్పరచి మహాభారతం కథానువాదకావ్యం అని నిర్ధారించారు. నన్నయది కథానువాద పద్ధతి, అయినా వ్యాసుని కాలానికి నన్నయ కాలానికి మధ్య సుమారు రెండు వేల సంవత్సరాలున్నాయి. వీరు నివసించిన దేశాలు వేరు దేశాకాల ప్రభావం రచనమీద ఉంటుంది. ఇది అనువాద రచన మీద తక్కువగా స్వతంత్ర రచన మీద ఎక్కువగా వుంటుంది. వ్యాసునిది నీతి ధర్మదృష్టి. కవిత్రయంవారు నీతి ధర్మాలకు కళను జోడించారు. సంస్కృత భారతం కంటే తెలుగు భారతం సంగ్రహింపబడింది. నాలుగవ వంతుకు తగ్గింపబడింది. ఇది శ్లోకాలను పద్యాలను పరిశీలించినప్పుడు తేలిన అంశం. కాని శ్లోకాలు చిన్నవి. తెలుగు పద్యాలు పెద్దవి. నాలుగు శ్లోకాలను ఒక పద్యంగా రాయవచ్చు. కంద పద్యాలు సంస్కృతంలోని అనుష్టిప్పులతో సమానాలు. తెలుగు భారతంలో వీటి సంఖ్య ఎక్కువ. అయినా భారతం సంస్కృత భారతం కంటే సగానికి సగం తగ్గింపబడినదనే చెప్పవచ్చు.

నన్నయ అనవసరమైన వర్ణనలను, సంభాషణలను, ప్రశ్నోత్తరాలను చాలావరకు సంగ్రహంగా రాయడం ఈ తగ్గిపోవుటకు కారణం. మూలభారతాన్ని నన్నయ సంగ్రహించిన 56 సందర్భాలనవధానిగారు చూపించారు. అనువాదం చేసే సందర్భాలలో పూర్తిగా వదలివేసిన 31 విషయాలను, మూలానికి పెంపు కలిగించే 14 సందర్భాలను మూలంలోని 16 భావకల్పనలను అర్థాంతరన్యాస కల్పనలను 16 విశేషాలను అధికంగా వాడిన 9 సందర్భాలను కథారచన ప్రసన్నంగా కనిపించడానికిగల 7 హేతువులను మూలంలో పేర్ల క్రమం తప్పినప్పుడు వాటిని ఒక క్రమంలో నన్నయ చెప్పిన సందర్భాలను 19దింటిని కథాంశాలు మార్చి రాసిన చోట్లను 18ని మూలంలోని అనౌచిత్యాన్ని తొలగించి మూలానికి వన్నె చేకూర్చిన42 అంశాలను, పాత్రల స్వభావాలను స్వరూపాలను తెలియజేసే విశేషణాలు మూలంగా చెల్లాచెదురుగా ఉండగా నన్నయ ఆ పాత్రలను ప్రవేశపెట్టుటకు ముందే పేర్కొనుచుండునని, నన్నయ సందర్భనుసారంగా సూక్తులను చొప్పించిన సందర్భాలను ఆదిపర్వంనుండి 8, సభాపర్వంనుండి 2, అరణ్యపర్వంనుండి నాలుగు ఉదహరించారు. ఇంకా నన్నయ మూలంలోని శ్లోకాలను యథాతథంగా అనువాదం చేసిన సందర్భాలను పర్వానికి ఐదేసి చొప్పున ఉదాహరించి చూపారు. తెలుగు భారతం కంటే సంస్కృత భారతంలో ఔచిత్య శోభితాలుగా ఉన్న 12 సన్నివేశాలను కూడా అవధానిగారు పేర్కొన్నారు.

సంస్కృతంలోని కాళిదాసాదుల కావ్యాల ప్రభావం నన్నయమీద అక్కడక్కడ కలదని నిరూపించారు. కన్నడ కవి పంపని భావాలను పదాలను గ్రహించిన విధానాన్ని కూడా అవధానిగారు చూపించారు.

ఆయన మాటలలో -

''ఇరువురు నవలంబించిన కవితాగుణములందు గూడ గొంత సామ్యముగానిపించు చున్నది. పంపని పద్యములందలి ప్రసన్నకవితాగుణ, ఆ సకాలార్థ సంయుత, లలితపద వాక్రిభగాది పదములే నన్నయ పద్యములందలి ప్రసన్న కథా కలితార్థయుక్తి, అక్షరరమ్యత అనువానికి మూలమైనట్లు తోచును''[11] అని పేర్కొన్నారు. అనగా నన్నయ అవతారికలో తన కవితాగుణాలను గురించి చెప్పుకొన్న మాటలు కూడా పంపకవివని తెలియుచున్నది.

నన్నయు అనువాద పద్ధతిని క్షుణ్ణంగా పరిశీలించి అందులోని గుణగణాలను నిష్పక్షపాతంగా విశ్లేషించారు.

## 9. నన్నయ అవతారిక

భారతారంభంలో నన్నయ రచించిన అవతారిక ఒక విధంగా నాటకాలలో చెప్పబడిన నాందీ ప్రస్తావన లక్షణాలను కలిగి వుంది. నన్నయ రచించిన ఆరంభ శ్లోకం సరిగా నాందీ శ్లోకాన్ని తలపిస్తుంది. నాందీ ఆశీర్వాదంతోనే నమస్కారంతోడనో ఉండి కావ్య వస్తువును సూచించు అర్థముతోనో శబ్దముతోనో కూడివుండి చంద్రనామంకితమై యుండవలయు నను నియమమున్నది. ''పురుషోత్తమాంబుజ భవ శ్రీ కంధరులు మీకు శ్రేయోదాయకు లగుదురుగాక అనే ఆశీర్వాదమిందులో ఉన్నది. దీనిని కావించిన వాడు భారతాంధ్రీకరణ సూత్రధారుడైన రాజరాజనరేంద్రుడు.

''తన కుల బ్రాహ్మణుడు ఇత్యాది పద్యాలలో ప్రస్తావనల క్రమం ఉంది. ప్రస్తావనలో సూత్రధారుడు ప్రవేశించి నటీనట విదూషకాదులలో ఒక్కరితో చిత్రమైన సంభాషణ కావించును. అందులో ఐదంశములుండును. 1. కవిగోత్రనామాదికథనము. 2. ప్రరోచనమనబడు ఉన్ముఖీకరణము 3. ఋతువర్ణనము 4. కావ్యార్థసూచన 5. పాత్ర ప్రవేశ సూచన. కవి కుల గోత్రములను తెలియజేయుట అనే అంశానికి తన కుల బ్రాహ్మణుడను పద్యాన్ని లక్ష్యాంగా తీసుకోవచ్చు. నన్నయను గురించిన కొంత సమాచారం ఈ పద్యం అందిస్తుంది. నన్నయ రాజరాజుకు కుల బ్రాహ్మణుడు, అతనియందు అనురక్తుడు, వేదసంహిత నభ్యసించినవాడు. బ్రహ్మాండాది పురాణాలను పఠించి విజ్ఞానాన్ని మూరగొన్న వాడు, అపస్తంభసూత్రుడు, ముద్గలగోత్రుడు, సజ్జనస్తోత్ర పాత్రుడును స్వచ్ఛమైన చరిత్ర

సంపద కలవాడు, లోకజ్ఞుడు, సంస్కృతాంధ్రముల రెండింటిలో కావ్యరచన చేయగలవాడు, సత్ప్రతిభాభియోగ్యుడు, నిత్య సత్య వచనుడు. సుజనుడు, బుద్ధికి బృహస్పతి, అనే విషయాలు ప్రస్తావింపబడినాయి. కావ్యార్థ సూచన, ప్రస్తావనలో మరో అంశం. ''నాకుననవ రతంబును శ్రీ మహాభారతమునందలి యభిప్రాయంబు విననభిలాష పెద్దయ్యెయుండు'' అని రాజరాజనరేంద్రుడు మహాభారతోదంతాన్ని ప్రస్తావించును.

అవతారికలో ఋతువర్ణన మరొక అంశం ''ఘనదురితాబం'' భ ఇత్యాది పద్యాలలో పరోక్షంగా వసంతఋతువర్ణన సూచ్యమానమగుచున్నది.

పాత్ర ప్రవేశ సూచన, ప్రస్తావనలో ఇంకొక అంశం - భారతాంధ్రీకరణంలో ప్రధాన పాత్ర నన్నయగారిది. అతనికి సహాయకుడు నారాయణభట్టు, అవతారికలో చివరి రెండు పద్యాలతో వీరి విషయం సూచింపబడుచున్నదని అవధానిగారు సమన్వయించి చూపారు.

ఈ అవతారికలో రాజరాజనరేంద్రుని గుణగణాల వర్ణన, సమాజానికప్పుడు భారత రచన తెలుగులో చేయవలసిన అవసరం, తెలుగులో భారత రచన చేయుటలోని సాధక బాధకాలు కూడా చెప్పబడినవి.

కావ్యరచనారంభమున నిర్విఘ్న పరిసమాప్తికై నన్నయ ''హరిహరాజ గజాననార్క షడాస్య మాతృసరస్వతీ గిరిసుతాదిక దేవతా తతిః'' నమస్కృతి యొనరించినాడు. విద్వత్సభలను కొనియాడినాడు. తనకు సహాయం చేసిన నారాయణభట్టుకు కృతజ్ఞతలు తెలియజేశాడు. చివరి పద్యంలో తన కవితాగుణాలను సూచించాడు. అవతారికలో నన్నయ తన భారత రచనను రాజరాజనరేంద్రునికంకితం చేసినట్లు కనిపించదు. ఆశ్వాసాద్యంత పద్యాలు మాత్రం ఈ అభిప్రాయాన్ని కలుగజేస్తాయి. అవతారికలో రెండు విషయాలు వింతగా కనిపిస్తాయి. ఒకటి కావ్యాన్ని శ్లోకంతో ఆరంభించుట. రెండు ఉత్తమ పురుషలో కాక ప్రథమ పురుషలో సంతరించుట. అందుకే ఈ అవతారిక నారాయణభట్టు రాసినాడను వాదం కూడా ఒకటుంది. కాని దీనికి బలమైన ఆధారాలు లేవు.

అవతారికను గూర్చి అవధానిగారు -

''ఆంధ్రవాఙ్మయమున నితరకవులు గ్రంథాదుల రచించిన యవతారికలెన్నో యున్నవి. కాని సత్యకథనమునగానీ, సహజత్వమునగాని సారళ్యమునగాని శైలీ సంపనుగాని యందేదీయు నన్నయ యవతారికకు సాటి కాజాలదు'' [12] అని వితర్కించి వివరించినారు.

# 10. నన్నయ కవితారీతి - శైలి

నన్నయ అవతారికలో తన కవితా గుణములలో ''ప్రసన్న కథా కవితార్థయుక్తి'' అను సమాసానికి ''ప్రసన్నకథాకలితార్థ యుక్తి'' అను పాఠాంతరమున్నది. ప్రధాన గుణములుగా పేర్కొన్న ప్రసన్న కథా కవితార్థయుక్తి, అక్షరరమ్యత, నానారుచి రార్థసూక్తి నిధిత్వము అనువానిని గురించి కోరాడ రామకృష్ణయ్యగారు, విశ్వనాథ సత్యనారాయణగారు మొదలగు వారనేక విధాల విమర్శించారు. అవధానిగారు వాటి సారాంశములను మాత్రం తెలియజేశానన్నారు. కానీ విమర్శ సారాంశమే గాక విపులంగా చర్చించి నన్నయ కవితా రీతిని శైలిని విస్పష్ట రేఖలతో చూపారు. ''ప్రసన్న కథా కలితార్థయుక్తి'' అను పాఠం తీసుకోవడమే మంచిది. ప్రసన్నమనగా ప్రసాదగుణంతో కూడినది. ఈ ప్రసాదగుణాన్ని గూర్చి సంస్కృత లాక్షణికులైన వామనుడు, దండి, మమ్మటుడు, విశ్వనాథుడు మున్నగు వారి నిర్వచనాలను పేర్కొన్నారు. రసదృష్టితో నన్నయ ఈ ప్రసన్న శబ్దాన్ని వాడినాడన్నారు.

అక్షర రమ్యత కూడా ఈ ప్రసన్నతలో ఒక భాగమే. ఈ ప్రసన్నతాగుణం కవితలో కలుగజేయడానికి నన్నయ ఆరు పద్ధతులను అనుసరించెను. నన్నయ కథన పద్ధతిలో రచన చేసెను. నన్నయ కథలలో నాటక కథలలో వలె Dramatic Irony అనబడు చమత్కారం కనిపిస్తుంది.

పదమైత్రియే అక్షర రమ్యత, దీనినే విశ్వనాధుడనే అలంకారికుడు శయ్య యని పేర్కొన్నాడు. నన్నయ చెప్పిన అక్షర రమ్యత పింగళి సూరన్న పేర్కొన్న ''పాసగ ముత్యపు సరుల్ పోహళించిన రీతి దమలోన శబ్దములను గూర్చి'' అని పేర్కొన్నారు. గంధి పరాశరుల సమాగమములో, శకుంతలా జన్మవృత్తాంతము మొదలైన సందర్భాలలో శృంగార రసాన్ని పోషించారని అవధానిగారు రసపోషణ విషయాన్ని తెలియజేశారు. పాత్ర పోషణలో నన్నయ పాత్రను స్వభావాలను చక్కగా తెలిసినవాడు కాబట్టి వానిని సుస్పష్ట రేఖలతో, సజీవంగా తీర్చిదిద్దును. అతని పాత్రలలో గాంభీర్యము ఉదాత్త లక్షణాలుట్టిపడుచుండును. ధృతరాష్ట్రుని పాండవులపై కపట వాత్సల్యము దుర్యోధనుని ఈర్ష్యా ద్వేషాలు, దురభిమానము, శకునికై తపము, విదురుని ధర్మజ్ఞత, ధర్మజుని ధర్మతత్పరత, భీష్ముని నిష్పక్షపాతబుద్ధి, భీమార్జునుల భ్రాతృభక్తి, శ్రీకృష్ణుని ధర్మరక్షణ పరాయణత్వము, చక్కగా చిత్రించారు. స్త్రీ పాత్రను సృష్టించుటలో కూడా నన్నయ అందె వేసిన చేయి. గాంధారి పాతివ్రత్యము, ద్రౌపది ధర్మజ్ఞత, గృహిణీత్వము కుంతి ఉదాత్తత, పుత్రప్రేమ, దమయంతి పతిప్రేమ, దేవయాని గడుసుదనము, సుకన్య యవ్వన చాపల్యములను ఎంతో స్ఫూర్తితో పాత్రలమూర్తులు పాఠకుల యెదుట సాక్షాత్కరించే విధంగా సృష్టించారని అవధానిగారు అభినందించారు. ఈ విధంగానే నన్నయ లోకజ్ఞతను గురించి శర్మిష్టచే

బలవంతంగా త్రోయబడిన దేవయాని ప్రమాదవశాత్తు పడినానని యయాతితో చెప్పించుట, ద్రౌపది వస్త్రాపహరణ విషయంలో రంగురంగుల చీరలు కాక ఒకే వర్ణం చీరలు 'పాయక' వచ్చాయని చెప్పుట మొదలైన సందర్భాలలో ఎంతో సముచితజ్ఞతను నన్నయ పాటించారని, చెప్తూ నన్నయ శైలి పద ప్రయోగాలను గురించి కూడా చర్చించి పద్యాలు నాదసౌందర్యనిలయాలని, పదాలను సాభిప్రాయంగా వాడునని, శ్లేష, శబ్దాలంకారాదులను వాడునని, భట్టారక, మానుగ, తగిలి, ఇమ్ముల అనుపదాలను పదేపదే వాడునని, చంపకమాల, ఉత్పలమాలాది వృత్తాలతో పాటు తరువోజ మధ్యాక్కరాది దేశీయ ఛందస్సును కూడా వాడునని అవధానిగారు పేర్కొన్నారు.

## 11. నన్నయ భారతమునందలి భాషావిశేషములు

నన్నయ యడాగమములను స్థిరీకరించాడు. 'క్ష' కారానికి 'క' కారాదులతోనే గానీ చకారాదులతో యతిమైత్రి చెప్పలేదు. నన్నయ భారతంలో పేర్వాదుల కచ్చు పరమైనప్పుడు టుగాగమము వచ్చిన రూపాలు కనబడవు. చిన్నయసూరి సంధి వైకల్పికమని చెప్పిన కొన్నిచోట్ల సంధిలేని రూపాలు నన్నయ భారతంలో కనపించుచున్నవి. ఇవి అత్తునకు సంధి బహుళమను సూత్రం వలన కావచ్చు. అచ్చు ప్రతులలో ఏమి, అది అను వానికి అవసరమైనప్పుడుసంధి అయిన రూపాలు కలవు. కానీ వ్రాత ప్రతులలో యడాగమము వచ్చిన రూపాలే కనిపిస్తున్నాయి. నన్నయ భారతంలో రెండుమూడు చోట్ల ద్రుతద్విత్వ సంధి కనిపిస్తున్నది. ఉకారాంత పుంలింగములు కొన్ని డుమంతములుగ, కొన్ని ఉభయములుగ కనిపించుచున్నవి. మిత్రము, పాత్రము అను ప్రయోగములు నన్నయ భారతంలో కనిపించవు. హంసశబ్దంసర్వత్ర స్త్రీసమముగా వాడబడినది. ఉరగశబ్దానికి బహువచన రూపాలు ఉరేగములు, ఉరగులు అను రెండు రూపాలు కనిపిస్తున్నాయని ఇంక హలంత శబ్ద ప్రయోగాలను, ఔపవిభక్తులను, బహువచన ప్రత్యాయాలను, సంఖ్యావాచకాలను, క్రియలను, తద్ధితాంతాలను, సోదాహరణంగా వివరించారు. వాక్య నిర్మాణాన్ని సమీక్షించారు. కవిలగడ్డము, కవిల జడలు, సురకరువలి మొదలైన సమాసాలను గురించి చర్చించారు. వాగనుశాసన బిరుదమును సమర్థిస్తూ అవధానిగారు నుడివిన మాటల నుదహరిస్తున్నాను చూడండి. నన్నయ తనకు బూర్వము శాసనములందును దనకాలమునశిష్ట వ్యవహారమునందు గల ప్రయోగములను బాగుగా పరిశీలించి యుచితములను శ్రుతిసుభగములునని తోచిన వానిని గ్రహించియట్లు లేనివానిని బరిహరించి సంస్కృతమునుండి బహుశబ్దముల గ్రహించి, వానిని తెలుగున వాడుటయెట్లో నిశ్చయించి భారత రచనమునకు బూనుకొనెను. ఈ పని మహా ప్రతిభావంతులకు గాని యన్యులకు సాధ్యమైనది కాదు. ఈ కార్యమున నన్నయ చూపిన సామర్థ్యమే యతని

''విపులశబ్దశాసన'' బిరుదమున కర్హునిగావించెను. అతడు కావించిన ప్రయోగములు శ్రవణానందములును లాక్షణికములునై తరువాత బరమప్రమాణములయ్యెను'' [14]

## 12. నన్నయ భారతమునందలి ఛందస్సు

నన్నయ ఆకాలంలోగల ఇతర కవులను కన్నడ కవుల మార్గాలననుసరించి, సంస్కృతం నుండి వృత్తాలను గ్రహించి తెలుగు ఛందస్సుకనుగుణంగా యతిప్రాసలను చేర్చి రచన కొనసాగించెను. మానిని మొదలైన సంస్కృతంనుండి గ్రహించి వీటికి కన్నడ కవులు పెట్టిన క్రొత్త పేర్ల జోలికి వెళ్లకుండా సంస్కృతంలోని పేర్లతోనే వ్యవహరించెను. నన్నయ తన భారతంలో 32 వృత్త పద్య భేదాలను వాడెను. అందులోనూ పంపకవివలె సంస్కృత వృత్తభేదాలను ఎక్కువగా వాడెను. వృత్తాలలో చంపకమాలలు జాతులలో కంద పద్యాలను అధికంగా వాడెను. నన్నయ రాసిన పద్యాల సంఖ్య - 2487. గద్యాలు 1,496. మొత్తం 3983. ఇందులో చంపకమాలలు 240, ఉత్పలమాలలు 184, మత్తేభములు 61, శార్దూలములు 18, మత్తకోకిల 626, తరళ 25, కందపద్యాలు 1219, సీసపద్యాలు 251, ఆటవెలదులు 195, తేటగీతి 177, మధ్యాక్కరలు 39, తరువోజ 12 మిగిలిన ఇరవై రకాల వృత్తాలు పదులకు మించలేదు. ఒక్కొక్క పద్యం రాసిన వాటి సంఖ్యయే ఎక్కువ. పృథ్వీవృత్తంలో పద్మకవృత్తంలో, మానిని వృత్తంలో, కవిరాజవిరాజితలో యతిస్థానం విషయంలో ఇతరులకును నన్నయకున్న భేదం కనిపిస్తున్నది. ఈ నాలుగు వృత్తాలలో తప్ప మిగిలిన 28 రకాల పద్యాలలో యతి, ప్రాస గణాల విషయంలో లాక్షణికులు చెప్పినట్లే ఉన్నవి.

10రకాల సీస పద్య భేదాలలో నన్నయ ఏడు రకాలు వాడినాడని అప్పకవి చెప్పగా అవధానిగారు నన్నయ మూడు రకాల సీసపద్యాలు మాత్రం వాడినట్లు తెలిపారు. నన్నయ రాసిన 251 సీస పద్యాలలో 225 సీస పద్యాలకు చివర ఆటవెలదులున్నవి. 26 సీసపద్యాలకు మాత్రం తేటగీతులతో నన్నయ రాశారు. దీనిబట్టి చూస్తే నన్నయకు పూర్వం సీస పద్యాలకు చివర ఆటవెలదులు మాత్రం చెప్పు అలవాటు ఉండినట్లు తెలియుచున్నది. ఒకప్పుడు సీస పద్యానికి ఆరుపాదాలు ఉండేవి. అప్పుడు ఆటవెలది తేటగీతి సీసం చివర చెప్పేవారు కాదు. స్వరమైత్రి, స్వరప్రధానవళులను ఎక్కువగా వాడినారు. నన్నయ రసభావానుగుణంగా వస్తుగౌరవానుగుణంగా రసోచితమైన వృత్తాలను పద్యగద్యములను రచించి సర్వజనామోదం చేశారని అవధానిగారి ఛందః సమీక్షా సారాంశం.

## 13. నన్నయ చిత్రించిన రాజరాజు

రాజరాజు నలుబది సంవత్సరాలకు పైగా చాళుక్య సామ్రాజ్యాన్ని పరిపాలించాడు. అతడెన్నో ప్రజాహిత కార్యాలు చేసి ఉండవచ్చు. కానీ భారతాంధ్రీకరణకే నన్నయను ప్రోత్సహించుటచే అతడు తెలుగువారి హృదయాలలో శాశ్వతంగా నిలిచిపోయాడు. ఇది అతడు నిస్వార్థంగా చేసిన పని.

నన్నయను భారతాంధ్రీకరణ చేయమన్నాడే కానీ తనకంకితం ఇవ్వమనలేదు. నన్నయ రాసిన అశ్వాసాద్యాంతాదిపద్యాల వలన రాజరాజు కీర్తి అక్షరమైన మూర్తి సాక్షాత్కరిస్తుంది.

కోరుమిల్లి తామ్రశాసనంలో కూడా రాజరాజనరేంద్రుడు పలు విధాల ప్రశంసింప బడినాడు. కొన్ని అతిశయోక్తులను తీసివేస్తే రాజరాజు స్వచ్ఛమైన మూర్తి మనకు దర్శనమిస్తుంది.

రాజరాజు తండ్రి విమలాదిత్యుడు క్రీ.శ. 1019లో దివంగతుడు కాగా రాజరాజు రాజ్యానికి రావలసి ఉండెను. కాని రాజరాజు సవతి తమ్ముడైన విజయాదిత్యుడు సింహాసన మాక్రమించాడు. మూడేండ్ల తరువాత రాజరాజు రాజ్యానికి వచ్చాడు. 1022లో పట్టాభిషిక్తుడయ్యాడు. 1031 జూన్ 27వ తేదీ మరల రాజ్యాన్ని కోల్పోయాడు. రాజరాజు చోళుల సహాయంతో తిరిగి రాజ్యాన్ని సంపాదించాడు. ఏడెనిమిది సంవత్సరాలు పరిపాలన చేసిన తరువాత మళ్లీ కొంత రాజ్యాన్ని కోల్పోయాడు. 1051లో పశ్చిమ చాళుక్యులతో స్నేహం పెంచుకున్నాడు. 1061లో మరణించాడు. మొత్తంమీద రాజరాజు రాజకీయ జీవితం ప్రశాంతంగా కొనసాగలేదనే చెప్పాలి. రాజరాజు భార్య మమ్మంగదేవి. ఇతనికి ద్రాక్షారామ భీమేశ్వరుడు కులదైవం. నయబంధుర, నిఖిలరాజ విద్యానిధి, నృపవిద్యాసాగర, రాజవిద్యాపారగ, పార్థివ విద్యాధర మొదలైన విశేషాల వలన విద్వాంసుడనుకొనవచ్చు. కవీంద్ర సమాక సురక్ష్మాజ సూరి విధాన, బుధజన చింతామణి శిష్ట పరిపాలనాసక్త, శిష్టటం భోజననద్యునుడి యనువిశేషణములవల్ల విద్వత్కవిపోషణను విశదము చేయుచున్నవి. యువతీమదనుడు, భవనైకసుందరుడు, భావభవనిభ, సుభగుడు, మన్మథాకారుడు తరుణావతారుడు మొదలైన ఉపమానాలాతని రూపసంపదను తెలియజేయుచున్నవి. ఎర్రన రాజరాజు సమకాలికుడు కాకపోయినా అతనిని అనేక విశేషాలతో ప్రశంసించాడు. భారత రచనా ప్రోత్సాహమే ఆయన కీర్తిమూర్తిని ఆంధ్రలోకంలో **అజరామరం చేసింది అని** అవధానిగారు రాజరాజును గురించి రసవత్తరంగా తెలియజేశారు.

## 14. చాళుక్యుల కాలంనాటి రాజకీయ, మత, సాంఘిక పరిస్థితులు

చాళుక్య యుగంనాటి శాసనాల బట్టి భారత రచనలో ప్రతిబింబిస్తున్న సామాజిక విషయాలను బట్టి నాటి రాజకీయ మత సాంఘిక పరిస్థితులను తెలుసుకొనవచ్చు. క్రీ.శ. 11వ శతాబ్దిలో భారతదేశ మందంతట మహాభారతంపై శ్రద్ధాసక్తులు అతిశయించినట్లు తెలియుచున్నది. ఈ శతాబ్దంలోనే కాశ్మీర దేశ పండితుడైన క్షేమేంద్రుడు భారతమంజరి యనుపేరుతో సంగ్రహముగా భారతాన్ని సంతరించాడు. జావా ద్వీపంలో కూడా అద్వీప భాషలో భారతం ఈ కాలంలోనే రాయబడింది. రాజకీయ పరిస్థితి - చాళుక్య యుగంలో ఆంధ్ర దేశానికి వేంగీదేశమని పేరు. దీనికుత్తరమున కళింగ ఓఢ్రరాజ్యాలు, దక్షిణమున చోళరాజ్యాలుండెను. కర్నాటక రాజ్యానికప్పుడు కుంతల రాజ్యమని, రట్టపాడీ అని పేర్లుండెను. చోళచక్రవర్తులు రాజ్యవిస్తరణ కాంక్షచే పరస్పరం యుద్ధాలు చేయుచుండిరి. అందువలన చాళుక్యులను కర్నాటక రాజులు శత్రువులుగా భావించుచుండిరి. కర్నాటక రాజ్యదండనాథుడు బయటనుంచి వేంగీ దేశముపై దండెత్తి కమ్మ రాష్ట్రములోని రెండు దుర్గాలను దగ్ధమొనరించి చేబ్రోలులోని దేవుని నిర్మించినట్లు తెలియుచున్నది. రాజరాజు మీదికి పశ్చిమ చాళుక్యులు దండెత్తిరాగా వారితో సంధి చేసుకొని రాజ్యమును పాలించెను. రాజరాజు 1062లో మరణించు వరకు ఇదే పద్ధతిలో పాలించెను. చోళులితనికి సహాయం చేసే పరిస్థితిలో లేకుండిరి. వారిని కూడా పశ్చిమ చాళుక్యులు రెండవ కుప్పం యుద్ధంలో ఓడించి యుండిరి. రాజరాజు తరువాత విజయాదిత్యుని కుమారుడు శక్తివర్మ రాజ్యానికి వచ్చెను.

వేంగీ చాళుక్యులకు మాళవరాజులకు చాలాకాలమునుండి వైరముండెను. వేంగీ చాళుక్యులు హిందువుల వర్ణధర్మ శాస్త్రములందు వర్ణింపబడిన పద్ధతిననుసరించి రాజ్యపాలన చేయుచుండిరి మంత్రులకు తీర్పులను పేరుండెను. మంత్రులనేగాక పురోహిత సేనాపతులాది గాగల 18వంది రాజకీయాధికారులు కూడా తీర్పులను పేర పిలువబడుచుండిరి. రాజ్యము 'విషయ'ములుగ విభజింపబడి యుండెను. ఇవి ఇప్పటి మండలాలు లేక జిల్లాలతో పోల్చవచ్చును. దేశ విభాగములను కొట్టములని కూడా అనుచుండిరి. (కోటనుండి ఈ కొట్టములు వచ్చియుండును) గ్రామణి అనువాడు గ్రామములలో రాజప్రతినిధిగా ఉండెడివాడు. కొంతభూభాగం భూస్వాముల అధీనంలో కూడా ఉండెడిది. వీరు రాజునకు కప్పము కట్టుచుండిరి. అప్పుడప్పుడు శత్రువులతో చేతులు కలిపి రాజులకపకారము చేయుచుండిరి అంతర యుద్ధములకు కారకులగుచుండిరి.

**సాంఘిక పరిస్థితి** - వర్ణవ్యవస్థ సుప్రతిష్ఠితమై యుండెను. నూటికి తొంభైమంది హిందూమతావలంబకులై యుండిరి. బ్రాహ్మణాధిక్యము వర్ధిల్లుచుండెను. వీరు

రాజకార్యాలలో కూడా పాల్గొనుచుండిరి. క్షత్రియులు రాజ్యపాలనాధికారం వహించి యుండిరి. సూర్యవంశపురాజులు చంద్రవంశపు రాజులను రెండు తెగలుగ వీరుండిరి. వాణిజ్యము వైశ్యుల చేతిలో నుండెను. వైశ్య సంఘాలకు 'నకర' ములని పేరుండెను. పెనుగొండ పెద్దవ్యాపారకేంద్రంగా నుండెను. జనాభాలో నాల్గవ వర్ణంవారే అధికంగా ఉండిరి. వీరి ముఖ్య వృత్తి వ్యవసాయం. పశుపోషణ పంటలను పండించుట వీరి ముఖ్యమైన పనులు. వీరిలో ఉపశాఖలనేకముండెను. బహుభార్యత్వం ఆచారముగా నుండెను. రాజుల కొలువులో దేవాలయాలలో వేశ్యలధికంగా నుండిరి. ఒక్కొక్క దేవాలయానికి ఏబైఇద్దరు (52) వేశ్యలుండినట్లు కలదిండి శాసనంవల్ల తెలియుచున్నది. ధనికులు భూస్వాములు వీరితో సంబంధం పెట్టుకొనుచుండిరి. వీరికి 'లంజపెండ్లము' లను పేరుండెను. ఈ లంజపెండ్లములు దేవాలయాలకు అనేక దానధర్మాలు చేసినట్లు శాసనములలో లిఖింపబడియున్నది. వీరు నృత్యగాన కోవిదులుగా నుండిరి. కొందరు రాజులు వీరిని వివాహం కూడా చేసుకొనుచుండిరి.

**మత పరిస్థితులు** - చాళుక్యులాంధ్రదేశమును ఆక్రమించునాటికి హిందూ, జైన, బౌద్ధమతాలు ప్రచారంలో ఉండెను. బౌద్ధమతం క్షీణదశలో నుండెను. బౌద్ధారామములైన పంచరామములు కాలక్రమమున హైందవ క్షేత్రాలుగా మారిపోయినవి. జైనమతం జనసామాన్యంలో బహుళ ప్రచారం పొంది యుండెను. రాజులు, ప్రజలు కూడా జైనవసతులను నిర్మించుచుండిరి. మాందిర దేవుడను జైనాచార్యుడు అద్భుతాలను చేయుచుండెను. రాజరాజు తండ్రి విమలాదిత్యుడితని యనుయాయియై శ్రావకుడుగా మారెను. రాజ్యాన్ని కూడా త్యజించెను. జైనయోగులు మానవాతీత మహిమలు ప్రదర్శించుచుండిరి. కాని జైనమతమెప్పుడు రాజమతంగా పరిగణింపబడలేదు. చాళుక్యరాజులందరు శైవమతావలంబకులుగా నుండిరి. ఈ కాలంలో హిందూమతమే జాతీయమతంగా నుండెను. బెజవాడలో అన్నిటికంటె పెద్ద జైనమఠముండెను. మఠాలు మత ప్రచారాలనే గాక విద్యా సేవా కేంద్రాలుగా కూడా నుండెను. మత సహనం మాత్రం సర్వత్రా కనిపించెడిది. చాళుక్య రాజుల పాలనలో హిందూమత పునరుద్ధరణ ప్రారంభమయ్యెను. నన్నయ నాటికి వికాసము కాజొచ్చెను.

## నన్నయ వైదిక మతోద్ధరణ - నన్నయ భారత రచన

రాజరాజునకు చోళులతో సన్నిహిత సంబంధమున్నది. అతడు తరచు చోళుల కొలువునకు వెళ్లివచ్చుచుండెను. తమిళమున క్రీ.శ. 8, 9 శతాబ్దుల నాటికే పేరిందేవనార్ భారత రచన చేసి ఉండెను. రాజరాజు కావిషయం భారత రచనకు ప్రేరణ కలిగించెను.

పంపడు రాసిన విక్రమార్జున విజయమును కూడా రాజరాజు చూసి ఉండెను ఇది కూడా రాజరాజ నరేంద్రునకు ప్రేరణ కల్గించుటకు కారణమాయెను. వైదిక మతాభిమానం అన్నిటికంటె అతి ముఖ్య కారణం. కర్మమార్గాన్ని గురించి భారతం తెలియజేయగలదనే ఉద్దేశంతో నన్నయ అందుకు సమర్థుడనే నమ్మకంతో రాజరాజు నన్నయ నర్థించెను. రాజు హృదయం తెలిసి నన్నయ దానిని ఆమోదించెను. వైదిక మత ప్రాతిపదికగా భారతము నాంధ్రీకరించినచో తప్పక జగద్ధితము నాపాదించునని నన్నయ విశ్వాసం. ఆ విశ్వాసమే మూలమున లేని సందర్భాలలో కూడా అతనిచే వైదిక విధులను వేదములను, విప్రవరులను ప్రశంసింపజేసినది. అని అవధానిగారు చాళుక్యుల కాలంనాటి రాజకీయ సాంఘిక, మత విషయాలను వ్యక్తం చేశారు.

## 15. నన్నయ ఆంధ్రశబ్ద చింతామణి అరణ్యపర్వశేషముల కర్తృత్వము

ఆంధ్ర శబ్ద చింతామణి కర్తృత్వ విషయంలో ఉన్న రెండు వాదాలను వారు చూపిన ఆధారాలను చూపించి దీనిని నిర్ణయించడానికవకాశం లేదనే అభిప్రాయం వెలిబుచ్చారు. చింతామణి నన్నయకృతం కాదనడానికి 12 ఉదాహరణలను చూపించారు. ఇందులో వీరేశలింగంపంతులు, చిలుకూరి నారాయణరావు, మల్లాది సూర్యనారాయణశాస్త్రి గార్ల అభిప్రాయములు ముఖ్యమైనవి. నన్నయ రచనయే అనుటకు కూడా శ్రీ వజ్ఝల చిన సీతారామశాస్త్రులవారి ఉదాహరణలను పదమూడింటిని చూపారు.

అరణ్య పర్వ శేషమును ఎఱ్ఱన పూరింపలేదు. అది నన్నయ రచనయే. నన్నయ రచనలోని శిధిల భాగాలను మాత్రం ఎఱ్ఱన పూరించాడు అని కొందరి అభిప్రాయం. కానీ ఎఱ్ఱన రచనే అనుటయే సమంజసమని అవధానిగారభిప్రాయపడినారు.

''ఈ విధముగా నెఱ్ఱన శేషభాగ రచన కావించెననియు శిథిల భాగ పూరణము నొనరించెననియు. నిరు తెరగుల వాదించుట కవకాశము కలదు. కానీ మధ్యాక్కరలతో యతి భేదము కానవచ్చుటయు, కొన్ని సీసములందు నన్నయ కావించుకొన్న నియమములు కానరాకుండటయు జూడ నరణ్యపర్వ శేషము నెఱ్ఱనయే రచించెనుకొన్న నన్నిప్రతులలో నొకే భాగమొక చోటనుండియే శిథిలమైపోవుటయు, నా శిథిల భాగముననే యెఱ్ఱన యతి భేదము తోడ మధ్యాక్కరలను వ్రాసెనను కొనుట నుచితముగా నుండదు'' [15]

## 4. ఆంధ్ర మహాభారతము - కవిత్రయము

ప్రథమ ప్రపంచ తెలుగు మహాసభలు 1975 ఏప్రిల్ 12వ తేదీన మొదలై ఒక వారం రోజులు

జరిగాయి. తెలుగు మహాసభలకు విచ్చేయు వారికి తెలుగు జాతి సాంస్కృతిక వైభవాన్ని తెలియజేయుటకై వీలుగా ఆంధ్ర భాష, సాహిత్య, కళా చరిత్రాదులను గురించి ఉత్తమములు, ప్రామాణికములనైన కొన్ని లఘు గ్రంథాలను ప్రకటించాలనుకున్నారు. అందులో భాగంగా ప్రకటింపబడిన ఒక లఘుకావ్యమే ఆంధ్ర మహాభారతము - కవిత్రయము.

ఇందులో దివాకర్ల వేంకటావధానిగారు నన్నయ, తిక్కన, ఎఱ్ఱన్నల భారత రచనా విధానాన్ని విశ్లేషించారు. వారి జీవిత విశేషాలను కూడా సమీక్షించారు.

మహాభారత ప్రాశస్త్యాన్ని ప్రశంసించారు. సంస్కృతాంధ్రములలో దాని ఔన్నత్యాన్ని వర్ణించారు. భరతవంశరాజుల చరిత్రను చెప్పుగ్రంథం కావటం చేత మాహాత్మ్య భారవత్త్వముల చేత దానికి మహాభారతమను పేరు ఏర్పడినది. సర్వోపనిషత్సారభూతము, యోగశాస్త్రము ఐన భగవద్గీత అందలి భాగములగుట దాని మాహాత్మ్యమునకు ఉత్కర్ష కల్గించినది. అది పెక్కు కావ్యాలకు, నాటకాలకు వస్తువు చేకూర్చిన ఆధార గ్రంథము. అది అన్ని భారతీయ భాషలలోనికి కొన్ని పాశ్చాత్య భాషలలోనికి కూడా అనువదింపబడి అఖండమైన ప్రశస్తిని ఆర్జించినదని సంస్కృత మహాభారత ప్రాశస్త్యాన్ని పేర్కొన్నారు. ఇట్లే తెలుగు భారతాన్ని గురించి కూడా తెలియజేశారు.

నన్నయను గురించి అవధానిగారు రాసినన్ని పుస్తకాలు మరెవ్వరూ రాయలేదు. నన్నయ జీవితాన్ని గురించి భారత రచన ప్రారంభాన్ని గురించి నన్నయ ఆంధ్రీకరించిన విధానాన్ని గురించి నన్నయ భాషను గురించి ఔచిత్య పరిపోషణ, లోకజ్ఞత, శైలి మొదలైన అంశాలను గురించి అవధానిగారు చర్చించినంత విపులంగా మరెవ్వరూ చర్చించలేదు. ఆంధ్ర వాఙ్మయారంభదశలో నన్నయ్యను గురించి సమగ్రంగా విపులీకరించారు. కనుక తిక్కన ఎఱ్ఱనలకు సంబంధించిన అంశాలను మాత్రం ఇక్కడ చర్చిస్తాను.

## తిక్కన సోమయాజి

తిక్కన తండ్రి కొమ్మన, తల్లి అన్నమ. తాత మంత్రి భాస్కరుడు. ఇంటిపేరు కొట్టరవువారు. కోష్టాధిపతి పదవి ఈ వంశం వారెవ్వరో నిర్వహించుట వలన వీరి ఇంటిపేరు 'కొట్టరవు' వారైనది. కొమ్మన తన తండ్రి భాస్కరునివలె గుంటూరు విభుడై ఉండెను. చోడవంశపురాజుల దగ్గర దండనాథుడుగ కూడా ఉండెను. నెల్లూరి ప్రాంతంలో జరిగిన ఒక యుద్ధములో వీరమరణం పొందెను. ఆయన భార్య ఆ వార్త తెలిసి సహగమనం చేసెను. చిన్నతనంలోనే తల్లిదండ్రులను కోల్పోయిన తిక్కన నెల్లూరికి వెళ్లి అక్కడ పెద తండ్రి అయిన సిద్ధనామాత్యుని కడపెరిగెను. విద్యాబుద్ధులు నెల్లూరులోనే అభ్యసించెను. మనుమసిద్ధి ఇతనికి సహపాఠి. తిక్కన రాజనీతిని కూడా అభ్యసించెను. తిక్కన క్రీ.శ.

1210నుండి 1280 వరకు జీవించి ఉండును. తిక్కనకాపేరు తండ్రి పెట్టినదే. తిక్కన తండ్రి మనుమసిద్ధి తండ్రి అయిన తిక్కరాజు దగ్గర దండనాధుడుగ ఉండెను. అందువలన తన కుమారునికి తన ప్రభువుపేరైన తిక్కన అను పేరు కృతజ్ఞతాభావంతో పెట్టుకొనెను. తిక్కన అనే పేరు శ్రీకాళహస్తి అందలి ''తిరుకాళస్తి'' దేవుని బట్టి ఏర్పడినది. తిక్కరాజుకు కూడా తిరుకాళక్తి దేవచోడుడను పేరున్నదని తిక్కన బాల్యం విద్యాభ్యాసం నామధేయాన్ని గురించి అవధానిగారు తెలియజేశారు.

మనుమసిద్ధి రాజు కాగానే తన మిత్రుడైన తిక్కనను మంత్రిగా నియమించుకొనెను. అక్కన, బయ్యన అను దాయాదులచే మనుమసిద్ధి రాజ్యభ్రష్టుడు కాగా తిక్కన ఓరుగల్లునకు వెళ్లి గణపతిదేవునకు భారతాన్ని వినిపించి అతని సహాయాన్నర్థించి మనమసిద్ధిని మరలా రాజుగా చేసెను. మనుమసిద్ధికంటె తిక్కన కొంచెం పెద్దవాడు. అందుకే మనమసిద్ధి ఇతనిని మామ అనుచుండెను. తిక్కన తొలి రచన నిర్వచనోత్తర రామాయణము. దీనిని మనమసిద్ధికి తిక్కన అంకితం చేశాడు. పూర్వరామాయణం తాత మంత్రి భాస్కరుడు రాసి ఉండుట చేత మనుమడు ఉత్తర రామాయణాన్ని రాసి రామాయణాన్ని పూర్తిచేసిన ట్లూహింపవచ్చు. తిక్కన విజయసేనము, కవిసార్వభౌమ ఛందస్సు, కృష్ణశతకము అను గ్రంథాలను కూడా రచించెనని చెప్పుదురు. కాని అవి అలభ్యం. తిక్కన కీర్తి సౌధానికి మూలస్తంభం పదిహేను పర్వాల భారత రచన, నన్నయ తరువాత తిక్కన వరకు భారత రచనకు ఎవరూ పూనుకోక పోటానికి మతము రాజకీయ పరిస్థితులే కారణం కావచ్చు. తిక్కన తన భారతాన్ని హరిహరనాధున కంకితం చేసెను. తిక్కన భారతాంధ్రీకరణ విషయంలో నన్నయనే ఒజ్జబంతిగా గ్రహించెను. తిక్కన వట్టి కవియే గాక గొప్ప రాజనీతి వేత్తగా కూడా ఉండెను. ఇది ఆతని రచనలలో ప్రతిబింబిస్తూంది. అవధానిగారు తిక్కన అనువాద విషయాన్ని రసపోషణను, పాత్ర పోషణను, వర్ణనలను వివరించారు.

ఆంధ్రీకరణ విషయంలో, సంక్షేపించిన సందర్భాలలో భగవద్గీత సనత్సుజాతీయము ముఖ్యమైనవని పేర్కొన్నారు. తిక్కన పెంచిన ఘట్టాలలో కీచకుని ప్రణయ వృత్తాంతాన్ని ఉద్యోగపర్వంలోని శ్రీకృష్ణ సంజయ రాయబారాలు ముఖ్యమన్నారు. ఔచిత్య దృష్టితో మూలమును మార్చి రాసిన భాగాలలో విరాటపర్వంలో అర్జునుడు విరాటుని కొలువులో నాట్యాచార్యుడుగా చేరునప్పుడు అతని నపుసంకత్వాన్ని స్త్రీలద్వారా విరాటుడు పరీక్షించినట్లు మూలంలో ఉండగా ఇది అనుచితము తిక్కన దీనిని తొలగించి ''నైపుణనంబున నుచితంబుమై నరసి పొచ్చము లేమి దదీయ సేనన్నైకొనుటకు నిశ్చయించె'' నని ఔచిత్యశోభితంగా రచించాడు.

ఇట్లే విరాటపర్వంలో వ్యాసుడు భీమ కీచకుల పోరాటాన్ని విపులంగా వర్ణించాడు. పెద్ద

అలజడి జరిగినదని కూడా సంస్కృత భారతంలో కలదు. కాని తిక్కన భీమ కీచకులున్న పరిస్థితిలలో బహిరంగంగా యుద్ధం చేయుట తిక్కనకు నచ్చలేదు. తన యగసాటెరుంగునని కీచకుడు సమయ భంగమగునని భీముడు గొంకుచు నిగూఢమర్దన మొదలుపెట్టారని వర్ణించాడు. తిక్కన మూలాన్ని యథాతథంగా అనువదించిన సందర్భాలను కూడా అవధానిగారు పేర్కొన్నారు.

పాత్రచిత్రణ విషయంలో ''భారతం మహాసముద్రము వంటిది. సముద్రము నందలి జలచరముల సంఖ్యవలె అందలి పాత్రల సంఖ్యయు అత్యధికమైనది. అయ్యును తిక్కన ఆ పాత్రలనన్నింటిని సుస్పష్ట రేఖలతో తీర్చిదిద్ది ఒక్కొక్కరియందు విలక్షణమైయుండు వ్యక్తిత్వమును వ్యక్తము చేయుచుండును. ధృతరాష్ట్రుని తనయ పరాధీనత, దుర్యోధనుని దురభిమానము, శకుని కైతమును, దుశ్శాసనుని దూర్జతను, కర్ణుని రాజభక్తి పరాక్రమ ములను, భీష్మద్రోణాదుల ధర్మ పరాయణతను, విదురుని నీతినేతృతతను, శ్రీకృష్ణుని దుష్టశిక్షణ శిష్టరక్షణ, రాజనీతి ధౌరంధర్యములను, ధర్మరాజు ధర్మప్రీతిని, భీముని అమాయకతను, అర్జునుని ఉదాత్తత, విక్రమములను, నకులుని సౌజన్యమును, సహదేవుని రాజనీతి నైపుణ్యమును, ఎంతో విశదముగా నిరూపించెను'' [16] అని పేర్కొన్నారు అవధానిగారు. తిక్కన కావ్యమున కాత్మ ధ్వనియను ప్రాచ్యలాక్షణికుల మతానుసారంగ అనేక ఘట్టాలలో వ్యంగ్యార్థము స్ఫురించినట్లుగా రచన సాగించాడు. విశ్వశ్రేయః కావ్యమను సూక్తిని విశ్వసించి, జగద్ధిత బుద్ధితో మహాభారతమును రచించి కృతకృత్యుడైన మహాకవి తిక్కన. అతని విషయమున కవిత్వమొక తపస్సు. ఆ తపస్సు చేత లోకమును పవిత్రీకరించిన పుణ్యమూర్తి తిక్కన అని తిక్కన వ్యక్తిత్వ కవిత్వాలను గురించి ప్రవచించారు అవధానిగారు.

## ఎఱ్ఱాప్రెగడ :

పోతమాంబ సూరనార్యులు ఎఱ్ఱన తల్లిదండ్రులు. ఎరపోతసూరి అతని తాత. బొల్లన ఇతని తాత తండ్రి. భీమన అతని తాత తాత. ఎర్రన సుమారు 1350 ప్రాంతం వరకు రాజ్యపాలన చేసిన ప్రోలయ వేమారెడ్డి ఆ స్థానాన్ని అలంకరించి ఉండెను.

ఎఱ్ఱన గురువు శంకరస్వామి. ఎఱ్ఱనకు ప్రబంధ పరమేశ్వరుడు, శంబుదాసుడను బిరుదములు కలవు. ఎఱ్ఱన నృసింహపురాణము, అరణ్యపర్వశేషము, రామాయణము, హరివంశము అను నాలుగు గ్రంథాలు రచించినట్లు తెలియుచున్నది. రామాయణం లభించుట లేదు. రెండు మూడు పద్యాలు మాత్రం లభిస్తున్నాయి.

నరసింహపురాణం వస్తైక్యము కలిగి వర్ణన ప్రధానమై ఒక ప్రబంధంవలె కనిపించుచున్నది. దీనిని బట్టియే ఎఱ్ఱనకు ప్రబంధ పరమేశ్వరుడను బిరుదు వచ్చెనని కొందరి అభిప్రాయం.

శ్రీకృష్ణుని దివ్యచరిత్రమును వివరించు గ్రంథం హరివంశము. దీనికి భారత పరాంశం అను ప్రసిద్ధి ఉంది. దీనిని పూర్వోత్తర భాగాలుగా విభజించి ఎఱ్ఱన రచించాడు. ప్రోలయ వేమారెడ్డి ప్రోత్సహించెను.

ఎఱ్ఱన అరణ్యపర్వ శేషమును నన్నయ రచనయనునట్లు పూరించెను. 'పూరించెను' అను క్రియకు అర్థము చెప్పుపటలో పండితులలో అభిప్రాయ భేదం ఉన్నది. కొందరు నన్నయయే అరణ్యపర్వం పూర్తిగా రచించెననియు క్రిమిదష్టములై పోవుటచే ఎర్రన అశిథిల భాగాలను మాత్రం పూరించెనని కొందరి అభిప్రాయం. మరికొందరు నన్నయ అరణ్యపర్వంలో నాలుగు అశ్వాసంలో 142 పద్యాలు మాత్రం రచించెననియు 143వది అయిన ''స్ఫురదరుణాంశురాగరుచి పాంపిరిచోవ'' అను పద్యంనుండి ఎర్రనయే రచించెననియు, అందుచేతనే అరణ్యపర్వంలో 142వ పద్యం తరువాత ఎర్రాప్రగడ కవిత్వ ప్రారంభము అను సూచన కనబడుచున్నదని వీరి వాదన.

నన్నయయే అరణ్యపర్వమును పూర్తిగ రచించెననువారు చూపు ఆధారాలు అంత సమంజసంగా లేవు కనుక ఎఱ్ఱనయే అరణ్యపర్వ శేషాన్ని పూరించెనని అభిప్రాయపడినారు.

సంస్కృతంలో అరణ్యపర్వములో 11,847 శ్లోకాలున్నాయి. అందు నన్నయ సుమారు 7,000 శ్లోకాలతో కూడిన భాగమును అనువదించెను. మిగిలిన ఐదువేల శ్లోక పరిమితమైన భాగాన్ని ఎఱ్ఱన 1485 గద్యపద్యములతో సంగ్రహించెను. అనువాద సందర్భంలో అతడు నన్నయను అనుకరించెను. కవిత్రయమువారి ముగ్గురి అనువాదం స్వతంత్రతతో కూడినదే అయిన ఎఱ్ఱనది తిక్కన ఇరువురి దానికంటే మూలమునకు సన్నిహితంగా కనిపించును. నన్నయ చెప్పిన ప్రసన్న కథాకవితార్థయుక్తి ఎఱ్ఱన రచనలో కూడా కనిపించును.

నన్నయ శైలి ప్రధానంగా కథనశైలి, తిక్కనది సంవాదన, ఎఱ్ఱన శైలి వర్ణనశైలి అని పెద్దలు చెప్పుదురు. నన్నయ తిక్కనల రచనలు మహాసముద్రాలవంటివి. ఆ రెండిని కలుపు జలసంధి ఎఱ్ఱన రచించిన అరణ్యపర్వ శేషము.

నన్నయ తిక్కనలవలెనే ఎఱ్ఱనయు శబ్దార్థాలంకారాలకై ఎచ్చటను ప్రయత్నించలేదు. అతను ఉత్ప్రేక్ష, రూపక, ఉపను స్వభావోక్తి, అర్థాంతరన్యాసము మొదలైన అలంకారాలను సహజసిద్ధంగా ఉండి ఇంపుగా నుండును.

ఎఱ్ఱన చంపకోత్పలమాలలను, శార్దూల మత్తేభాలను, సీసకందములను, ఆటవెలది, తేటగీతులను, ఎక్కువగా వాడును. సీసము తరువాత తేటగీతులను ఎక్కువగ వాడెను. నన్నయ ఆటవెలదులను అధికంగా వాడెను.

ఎఱ్ఱన నన్నయ తిక్కనలందపార భక్తికలవాడు. ధర్మపరాయణుడు. ఎంత మహాపండితుడో

అంత మహాకవి. శివకేశవాద్వైతము సాధించిన సమరసబుద్ధి అని ఎట్టనను గురించి చెప్పి కవిత్రయం వారిని గురించి -

''కవిత్రయమువారు వేదత్రయమూర్తులైన త్రిపురుషులు, ప్రతిభా వ్యుత్పత్తి యభ్యాసములకు పట్టుగొమ్మలు. ఆంధ్ర భాషా సారస్వతములకు రూపుదిద్ది వారు కల్గించిన వన్నె ఇంతింతనరానిది. తరువాతి కవులందరికి వారు గురు ప్రాయులు. వ్యాసరచిత పంచమ వేదమును అందు నిరూపితమైన అర్థమేర్పడునట్లుగా, నవరసాలంకార భరిత మహా కావ్యముగా, నీతి ధర్మ తత్త్వ నిధానముగా ఆంధ్రులకందించిన ఆ మహాకవులు నిత్యస్మర ణీయులు, నిరంతరారాధ్యులు'' [17] అని అవధానిగారు వారిని ప్రశంసించారు. ఈ గ్రంథంలో అరసున్నలు పూర్తిగా తగ్గించి, యడాగమములను కూడా తగ్గించి అవధానిగారు రచించుట గమనార్హం. బండిరాలు గూడా చాలా సందర్భాలలో తగ్గించారు. ఇది 1975లో వ్రాయ బడినది అయినా దీనికంటే ముందు ఇతర రచనలు చేసి ఉండిన నన్నయ గురించి వ్రాయబడి ఉండుట చేత దీనిని 1960 రచన పొంత చేర్చబడినది. దీని తరువాత కూడా నన్నయకు సంబంధించిన రచనలను కాలక్రమము ననుసరించి కాక నన్నయకు సంబంధించిన వాని సరసన చేర్చబడును. అవధానిగారు యువభారతివారు అడిగినప్పుడు తిరుపతి దేవస్థానం తిరుమల వారు అడిగినప్పుడు నన్నయను గురించి రాసినారు. నన్నయను గురించిన రచనలన్నీ ఒక వరసలో ఉండిన బాగుండునను ఉద్దేశంతో ఈ క్రమం పాటింపబడినది.

## 5. నన్నయ కవితా వైభవము

నన్నయ కవితా వైభవమనే ఈ చిన్న పుస్తకాన్ని యువభారతి సాహితీ సాంస్కృతిక సంస్థ 1976 జనవరిలో ప్రచురించింది. సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యం కంటే ఇతరమైన సాత్త్విక సాధనం లేదనే విశ్వాసంతో చేస్తున్న కృషిలో ఇలాంటి పుస్తకాలు ప్రచురించుట ఒక భాగం. యువభారతి సంస్థకు అవధానిగారు గౌరవ సభ్యులు. హితులు, సన్నిహితులు. నన్నయను గురించి విశేష పరిశోధన చేసినవారు. నన్నయ కవితా వైభవాన్ని తెలుగు వారికందించుటకు ఈ పుస్తకం ప్రచురింపబడినది. దీని అముఖంలో ''నన్నయకు పూర్వం తెలుగు ఎలా ఉండేదో, నన్నయ దాన్ని ఎట్లా తీర్చిదిద్దాడో అతని కవిత్వం ఎంత గొప్పదో గొప్ప పరిశోధన చేసి తెలుగులోకానికి అందజేసిన విద్వత్కవులు ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు. జలదస్వనగంభీర మధురమైన తమ రాగామృత ధారలతో యావదాంధ్రదేశాన్నీ పునీతం చేసిన వాగ్వివతంసులు. అష్టావధానం చేస్తున్న ఆ న్వర్థ నామధేయులు, సంస్కృత భాషాభినివేశం, ఆంగ్లభాషా సంపర్కం, ప్రాచ్య పాశ్చాత్య సాహిత్య సిద్ధాంత పరిజ్ఞానం శ్రీ అవధానిగారిని ఆచార్యులను చేసింది. ఎందరో తెలుగు గురువులకు ఆయన గురువులు'' [18] అని అవధానిగారి వైదుష్యాన్ని గురించి యువభారతి

సంస్థ అప్పటి అధ్యక్షుడు డాక్టర్ ఇరివెంటి కృష్ణమూర్తిగారు పేర్కొన్నారు. అటువంటి అవధానిగారు నన్నయ రమ్యమైన పద్యాలకు రుచిర వ్యాఖ్యలను రచించారు. ఇందులో మొత్తం 65 పద్యాలను నన్నయ భారతంనుండి ఎన్నుకొని వ్యాఖ్యానించడం జరిగింది. ఆదిపర్వంనుండి 37 పద్యాలను సభాపర్వంనుండి 18 పద్యాలను అరణ్యపర్వ భాగంనుండి 10 పద్యాలను అవధానిగారు గ్రహించారు. మచ్చునకొక పద్యం -

''గంగ నిజాంగదీప్తు లెసగం జనుదెంచి లతాంగి సంతతో
త్తుంగ పయోధర ద్వితయతోయరుహానన చారు నేత్ర ది
వ్యాంగనయై ప్రతీప వసుధాధిపు సాల విశాల దక్షిణో
త్తుంగ మునందు మన్మధవశంబున నుండె గరంబులీలతో (ఆది, 4-135)

ప్రతీపుడు శంతునుని తండ్రి. అతడు రాజ్యసుఖములదనిసి గంగాతీరమున యముని యమవ్రత పరాయణుడై తపము సేయుచుండ గంగ దివ్యాంగనయై యాతనికి బ్రత్యక్షమైన సందర్భమునందలి పద్యమిది.

గంగ తన శరీరకాంతులు వ్యాపింప ప్రతీపుడు తపస్సు చేయుచున్న చోటికి దివ్యాంగనా రూపమున వచ్చి, యాతని సాలవృక్ష విశాలమైన కుడి తొడయందు గూర్చుండెను. ఈ పద్యమున గంగకు వేయబడిన విశేషణములామె శరీరకాంతిని అంగమార్దవమును స్తనౌన్నత్యమును, హసన నేత్రముల సౌందర్యమును చక్కగా వర్ణించుచున్నవి. మొదటి రెండు పాదములందు బిందుపూర్వక 'గ' కార పునరావృత్తి శృంగార రసానుకూలమైన మాధుర్యమును, పెంపొందించుచున్నది. కుడి తొడ పురుష భాగమై పుత్రారోహణ యోగ్యమైనది. ఎడమ తొడ స్త్రీభాగము దాని నెక్కక గంగకుడి తొడ నెక్కుటచేతనే ప్రతీపుడామెను గ్రహింపక నా పుత్రునకు భార్యవగుమని యాదేశించి పంపివైచెను'' [19]

ఇందులో మామూలు పాఠకునికి కూడా అర్థం అయ్యేంత స్పష్టంగా సరళంగా వ్యాఖ్యానించారు అవధానిగారు. వ్యాఖ్యానం రాసిన పద్యాలలో ఎక్కువ భాగం నీతికి సంబంధించినవి. కొన్ని రాజనీతికి సంబంధించిన పద్యాలు శృంగార రసపోషణకు సంబంధించిన పద్యాలు, అలంకారయుక్తమైన పద్యాలను ఎన్నుకొని అవధానిగారు రసరమ్య వ్యాఖ్యానాలు సంతరించారు. ఇది ఇంతకుముందు నన్నయను గురించి తెలియచేసిన విధానానికన్న భిన్నంగా రమణీయంగా ఉంది.

## 6. నన్నయ భట్టారకుడు :

ఈ గ్రంథం 1983లో ప్రచురితమైనది. తిరుపతి తిరుమల దేవస్థానంవారు తమ ప్రచురణ సంఖ్య 169గ దీనిని ముద్రించారు. అవధానిగారిని గురించి అప్పటి తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారి అయిన జి.కుమారస్వామిరెడ్డిగారు ఈ విధంగా పేర్కొన్నారు.

''కళాప్రపూర్ణ డాక్టరు దివాకర్ల వేంకటావధానిగారు 'నన్నయభట్టారకుడు' అనే ఈ గ్రంథంలో నన్నయకు పూర్వం తెలుగు భాష, నన్నయ జన్మదేశాదులు, నన్నయ అవతారిక, ఆయన ఆంధ్రీకరణ విధానం, కవితారీతి, శైలి, అక్షర రమ్యత, నన్నయ రచనలోని భాషా ఛందో విశేషాలు చక్కగా వర్ణించారు'' [20] అని పేర్కొన్నారు.

అవధానిగారు ఇందులో చర్చించిన అంశాలు ఏడు

1. నన్నయకు బూర్వము తెలుగు భాష
2. సంస్కృత భారతము- నన్నయయ జన్మదేశాలు
3. నన్నయ యవతారిక
4. నన్నయ ఆంధ్రీకరణ విధానము
5. నన్నయ కవితా రీతి
6. నన్నయ శైలి - అక్షర రమ్యత
7. నన్నయ రచన యందలి భాషాఛందో విశేషములు.

ఈ అంశాలను గురించి అవధానిగారు తన పరిశోధనా వ్యాసం ఆంధ్ర వాఙ్మయారంభ దశలో కూడా విపులంగా చర్చించారు. ఎన్నో విషయాలను సిద్ధాంతరీకరించారు. అందులోని సారాంశాన్ని సరళమైన భాషలో నన్నయ భట్టారకుడనే ఈ గ్రంథంలో వ్యాఖ్యానించారు. అవధానిగారు ఇందులో నన్నయ శబ్దాన్ని గురించి విపులంగా చర్చించారు. నందంపూడి శాసనమున, 'ఆజ్ఞాప్తిరస్యకటకాధి రాజ, కావ్యానాం కర్తా నన్నయభట్టో లేఖకో గండాచార్యయ' అని వ్రాయబడి యున్నది. ఈ నన్నయభట్టునుకొందరు భారత రచన చేసిన నన్నయభట్టుకంటే భిన్నుడని వాదింతురు. కొందరు ఈ 'నన్నయ' యను శబ్దం కన్నడ శబ్దమువలె గోచరించుటచే అతడు కన్నడ దేశీయుడై ఉండునని కొందరి భావన. ఈ రెండు వాదనలు సమర్థనీయములు కావు. శాసనకర్త 'నన్నయ' భారతకర్త 'నన్నయ' ఇద్దరు కారు ఒకరే అని నిర్ధారించారు. కొందరు నన్నయ మహారాష్ట్రుడన్నారు. ఇది సరిగాదని చాగంటి శేషయ్య ఖండించారు. అని నన్నయను గురించి చర్చించారు. కొన్ని సంస్కృత శ్లోకాలను మూలంనుండి ఉదహరించి అనువాద విధానాన్ని ఉల్లేఖించారు. ఈ రెండు

విషయాలు పరిశోధనావ్యాసంలో లేవు. మొత్తంమీద నన్నయభట్టారకుడనే ఈ పుస్తకం అవధానిగారి పరిశోధన వ్యాసాలకు సంగ్రహ రూపమని చెప్పవచ్చు.

## 7. నన్నయభట్టు

ఆంగ్లంలో English men of Letters అను గ్రంథంవలే తెలుగులో కూడా అటువంటి గ్రంథ పరంపరను రాయాలనే ఉద్దేశంతో యువభారతి సంస్థతో అవధానిగారు సంప్రదించగా వారు ప్రచురణకు ఉత్సాహం చూపినందువలన అవధానిగారు యువభారతి వారు కలిసి ''ఆంధ్ర కవి నక్షత్రమాల' అనే పేరుతో 27 గ్రంథాలుగా 40మంది కవుల గురించి ప్రచురించడానికి నిర్ణయించారు. అందులో మొదటి గ్రంథంగా నన్నయభట్టు వెలువడింది. అవధానిగారు రచించారు, యువభారతివారు 1986లో ఈ గ్రంథాన్ని ప్రచురించారు. ఇందులో నన్నయకు పూర్వం తెలుగు భాషా స్వరూపాన్ని సంగ్రహంగా తెలియజేసి నన్నయ జీవిత విశేషాలను సంస్కృత భారతాన్ని గురించి నన్నయ రచనా విధానాన్ని గురించి చర్చించారు. ఇందులో చర్చింపబడిన అంశాలు ఈ క్రింది విధముగా ఉన్నాయి.

1. ప్రాజ్నన్నయ యుగమునందలి తెలుగు భాష
2. సంస్కృత భారతము - నన్నయ జీవిత విశేషములు
3. ఆంధ్ర భారతమునందలి అవతారిక
4. నన్నయ అనువాద పద్ధతి
5. నన్నయ వర్ణనలు
6. నన్నయ కవితా రీతి
7. నన్నయ రసపాత్ర పోషణ
8. నన్నయ శైలి అక్షర రమ్యత

అనే అంశాలను గురించి చర్చించారు. అవధానిగారి పరిశోధనా గ్రంథం ఆంధ్రవాఙ్మయారంభదశలోని అంశాలనే నన్నయ భట్టారకుడనే గ్రంథంలో కొంత సంగ్రహరించి ఉల్లేఖించారు. నన్నయ కవితా రీతిని గురించి కొన్ని ప్రకరణల చివర కొన్ని పద్యాలు రాయబడి ఉండుట ఇందులో విశేషం. అవధానిగారు నన్నయను గురించి చేసిన చివరి రచన ఇది. నన్నయను గురించి అవధానిగారు ఒక శ్లోకం కూడ ఇందులో రచించారు.

''వాచామాంధ్ర మయినాం యేః
ప్రవక్తా ప్రథమో అభవత్
ఆచార్యం తం కవీంద్రాణాం
వందే వాగమశాసనమ్''

ఈ గ్రంథాన్ని గురించి అప్పటి యువభారతి అధ్యక్షులు ఇరివెంటి కృష్ణమూర్తిగారిట్లు పేర్కొన్నారు.

''నన్నయభట్టు'' అన్న ఈ చిన్న పుస్తకం నన్నయ సాహిత్య వ్యక్తిత్వానికి అద్దం లాంటిది. కొండ అద్దమందు కొంచెమై కనిపించినట్లు నన్నయ ప్రతిభ మహాభారత ప్రశస్తి నన్నయ విజ్ఞాన నిరతి నన్నయ కవితా పారమ్యం ఈ పుస్తకంలో సాక్షాత్కరిస్తాయి. ఈ పుస్తకం చదివితే ఆదికవిని దర్శించినంత ఫలం లభిస్తుంది'' [21]

అన్ని దృక్కోణాలనుండి నన్నయను గురించి అవధానిగారు అనుశీలించారు. ఎన్నో సందర్భాల్లో నన్నయను గురించిన అమూల్య విషయాలెన్నింటినో వెల్లడించారు. నన్నయను గురించి ఆయన చేసిన పరిశోధన సర్వవిధాల ప్రామాణికమై ఆదర్శప్రాయమై నిలిచినది. ప్రతిభా వ్యుత్పత్తి అభ్యాసాలు మూర్తీభవించిన సాహితీ మూర్తి అవధానిగారు. యువభారతి కాయన ఎందరో కవులను గురించిన వ్యాసాలు రచించి ఇచ్చి ఉపన్యాసాలిచ్చి సాహితీ ప్రియులలో ఒక చెదరని ముద్ర వేశారు. అవధానిగారు నన్నయ మీద చేసిన పరిశీలన పరిశోధనా రంగానికి ఒరవడి దిద్దింది. యువభారతి వేదికమీద చేసిన ఉపన్యాసాలు ఉపన్యాస కళకు మార్గదర్శకాలైనాయి.

## 8. నన్నెచోడుని కుమార సంభవము భాషా ప్రయోగ విశేషములు

ఇది ఆంధ్రభాషా చరిత్రకు తోడ్పడు రచన. నన్నెచోడుని కుమార సంభవ కావ్యములోని భాషకు నన్నయ భారతమునందలి భాషకు గల తారతమ్యం ఈ గ్రంథంలో నిరూపింప బడినది. ఇది పరిశీలనాత్మక రచన.

నన్నెచోడుడు శివకవులలో మొదటివాడు. కానీ కొందరు నన్నయకంటే నన్నెచోడుడే మొదటివాడని తెలుగులో అతడే ఆదికవియని వాదింతురు. కొందరితడు తిక్కన తరువాతి వాడని కూడా చెప్పెదరు. కానీ చాలామంది విమర్శకులు ఇతడు నన్నయ తిక్కనల నడిమి కాలం వాడని అభిప్రాయపడుతున్నారు. ఇది సమంజసంగా ఉన్నదని అవధానిగారభిప్రాయ పడినారు. ఆంధ్ర వాఙ్మయంలో ద్వితీయ మహాకవి నన్నెచోడుడు, కుమార సంభవకావ్యం స్వతంత్ర కావ్యమే అయినా అక్కడక్కడా కాళిదాసు కుమారసంభవంలోని శ్లోకాలకు అనువాదములని చెప్పవీలున్న పద్యములు చోటుచేసుకున్నాయి. జానుతెనుగును గురించి మొట్టమొదట ప్రస్తావించినవాడు కూడా నన్నెచోడుడే. అది తనకభిమతమని కూడా చెప్పుకున్నాడు. కానీ అతనికి అభిమతమైన జాను తెనుగెటువంటిదో స్పష్టం చేయలేదు.

''కన్నడమున నాగవర్మ గుణవర్మలు 'జాణ్ణు' కి పేరుపొందినవారట. జన్నకవి యశోధర

చరిత్రలో గుణగవర్మ 'జాణ్ణు'డినభినందించి యున్నారు. ఈ కన్నడ కవులు కూడా జాణ్ణుడిని ఇదమిత్థమని చెప్పి యుండలేదు. నన్నెచోడుడాతను జాను తెనుగు గనుపదమునాకన్నడ కవుల జాణ్ణుడి ననుసరించియే వాడియుండును'' [22] అని అవధానిగారు పేర్కొన్నారు. నన్నెచోడుడు చేసిన పద ప్రయోగాలను వ్యాకరణ సూత్రాలకన్వయించి వాటి గుణ దోషములను ఈ కావ్యంలో సోదాహరణంగా నిరూపించారు.

నన్నయకు పూర్వమున్న శాసనములలో ఱ, ౙ అను ధ్వనులు నన్నయ భారతంలోని నన్నెచోడుని కుమార సంభవమునగాని లేవు.

నన్నయ భారతంలో 'క్ష' కారాని కకారాదులతోనెగాని చకారాదులతో యతి వేయలేదు. కుమార సంభవమున క్ష కారమునకు క, చ వర్గముల రెండింటితో యతి వేయబడి యున్నది.

న, ల, లను ణ, ళుగా నుచ్చరించు నాచారము కూడా నన్నెచోడుని నాటికి తగ్గినట్లు కన్పించును. ఎడద అను పదాన్ని ఎడ్డ అను రూపంలో కొన్నిచోట్ల వాడినాడు అందులో ఎ లఘువేకాని గురువు కాదు.

నన్నెచోడుడు మిశ్ర సమాసములను పెక్కువాడెను. 'తృణ' శబ్దాన్ని 'త్రిణ' అను రూపంలో వాడెను. ఇట్లే నన్నెచోడుడు వాడిన శబ్దాల ననేకం అవధానిగారు ఉదాహరించినారు. శిభక్తి ప్రత్యాయాలు, సంధులు, సర్వనామములు, సంఖ్యా వాచకాలు, తత్సమ శబ్దాలు, తమిళ కన్నడ పదాలు, ఔపవిభక్తికములు, క్రియలు, తద్ధర్మార్థక క్రియలు, ప్రార్థన నాద్యకర్థకములు, అసమాపక క్రియలు, అవ్యయములు, కృద్ధితాంతములు, తద్ధితాంతములు, విశేషణములు, వాక్య నిర్మాణములు మొదలైన వాటిని నన్నెచోడుడు ప్రయోగించిన విధానాన్ని అవధానిగారు సోదాహరణంగా వ్యాఖ్యానించారు.

అవధానిగారు చూపిన కొన్ని ఉదాహరణలు - గరుడు - గరుడి (విభక్తి ప్రత్యయం), ఏను - నీవు - లేరు (ప్రత్యనామాలు) అసురలు - నన్నెచోడుడు (తత్సమపదాలు) అర్వై - దుష్టత్వం ఇక్కు - నడము ఒప్పము - అందము - నాయి - కుక్క (తమిళ పదాలు), తొప్పెనె - అధికము నప్పరిసు - తట్టుచు కెలస - పని (కన్నడ పదాలు), ఉఱడు - ఉఱక (క్రియా పదాలు) ఇలాంటి పదాల ప్రయోగాలను నన్నెచోడుని కుమార సంభవమునుండి ఉదహరించి చూపారు.

వాక్య నిర్మాణం గురించి, ప్రాఙ్నన్నయ యుగమునందలి శాసనాలలో వలె కుమార సంభవములో సమాపక క్రియలు లేని వాక్యాలు కొన్ని కనిపించుచున్నవి. వానిలో గొన్నిటి యందు విశేషణములో, తచ్ఛబ్దానుప్రయోగము కూడిన దాతుజ విశేషణములో క్రియా

కార్యములొనరించుచుండును. కొన్నిటిలో అగుధాతువు నధ్యాహార్యము చేసికొనవలయును.

హేమాద్రి విస్తారమెంత (అగు) ఇదియు మనకు గర్వంబు, నాకిది యేమి గహనంబు - మహీ దేవధ్యాన నిరతువిప్రుల్ - (అగుదురు) వీరేకాదశరుద్రులు, శీకరాకారంబులు చెవులు వారెల్లగా మవశులగువారు, మొదలైన వాక్యాలు దుహరింపబడినవి.

ఈ విధంగా అవధానిగారు నన్నెచోడుని భాషా విశేషాలను నన్నెచోడుని వ్యాకరణ ప్రయోగాలను సోదాహరణంగా ఉదహరించారు. నన్నయమీదనే గాక నన్నెచోడుని భాషను గురించి కూడ అవధానిగారు పరిశోధనాత్మక గ్రంథం రాశారు. 1962వ సంవత్సరం జూలై 16వ తేదీ హైదరామాద్‌లో నన్నెచోడ పద ప్రయోగ కోశావిష్కరణ సభలో ఉపన్యసించిన విషయాలు ఈ గ్రంథంగా రూపొందింది.

## 9. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ - విశిష్ట సభ్యుల ప్రశంస

1968నుండి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు సాహితీరంగంలో విశేష కృషి చేసి విశిష్టులైనవారికి విశిష్ట సభ్యత్వ ప్రదానం చేసేవారు సాహిత్య అకాడమీని తెలుగు విశ్వవిద్యాలయంలో కలుపునంతవరకు ఈ పథకం కొనసాగింది. ఈ విశిష్ట సభ్యత్వం పొందిన వారికి ఒక శాలువ ఒక స్వర్ణపతకమును సభాముఖంగా అందజేయడమే కాక, వారిని గురించిన ప్రశంస కూడా సభాముఖంగా చేసేవారు. ఈ ప్రశంసలలో విశిష్ట సభ్యత్వం పొందిన వారి విద్యాభ్యాసము, జీవిత విశేషాలు, రచనలు, చేసిన వృత్తులు, జన్మస్థలము, బిరుదములు నిర్వహించిన పదవులు మున్నగు విషయాలనుల్లేఖించి చదివి సభ్యత్వ చిహ్నాన్ని అందజేసేవారు. ఆవిధంగా అవధానిగారు 36మంది విశిష్ట సభ్యులను గూర్చి చేసిన ప్రశంసా రచనలను ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు సంకలనం చేసి 1972లో ముద్రించారు. ఇందులో సర్వే పల్లి రాధాకృష్ణ పండితులనుండి మరుపూరి కోదండ రామరెడ్డిగారి వరకు విశిష్ట సభ్యుల ప్రశంసలున్నాయి.

| విశిష్ట సభ్యులు | సభ్యత్వంప్రదానం చేసిన సమావేశపు తేది |
|---|---|
| 1. శ్రీ రాధాకృష్ణ పండితులు | 29-1-1966 |
| 2. శ్రీకాశీకృష్ణమాచార్యులు | 29-1-1966 |
| 3. డా. గిడుగు వేంట సీతాపతి | 29-1-1966 |

| | |
|---|---|
| 4. శ్రీ తాపీ ధర్మారావు | 29-1-1966 |
| 5. శ్రీ ఆదిరాజు వీరభద్రరావు | 7-1-1967 |
| 6. శ్రీ బాలాంత్రపు వేంకటరావు | 7-1-1967 |
| 7. శ్రీ గుండేరావు హర్కారే | 7-1-1967 |
| 8. శ్రీ వేలూరి శివరామశాస్త్రి | 7-1-1967 |
| 9. శ్రీమాన్ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ | 7-1-1967 |
| 10. శ్రీ వూతలపట్టు శ్రీరాములరెడ్డి | 7-1-1967 |
| 11. శ్రీ గుర్రం జాషువా | 7-1-1967 |
| 12. శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రి | 7-1-1967 |
| 13. శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి | ,, |
| 14. శ్రీ నాయని సుబ్బారావు | ,, |
| 15. శ్రీ తుమ్మల సీతారామమూర్తి | ,, |
| 16. శ్రీ రాయప్రోలు సుబ్బారావు | ,, |
| 17. శ్రీ విశ్వనాథ సత్యనారాయణ ,, | |
| 18. శ్రీ గడియారం వేంకటశేష శాస్త్రి | ,, |
| 19. శ్రీ కోలవెన్ను రామకోటేశ్వరరావు | 1-2-1968 |
| 20. శ్రీ మునిమాణిక్యం నరసింహారావు | 1-2-1968 |
| 21. శ్రీ బండారు తమ్మయ్య | 24-8-1968 |
| 22. శ్రీ శివశంకర స్వామి | 24-8-1968 |
| 23. శ్రీ పురిపండా అప్పలస్వామి | 24-2-1968 |
| 24. శ్రీ ఎస్.టి.జి. వరదాచార్యులు | 8-1-1969 |
| 25. శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి | 8-1-1969 |
| 26. శ్రీ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి | 8-1-1969 |
| 27. శ్రీ పింగళి లక్ష్మీకాంత కవి | 30-1-1970 |
| 28. శ్రీ గుడిపాటి వేంకటాచలం | 30-1-1970 |
| 29. శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావు | 30-1-1970 |
| 30. శ్రీ త్రిపురాభట్ల వీరరాఘవస్వామి | 31-1-1971 |
| 31. డా. నేలటూరి వేంకటరమణయ్య | 31-1-1971 |
| 32. శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రి | 31-1-1971 |
| 33. శ్రీ వానమామలై వరదాచార్యులు | 31-1-1971 |
| 34. శ్రీ మొక్కపాటి నరసింహశాస్త్రి | 12-2-1972 |

35. శ్రీ గంటిజోగి సోమయాజి 12-2-1972
36. శ్రీ మరుపూరి కోదండరామరెడ్డి 12-2-1972

వీరందరిని గురించి అవధానిగారు వారి సాహితీ వైశిష్ట్యాన్ని ప్రశంసిస్తూ వారి జీవిత విశేషాలను విశ్లేషిస్తూ సాహితీ విలువలుకల రచనలు చేశారు.

సాహిత్య అకాడమీ మొదటి ఐదుమంది ( శ్రీ ఆదిరాజు వీరభద్రరావు) వరకు సభ్యత్వ చిహ్నము అమూల్యాంబరము ( ప్రధాన) బాలాంత్రపు వేంకటరావు నుండి వాటితోపాటు స్వర్ణపతకము కూడా ప్రదానం చేశారు. ఇందలి భాషగ్రాంధికము, తెలుగులో ఈ విధంగా విశిష్టులను గురించి ప్రశంసాసహితమైన జీవిత విశేషాలు, వ్యక్తిత్వాలు, సాహితీ తత్పరతా దీక్షాదక్షతలను గురించి వెలువడిన రచనలరుదు. ఇవి కేవలం ప్రశంసలు కావు జీవిత చరిత్రలు కావు, విమర్శ వ్యాసములు కావు, సాహిత్య పరిచయ రచనలు కావు, వ్యక్తిత్వ విశ్లేషణములు కావు కానీ ఇవి విశిష్ట సభ్యుల ప్రశంసలు వీటన్నిటి సమ్మిళితాలు, తెలుగు సాహిత్యంలో ఇలాంటి రచనలు పూర్వం వెలువడలేదు.

సాహిత్య అకాడమీ ఉన్నప్పుడు అందులో పనిచేసి ఇప్పుడు తెలుగు విశ్వవిద్యాలయాల అసిస్టెంట్( సహాయ) రిజిస్ట్రార్‌గా పనిచేస్తున్న శ్రీ పాండురంగయ్యగారు ఈ విశిష్ట సభ్యుల విషయమై ఈ విధంగా తెలియజేశారు.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీలో 15మంది విశిష్ట సభ్యులుంటారు. వీరిలో ఎవరైనా రిటైరు అయితే వారి స్థానంలో కొత్తవారికి అవకాశం ఇస్తారు. ప్రసిద్ధులైన తెలుగు సాహితీవేత్తలను ఎన్నుకుంటారు. పుస్తకరూపంలో రాని అకాడమీ రికార్డుల్లో ఉన్న కొందరు విశిష్ట సభ్యుల వివరాలు ఇలా ఉన్నాయి.

3-2-1973 నాడు ఇందరు విశిష్ట సభ్యుల గురించి రచించిన దివాకర్ల వేంకటావధానిగారికి విశిష్ట సభ్యత్వం లభించింది. ఆచార్య సి.నారాయణరెడ్డిగారు అవధానిగారిని గురించి ప్రశంసించారు.

19-1-1974లో కవిసమ్రాట్ శ్రీ నోరి నరసింహశాస్త్రిగారిని గురించి

10-1-1975లో శ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిని గురించి

18-1-1976లో పద్మభూషణ శ్రీ డా. శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యుల గురించి

29-1-1977లో పద్మభూషణ మోటూరి సత్యనారాయణ, జంధ్యాల పాపయ్యశాస్త్రి,

గడియారం రామకృష్ణశర్మగారలను గురించి కూడా దివాకర్ల వేంకటావధానిగారు ప్రశంస రచనలు చేశారు.

## 10. తిరుపతి వేంకట కవులు

1973 ఫిబ్రవరిలో ఈ గ్రంథం ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ వారిచే ముద్రించబడింది. ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీవారి కోరికపై అవధానిగారీ గ్రంథమును రచించారు. తిరుపతి వేంకటకవులు నాటకకర్తలగుటచే సంగీత నాటక అకాడమీవారీ గ్రంథమును ప్రచురించారు.

తిరుపతి వేంకట కవులు జంటకవులు. తెలుగు సాహిత్యంలో ఈ జంట కవులకొక విశిష్టమైన స్థానం కలదు. దివాకర్ల తిరుపతిశాస్త్రిగారు దివాకర్ల వేంకటావధానిగారికి స్వయాన పెదనాన్న. రెండవవారు చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు. వీరిద్దరి ప్రాంతాలు వేరు శాఖలు వేరు. కానీ ఒకే దగ్గర విద్యాభ్యాసం చేయుటచేత జంటకవులుగా మారినారు. ఆంధ్రదేశం నలుమూలలా సాహితీ భేరిని మోగించారు. వీరిని గురించి అవధానిగారు.

''ప్రతి వాఙ్మయమునందును యుగపురుషులనదగిన మహాకవులు కొందరుందురు. వారు దాత్తములు, రసవంతములైన రచనలు కావించి సహృదయ పాఠకుల నలరించుటయే కాక సమకాలమునందును అనంతర కాలమునందును, రచయితల నాకర్షించి రచనా విషయమున వారికి మార్గదర్శకులగుచుందురు. వారి జీవితకాలమునను వారు మరణించిన పిమ్మటకూడా వాఙ్మయముపై వారి రచనల ప్రభావమెంతో గోచరించుచుండును. కవిత్రయము వారు, శ్రీనాథుడు, పెద్దన, భట్టుమూర్తి, చేమకూర వేంకటకవి, మున్నగు వారట్టివారు. ఆధునికాంధ్ర మహాకవులలో శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవులను యుగపురుషులుగా భావింపవచ్చును. వారు ప్రసన్నము, మధురము, సరసము, సర్వసుబోధమునైన పద్యరచనా శైలికి నాందీ శ్లోకము పఠించి శతాధికములైన కావ్యాదులు రచించి తమంతవారైనా పలువురు శిష్యులను సృజించి ఆంధ్ర వాఙ్మయమున కింతింతనరాని యౌజ్వల్యము నావహించిరి''[23]

ఈ గ్రంథమును దివాకర్ల వేంకటావధానిగారు ఐదుభాగాలుగా విభజించినారు. 1. జీవిత విశేషములు 2. నాటకములు, ప్రహసనములు 3. వచనములు విమర్శలు, 4. అవధానములు, రాజసందర్శనములు 5. ఉపసంహారము, జీవిత విశేషములలో ముందుగా దివాకర్ల తిరుపతిశాస్త్రిగారి జననము, బాల్యమును గురించి తెలియజేశారు. తిరుపతి శాస్త్రిగారు వెలనాటి బ్రాహ్మణులు, హరితసగోత్రము, వారి పూర్వులెవ్వరో దివాకరోపన్యాసము చేయుటచే వీరి ఇంటిపేరు దివాకర్లవారుగా స్థిరపడి యుండెనని తెలియజేశారు. పశ్చిమ

గోదావరి జిల్లా భీమవరం తాలూకాలోని ఎండగండి గ్రామంలో శేషమ్మ వేంకటావధాని దంపతులకు 22-3-1872 ప్రజోత్పత్తి నామ సంవత్సరంలో ఫాల్గుణ శుద్ధ దశమినాడు కుంభలగ్నంలో జన్మించారు. సుబ్బరాయుడనే గురువు అక్షరాభ్యాసం చేయించారు. తిరుపతిశాస్త్రిగారికి బాల్యంలో దుడుకుతనం ఎక్కువ. వారి తండ్రిగారికి కోపం ఎక్కువ. కాబట్టి అప్పుడప్పుడు దెబ్బలు తినుచుండిరి వారి మేనత్త ఇది చూసి తిరుపతి శాస్త్రిని తనతో అంగలకుర్రు తీసుకుని వెళ్ళి గరిమెళ్ల లింగయ్య శాస్త్రిగారి యొద్ద విద్యాభ్యాసం కోసం చేర్పించినది. కిరాతార్జునీయము, భారత చంపువును, కొన్ని భాణములను ఆయన దగ్గర పఠించారు. పిప్పర గ్రామ నివాసి అయిన పమ్మిపేరిశాస్త్రుల వారియొద్ద మురారి అనర్ఘ రాఘవములో నాలుగంకములు ఇంకొక తర్కపండితుని దగ్గర కొంత తర్క శాస్త్రము అభ్యసించారు. ఆ తరువాత చర్ల బ్రహ్మయ్యశాస్త్రులుగారి దగ్గర వ్యాకరణం చదువుకొనుచున్న సమయంలో చెళ్లపిళ్ల వేంకటశాస్త్రులవారు కూడా అక్కడికి వ్యాకరణం చదువుకోవడానికి వచ్చారు.

వేంకటశాస్త్రి ఆరామద్రావిడ బ్రాహ్మణశాఖకు చెందినవారు. వీరిది భారద్వాజ గోత్రము, చంద్రమ, కామయ వీరి తల్లిదండ్రులు. 10-8-1870 ప్రమోదూత నామ సంవత్సరం. శ్రావణ శుద్ధ ద్వాదశీ సోమవారం మిధున లగ్నంలో జన్మించారు. వీరు తూర్పు గోదావరి జిల్లా కడియం గ్రామంలో జన్మించారు. ఈయన బాల్యంలో పాఠశాలలో ఆంగ్లం, మృదంగం, కుస్తీపట్టుట, తిట్టుకవిత మొదలైనవానిని కూడా నేర్చుకున్నారు. శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారియొద్ద మరికొందరి యొద్ద కూడా విద్యాభ్యాసం చేసి కవితల్లడము కూడా చేయుచుండిరి. వ్యాకరణం నేర్చుకొనుటకు కాశీకి వెళ్లతలపెట్టిరి. కాని ధనము లేక ఆ ప్రయత్నం విరమించుకున్నారు. చర్ల బ్రహ్మయ్యశాస్త్రిగారి యొద్దకు వచ్చి చేరినారు. వీరిద్దరికి జత కుదిరింది. వేంకటశాస్త్రిగారి నుండి కవిత రాయడం తిరుపతి శాస్త్రిగారు గ్రహించారు. జంటకవులుగా మారినారు. వీరిద్దరు కలిసి రచించినది 'ధాతురత్నాకరము' అను సంస్కృత చంపువు తరువాత శృంగార శృంగాటకము అను వీధి రూపకమును రచించారు. దురిసేటి శేషగిరిరావు కాకినాడలో వీరిచే అష్టావధానం చేయించారు. అప్పటినుండి అవదానాలు చేయనారంభించారు. బాదం వేంకటరత్నంగారు వీరిచే మొదటి శతావధానం చేయించారు. ఇది కాకినాడలోనే జరిగినది. బందరులో కొన్ని నాటకాలు రచించినటకులకిచ్చారు. మొట్టమొదట వారు వేంకటగిరి రాజును సందర్శించారు. అప్పటినుండి రాజాస్థానాల సందర్శన ప్రారంభమైనది. 1894లో తిరుపతి శాస్త్రిగారికి వివాహమైంది. ఆ వివాహ సమయంలో వేంకటశాస్త్రిగారికి నీలాచలమను భోగము స్త్రీకి కలిగిన పరిచయం శ్రవణానంద ప్రబంధమునకు వస్తువైనది. తరువాత వారు రాజ సందర్శనాలు సత్కారాలు పొందనారంభించారు.

1895లో మొదటిసారి గద్వాల రాజును దర్శించారు. తరువాత విజయనగర మహారాజును సందర్శించారు. మూడుసార్లు గద్వాల రాజును సందర్శించారు. నరసాపురము, మొగల్తూరు, పాలకొల్లు, కొణతివాడ, కాకినాడ, పిఠాపురము, ఆత్మకూరు మొదలైన సంస్థానములను దర్శించారు. సన్మానాలను సత్కారాలను పొందారు. శ్రవణానందమును వాడరేవు వేంకటరత్నంగారి కంకితమిచ్చారు. కేలామహాత్మ్యమును సర్వారాయుని కంకితం చేశారు. కాకినాడలో కృష్ణారావుగారికి బుద్ధ చరిత్రనంకితం చేశారు. 1901నుండి తిరుపతిశాస్త్రిగారు పోలవరం జమీందారు దగ్గర ఆస్థానకవిగా ఉన్నారు. 1904నుండి శాస్త్రి బందరులో హిందూ హైస్కూలులో తెలుగు పండితులుగ పనిచేశారు. 13 సంవత్సరాలు పనిచేసి పదవీ విరమణము చేశారు. 1918లో పోలవరము జమీందారు మరణించారు. తరువాత తిరుపతి శాస్త్రిగారు రెండేళ్లు మాత్రం జీవించారు. ఈ రెండు సంవత్సరాలు చెలికాని లచ్చారావు ఇతనిని పోషించారు.

తిరుపతిశాస్త్రి మరణించిన తరువాత వేంకటశాస్త్రి సుమారు ముప్పై సంవత్సరాలు, రచనా వ్యాసంగం మానలేదు. రాజ సందర్శనాలు ఆపలేదు, 1949లో సంయుక్త మదరాసు రాష్ట్రం మొదటి ఆంధ్ర భాషా ఆస్థానకవిగా వేంకటశాస్త్రిగారిని నియమించి గౌరవించెను. 1950 ఫిబ్రవరి 15వ తేదీ శివరాత్రి రోజు వేంకటశాస్త్రిగారు మరణించారు.

ఈ జంట కవులు సంస్కృతాంధ్ర భాషలలో చేసిన రచనలు శతాధికములు. తిరుపతిశాస్త్రి మరణించిన తరువాత వేంకటశాస్త్రి చేసిన రచనలు కూడా ఇద్దరి పేరు మీదనే ప్రకటింపబడినవి.

తిరుపతి వేంకటకవుల కావ్యాల గురించి నాటకాల గురించి ప్రహసనాల గురించి, విమర్శ రచనల గురించి అవధానిగారు ఈ గ్రంథంలో విపులంగా చర్చించారు. వారి రచనా విధానాన్ని శైలిని సోదాహరణంగా చర్చించారు. నాటకాలను గురించి విపులంగా వివరించారు. అవధానాలు రాజసందర్శనాలను రసవత్తరంగా వర్ణించారు.

''తిరుపతి వేంకటకవుల శైలి విశిష్టమైనది. వారు మహాపండితులయ్యు అనవసర సమాసాడంబరమును బ్రదర్శింపరు. అసహజములైన యలంకారములకై యత్నింపరు. మారుమూల పదములనన్వేషింపరు. వ్యర్థ పదములకు చోటీయరు. వారి రచన సరస సరళపద ప్రయోగ ప్రచురమై, భావగంభీరమై, నిర్దుష్టమై, సర్వజన సుబోధముగా నుండును. పండిత పామర మనోరంజన రామణీయకముతో కూడిన ఈ శైలీ విశేషమే వారి కవిత్వము నప్రతిమాన ప్రచారము కలిగించినది. ఒక విమర్శకుడన్నట్లు వారి రచనలు ప్రాచీన కవిత్వమునకు భరత వాక్యమును ఆధునిక కవిత్వమునకు నాందిని పలికించినవి.'' [24]

- అని అవధానిగారు తిరుపతి వేంకటకవుల సాహితీ వ్యాసంగాన్ని శైలిని సమీక్షించారు.

ఈ గ్రంథంలో అరసున్నలు వాడలేదు. భాషకూడా సరళంగా ఉన్నది. పైన చెప్పిన తిరుపతి వేంకటకవుల శైలిలోని గుణాలు అవధానిగారి శైలిలో కూడా మనకు దర్శనమిస్తాయి.

''తిరుపతి కవి జీవిత సంగ్రహము'' అనే గ్రంథాన్ని మరో దివాకర్ల వేంకటావధాని రచించారు. ఈ దివాకర్ల వేంకటావధాని ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు కారు. ఈయన దివాకర్ల తిరుపతిశాస్త్రిగారి కుమారులు. ఈయన కూడా వేంకటేశ్వర పంచశతి వంటి గ్రంథాలు రచించారు.

## 11. గురుశిష్యులు

శ్రీరామకృష్ణ పరమహంస స్వామి వివేకానందులను గురించి విద్యార్థుల కోసం రచించిన గ్రంథమే 'గురుశిష్యులు'. ఇందులో వీరిద్దరి జీవిత విశేషాలను, ఆధ్యాత్మిక తత్త్వ విషయాలను సంగ్రహంగా ఒక క్రమపద్ధతిలో అవధానిగారు వివరించారు. ఈ గ్రంథరచనకు శ్రీ విశ్వనాథ వేంకటేశ్వర్లుగారు 'దక్షిణేశ్వరము' అను గ్రంథాన్ని మరియు చిరంతరానంద స్వాములవారు, బులుసు వేంకటేశ్వర్లుగారలు రచించిన వివేకానంద జీవిత చరిత్రలను ప్రధానాధారాలుగా స్వీకరించి రచించినారు. ఇందులోని విషయాన్ని కూడా ఈ గ్రంథం నుండే గ్రహించారు. ఇంకా శ్రీ రామకృష్ణ పరమహంస, వివేకానందులకు సంబంధించిన ఆంగ్ల గ్రంథాలను కూడా పరిశీలించారు. 1950లో అవధానిగారు ఈ గ్రంథాన్ని రచించారు. ఇది 1971లో రెండవ ముద్రణ పొందింది. ఈ గ్రంథ రచనోద్దేశాన్ని అవధానిగారు తన మాటల్లో ఈ విధంగా తెలియజేశారు.

''పాశ్చాత్య నాగరికతా వ్యామోహమునంబడి యంధప్రాయులైన భారతీయుల యజ్ఞానముచే నడుగారిపోనున్న భారత జాతీయతను సనాతన ధర్మమును బునరిద్ధరించి భారతమాత కూఁటట కలిగించిన దివ్యజీవులు శ్రీరామకృష్ణ వివేకానందులు. ప్రగాఢమైన చీకటిలో వెలుగును. సాంద్రమైన యరణ్యములో జక్కని మార్గమును జూపి భారతీయుల నుద్ధరించిన మహనీయులువారు. వారి యాదర్శములు నిరుపమానములు. వారి జీవితములు సర్వానుకరణీయములు. వారి బోధలు శిరోధార్యములు. అట్టి మహనీయుల జీవితముల బఠించుట యాధునిక విద్యార్థుల కావశ్యకమనియు, నవి వారి జీవితముల సరిదిద్ది సర్వజన స్తుత్యముల నొనరించుననియు దలించి ఈ గ్రంథమును వ్రాసితిని''.[25]

''శ్రీరామకృష్ణ పరమహంస జీవిత విశేషాలను గురించి ఈ క్రింది క్రమంలో అవధానిగారు చెప్పారు. బాల్యము, దక్షణేశ్వరాగమనము, కాళీసేవారంభము, భైరవీ బ్రాహ్మణి దక్షణేశ్వరమునకు వెళ్లుట, సాధనా సమన్వయము, బ్రహ్మసమాజము, ఆత్మగుణ వైభవము, శిష్య సముదాయము, నరేంద్రుడు, అఘోరమణి, కంఠమునందలి వ్రణము, మహాసమాధి, రామకృష్ణుని బోధనలు అను విధంగా వివరించారు.

''శ్రీరామకృష్ణుని హృదయము విశాల గంభీరమైనది. సర్వమత సిద్ధాంత మాతని యాదర్శము. అందుచేతనే యాతని బోధనలు నిష్కపటములును, విశాలములును, నిరాడంబరములునై వినువారి హృదయమందెల్ల సంపూర్ణముగా హత్తుకొనుచుండెను. ఆయన బోధనా విధానమద్భుతావహమైనది. అతండెన్నడు నెదుటివారితో దర్శింపక యొక్క కీర్తన చేతనో మాట చేతనో కటాక్షము చేతనో యపూర్వ విషయములను గూడ విస్పష్టముగా బోధించుచుండెను. ఆత్మసాక్షాత్కారమే మానవుని పరమావధియనియు నాత్మానంద భరితమగు చిత్తమున వాదోపవాదములకు దావులేదనియు, జ్ఞానోదయ మైనంతనే యరుణోదయమున నందకారమువలె సంశయములన్నియు బటాపంచ లగుననియు, నాతండు సదా వాక్రుచ్చుచుండెను. భగవంతుని గూర్చి వాదము చేయుట కంటే నాతని దర్శనమునకై యత్నించుటే మత ధర్మోద్దేశ్యమనియాతని విశ్వాసము''[26] ఇందులోని భాష గ్రాంధికమైన్నా శైలి చాలా సరళమై అరటిపండొలచి చేతికందించిన విధంగా ఉన్నది. ఇది అవధానిగారి రచనలోని ప్రత్యేకత. శిష్యశేఖరుడనే శీర్షికతో వివేకానంద స్వామిని గురించి వివేకానందస్వామి బాల్యము విద్యాభ్యాసము బుద్ధి వైభవము శ్రీరామకృష్ణ సందర్శనము, గురుశిష్య భావము, నరేంద్రుని కష్టము దక్షణేశ్వరము, గురుశుశ్రూష, రామకృష్ణుని నిర్యాణము, స్వామి మరల అమెరికా కరుగుట, పశ్చిమ దేశ సంచారము, భారతదేశమున, మఠ ప్రతి ప్రతిష్ఠాపన, స్వామి సోదర బృందము, అమెరికా పునః ప్రయాణము, సర్వమత వారిత్రక మహాసభ, వంగ దేశ పర్యటనము, మఠ నివాసము, చరమదశ మహాసమాధి అను వరస క్రమంగా అవధానిగారు వివేకానందులవారి జీవితాన్ని గురించి తెలియజేశారు.

అవధానిగారి రచనలో క్రమబద్ధత విషయ నిబద్ధత సర్వత్రా దర్శనమిస్తాయి. ఆయన వచన శైలిలో సలక్షణమైన ప్రసన్నతా గుణం కనిపిస్తుంది.

''వివేకానందుడు సాటిలేని వ్యక్తి. అతని యాదర్శములు నిరుపమానములు. ప్రతిభ యనన్యాదృశ్యము. ధైర్య సాహసములద్వితీయము. గురుభక్తి యకుంఠితమైనది. మధుర గంభీరములైన యుపన్యాస పరంపరలచే బ్రాపంచిక వాసనావియోజితములై యున్న పాశ్చాత్య జన సమూహముల కన్నులతెరచి సనాతన ధర్మతేజముచే మిరుమిట్లు గొలిపిన ధీరపుంగవుడాతడు''.[27]

సాటిలేని నిరుపమానములు, అనన్యాదృశ్యము, అద్వితీయము, అకుంఠితము, వంటి విశేషణాలు వివేకానందుని వ్యక్తిత్వము, ఆదర్శ ప్రతిభలు, ధైర్యసాహసములు, గురుభక్తి వంటి గుణాలకు వాడుట యెంతో అర్థవంతంగా ఉండుటయేగాక ఒకదానికంటే ఒకటి యెక్కువ అనే అర్థం గూడ స్ఫురిస్తుంది. విశేషణాలు వాడుటలో ఒక క్రమత కన్పిస్తుంది. గురుశిష్యులనే ఈ రచనలో శ్రీ రామకృష్ణ పరమహంస వివేకానందుల జీవిత వ్యక్తిత్వాలను రేఖామాత్రంగా స్పష్టంగా అవధానిగారు చూపించారు.

## 12. వేమనయోగి

ఆచార్య ఈశ్వరటోపాగారి Saint Vemana and his Philosophy అను ఆంగ్ల గ్రంథానికి అనువాదం. దీనిని అవధానిగారు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో రీడరుగ పనిచేయుచున్న కాలంలో రచించారు. 1958లో ఓరియంటల్ పబ్లిషింగ్ కంపెనీవారు దీనిని ముద్రించారు. అప్పుడు ఆచార్యటోపాగారు ఉస్మానియా విశ్వవిద్యాలయానికి రిజిస్ట్రారుగా పనిచేసేవారు. తెలుగువారు కానివారి నెందరినో ఆకర్షించిన వేమన టోపాగారిని కూడా ఆకట్టు కొనినట్లున్నారు. అందుకే ఆయన ఆంగ్లంలో వేమన యోగి తత్త్వాన్ని ప్రకటించారు. దానిని అవధానిగారనువదించారు.

దీనికి ముందుమాట పద్యాల్లో చెప్పుట విశేషం -

సీ॥ విశ్రుతోస్మానియా విశ్వవిద్యాలయ, కార్యనిర్వహణ దక్షత వహించి
సాంఘిక శాస్త్ర విజ్ఞాన తత్త్వములందు, నద్వితీయుండన్న యశము
నిఖిల దేశముల పండితవర్యులౌనని తల యూపనగ్రంథములు రచించిగాంచి
పరిశోధనా ధురంధరత నప్రతిముడై ఛాత్రవర్గములకుత్సాహమొసగి
ఆంగ్లమున, నుర్దునన్, హిందియందు మేటి
పండితుండయి మించు 'టోపా' మనీషి
యాంగ్ల భాష రచించిన యట్టి గ్రంథ
తిలకమునకిది సరియైన తెలుగు సేత'' [28]

ఈ తొలి పలుకుల్లో టోపాగారు ఇంగ్లీషులో రచించిన గ్రంథానికి ఇది సరియైన తెలుగు సేత అని చెప్పిన దానిని బట్టి పరిశీలిస్తే ఇది మూల విధేయానువాదమనే అభిప్రాయం వ్యక్తమౌతుంది. సరియైన అనుమాటకు సమానమైన అని నైఘంటుకార్థం. కనుక ఇది Saint Vemana and his Philosophyకి సమానమైన అనువాదం

ఇందులో విషయ విభజన ఈ విధంగా ఉంది.

1. ప్రథమాధ్యాయము - మానవీకరణ మార్గం
2. ద్వితీయాధ్యాయము - మానవత్వపు విలువలు
3. తృతీయాధ్యాయము - మానవ ధనికతాదారిద్ర్యములు
4. చతుర్థాధ్యాయము - జీవిత భ్రాంతి
5. పంచమాధ్యాయము - జీవితోపగమనము
6. షష్ఠోధ్యాయము - అసత్య జీవిత మార్గము

7. సప్తమాధ్యాయము - జీవితబంధములు
8. అష్టమాధ్యాయము - జీవిత పరిభ్రమణము
9. నవమాధ్యాయము - జీవిత కళంకము
10. దశమాధ్యాయము - జీవిత భావములు
11. ఏకాదశాధ్యాయము - మతము మతాచార్యులు
12. ద్వాదశాధ్యాయము - భగవదారాధనము - మానవారాధనము

ఈ విభాగాల్లో వేమన తత్త్వం ప్రవచింపబడింది. వేమన జీవితం గురించి ఈ గ్రంథంలో ప్రాముఖ్యమివ్వలేదు. వేమన వెనుకబడిన ప్రజల మనిషి. ఆయన తత్త్వం తిరగబడుమని బోధించుట కాదు. కన్నుతెరువుమని వెలుగు చూడమని ప్రబోధించుట, మూఢాచారాల మురికి బట్టలను వదలివేయుమని, వాస్తవాల నగ్న సత్యాలను గుర్తించి వర్తించమని అతని తత్త్వ సారాంశం. ఆచార్య 'టోపా'గారు సాంఘిక శాస్త్ర ఆచార్యులు కాబట్టి సాంఘిక దురాచారాలమీద వేమన చేసిన దాడిని ఈ గ్రంథంలో విశ్లేషించారు. దానికి అవధానిగారు దీటైన అనువాదం చేసి వేమన తత్త్వ, ఔన్నత్యాన్ని లోకానికి చాటారు. అనువాదానికి అనువైన శైలిని నిర్మించుకున్నారు. శకటరేపాల సంఖ్య తగ్గించారు. విసంధులు చేయలేదు. పదాల ఎంపికలో ఎంతో జాగరూకత వహించారు. సరళము సుబోధము అయిన భాషలో అనువదించారు.

అవధానిగారి అనువాద శైలి కుదాహరణంగా -

''సామాన్య మానవుడు సంఘమునకు సంబంధించిన నియత సిద్ధాంతములను నిర్మిత శాసనములను ఆశ్రయించెను. పుట్టినదాది చచ్చువరకు నాతడు నిర్ణీత మార్గములనే యనుసరింపవలసి వచ్చెను. సాంఘిక నియమములు దృఢములును గఠినములునై యుండుటచే నతడు వాని హద్దులను దాట జాలకపోయెను. అట్టి సంఘములో సామాన్య మానవునికి జీవితమును సంస్కృతీకరించిన సమస్యయే యుప్పతిల్లదు. తన కిష్టము వచ్చినట్లు యధేచ్ఛముగా జీవించుట యతని కతీతమ్మై యుండెను. ఆకాలమునందలి జనుల హృదయములలో సాంఘిక సామనస్యముల బెంపొందించు నవకాశముల యభావమున కిదియే యొక కారణమ్మై యుండెను. సంఘమప్పుడు భిన్నములైన వివిధాంశముల క్రోడికయ్యె యుండెను. జాతియొక్క క్షేమమునకై సహకరించి పనిచేయు సానుభూతి కాని సద్భావముకాని మానవునియందు లేకుండెను. వర్గవర్ణములను స్వల్ప ప్రపంచముల సీమలతో నాతడు నివసింపవలసి వచ్చెను. అతడు తన వర్ణమునందో సాంఘిక వర్గమునందో మాత్రము సభ్యుడై యుండెను. కాని తన జాతియందు స్వతంత్రుడైన సభ్యుడు కాకుండెను. ఇట్టి సాంఘిక జడత్వమును అసంతృప్తియునే మానవుని హక్కుల రక్షణమునకై నిల్చి సాంఘిక

విభేదములను దొలగించుటకై తన యావశ్శక్తిని వినియోగింపదలచుచున్న వేమన వంటి ధీమంతుని చిత్తమున మానవునికి జరుగునన్యాయముపైని మానవులందుండు భేదములపైని దండెత్త వలయునను భావాలను గలిగించుటకు గారణమయ్యెను'' [29]

ఈ విధమైన శైలిలో ఈ గ్రంథం రచింపబడినది. వేమన సిద్ధాంతాలను తత్త్వాలను బోధించు పద్యాలిందులో సోదాహరణంగా వివరింపబడినవి. పలుకోణాలనుండి వేమనను దర్శించి ఆయన గుణాలు అందులో పొందుపరచుట జరిగింది.

## 13. పరశురామ పంతుల లింగమూర్తి (జీవితము - సాహిత్యము)

17-7-1976వ తేదీన ఆంధ్ర సారస్వత పరిషత్తువారు పరుశురామ పంతుల లింగమూర్తిగారి జయంతి సభ జరిపారు. ఆ సభలో దివాకర్ల వేంకటావధానిగారు లింగమూర్తికాల కవిత్వ విశేషాలను గూర్చి ఉపన్యసించారు. శ్రీ కేశవపంతుల నరసింహ శాస్త్రిగారు కావ్య విషయ, తత్త్వ విశేషాలను గూర్చి ప్రసంగించారు. ఈ రెండు ఉపన్యాసాలనే ''పరశురామ పంతుల లింగమూర్తి'' అనే గ్రంథంగా పరిషత్తువారు ప్రచురించారు.

ఇందులో అవధానిగారి రచన పుట 1 నుండి 33 వరకు. ఇందులో కవికాల నివాస కవిత్వ విశేషాదులను తెలియజేశారు.

లింగమూర్తి పదునెనిమిదవ శతాబ్ది పూర్వార్ధమున నివసించెనని వారి వంశములోని అమృతాబాయమ్మ తెలిపిన విషయాలను బట్టి రామమూర్తి (లింగమూర్తిగారి కుమారుడు) కవి రచించిన గ్రంథాలను బట్టి లింగమూర్తి పూర్వులను గురించి అవధానిగారు తెలియజేశారు.

లింగమూర్తిగారి పూర్వీకులు మహారాష్ట్రులు, ఔరంగజేబు కాలంలో అతని సైనికులు పెట్టే బాధలను భరించలేక వలస వచ్చినారు. సెనగవరమనే ఊరిలో నివసింపసాగినారు. ఇది వరంగల్లు సమీపంలో ఉన్నది. ఈ విధంగా వలస వచ్చిన కుటుంబాలు మూడు. 1. దండాపంతుల కుటుంబం 2. శ్యామాపంతుల కుటుంబం 3. పరశురామ పంతుల కుటుంబం. వీరి ఇంటిపేరు 'పరశురామపంతులు' అనునది. ఈ పరశురామ పంతులు వలన వచ్చినది. పరశురామ పంతుల లింగమూర్తి నివసించిన గృహము అతడు వాడిన వస్తువులు ఇప్పుడు ఓరుగల్లులోని మట్టెవాడలో ఉన్నవట.

లింగమూర్తిగారి తండ్రిపేరు రామమంత్రి, తల్లి తిమ్మాంబిక. లింగమూర్తి కుమారుడు రామమూర్తి పౌత్రుడు లింగమూర్తి. ప్రపౌత్రుడు రామకృష్ణ సోమయాజి. ఇతనికిద్దరు కుమారులు 1. అనంతరామయ్య 2. దశరాధరామయ్య. వీరిలో అనంతరామయ్యకు

పట్టాభిరామయ్య అను కుమారుడు జన్మించెను. ఈ పట్టాభిరామయ్యకు రాధకృష్ణయ్య అను కుమారుడు అమృతాబాయమ్మ అను కుమార్తె జన్మించారు. ఈ అమృతాబాయమ్మ ఇప్పుడు వరంగల్లులో మట్టివాడలో లింగమూర్తి నివసించిన గృహంలో నివసిస్తున్నది. లింగమూర్తికి శ్రీరామానుగ్రహమున లభించిన షట్పత్ర సీతారామసాలగ్రామము, శ్రీరామమాడ, శ్రీరామ పంచాయతనము, మరకత శివలింగము, స్ఫటిక గణపతి అనువానికి నిత్యము పూజానైవేద్యములు ఈమె జరిపించుచున్నది. లింగమూర్తి ఉపయోగించిన 'మేనా' సవారి కూడా జీర్ణస్థితిలో ఇప్పుడా గృహంలో ఉన్నదట. లింగమూర్తి గురువు మహీదేవ గురుడు. ఇతనికే తాను రచించిన 'సీతారామాంజనేయ సంవాదము'ను అంకితమిచ్చెను. లింగమూర్తి వరంగల్లు సమీపమునగల అంబాలగుట్టపై శ్రీరామమంత్రోపాసన చేసి సిద్ధిపొందెను. లింగమూర్తి సజీవ సమాధి పొందినాడట. ఇతని సమాధి వారి ఇంటి సమీపంలోనే ఉన్నది. లింగమూర్తికి అతని శిష్యులొసగిన సార్థక బిరుదము 'గురుమూర్తి'. ఇతడు రచించిన గ్రంథాలు 1. రతి మన్మధ విలాసము - ఇది ఆంజనేయస్వామికి అంకితం చేయబడినది. 2. సీతారామాంజనేయ సంవాదము - ఇది ఆధ్యాత్మిక గ్రంథము. తెలుగు సాహిత్యంలో దీనికొక ప్రత్యేక స్థానమున్నది. ఇది ప్రబంధ లక్షణాలు కలిగి ఉన్నది. 3. జీవన్ముక్తి ప్రకరణము - ఇది యక్షగానము. 4. నారద పరమేష్టి సంవాదము 5. మానవశతకము 6. సీతపాట అను పేరుగల గేయ కావ్యము రచించాడు. ఇతనికి కీర్తి ప్రతిష్టలు తెచ్చిన గ్రంథం సీతారామాంజనేయ సంవాదము. ఈ గ్రంథంలో క్లిష్టములైన ఆధ్యాత్మిక విషయాలను కూడ లలితంగా సరసంగా వివరించారు. స్పష్టమైన భాష, రమ్యమైన అలంకారాలలో అనుభవపూర్వకంగా క్లిష్ట విషయాలను కూడా పఠితలకు సుగమము, అనందప్రదము అగునట్లు రచించారు. పద్యరచనలో ఇతనిపై పోతన ప్రభావం అధికంగా కనిపిస్తుంది. పోతనవలె ఇతడు కూడా శబ్దాలంకారాలను వాడినాడు. రూపక, ఉత్ప్రేక్షాది అలంకారాలను కూడా అధికంగానే వాడినాడని అవధానిగారు తెలియజేశారు.

లింగమూర్తి కందసీసపద్యాలనే కాకుండా, సుగంధి, వనమయూరము, మానిని, కవిరాజ విరాజితము, సుందరి మొదలైన ముప్పై విశేష వృత్తాలను కూడ వాడినాడు.

''లింగమూర్తి రచనయంతయు నతడు ప్రతిపాదించిన విషయము వలనే హృద్యము. నిరవద్యము గంభీరమునై యలరారుచు పఠితలకు తత్త్వ విషయమును గూడ కరతలామలకమొనరించును. ఇతని పద్యములు ధారశుద్ధి కలిగి కుంఠితగమనము లేక యాశ్రమోపాంతమందలి గిరినిర్ఝరవలె ప్రవహించుచున్నది. ఇతని రచన యంతయు వ్యాకరణానుసారియు, లాక్షణికమునై తత్త్వవేత్తలకే కాక పండితులకు గూడ ప్రమోదమునిచ్చుచున్నది'' [30]

- అని అవధానిగారు లింగమూర్తి రచనా విధానాన్ని నిర్వచించారు. లింగమూర్తి గారి రసపోషణము, పాత్ర పోషణను, శైలి సంవిధానాన్ని భాషాప్రయోగవైచిత్రిని తెలియజేశారు. సీతారామాంజనేయ సంవాదము అందరికి కొరుకుడుపడే గ్రంథం కాదు. దీనిలోని ఔచిత్యాన్ని అవధానిగారు తన సరస సరళ పద్ధతిలో వివరించారు. సుమారు 48 పద్యాలనుదహరించారు. పోతనకు లింగమూర్తికి, పోతన పద్యాలకు లింగమూర్తి పద్యాలకు గల సాదృశాలను సోదాహరణంగా ధ్రువీకరించారు.

## 14. పోతన

భారతీయ సాహిత్య నిర్మాతలు (Makers of Indian Literature) అనే శీర్షిక క్రింద కేంద్ర సాహిత్య అకాడమీ న్యూఢిల్లీవారు ప్రచురించిన గ్రంథ పరంపరలో ఇది ఒకటి. దివాకర్ల వేంకటావధానిగారు కేంద్ర సాహిత్య అకాడమీవారి కోరిక మేరకు 1972లో పోతనను గురించి ఆంగ్లంలో రచించారు. దానినే 1980లో తెలుగులోకిని అనువదించారు. ప్రాచీన ఆధునిక భారతీయ సాహిత్య నిర్మాతలను గురించి తెలుసుకోవడం ద్వారా భారతీయ సాహిత్య చరిత్రలోని ప్రధాన ఘట్టాలను సామాన్య పాఠకుడు సైతం గ్రహింపవచ్చుననే ధ్యేయంతో కేంద్ర సాహిత్య అకాడమీ ఈ కార్యక్రమం చేపట్టింది. ఏ భారతీయ భాషలోనైనా దాని అభివృద్ధి వికాసములకు తోడ్పడిన సుప్రసిద్ధ రచయిత జీవితకథనూ అతని సాహిత్య సేవనూ ఈ శీర్షిక క్రింద వెలువడే గ్రంథాలను బట్టి తెలుసుకోవచ్చు. అన్ని భారతీయ భాషలు అందరికీ తెలియవు. కనుక భారతీయ సాహిత్య నిర్మాతలను గురించి ఆంగ్లంలో ప్రచురిస్తారు. తరువాత ఆయా ప్రాంతీయ భాషలలోకి అనువదిస్తారు. ''పోతన'' అనే ఆంగ్ల గ్రంథము 'పోతన' అను తెలుగు గ్రంథము కూడా అదేవిధంగా ప్రచురింపబడినవి. సామాన్యులకు కూడా అర్థమగుటయే అకాడమీ ఉద్దేశం కనుక ఆంగ్లంలోనూ, తెలుగులోనూ సరళమైన భాషలో రచించాలనే నియమము రచయితలకు తెలియజేస్తారు. రచయిత లాసూచన మేరకే ఇటువంటి గ్రంథరచన చేస్తారు. దివాకర్ల వేంకటావధానిగారు కూడా ఆ సూచన మేరకే ''పోతన'' అను రచనను ఆంగ్లంలోను, తెలుగులోను సరళమైన భాషలో రచించారు. సంస్కృతాంగ్ల ఆంధ్ర భాషలలో పండితుడైన అవధానిగారు ఈ రచనకెంతో న్యాయం చేశారు. ఇందులో పోతన జీవిత దేశకాలాదులను, పోతన కృతులను, శ్రీమద్భాగత ప్రాశస్తిని, అనువాద విధానాన్ని, భాగవతమునందలి కథలు - ఉపాఖ్యానములను, భాగవతంలోని భక్తిని, అనువాదవిధానాన్ని పోతన కవిత్వ తత్త్వమును, వ్యక్తిత్వమును సోదాహరణంగా వివరించారు.

క్రీ.శ. 15వ శతాబ్దికి చెందిన సుప్రసిద్ధ భక్త కవి పోతన. వరంగల్ జిల్లాలోని బమ్మెర అను

గ్రామంలో వీరశైవ కుటుంబంలో జన్మించాడు. సంస్కృతాంధ్ర భాషలను తండ్రి దగ్గరే చదువుకొన్నాడు. సోమశేఖరుడీతనికి మత గురువు. అతని ప్రభావం వలన పోతన వైష్ణవ మతాభిమాని అయినాడు. గణితశాస్త్రం కూడ పోతన నేర్చుకొన్నాడు. భాగవతము, భోగిని దండకము, వీరభద్ర విజయము, నారాయణ శతకము అను గ్రంథములను రచించాడు. పోతన భాగవతము ధారాశుద్ధికిని, సహజములైన వర్ణనలకును, రసపాత్ర పోషణ కౌశలమునకును, భావనాశక్తికిని పేరుపొందినది. పోతన అనువాద విషయంలో కొంత స్వాతంత్ర్యం వహించి భక్తిరసమయ ఘట్టములను పెంచి రచించెను. భాగవతమును నరాంకితం చేయక నారాయణునికే అంకితం చేసెను. దారిద్ర్యమును లక్ష్యపెట్టక తాత్త్వికుడై ఆత్మగౌరవంతో జీవితాన్ని గడిపాడు. ఇతడెంత మహాపండితుడో అంత వినయశీలి.

## అవధానిగారు రూపొందించిన పోతన

పోతనను గురించి ఎందరో ఎన్నో రచనలు చేశారు. వానమామలై వరదాచార్యులు పోతనను గురించి విశేష కృషి చేశారు. అతనికి అభినవ పోతన అను బిరుదుకూడా ఉన్నది. అవధానిగారు పోతన జీవిత వ్యక్తిత్వ కవిత్వాదులను రేఖామాత్రంగా చూపించారు.

**పోతన జన్మస్థలము :** దీనిని గురించి రెండు వాదాలున్నాయి. 1. పోతన పేర్కొన్న ఏకశిలా నగరము ఓరుగల్లు అని ఓరుగల్లుకు సమీపంలో ఉన్న బమ్మెర అను గ్రామం అతని నివాసమై యుండునని గ్రామ నామమే పోతనకు ఇంటిపేరుగా మారి ఉండునని ఈ వాదం యొక్క సారాంశం. మరియు భాగవతంలో ప్రక్షిప్తాలను పూరించిన వెలుగందలనారయ, గంగన తెలంగాణాకు చెందినవారు కాబట్టి పోతన పేర్కొన్న ఏకశిలానగరం ఓరుగల్లేనని పోతన నివసించినది ఓరుగల్లె అని కూడా వీరభిప్రాయపడుచున్నారు. ఒరు- అనగా ద్రావిడ భాషలో ఒకటి అని అర్థం. కల్లు- అనగా రాయి అను అర్థమున్నది. కనుక ఓరుగల్లు అనగా ఒక రాయి అని అర్థము. ''ఏకశిల'' అనిన కూడా అదే అర్థము. కనుక ఈ వాదం సమంజసంగానే ఉన్నది. 2. రెండవ వాదం - ఈ వాదాన్ని ప్రతిపాదించినవారు కీ.శే. పురాణం హయగ్రీవాచార్యులు. దానిని విపులీకరించి సమర్థించినవారు కీ.శే. వావిలికొలను సుబ్బారావుగారు. వీరి వాదసారాంశమేమనగా, పోతన కడప మండలం సమీపంలోగల ఒంటిమిట్ట నివాసి అని, అక్కడ వెలసిన కోదండరామునికీ భాగవతం అంకితం చేశాడని, కానీ పలువురు విమర్శకులీ వాదమును ఒప్పుకొనలేదు. పోతన ఓరుగల్లు వాడేనని స్థిరపరచారు.

**పోతన బాల్యము :** పోతన జన్మించినది వీరశైవ కుటుంబం. అక్షరాభ్యాసం చేయించిన వాడు తండ్రి కేసన. తండ్రి దగ్గరనే కొంత విద్య నభ్యసించిన తరువాత సంస్కృతాంధ్ర

కావ్యములను స్వయంగా చదివి కొంత పాండిత్యాన్ని గడించి ఉండవచ్చు. బాల్యమంత బమ్మెరలోనే గడిచి ఉండును. తరువాత బమ్మెరకు సమీపమునగల ఓరుగల్లు రాచకొండ మొదలైన నగరాలకు వెళ్లి అక్కడ కవి పండితులతో కలసి వచ్చుచుండెను. ఈ విధంగా కూడా అతను విద్యాభ్యాసం చేసెనని అవధానిగారు అభిప్రాయబడిరి. పోతన తాను సహజ పాండిత్యం కలవాడనని చెప్పుకొన్నాడు. వీరభద్ర విజయములోని ''జనకశిక్షిత వినిలాక్ష రాఖ్యానుండనై వీరభద్ర ప్రసాద లబ్ధకవితాతి శయంబున'' అనియు భాగవత గద్యలో ''పరమేశ్వర కరుణాకలిత కవితా విచిత్ర.... సహజ పాండిత్య పోతనామాత్య ప్రణీతంబైన'' అనియు చెప్పుకొన్న మాటలు పై విషయాన్ని ధ్రువపరుస్తున్నాయి. పోతన సంస్కృతాంధ్ర కృతులనేకములను భక్తి శ్రద్ధలతో చదువుటచేత అతనికి సహజ పాండిత్యమబ్బినది. స్వయంకృషి చేత పోతనకు పాండిత్యమలవడి యుండుననుట సమంజసము. అతడు కవితాకృషీవలుడు గనుక అతని కృషి ఫలించి ఫలితం దక్కింది. పోతన వృత్తి వ్యవసాయం. ప్రవృత్తి కవితా ఫలసాయం.

## పోతన కృతులు - 1. వీరభద్ర విజయము

పోతన శైవమునుండి వైష్ణవానికి మారినా అతనికి శివుని మీద భక్తిగౌరవములు కలిగి వుండెను. కనుకనే వీరభద్ర విజయమును రచించెను. ఇది లేబ్రాయమున రచించెనని చెప్పవచ్చును. వీరభద్ర విజయములోని కొన్ని శబ్ద ప్రయోగాలు, వ్యాకరణ స్ఖాలిత్యాలు, యతిప్రాస విశేషాలు కవితయందలి అపరిపక్వత ఈ విషయాన్ని రుజువు చేస్తున్నాయి. ఇది నాల్గాశ్వాసముల గ్రంథము. కథా వస్తువు వాయు బ్రహ్మపురాణాలనుండి గ్రహించెనని చాగంటి శేషయ్యగారు నిరూపించారు.

## 2. భోగినీ దండకము

తెలుగు సాహిత్యంలో దండకము ఒకరకమైన లయబద్ధమైన గద్యరూప ఛందస్సు. పోతన కాలం వరకు వచ్చిన దండకాల సంఖ్య చాలా తక్కువ. నన్నయ ఒకటి ఎర్రన ఒకటి, శ్రీనాథుడు కొన్ని దండకాలు రచించారు. కాని పోతన వలె కథాకావ్యంగా దండకమును రచించినవారు ఇంతకుపూర్వం కనిపించరు. ఈ విషయంలో పోతనే ఆద్యుడు. ఆ తరువాత ఎన్నో దండకాలు వెలువడినవి. తెలుగులో ఉన్నన్ని దండకాలు మరే భాషలోనూ లేవని అవధానిగారు పేర్కొన్నారు.

ఇది శృంగార ప్రధానమైన రచన. మరి పోతన భక్తిశీలికదా మరి ఇటువంటి రచన చేసి ఉండునా అను సందేహము రావచ్చు. కాని పోతన భక్తి శృంగారములను సమ్మిళితం చేసి

రాసిన సందర్భాలు భాగవతంలో ఎన్నో ఉన్నాయి. పోతన భక్తుడే అయినా శృంగార రసవిముఖుడు కాడు.

భోగిని అను వేశ్య సింగభూపాలుని వలచి మురిపించుటే ఇందలి ఇతివృత్తం. దీని శైలి పద ప్రయోగం. అంత్యానుప్రాస ముక్తపద గ్రస్తాది శబ్దాలంకారాలు భాగవత రచనను పోలి ఉంటాయి.

## 3. నారాయణ శతకము

దసరా సమయాల్లో బాలురు పాడుకొనే ''ధరసింహాసనమైనభంబుగొడుగై'' మొదలైన పద్యాలు ఈ నారాయణ శతకంలోనివే. నారాయణా అను మకుటంతో రచింపబడినది. దీని కర్తృత్వ విషయంలో వాదాలున్నాయి. చాగంటి శేషయ్య దీనిని కరీంనగరుకు చెందిన కవియెవరో రచించెనని అభిప్రాయపడినారు. సరియైన ఆధారాలు దొరకునంతవరకు ఇది పోతన రచన అని చెప్పుటకు వీలులేదని అవధానిగారభిప్రాయపడినారు.

## 4. శ్రీమద్భాగవతము

భాగవతమనగా భగవంతునకు సంబంధించినదని అర్థం. భగవంతుడైన శ్రీమన్నారాయణుని అవతార లీలా విశేషాలు చెప్పబడుటచే దీనికి భాగవతమను పేరు కల్గినదన వచ్చునని అవధానిగారు పేర్కొన్నారు. భాగవతం సంస్కృతంలో వ్యాసుడు రచించెను. శ్రీమన్నారాయణుని ఏక వింశత్యవతారములు వర్ణింపబడినాయి. పోతన భాగవతము తెలుగులోకి రసవత్తరంగా అనువాదం చేశారు.

### పోతన అనువాదము :

అవధానిగారు ఆంధ్రవాఙ్మయములోని అనువాద విధానమును మూడు విధములుగ విభజించిరి.

1. కథానువాదము - ఇది స్వతంత్రమైనది కవిత్రయంవారు భారతానువాదంలో అనుసరించినది.

2. భావానువాదము - మూల శ్లోకములను అనువాదం చేయుట. అట్లు చేయునప్పుడు అచ్చటచ్చట మూల శ్లోకములను విడచుట, శ్లోకానువాదం ముగిసినచో ఇంక పదము శేషించియున్నచో దానిని కల్పిత రచనతో పూరించుట, శ్రీనాధుడీ పద్ధతి ననుసరించాడు. ఇతని అనువాద పద్ధతి అంతస్వతంత్రము కాదు, అంత మూలవిధేయము కాదు.

3. పదానువాదం - మూలములోని కథాభావాలనే కాక పదాలను కూడా విడకుండ

అనువాదం చేయుట మూలానికి విధేయంగా ఉండుట. ఆధునికులు కొందరీ యనువాద విధానాన్ని పాటించారు.

పోతన కథానువాద పద్ధతిని భావానువాద పద్ధతిని కూడా పాటించెనని అవధానిగారు అభిప్రాయపడినారు. పోతన పెంచిన భాగాలను ఎనిమిదింటిని చూపారు. పోతన శ్రీధర వ్యాఖ్యననుసరించి పెంచిన భాగాలను నాలుగింటిని, మూలమున సూచ్ఛమాత్రములుగ పదాలననుసరించి వ్యాఖ్యానించిన భాగాలను కొన్నింటిని అవధానిగారు చూపించారు.

ఉదాహరణకు అవధానిగారు చూపిన ఒక సందర్భం ''గజేంద్రుని మొరాలించియు బ్రహ్మేదులూరకుండిరి, కాని విష్ణువు భక్తుని రక్షింపదలచెనని తేల్చిన పిమ్మట మూలమున గజేంద్రుని స్తోత్రము వినిన వెంటనే విష్ణువు చందోమయుడైన గరుడు నధిష్ఠించి గజేంద్రుడున్న చోటికి వచ్చెను. చక్రము, చేతదాల్చి యట్లుగరుత్మంతునధిరోహించి వచ్చిన విష్ణువును జూచి గజేంద్రుడు తొండమెత్తి అఖిల గురూ! నారాయణా! నీకు నమస్కారమని పల్కెను. అంత హరి దేవతలు చూచుచుండగా చక్రమున నక్ర ముఖము ఖండించి దయతో సరస్సునుండి గజేంద్రుని పైకి పిలిచె'' నని తెల్పబడినది. పోతన ఇచ్చట భక్తి బంధురములును మనోజ్ఞములైన పది పంద్రెండు పద్యములను కల్పించి వ్రాసెను. ఈ భాగమెంత విస్తృతమో అంత సరసమై యలరారుచు పోతన భక్తితత్పరతను చక్కగా వ్యక్తము చేయుచున్నది'' [31]

పోతవ ఔచిత్య దృష్టితో గావించిన మార్పులను, మూలమును యథాతథంగా అనువదించిన భాగాలను, మూల భిన్న రచనలను, అవధానిగారు చూపించారు.

భాగవతమునందలి కథలు - ఉపాఖ్యానములు - అను శీర్షిక క్రింద వరాహావతార కథ నృసింహావతార వృత్తాంతము, వామనమూర్తి చరిత్ర, శ్రీ రామావతార వృత్తాంతము, శ్రీకృష్ణ లీలలు, దక్షాధ్యరధ్వంస వృత్తాంతము, ధ్రువుని చరిత్ర, పురందరోపాఖ్యానము, సుయజ్ఞో పాఖ్యానము, కుచేలోపాఖ్యానాదులను అవధానిగారు చూపించారు.

భాగవత భక్తి - అనే శీర్షిక క్రింద, మధుర భక్తికి గోపికల ప్రణయాన్ని, వాత్సల్యభక్తికి కౌసల్య దశరథుల, దేవకీ వసుదేవుల వృత్తాంతాలను, శరణాగతి తత్త్వానికి, ప్రహ్లాద, ధ్రువ, అంబరీష, గజేంద్ర, అక్రూరాదుల భక్తిని అవధానిగారు చూపించారు.

## పోతన కవిత్వము

అఖండమైన ధారాశుద్ధి కలిగియుండును. అతడు యతిప్రాసల కోసం ఎక్కడను వెదికినట్లు కనిపించదు. పోతన రసవర్ణనలలో రస పోషణలో ఆరితేరినవాడు. పోతన కవిత్రయము వారియొక్కయు పాలల్కురికి సోమనాధుని యొక్కయు భావములను కొంత

మార్పుతో అనుకరించిన పద్యములు భాగవతమునందచ్చటచ్చట కనిపించును. శబ్దాలంకార ప్రచురమైన కవిత్వ మధమ కవిత్వమని లాక్షణికులు నిర్దేశించినారు. కాని అలంకారాభిమానం ప్రదర్శిస్తూనే రసవంతంగా రచింపజాలిన కవి పోతన. అతని కవిత్వంలో అర్థాలంకారాలు శబ్దాలంకారాలు అధికంగా కనిపిస్తాయి. వర్ణన పద్యాలలో అంత్యానుప్రాసమో అనుప్రాసమో, యమకమో లేని పద్యాలుండవు. పోతన శైలి కథన వర్ణనాత్మకమైయుండును. పోతన అఖండయతిని వాడెను. రేఫరకారాలకు యతి ప్రాసల విషయంలో మైత్రి పాటించెనని కొందరు లాక్షణికులు పోతనను ప్రామాణిక కవిగా అంగీకరించలేదు. భాషా విషయంలో కూడా పోతన కొంత స్వాతంత్ర్యము ప్రదర్శించాడు. క్త్వార్థకారానికి సంధులు చేశాడు. ''వికచకమలనేత్రి'' లాంటి సమాసాలు, మిశ్ర సమాసాలు, ద్రుతదిత్వ సంధులు శాసలు, కంచల, పొడిచిందినంటి వ్యావహారిక పద ప్రయోగాలు ఈయన రచనలో విరివిగా కనిపిస్తాయని అవధానిగారు సోదాహరణంగా పేర్కొన్నారు. వ్యాసవిస్తర భీతిచేత నేనాఉదాహరణలన్నీ చూపలేదు.

## పోతన వ్యక్తిత్వము

ఉన్నదానితో తృప్తిపడి భగవంతునుపాసించుటయే పోతనలో కనిపించును. భోగభాగ్యాలపై మాత్రమే అతనికి విరక్తి కానీ విరక్తితో సంసారాన్ని విడిచిపెట్టిన వాడు కాదు.

బాలరసాలసాల నవపల్లవకోమలకావ్య కన్యకను కూళలకిచ్చి పడుపుకూడు భుజించుటకు పోతన సిద్ధపడలేదు. నిజదారాసుతోదరపోషణార్థమై హాలికుడైనాడు. ఈ భావంగల పద్యం మంచన కేయురబాహు చరిత్ర నుండి పోతన గ్రహించినా పోతన వ్యక్తిత్వానికి అతికినట్లు సరిపోవుచున్నది. మనుజేశ్వరాధములకు కావ్యమంకితమిచ్చి వారిచ్చే సొమ్ములు పుచ్చుకుని సొక్కి శరీరము వాయకాలునిచే సమ్మెట దెబ్బలు తినుటకు పోతన ఇష్టపడలేదు. శ్రీహరికి తన కావ్యాన్ని అంకితం ఇచ్చి ఇహం కంటె పరానికే ప్రాముఖ్యమిచ్చాడు. హాటక గర్భురాణివాణి కాటుకకంటి నీరు చనుకట్లపైబడునట్లు ఏడ్వగా ఆమె కన్నీళ్లు తుడిచి నిన్ను కర్ణాట కిరాట కీచకుల కమ్మను సుమా! త్రిశుద్ధిగనమ్ముము అని ఓదార్చిన కవి ఆంధ్ర సాహిత్యంలో ఒక పోతనే కనిపిస్తాడు. అతని భగవద్భక్తి ఆత్మనిగ్రహశక్తి అనన్యసామాన్యమైనది. పోతనకు శివకేశవ భేదం లేదు. చేతులారంగ శివుని పూజించమంటాడు నోరునొవ్వంగ హరిని కీర్తించమంటాడు. భారతాదులు కర్మమార్గాన్ని ఉపనిషదాదులు జ్ఞానమార్గాన్ని బోధించును భాగవతము భక్తి మార్గాన్ని బోధించును. పోతన తత్త్వమునకు వ్యక్తిత్వమునకు భాగవత తత్త్వందర్పణంవలె దర్శనమిచ్చుననుఅంశాలను అవధానిగారు పేర్కొన్నారు. పోతన భాగవత పురాణ ఫల రసాస్వాదన పదివిగనిన రసికభావ విదుడని చెప్పవచ్చు.

అవధానిగారు 'పోతన' రచనకు ఆంధ్ర సారస్వత పరిషత్తువారు ప్రచురించిన 'ఆంధ్ర మహాభాగవతోపన్యాసము' లను 1962లో నిడదవోలు వెంకట్రావుగారు రచించిన పోతన అను గ్రంథాన్ని ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు 1964లో అచ్చువేసిన భాగవత 'సంశోధిత ముద్రణను, 1965లో ఆరుద్రగారి సమగ్రాంధ్ర సాహిత్యము 5వ సంపుటాన్ని చాగంటి శేషయ్యగారి ఆంధ్ర కవితరంగిణి 6వ సంపుటాన్ని, తెలుగు విజ్ఞాన సర్వస్వము మూడవ సంపుటాన్ని, కందుకూరి వీరేశలింగం పంతులుగారి ఆంధ్ర కవుల చరిత్ర ప్రథమ సంపుటాన్ని, వావిళ్ల రామస్వామి శాస్త్రులవారి శ్రీ మద్భాగవతము (సంస్కృతము)ను ఖండవల్లి సూర్యనారాయణశాస్త్రిగారి భక్తపోతన, భాగవత రచన అను గ్రంథాలను ఆధారంగా చేసుకొని ఆంగ్లంలో 1972లో రచించారు. దానినే తెలుగులోనికి 1980లో అనువదించారు. ఇది యథాతథానువాదము. 1964లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు ప్రచురించిన భాగవత సంశోధిత ముద్రణ సంపాదకవర్గం ఐదుగురిలో అవధానిగారు ఒకరు. కావున అవధానిగారు సాధికారికంగా పోతనను గురించి ఆంగ్లంలో ఆంధ్రంలో కూడా రచించారు. ఇందులో భాష సరళతరం, చెప్పిన అంశాలు పరిశోధనాత్మకం. చేర్చిన అంశాలు విమర్శనాత్మకంగా ఉన్నాయి. అనువాద విధానానికి ఒక ఉదాహరణ.

When the idea of the Sanskrit sloka is not sufficient to cover the whole Telugu Verse. Phothana fills up the remaining portion independently and in doing so, displays his imagination and sense of propriety. In the portion called the Gopika Getas, the Gopikas state while enumeration the half rendered by Krishna to them. We were protected by you on several occasions from the ocean of poisonous water. From demons from storm, from electric fire and from many other calamities. Pothana translated the above in the following verse meaning Having protected us from poisonous water, from the demon, from the storm of hail-stones, from fire and from many other dangeres, is it proper form you to throuw us at the mercy of cuped in the end? As a matter of fact the idea of the Original sloka was completely expressed in the first three feet of telugu verse, and therefore Pothana added his own idea to fill up the fourth times means, Do you make us die eventually at the hands of cuped, bearing flowery arrous having protected us from several fierce calamities this is not only beautiful but also meaningful and adds grace to the original. In the same way, we come accross certain verses in the Telugu Bhagavatha, where the last lines or the lather halvees are

filled up by Phothana with his own ideas, without spoiling the sense of the original. [32]

అవధానిగారు ఆంగ్లంలోనూ తెలుగులోను తానే రాయటం వలన పోతన చెప్పిన మూలతత్త్వాన్ని రెండు భాషలలోను పొల్లుపోకుండా సమర్థవంతంగా చెప్పిన విధానం ఇది.

ఈ విధంగా రాయాలంటే ఉభయ భాషలలో అపారమైన పాండిత్యం ఉండాలి. కేవలం విషయాన్ని అనువదించడం ఎవరైనా చేయవచ్చు. కాని కవితా తత్త్వాన్ని పాఠకునికి యథాతథంగా అందించడానికి ఎంతో రచనా కౌశలం అవసరం. అవధానిగారి ఆంగ్ల రచనలోను చేసిన తెలుగు అనువాదంలోనూ ఈ రచనా కౌశలం గోచరిస్తుంది. మూల భాషలో లక్ష్యభాషలో ఒకే రచయిత రాసిన రచనలు చాలా అరుదు. పోతనను గురించి అతని కవితా తత్త్వాన్ని గురించి ఆంగ్ల ఆంధ్ర భాషలలో రచించిన ఈ విధానం ఎంతో వైశిష్ట్యాన్ని సంతరించుకున్నది. ఈ ఆంగ్ల రచనకు తెలుగు అనువాదం ఇలా ఉంది -

పోతన మూల శ్లోకమునందలి భావము తెలుగు పద్యమునకు సరిపోవనిచే మిగిలిన భాగమును తాను సొంతముగా పూరించుచుండును. అటు పూరించుటలో నతని భావనా శక్తియు నౌచిత్యదృష్టియు చక్కగా వ్యక్తములగుచుండును. గోపికా గీతలలో (సంస్కృత భాగవతము) గోపికలు కృష్ణుడు తమకు కావించిన యుపకారములన్నిటిని దెల్పుచు ''విషజలాశయమునుండియు, వ్యాళరాక్షసుని నుండియు, వర్షమారుతములనుండియు, వైద్యుతానలమునుండియ. వృషమయాత్మజునుండియు విశ్వతోభయమునుండియు మేము పలుమార్లు నీచే రక్షింపబడితి''మని వివరించి యుండిరి. పోతన దానిని 'విషజలంబు వలన విధధరదానవు వలన, రాళ్లవాన వలన, వహ్నివలనను రక్షించి కుసుమ శరుని బారిగూల్చదగునె''యని అనువదించెను. నిజమునకు మూలశ్లోకములందలి భావము పద్యమునందలి మూడు పాదములకే సరిపోయినది. నాల్గవ పాదమునందలి భావము పోతన కల్పించినట్టిది. పెద్దపెద్ద విపత్తులవలన రక్షించింది చివరికి మమ్మీ పూలబాణముల బారికగ్గము చేయుచున్నావా! యను నిందలి భావము. గంభీరమై మిక్కిలి రమణీయముగ నున్నది. ఇట్లే పోతన పద్యములందలి చివరి పాదమునో పద్యోత్తరార్థమునో స్వకపోల కల్పిత భావములతో మనోజ్ఞముగా పూరించుట ఎడనెడ కానవచ్చును'' [33]

ఆంగ్లంలో రాసిన దానినే గ్రంథమంతా పైవిధంగా యథాతథానువాదం చేశారు. ఆంగ్ల రచన కూడా సరళసుందరమైన భాషలో రచించారు. అవధానిగారు ఆంధ్ర ఆంగ్ల సంస్కృత భాషలలో పండితులు కనుక ఆయన సరళశైలిలో సుబోధకమగునట్లు, ఆంగ్లంలో రచించారు. సంస్కృత మూలంలోని విషయాలను అనుశీలించారు. పోతన అనువాద విధానాన్ని సోదాహరణంగా వివరించారు. తన పాండిత్యాన్ని గీటురాయిగ చేసి పోతన కవిత్వ

తత్త్వము నందలి విలువలను తెలియజేశారు. చారిత్రాకాధారలతో పోతన జీవన రేఖను చూపించారు. జీవితాన్ని కవిత్వాన్ని మథించి పోతన వ్యక్తిత్వాన్ని అందించారు. అవధానిగారు నన్నయను గురించి ఎక్కువ రచనలు చేశారు. ఆయన రచనలలో నన్నయ తరువాతి స్థానం పోతనకు దక్కుతుంది. నన్నయ ఆంధ్ర భాషకు ఆది కవి అయితే పోతన భక్తి కవులలో ఆదికవి. పోతనగారి భాగవతం చదివితే 'భాగవుతం' (బాగుపడుతాం) అని నమ్మే జనం ఇప్పటికీ ఆంధ్రదేశంలో ఉన్నారు. ఒక్క పోతనను గురించి తప్ప అవధానిగారు ఆంగ్లంలో ఇంకెవరిని గురించి రచన చేయలేదు. 1952లో వరంగల్లులో పోతన పంచశత జయంతి మహోత్సవ సందర్భముగ ప్రచురించబడిన పోతన భాగవతనీరాజము (పంచశతి మహోత్సవ సంస్మారిక) లో కూడ అవధానిగారు గోపికలు, మధురభక్తి అనే వ్యాసాన్ని రచించారు. పోతనను గురించి ఈ సంచికలో వివిధ రచయితల 41 వ్యాసాలు ప్రచురింపబడినాయి.

## 15. వాల్మీకి - విశ్వనాథ (ప్రసంగ వ్యాసం)

కవిప్రభా (కవి సమ్రాట్ విశ్వనాథ ప్రతిభా భారతి) అనే ట్రస్టు 14-12-1983వ తేదీన స్థాపింపబడినది. ప్రతి సంవత్సరం ఒక ప్రముఖ సాహితీ వేత్తచే విశ్వనాథ రచనలను గురించి ఉపన్యాసాలను ఏర్పాటుచేయుట వీరి ప్రధానాంశం. ఈ ఉపన్యాసాలను పుస్తకాల రూపంగా ప్రచురించుట వీరి సంకల్పం.

ఆ సంకల్పంలో భాగంగా 1984వ సంవత్సరంలో దివాకర్ల వేంకటావధానిగారిచేత విశ్వనాథ సాహిత్యంపై రెండుపన్యాసాలు ఇప్పించారు. అవి కూడా ''శ్రీమద్రామాయణ కల్పవృక్షము''పై ఉపన్యసించారు. కాని ఉపన్యాసాలను వ్రాయుట పూర్తిచేయకయే దివాకర్లవారు దివంగతులైనారు. ఆ అసంపూర్ణ రచనను యథాతథంగా ''వాల్మీకి - విశ్వనాథ'' అనే పుస్తకంగా 1987 డిసెంబర్ నెలలో కవిప్రభా ట్రస్టువారు ప్రచురించారు. ఇందులో అవధానిగారు -

1. జటాయువు వృత్తాంతము
2. అహల్యా వృత్తాంతము
3. సీతావివాహ వృత్తాంతము
4. పరశురామ గర్వభంగ వృత్తాంతము
5. శబరి వృత్తాంతము
6. హంసదౌత్యము
7. ఫలద్వయ వృత్తాంతము
8. హనుమద్దౌత్యము

అనే విషయాలను గురించి రచించారు. వాల్మీకి రామాయణ ప్రభావం విశ్వనాథ రామాయణం మీద ఉన్న విషయాన్ని పరిశీలనాత్మకంగా రచించారు. ఆధ్యాత్మ రామాయణ ప్రభావం కూడా రామాయణ కల్పవృక్షంపై ఉన్నదని తెలియజేశారు. అక్కడక్కడ విశ్వనాథ సత్యనారాయణ చేసిన కల్పనలను అవాల్మీకములైన విషయాలను కూడా వివరించారు.

విశ్వనాథ సత్యనారాయణగారు వాల్మీకిని ఎట్లు అనుసరించినది అవధానిగారు ఈ విధంగా తెలియజేశారు.

''వారు పలుచోట్ల వాల్మీకి రామాయణమునే యనుసరించిరి. ఆ రామాయణమునందలి శ్లోకములకు అనువాదములో అనుసరణములో అని చెప్పదగిన పద్యములు వారి కల్పవృక్షమున పెక్కు కనిపించును. ప్రతిభా సముద్రులగుటచే వారు కొన్నిచోట్ల వర్ణనాదులనుపెంచి వ్రాసి ఉండిరి. కథా కథనమున రమ్యతరమైన పద్ధతి నవలంబించిరి. కొన్ని మార్పులు చేర్పులు కూడా కావించిరి. తమ కల్పవృక్షము, వాల్మీకి రామాయణము నకు వ్యాఖ్యప్రాయమని వారి యభిప్రాయము. వారు వాల్మీకినెచ్చట ననుసరించిరో, ఎచ్చట స్వయముగా వర్ణనాదులు కావించిరో, ఎచ్చట మార్పులు చేర్పులు చేసియుండిరో సంగ్రముగా తెల్పుటకు యత్నించెదను. వివరించి తెల్పినచో అదియే ఒక మహాగ్రంథ మగును. అట్లు చేయుటకీ సందర్భమున తావులేదు. నాకు సమర్థత లేదు'' [34]

జటాయువు వృత్తాంతంలో దశరధునకు జటాయువుకు గల స్నేహ విషయము వాల్మీకిరామాయణంలో కనిపించదు. కాని రామాయణ కల్పవృక్షంలో జటాయువును దశరధుడు అశ్వమేథ యాగానికి పిలిపించుట వారిద్దరి మధ్యగల స్నేహాన్ని వివరించుట కలదు. ఇది అవాల్మీకము. అహల్య వృత్తాంతంలో అహల్య భక్తిని ఆధ్యాత్మ రామాయణ ప్రభావంతో విశ్వనాథ సత్యనారాయణగారు వర్ణించినట్లు అవధానిగారు తెలియజేశారు. అహల్య రాయిగ మారిన విషయము అవాల్మీకం. కాని తెలుగు రామాయణ కర్తలందరు అహల్య రాయిగ మారినట్లే రచించారు. విశ్వనాథ దీనినే అనుసరించాడు. వాల్మీకి రామాయణాన్ని, ఆధ్యాత్మిక రామాయణాన్ని, రామాయణ కల్పవృక్షాన్ని క్షుణ్ణంగా పరిశీలించితే కాని ఇటువంటి సూక్ష్మాంశాలను వివరించుట సాధ్యం కాదు. ఇది అవధాని గారి పరిశీలనా పాటవాన్ని తెలియజేస్తుంది.

''పరశురామ గర్వభంగ వృత్తాంతము'' లో విశ్వనాథవారు వాల్మీకిననుసరించుమనే చేసిన రెండు కల్పనలలోని సార్ధకతను వివరించారు. అందులో ఒకటి సీతారామ కళ్యాణం కంటే పూర్వమే పరశురాముడు ప్రత్యక్షమై గర్వభంగము పొందుట. దీనికి కారణము పరశు రాముడు, రాముడు ఇద్దరు విష్ణువు అవతారమున జన్మించిన వారగుటచే లక్ష్మి అంశంలో జన్మించిన సీత ఒకే అవతారమూర్తిని వివాహమాడవలయును కనుక పరశురామ అవతారం

సీతాకళ్యాణం కంటే ముందే సమాప్తి కావలయును. అందుచేత విశ్వనాథవారట్లు కల్పించారని అవధానిగారు వివరించారు.

రెండవ కల్పన సీతాకల్యాణానంతరం అయోధ్యకు వెళ్లినప్పుడు గౌతముని ఆశ్రమము మీదుగా వెళ్లగ అక్కడ అహల్య సీతారాములకు నారచీరలిచ్చుట వాటిని వారు ధరించుట, ఇది ఒక కావ్య ప్రయోజనాన్ని సాధించుటకు చేసిన కల్పన. కావ్య నాటకాదులలో భవిష్య దర్శసూచన అనునది కనిపిస్తుంది. ఇక్కడ విశ్వనాథవారు కూడా ఈ లక్షణమున్నకై తన ప్రతిభతో ఈ కల్పన చేశారని తెలియజేశారు.

శబరి భక్తి విషయంలో కూడా విశ్వనాథవారు ఎన్నో విశేషాలను జోడించారు. శబరిని మధుర భక్తురాలుగా విశ్వనాథ చిత్రించారని అవధానిగారు తెలియజేశారు. ఇట్లే హంసదౌత్య విషయంలో ఫలద్వయ వృత్తాంతమును హనుమద్దౌత్య విషయాన్ని కూడా విశ్వనాథవారు ప్రతిభతో మలచిన విధానాన్ని అవధానిగారు సోదాహరణంగా తెలియజేశారు.

## 16. ఆదికవి వాల్మీకి

ఇది సంస్కృత భాషా ప్రచార సమితి, హైదరాబాద్‌లో వాల్మీకి జయంతిని మొట్ట మొదటిసారి జరుపుకొన్నప్పుడు ప్రచురించారు. అవధానిగారికి ఆ సంస్థతో సన్నిహిత సంబంధం ఉన్నది. కనుక వారికోరిక మేరకు ఈ చిన్న పుస్తకాన్ని రచించారు. ఆకృతిలో చిన్నదైనా ఈ కృతిలో ఎన్నో అమూల్యమైన విషయాలను అవధానిగారు పొందుపరిచారు.

వాల్మీకి అను పేరు ఎట్లు వచ్చిందో చర్చించారు. ఆ చర్చ సారాంశమీవిధంగ ఉంది. -

1. పుట్టనుండి బయల్పడినవాడు ''వల్మీకాత్ ఉత్థిత'' అని కొందరభిప్రాయ పడుచున్నారు.

2. వల్మీకుడు అను ఋషి కుమారుడు ''వల్మీకస్య అపత్యం పుమాన్'' అనికొందురు.

3. వాల్మీకికి ''నాకు జాతుడు'' అనే పేరుకూడా కలదు. వల్మీక శబ్ద పర్యాయములు 'నాకు' అను శబ్దము వల్మీకజాతుడనియే యర్థము.

4. ''వేద వేద్యే పరేపుంసి జాతే దశర థాత్మజే
వేద; ప్రాచేతసా దాసీత్ సాక్షాద్రామాయణాత్మనా''

అను రామాయణ శ్లోకంలో వేదవేద్యుడైన పరమ పురుషుడు దశరథాత్మజుడై జన్మింపగా వేదము ప్రాచేతసుని ముఖమునుండి రామాయణమను పేరుతో అవతరించెను. ఈ పేర్లు వేదంలో కనిపిస్తున్నాయి. బార్గవుడనూ భృగుమహర్షి వంశంలో పుట్టినవాడు. ప్రాచేతసుడను

శబ్దానికి ప్రచేతుని కుమారుడని అర్థం. ప్రాచేతసునికే ఋక్షుడు, భార్గవుడు అను పేర్లుండుటచే అవి వాల్మీకికి కూడా చెందును, అని కొందరి అభిప్రాయం. అని తెలియ జేశారు. జనశ్రుతిలోని వాల్మీకిని గురించి ఉన్న రెండు మూడు వృత్తాంతాలను కూడా అవధానిగారు పేర్కొన్నారు.

1. రత్నాకరుడు (అగ్నిశర్మ అని కొందరు) అను బాలుడు తన తండ్రితో కూడా అడవిదారిన పోవుచు నిర్భయముగ సంతోషముగ తండ్రితోనేనీయడవియందే ఉండెదనని కూడా చెప్పెను. ఆ రాత్రి ఇంటినుండి రహస్యంగా అరణ్యానికి వచ్చి వేసెను. తండ్రి ఎంత వెదికినా దొరకలేదు. రత్నాకరుడు రాత్రంతా అడవిలో తిరిగి తెల్లవారుసరికి ఒక బోయగూడెం చేరెను. బోయదొర పిల్లలు లేనివాడగుటచేత అతనిని పెంచుకొనెను. యుక్తవయస్సు రాగానే అందమైన పిల్లనుతెచ్చి పెండ్లి చేసెను. అతనికి కొందరు పిల్లలు పుట్టిరి. గూడెములోనే బోయలతో కలిసి బాటసారులను దోచుకొనుచుండెను. నారదుని వలన జ్ఞానోదయమై ఋషిగా మారెను.

2. వాల్మీకి బోయవాడను రెండవ కథ పైవిధంగానే ఉన్నది. రత్నాకరుని విషయం ఇందులో లేదు.

3. బోయవానికి సప్తర్షుల వలన జ్ఞానోదయమై వాల్మీకిగా మారెననునది మూడవది.

అని మూడు విషయాలను పేర్కొన్నారు. వాల్మీకి రామాయణంలోని ఇతివృత్తాన్ని గురించి భాషను గురించి సంక్షిప్తంగా పేర్కొన్నారు.

మొత్తంమీద వాల్మీకి గురించి తెలియజేసే సంక్షిప్త రచన. రఘునాథ నాయకుడు చెప్పిన వాల్మీకి చరిత్రకు సంగ్రహ రూపం. రఘునాథ నాయకుడు క్రీ.శ. 1614 - 1633 మధ్య తంజావూరును పరిపాలించి అభినవ కృష్ణదేవరాయలనిపించుకొన్నాడు.

అవధానిగారి 'ఆదికవి వాల్మీకి' రచన చిన్నపిల్లలకు కూడా అర్థమై ఆహ్లాదాన్ని కల్గించే విధంగా సరళంగా మనోహరంగా ఉంది.

## 17. ఆంధ్రవాఙ్మయ చరిత్ర

ఆంధ్ర సారస్వత పరిషత్తువారు నిర్వహించు విశారద పరీక్షలకై వారి కోరిక ననుసరించి 1958వ సంవత్సరంలో అవధానిగారు ఆంధ్రవాఙ్మయ చరిత్రను సంగ్రహంగా రచించారు. ఇందులో ఆంధ్ర వాఙ్మయము యొక్క స్వరూపాన్ని దిఙ్మాత్రంగా వివరించానని తెలియ జేశారు. కానీ ఈ మాటలు అవధానిగారి వినయాన్ని తెలియజేస్తున్నాయి. ఈ ఆంధ్ర వాఙ్మయ చరిత్ర పరీక్షలకే కాక జిజ్ఞాసువులకు కూడా ఎంతో ఉపయుక్తంగా ఉన్నది. ఆయన

వాఙ్మయ చరిత్ర రచనా ప్రణాళిక ప్రశంసనీయంగా ఉన్నదనడానికి దాని బహుళ ప్రచారమే తార్కాణం. ఇప్పటికది 12 ముద్రణలు పొందింది. ఇతర భాషల్లోకి కూడా అనువదింప బడింది. దీనిని సంగ్రహ వాఙ్మయ చరిత్ర అనుటకంటే వాఙ్మయ చరిత్ర సారాంశమనుట సమంజసంగా ఉంటుంది. ఆంధ్ర వాఙ్మయ చరిత్రను ఎందరో రచించారు. వీరేశలింగంగారు ఆంధ్ర కవుల చరిత్ర, గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారు ''కవి జీవితములు'' చాగంటి శేషయ్యగారు 'ఆంధ్ర కవి తరంగిణి' పేరుతో పదమూడు సంపుటాలు సంతరించారు. రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ గారు కవి జీవితములు 'పింగళి లక్ష్మీకాంతంగారు ఆంధ్ర సాహిత్య చరిత్ర (ప్రబంధ యుగం వరకు), ఖండవల్లి లక్ష్మీరంజనంగారు ''ఆంధ్ర చరిత్ర సంగ్రహము'' నిడదవోలు వెంకట్రావుగారు (తెలుగు కవుల చరిత్ర), కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు 'ఆంధ్ర వాఙ్మయ చరిత్ర', శ్రీ. కె. వి. నారాయణరావుగారు (కవిత్వవేది), ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సంగ్రహము, శిష్ట్లా రామకృష్ణశాస్త్రిగారు ఆంధ్రవాఙ్మయ చరిత్ర సర్వస్వము, వారణాసి వేంకటేశ్వర్లు ఆంధ్రసాహిత్య చరిత్ర సంగ్రము, వేల్చేరు నారాయణరావుగారు ''తెలుగులో కవితావిప్లవాల స్వరూపం'' ప్రచురించారు.

ఆంధ్రప్రదేశ్ తెలుగు అకాడమీ, తెలుగు సాహిత్య చరిత్ర, ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి ఆరు యుగాల ఆంధ్ర కవిత, ఆరుద్రగారు సమగ్ర ఆంధ్ర సాహిత్యం 13 సంపుటాలు, జి.నాగయ్యగారు తెలుగు సాహిత్య సమీక్ష అను పేర్లతో రచించారు.

ఆంధ్ర వాఙ్మయ చరిత్ర ఒక సాగరం లాంటిది. కొందరు సాగర స్వరూపాన్ని చూపడానికి యత్నించారు. కొందరందులోని సొగసులను చూపించారు. కొందరందులోని రత్నాలను ఏరి అందించారు. అవధానిగారు మాత్రం దానిని మధించి అమృతాన్ని పంచిపెట్టారు.

తమకంటే ముందు రచించిన కవుల చరిత్రలను, సాహిత్య చరిత్రలను, వాఙ్మయ చరిత్రలను పరిశీలించి ప్రాఙ్నన్నయయుగంనుండి ఆధునిక యుగం వరకు గల ప్రసిద్ధులైన చాలామంది కవులను గురించి సమీక్షించారు. ఈ విధానం చాలా సరళంగా సరసంగా ఉంది. 'ఆంధ్ర వాఙ్మయ చరిత్ర' తొలి పలుకుల్లో అచిరకాలంలోనే సమగ్రమైన ఆంధ్ర సారస్వత చరిత్ర ప్రకటించి అందులో ఆంధ్ర కావ్యాలన్నిటిని గురించి విమర్శలు రచించి గ్రంథకర్తల రుణం తీర్చుకొంటాననే అభిప్రాయం వ్యక్తం చేశారు. కాని మరో సారస్వత చరిత్ర అవధానిగారి కలంనుండి వెలువడకనే ఆయన దివంగతులైనారు. ఇది ఆంధ్ర సరస్వతికి తీరని లోటు.

ఆంధ్ర వాఙ్మయ చరిత్రను అవధానిగారు కావ్యప్రక్రియా భేదాన్ని బట్టి యుగవిభజన చేశారు.

**1. ప్రాఙ్నన్నయ యుగము :** నన్నయకు పూర్వం ఆంధ్రభాషలో కావ్యాలుండెనో లేదో రచింపబడినచో ఎలాంటి కావ్యాలు రచించారో తెలుసుకొనుట కాదారాలు లేవు కాబట్టి దీనిని అజ్ఞాత యుగమని కూడా అనవచ్చునని అవధానిగారు పేర్కొన్నారు. ఇందులో ఆంధ్రము, తెలుగు, తెనుగు, పదాలను గురించి చర్చించారు. నన్నయకు పూర్వం శాసనాలలోని తెలుగు భాషా స్వరూపాన్ని సంగ్రహంగా వివరించారు. ఇంకా గాధాసప్తశతిలో తెలుగు మాటలను ఉదాహరించారు.

**2. భాషాంతరీకరణ యుగము :** నన్నయ తరువాత మూడు శతాబ్దాల వరకు తెలుగు కవులు సంస్కృతంలో ప్రసిద్ధ పురాణాలను అనువాదం చేశారు. కనుక దీనిని భాషాంత రీకరణ యుగమని, పురాణ యుగమని చెప్పవచ్చునని అవధానిగారభిప్రాయపడినారు. నన్నయనుండి రావిపాటి త్రిపురాంతకుని వరకు గల కవులను కావ్యాలను గురించి చర్చించారు.

**3. కావ్యయుగము :** ఈ కాలంలో తెలుగు కవులు సంస్కృతంలోని ప్రసిద్ధ కావ్యాలను ఆంధ్రీకరించుటే కాకుండా కొన్ని సంస్కృత కావ్యాలు కూడా రచించారు. ఈ యుగానికి శ్రీనాధుడు కర్త. బమ్మెర పోతన, జక్కన, అనంతామాత్యుడు, గౌరన, మడికిసింగన, దగ్గుపల్లి దుగ్గయ్య, కొరవి గోపరాజు, పిల్లలమర్రి పినవీరభద్రుడు, నంది మల్లయ, ఘంట సింగయ్య, వెన్నెలకంటి సూరనాదులను పేర్కొని వారి రచనలను సమీక్షించారు.

**4. ప్రబంధయుగము :** క్రీ.శ. 1500 - 1800 మధ్య కాలాన్ని ప్రబంధయుగమనవచ్చునని దీనిని రాయల యుగమని, నాయకరాజయుగము లేక దక్షణాంధ్రయుగమని రెండు భాగాలుగా చేయవచ్చునని పేర్కొన్నారు. కృష్ణదేవరాయలు అష్టదిగ్గజకవులు, సంకుసాల నృసింహకవి, అతుకూరి మొల్ల, తాళ్లపాక అన్నమాచార్యుడు, తాళ్లపాక తిరుమలాచార్యుడు, తాళ్లపాక తిమ్మక్క, తాళ్లపాక చిన్నన్న, కాసె సర్వప్ప, కందుకూరి రుద్రకవి తెలంగాణంలో వెలసిన, చరిగొండ ధర్మన్న, హరిభట్టు, పొన్నగంటి తెలగన్న, అద్దంకి గంగాధరకవి, సారంగుతమ్మయ మొదలగు వారిని గురించి సంగ్రహంగా తెలియజేశారు.

**5. దక్షణాంధ్రయుగము :** మధుర తంజావూరు, మైసూరు మొదలైన దక్షణ దేశ రాజ్యాలలోని తెలుగు కవులు, వారి కృతులను గురించి ఈ యుగంలో పేర్కొన్నారు. విజయనగర పతనానంతరం తెలుగు సరస్వతికి, విజయనగర రాజ్యానికి సామంతులైన నాయకరాజులు అండగా నిలిచారు. వారి ఆస్థానాలలో తెలుగు కవులను పోషించారు. అందుకే దీనిని నాయకరాజుల యుగమని కూడా అనవచ్చును. శృంగార ప్రబంధాలధికంగా రచింపబడి ఈ యుగంలో స్తుత్యమైన ప్రతిభ క్షీణించుటచే దీనిని క్షీణ యుగమని కూడా పిలవవచ్చునని అవధానిగారు పేర్కొన్నారు. ఈ కాలంలో వచ్చిన ప్రబంధాలు, గేయ కావ్యాలు, వచన రచనలు, యక్షగానములను సమీక్షించారు.

**6. ఆధునిక యుగము :** ఆంగ్లేయుల పాలననుండి మేల్కొన్న తెలుగు కవులు ప్రతిభతో ఆంగ్ల భాషా ప్రభావంతో నూతన ప్రక్రియలు చేపట్టి చేసిన రచనలను గురించి రేఖామాత్రంగా చెప్పారు.

ఈ ఆరు యుగాలలో వచ్చిన వివిధ ప్రక్రియలను గురించి ప్రక్రియా పరమైన శీర్షికలలో అవధానిగారు చర్చించారు. అవి ఈ విధంగా ఉన్నాయి.

శతకములు, జానపదగేయ వాఙ్మయము, నాటకములు, నవలలు కథానికలు, జీవిత చరిత్రలు, స్వీయచరిత్రలు, వ్యాసములు, విమర్శలు, పరిశోధనలు అనునవి. ఈ ప్రక్రియలలో ప్రసిద్ధులైనవారి రచనలను గురించ అవధానిగారు వివరించారు. జీవిత చరిత్రలు, స్వీయచరిత్రలు, అనే అధ్యాయం మూడవ ముద్రణనుండి కనిపించుచున్నవి. అంతకుముందు ముద్రణలలో లేదు.

ప్రవేశికము అనే శీర్షికలో సాహిత్యము, సారస్వతము, వాఙ్మయము అను పదాలను గురించి చర్చించారు. మొత్తంమీద ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సారాన్ని ద్రాక్షారసంగా మార్చి తెలుగువారికందించే ప్రయత్నం అవధానిగారు చేశారు. సఫలీకృతులైనారు.

ఇందులో మరొక విశేషమేమిటనగా ఈ గ్రంథంలో వివరింపబడిన కవులను గురించి గ్రంథం చివర అకారానుక్రమ సూచిక ఇవ్వడం. వాఙ్మయ చరిత్రలు రాసిన వారెవరూ ఈ పని చేయలేదు. ఒక కవిని గురించిన విషయం తెలుసుకోవాలనుకుంటే ఇది చాలా ఉపయోగపడుతుంది. అవధానిగారిచ్చిన ఆకారాది సూచిక ఈ విధంగా ఉంది.

ఇది పాఠకులకు పరిశోధకులకూ్కడా యెంతో ఉపయుక్తంగా ఉంది.

## 18. ఆంధ్రవాఙ్మయారంభ దశ - ప్రబంధ వాఙ్మయము

ఆంధ్రవాఙ్మయారంభదశ అని 1972లో ప్రబంధ వాఙ్మయము అని 1975లో కళాస్రవంతివారు దివాకర్ల వారి ఉపన్యాసాలను వ్యాసాలుగ చిన్న పుస్తకాలుగ ముద్రించారు. ఆంధ్రవాఙ్మయారంభదశలో తన పరిశోధనా సారాంశాన్ని సంక్షిప్తంగా తెలియజేశారు. ఆ విధంగానే ప్రబంధ వాఙ్మయములో కూడా ఆంధ్రవాఙ్మయ చరిత్రలోని ప్రబంధ యుగానికి కొన్ని అంశాలు జోడించి రచించారు. ఇందులో కూడా ప్రబంధయుగ సాహితీ సమీక్ష కనిపిస్తుంది.

ప్రబంధయుగ కవుల శైలిని రసపోషణను, వర్ణనలను సాంఘిక రాజకీయాది పరిస్థితులను సోదాహరణంగా వివరించారు.

అవధానిగారి మాటల్లో ప్రబంధాలను గురించి -

''తెలుగు కవుల భావానందమును, పాండితీ కౌండీర్యమును, లలిత మంజుల పద ప్రయోగ పాటవమును, వర్ణనావైదగ్ధ్యమును చవిచూడవలెనన్న ప్రబంధములనే పఠింప వలయును. ఆంధ్రవాఙ్మయ మహా వనమున నవి ప్రమదోద్యానములు. ప్రతి పదమునందు మకరందరసవాహినులు ప్రవహించును. పుప్పొడుల తిప్పలు కనువిందొనర్చును. పూతావులు గుబాళించును. అందడుగిడినవారు విగళిత వేద్యాంతరం బహిప్రపంచ విస్మారకమునైన పరనిర్వృతి ననుభవింతురనుటలో నతిశయోక్తి లేదు. అందుచేతనే అవి వెలసిన యుగమాంధ్ర వాఙ్మయమున స్వర్ణయుగమైనది.''[35]

ఆంధ్ర వాఙ్మయ చరిత్రలోని ప్రబంధ యుగమనే అధ్యాయంలోని విషయాన్ని ఈ చిన్న పుస్తకంలో కొంత విపులీకరించి వివరించారు. ఇది ప్రసంగ వ్యాసమైనను ప్రత్యేకంగా ఒక పుస్తకంగా రచించుటచే ఈ ప్రకరణంలో చేర్చబడింది.

## 19. మలయాళ వాఙ్మయ చరిత్ర

ఇది కేంద్ర సాహిత్య అకాడమీవారి ప్రచురణ. 1978లో ముద్రింపబడింది. దీనిని మళయాళ భాషలో శ్రీ పి.కె.పరమేశ్వరన్ నాయర్ రాశారు. శ్రీ ఇ.ఎం. పెవెణ్ణియార్

ఆంగ్లంలోని కనువదించారు. దానిని దివాకర్ల వేంకటావధానిగారు తెలుగులోని కనువదించారు.

ప్రాచీనకాలంనుండి నేటి వరకు గల మలయాళ వాఙ్మయ చరిత్ర వాలా విస్తృతమైనది. దానిని సంక్షిప్తంగా కేంద్ర సాహిత్య అకాడమీవారు ప్రచురించారు. సంక్షిప్తమైనా కూడా అంకాలన్నిటిని పొందుపరచుట జరిగింది. ప్రముఖ కవులచే సుసంపన్నం చేయబడిన ఉద్యమాలను, సాంఘిక చైతన్యాన్ని ఇందులో సమీకరించుట జరిగిందని, పి.కె. పరమేశ్వర నాయర్ తెలియజేశారు. అవధానిగారు దీనిని యథాతథంగా అనువదించారు.

ఇందులో గల అంశాలు :

1. భాష దాని ఉత్పత్తి పరిణామములు
2. ప్రాచీన మళయాళ వాఙ్మయము
3. మణిప్రవాళము ప్రాథమిక దశ
4. ప్రాత పాటలు
5. మణి ప్రవాళము చివరి దశ
6. భక్తినీతి కవిత్వము
7. ఆదిమ వచన వాఙ్మయము
8. కథకళీ సారస్వతము
9. ప్రణయకవులు
10. మలయాళము - ఆంగ్లభాష
11. నవల
12. కథానిక
13. నాటకము
14. కవిత్వంలో పునరుజ్జీవనము
15. కాల్పనికోద్యమము
16. కాల్పనిక కవితా స్వర్ణయుగము, ఆశాన్
17. వళ్లత్తోన్
18. ఉళ్లూర్
19. ఆశాన్, వళ్లత్తోళ్‌ల తరూవాత కాల్పనిక కవిత్వము
20. బి.శంకర కురుప్
21. చెంగంపుఝ్ఝు - తదనంతరము
22. గద్యసాహిత్యము

23. అనువాదములు

24. సాహిత్య సంస్థలు - సాంస్కృతిక సమాజములు

ఇది అనువాద రచన అయినా వాఙ్మయ చరిత్ర కాబట్టి వాఙ్మయ చరిత్రల సరసన చేర్చబడినది. అనువాద రచన అయినా ఇది కుంటుపడని ధారతో సరళమైన శైలితో ఒప్పారుచున్నది. అరసున్నలు ఇందులో కనిపించవు. ఇది మూలానికి యథాతథానువాదం ఆంధ్ర వాఙ్మయ చరిత్ర కంటే మలయాళ వాఙ్మయ చరిత్ర గ్రంథం పెద్దది. తెలుగు భాష వచ్చినవారు మలయాళ వాఙ్మయ చరిత్రను గురించి తెలుసుకోవటానికి ఇది ఎంతో ఉపయుక్తంగా ఉంది. మలయాళ వాఙ్మయ చరిత్రలోని మలుపులను, క్రమ వికాసాన్ని, కవుల శక్తి సామర్థ్యాలను ఒక్కొక్కచోట వారి రచనా చమత్కృతిని, వర్ణనా నైపుణ్యాన్ని, రసపోషణనుకూడా ఈ గ్రంథంలో విపులీకరింపబడింది. అనువాద విషయంలో అవధానిగారు పాటించిన పద్ధతులు తులలేనివి. కేంద్ర సాసిత్య అకాడమీవారి కృషిని గురించి పండిత జవహర్‌లాల్ నెహ్రూగారు ఈవిధంగా అభిప్రాయపడినారు.

''భారతదేశంలోని వివిధ భాషల సాహిత్య చరిత్రలను ప్రచురించాలని సాహిత్య అకాడమీ సంకల్పించడం హర్షింపదగిన విషయం. ఈ ప్రముఖ భారతీయ భాషలను ప్రోత్సహించి సమన్వయపరచడం అకాడమీ ముఖ్య కార్యకలాపాలలో ఒకటి.

మన వివిధ భాషా సాహిత్యములలో ప్రత్యక్ష పరిచయం కలిగియుండుట మనలో చాలామందికి వీలు కాకపోవచ్చు. అయినా అక్షరాస్యుడైన ప్రతి భారతీయుడూ తన మాతృభాష కాక ఇతర భాషలను గురించి కూడా కొంచెమైనా తెలుసుకొనుట వాంఛనీయం. ఇతర భాషలలోని ఆణి ముత్యాలవంటి ఇతర గ్రంథాలతో పరిచయం కలిగి యుండాలి. ఆ విధంగా బహుముఖమైన భారతీయ సంస్కృతిని అత్మగతం చేసుకోవాలి.

ఇందు నిమిత్తం, సాహిత్య అకాడమీ ఒక భాషలోని ఉద్గ్రంథములను మరొక భాషలోనికి పరివర్తింపజేస్తున్నది. సాహిత్య చరిత్రలను కూడా ప్రకటిస్తున్నది. ఈ విధంగా మన సంస్కృతికి అకాడమీ తోడ్పడుచున్నది. అంతేకాక భారతీయ భావైక్యమునూ, సాహిత్య సంపదనూ గుర్తించేందుకు కూడా సహాయపడుతున్నది'' [36]

ఈ అభిప్రాయమెంతో సమంజసంగా ఉంది. మలయాళ వాఙ్మయ వికాసాన్ని, అందులో వచ్చిన ఉద్యమాలను, ప్రక్రియలను, సాహిత్య సంస్థలు ఆ భాష కొరకు చేసిన కృషిని, సాంస్కృతిక సమాజాలు నిర్వహించిన పాత్రను ఈ అనువాద గ్రంథంద్వారా తెలుగువారు తెలుసుకొనుటకు అవధానిగారి కృషి ఎంతో ఉపయోగకరంగా ఉన్నది. ఇతర భాషా వాఙ్మయ చరిత్రలను తెలుగులోనికి అనువాదం చేసినవారరుదు. అవధానిగారి ఈ కృషి

అభినందనీయం. ఇతర భాషా వాఙ్మయ చరిత్రలను కొందరు తెలుగులో రచించారు. అందులో మొదట పేర్కొనదగినది మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి ''సంస్కృత కవి జీవితములు''. ఇది 1911లో ప్రకటితమైనది.

జొన్నలగొడ్డ వేంకటేశ్వరశాస్త్రిగారు 1968లో ప్రకటించి మలయాళ భాషా సాహిత్యముల సంగ్రహ చరిత్ర, వల్లా రాధాకృష్ణశర్మగారి తమిళ సాహిత్య చరిత్ర, ఆర్వీఎస్ సుందరంగారి కన్నడ సాహిత్య చరిత్ర, పురిపండా అప్పలస్వామిగారి ఒరియా చరిత్ర, ఆయాచితుల హనుమచ్ఛాస్త్రిగారి హిందీ సాహిత్య చరిత్ర మొదలైన గ్రంథములు కూడా ఈ కోవకు చెందినవే.

## 20. సాహిత్య సోపానములు

తెలుగులో కావ్య లక్షణాలను తెలియజేసే గ్రంథాల సంఖ్య చాలా తక్కువ. ఆ లోటు తీర్చడానికి అవధానిగారు చేసిన ప్రయత్న ఫలం 'సాహిత్య సోపానములు' అనే గ్రంథం. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు ఈ పుస్తకానికి బహుమతికూడా ఇచ్చి గౌరవించారు. ఇది 1960వ సంవత్సరంలో ప్రథమ ముద్రణ పొందింది. సాహిత్య సోపానములు అను ఈ పేరే ఎంతో అర్థవంతంగా ఉంది. సాహిత్యంలో మెట్లెక్కదలచే జిజ్ఞాసువులకు ఇది ఉపయుక్తంగా ఉంది. సంస్కృతాంగ్ల కావ్య లక్షణాలను రెండింటిని దృష్టిలో ఉంచుకుని నిర్మించిన సాహిత్య శాస్త్ర పరిచయ గ్రంథమిది. ఇది ఆంధ్ర సారస్వత పరిషత్తు అధ్యక్షుడైన డా. దేవులపల్లి రామానుజరావుగారు. అప్పుడు కార్యదర్శిగా ఉన్న శ్రీ గడియారం రామకృష్ణశర్మగారు ఆంధ్ర సారస్వత పరిషత్తు నిర్వహించే విశారద పరీక్షలకు కావ్య విషయాలను తెలియజేసే గ్రంథం రచింపవలసిందిగా కోరగా అవధానిగారు ఈ గ్రంథం రచించానని తెలియజేవారు. ఆయన మాటల్లో -

''ఆంధ్ర సారస్వత పరిషదధికారులైన శ్రీ దేవులపల్లి రామానుజరావుగారును, శ్రీ గడియారం రామకృష్ణశర్మగారును విశారద పరీక్షలకు కావ్య విషయములను దెల్పు అలంకార శాస్త్రమును గూడ కొంతవరకు పాఠ్యముగా నిర్ణయింపవలయునను సందర్భమున నన్నీ గ్రంథమును రచించమని కోరియుండిరి. ఒక్క విశారద విద్యార్థులకే కాక కళాశాల విద్యార్థులకు గూడ నుపయుక్తమగునట్లుగా నీ గ్రంథమును రచించితిని. దీనిని దయతో బ్రకటింపనంగీకరించిన ఆంధ్రసారస్వత పరిషత్తువారికి నా కృతజ్ఞతలు'' 37

ఈ గ్రంథాన్ని పరిశీలిస్తే ఇది ఆయన వినయంతో చెప్పుకొన్న విషయమని తెలుస్తూంది. ఆయన ఈ గ్రంథంలో కావ్యాలంకార సంగ్రహంలోని సంస్కృత కావ్య లక్షణాలను, ఆంగ్లంలో 'హడ్సన్' రచించిన (Introduction to English Literature) అనే గ్రంథాన్ని

కూడా తగిన సందర్భములలో పేర్కొని సంస్కృతాంధ్రాంగ్ల కావ్యలక్షణ శాస్త్ర సమన్వయ దృష్టి కనబరచినట్లు స్పష్టమగును. ముఖ్యంగా ప్రతాపరుద్రీయము, సాహిత్య దర్పణము, ధ్వన్యాలోకాది లక్షణ గ్రంథాలను పరిశీలించి ఈ గ్రంథ రచన చేసినట్లు అవధానిగారు పేర్కొన్నారు.

ఇందులో ఐదు సోపానాలున్నాయి.

ప్రథమ సోపానంలో - 1. విమర్శ అనగా నేమి?

2. లలిత కళలు - కవిత్వము

అనే అంశాలను చర్చించారు. విమర్శ గురించి అవధానిగారి అభిప్రాయాలు ఈ విధంగా ఉన్నాయి.

1. ఉత్తమమైన విమర్శ పఠితలకు విజ్ఞాన వికాసమును చేకూర్చుటయే గాక వారియందు నూత్న చైతన్యాన్ని రేకెత్తిస్తుంది.
2. మహాకవులు తమ కావ్యాలద్వారా మానవ జీవిత మరమార్థాన్ని వర్ణిస్తారు. విమర్శకుడు సారస్వత పరమార్థాన్ని వివరిస్తాడు.
3. విమర్శకుడు పాఠకుడు పెడదారిన పడినప్పుడు సన్మార్గాన్ని చూపిస్తాడు.
4. విమర్శకుడు సాహిత్య శాస్త్ర నిష్ణాతుడైన పూర్వకవి రచిత మహాకావ్యాలతో పరిచయం కలిగి వుండాలి.
5. విమర్శించవలసింది కావ్యప్రవృత్తియే కాని కవి ప్రవృత్తి కాదు.
6. కావ్య విమర్శ చేసేటప్పుడు విమర్శకుడు తన భావాలను విస్మరించి అహంకార పరిత్యాగం చేయాలి. సహృదయ భావంతో కావ్యానుశీలన కావించాలి.
7. విమర్శకులు రాగద్వేషాలకు లోనుగాక సమదర్శనం కలిగి వుండాలి.
8. విమర్శ నిర్మాణాత్మకంగా ఉండాలి కాని విధ్వంసనాత్మకంగా ఉండరాదు.
9. విమర్శకుడు నిష్పక్షపాతంగా గ్రంథంలోని సత్యాలను చెప్పే ప్రయత్నం చేయాలి.

**పాశ్చాత్య విమర్శన విధానాన్ని గురించి -**

పాశ్చాత్యులేదైనా గ్రంధాన్ని విమర్శించే ముందు ఆ గ్రంథకర్త దేశకాల మత రాజకీయ సాంఘిక పరిస్థితులను రచనపై వాటి ప్రభావమెట్టిదో పరిశీలిస్తారు. భారతీయులు కావ్య పరిశీలన కిచ్చినంత ప్రాధాన్యం కవిచరిత్రకివ్వరు. రసము, ధ్వని, అలంకారాలు, గుణాలు,

దోషాలు, ఔచిత్యం మొదలైన వాటిని భారతీయ విమర్శకులు శ్రద్ధగా పరిశీలిస్తారు. పాశ్చాత్యులు మొన్న మొన్నటి వరకు రసము, ధ్వని మొదలైన వాటిని గురించి అంతగా పట్టించుకొనలేదు. భారతీయ విమర్శకులకు కావ్య ప్రయోజనములతో ఆనంద ఉపదేశములు రెండు ముఖ్యమే. కానీ పాశ్చాత్య విమర్శకులు ఉపదేశంకంటే ఆనందానికే అధిక ప్రాధాన్యం ఇస్తారు. కానీ ఆంగ్లభాషలో భారతీయులకు పరిచయం లభించిన తర్వాత పాశ్చాత్యుల విమర్శనా పద్ధతులను కూడా అనుసరిస్తున్నారు అని అవధానిగారు అభిప్రాయ పడినారు. ఈ విధానం సారస్వతాభివృద్ధికెంతో శుభసూచకము. గుణాలు పరదేశానివైనా గ్రహించాలి దోషాలు మనదేశానివైనా వదిలిపెట్టలని కూడా సూచించారు. ఈవిధంగానే లలితకళళు, కవిత్వం అనే అంశాన్ని కూడా ప్రథమ సోపానంలో చర్చించారు.

రెండవదైనా కావ్యసోపానంలో, కావ్య స్వరూపాన్ని కావ్య హేతువులను, కావ్యాత్మను, కావ్య ప్రయోజనములను, కావ్య వస్తువును, కావ్య నాయికా నాయకులను, కావ్య భేదాలను గురించి ప్రాచీన లాక్షణికులైన భరత, భామహ, భట్టతౌత, వామన, ఆంనదవర్ధన, మహిమభట్టు, కుంతక, దండి, విశ్వనాథ, జగన్నాథాదుల నిర్వచనాలను అభిప్రాయాలను తెలియజేశారు. పాశ్చాత్య లాక్షణికులైన గోల్డుస్మిత్, లేహన్టు మొదలైనవారు కావ్యస్వరూపాన్ని గూర్చి వెలువరించిన అభిప్రాయాలను ఉదహరించారు. కావ్యము, శాస్త్రము, కావ్యము చరిత్ర, కావ్యము తత్త్వశాస్త్రము, కావ్యము, ఛందస్సు, కావ్యము, సంఘము అనే అంశాలను కూడా చర్చించారు.

మూడవదైన రససోపానంలో రసస్వరూపాన్ని, రసములు, స్థాయిభావాలను, శృంగార వీర రస భేదాలను, రస సమీకరణము, రసములెన్ని అనే అంశాలను ప్రాచ్య పాశ్చాత్య లాక్షణికులకు గల అభిప్రాయాలను వివరించారు.

నాల్గవదైన ధ్వనిసోపానంలో ధ్వని భేదాలను, ధ్వనికిశ్లేషకుగల తేడాను, వృత్తులను, వాచ్య, లక్ష్య, వ్యంగ్యార్థాలను సవివరంగా వివరించారు. పూర్వలాక్షణికుల అభిప్రాయాలను క్రోడీకరించారు. మొత్తం 5304 ధ్వని భేదములున్నట్లు చెప్పారు. అందులో ముఖ్యమైన ధ్వని భేదాలను లక్ష్య లక్షణాలతో సమన్వయం చేసి చూపారు. ఒక చిత్రపటం ద్వారా కూడా ధ్వని భేదాలను చూపించారు.

ఐదవది గుణరీతి వృత్త్యాది సోపానము. ఇందులో భరతుడు, భామహుడు, దండి, ఆనందవర్ధనుడు, జగన్నాధుడు మొదలైన లాక్షణికులు పేర్కొన్న కావ్యగుణాలను సోదాహరణంగా వివరించారు. ముఖ్యంగాశ్లేష, ప్రసాదము, మాధుర్యము, సౌకుమార్యము, సమత, అర్థవ్యక్తి, ఔదార్యము, కాంతి, ఓజస్సు, సమాధి అను పది గుణాలను నరసభూపాలీయమునుండి ఉదాహరణలు గ్రహించి వివరించారు. రీతులను, వృత్తులను,

శయ్యాపాకములను, కావ్యదోషములను గురించి సంక్షిప్తంగా సమీక్షించారు. కావ్యదోషాలను సాహిత్య దర్పణములోని వాటిని ఉదాహరించారు. 16 పదవాక్య దోషాలను 28 వాక్యమాత్ర దోషాలను, 21 అర్థ దోషాలను, 15 రసదోషాలను పేర్కొన్నారు. అలంకారాలను గురించి రేఖామాత్రంగా వివరించి అలంకారాలపై అలంకారికుల అభిప్రాయాలను కూడా క్రోడీకరించారు. ప్రతాపరుద్రీయము ననుసరించి అర్థాలంకార శబ్దాలంకార విభజన చేశారు. వక్రోక్తి అనుమానము, ఔచిత్యము అనే కావ్యాత్మవాదాలను కూడా ఈ ప్రకరణంలో పేర్కొన్నారు.

మొత్తంమీద సాహిత్య సోపానాలు ప్రాచీన సాహిత్య విమర్శ అనే సోపానాలను ఎక్కదలచిన వారికి ఉపయుక్తంగా ఉన్నది. పాశ్చాత్య విమర్శకుల అభిప్రాయాలు కూడా కొన్ని పొందుపరచబడి ఉన్నాయి. ఇటీవలి కాలంలో తెలుగు సాహిత్యంలో విమర్శ కొంత వింత పోకడలననుసరించిన ఒక స్థానాన్ని ఏర్పరచుకొన్నది. లోకో భిన్నరుచిః అన్నట్లు విమర్శకులు కూడా వివిధ కోణాలలో తెలుగు సాహిత్య విమర్శను విశ్లేషించారు. ప్రాచీనాలంకారికుల యొక్కయు, పాశ్చాత్య విమర్శకుల యొక్కయు, మార్క్సిజం దృక్పథంలో దర్శించిన విధానం యొక్కయు పద్ధతులు నేడు తెలుగులో కనిపిస్తున్నాయి.

డా. కె.రాజన్నశాస్త్రిగారి 'ధ్వని మనుచరిత్రము' ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారి 'సాహిత్య శిల్ప సమీక్ష' చర్ల గణపతిశాస్త్రిగారి సాహిత్య దర్శనము, ఆచార్య కాకర్ల వేంకట రామనరసింహంగారి సాహిత్య దర్శనం, విశ్వనాథ సత్యనారాయణగారి 'కావ్యానందము' తిప్పాభట్ల రామకృష్ణమూర్తి రససిద్ధాంతము, ఆంధ్రసాహిత్య విమర్శ, ఆచార్య ఎస్.వి. రామారావుగారి తెలుగులో సాహిత్య విమర్శ, ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యంగారి ఆంధ్ర సాహిత్య విమర్శ - ఆంగ్ల ప్రభావము, ఆచార్య సుప్రసన్నాచార్యులగారి 'సాహిత్య వివేచన' మొదలైన విమర్శ గ్రంథాలు నేడు తెలుగులో సాహిత్య విమర్శ స్వరూప స్వభావాలను తెలియజేస్తున్నాయి. 1966లో దివాకర్ల వేంకటావధానిగారు సాహిత్య సోపానాలు రచించే నాటికి తెలుగు విమర్శ ఇంత అభివృద్ధి చెందలేదు. తెలుగు విమర్శకు ఒక రూపం స్థిరపడుతున్నది గత రెండు దశాబ్దాలుగానే. వీరేశలింగం, కట్టమంచి రామలింగారెడ్డి మొదలైనవారు వెలిగించిన తెలుగు విమర్శనా చిరుదీపం ఇప్పుడు విద్యుద్దీపమై వెలుగులను వెదజల్లుతున్నది. విమర్శ ప్రక్రియకు అవధానిగారు కూడా తన వంతు కృషి చేశారు.

## 21. భాషాశాస్త్ర విమర్శ సూత్రములు

History of Language and Literary Criticism అనే చిన్న పుస్తకాన్ని 1977లో ఇంటర్మీడియట్, బి.ఎ చదివే విద్యార్థుల కోసం, ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు

డా. బయ్యా వేంకట సూర్యనారాయణగారు కలిసి రచించారు. ఇది విద్యార్థులకు గైడులాంటి పుస్తకం. కేవలం పాఠ్య ప్రణాళికాంశాలను మాత్రం సంగ్రహముగా వివరించారు. భాషాశాస్త్రానుసారంగా భాషా కుటుంబాలను వర్గీకరించారు. ద్రావిడ భాషలలో తెలుగునకుగల స్థానాన్ని చూపడానికి యత్నించారు. సాహిత్య సోపానాల్లో చెప్పబడిన కావ్య స్వరూపాదులను వివరించారు. ఇవీ ఈ గ్రంథంలోని ముఖ్యాంశాలు.



## పంచమ ప్రకరణము

# వివిధ ప్రక్రియల విలోకనం

### 1. వ్యాసాలు

అవధానిగారు విద్యార్థి దశనుండి వ్యాసరచనా వ్యాసంగాన్ని కొనసాగించారు. వ్యాస ప్రక్రియలో తనకంటూ ఒక మార్గాన్ని నిర్మించుకున్నారు. ఆయన మొట్టమొదటి వ్యాసం 1924వ సంవత్సరం మే నెలలో ఆంధ్రప్రభ దినపత్రికలో ప్రచురించబడింది. ఆ వ్యాసం పేరు ''కాకతి రాజుల సాహితీ పోషణ'' (వరంగల్లు ప్రశస్తి). ఇది ఆయన తన 12వ యేట విద్యార్థి దశలో రాసిన వ్యాసం. అప్పటినుండి 1986 వరకు 640 వ్యాసాలు రాశారు. ఆయన వ్యాసరచనా విన్యాసం అనన్యసామాన్యమైనది.

వ్యాస ప్రక్రియను గురించి రెండు మాటలు, తెలుగులో వ్యాసం ఒక ప్రక్రియగా ఈ శతాబ్ది మొదటి దశకంలోనే రూపుదాల్చింది. అంతకుముందు సామినేని ముద్దు నరసింహ నాయుడు పరవస్తు వేంకటరంగాచార్యులు, జియ్యరు సూరి, కందుకూరి వీరేశలింగం పంతులు మొదలైనవారు ప్రయోగాత్మకంగా ఈ ప్రక్రియలో రచనలు చేశారు. వ్యాసంతో సమానమైన ఈ రచనలను ప్రమేయాలు, సంగ్రహాలు, వచన కావ్యాలు ఉపన్యాసాలు మొదలైన పేర్లతో పిలిచేవారు. గురజాడ అప్పారావుగారు మాత్రం తన రచనలను వ్యాసాలన్నారు. అప్పటినుంచే ఈ ప్రక్రియకు వ్యాసమనే పేరు స్థిరపడింది. తెలుగులో వ్యాసం ప్రస్తుతం విశ్వరూపం దాల్చింది. ఇది ఒక వచన విన్యాసంగా నేడు స్థిరపడింది. పరమాణువునుండి పర్వతం వరకు చీపురుపుల్లనుండి విశ్వాంతరాళం వరకు నేడు వ్యాసాలు రాస్తున్నారు.

వేంకటావధానిగారు 'వ్యాసావళి'ని విద్యార్థులకు పయోగపడే విధంగా రచించారు. ఇందులోని వ్యాసాలను ఐదు విధాలుగా విభజించారు. 1. వర్ణనాత్మక వ్యాసములు, 2. కథనాత్మక వ్యాసములు 3. వివరణాత్మక వ్యాసములు 4. భావనాత్మక వ్యాసములు 5. వివాదాత్మక వ్యాసములు అని పేర్కొన్నారు.

వాటి లక్షణాలను ఈ విధంగా తెలియజేశారు.

1. వర్ణనాత్మక వ్యాసములు - ఇందొక వస్తువుయొక్కగానీ ప్రదేశము యొక్కగానీ, జంతువుయొక్కగానీ వర్ణనము కావింపబడును. ప్రకృతి దృశ్యముల వర్ణన కూడా ఈ

విభాగంలో చేరును అని తెలియజేశారు. పై అంశాలమీద 17 వ్యాసాలు రచించారు.

2. కథనాత్మక వ్యాసాలు - సామాన్య సన్నివేశము, చారిత్రక సంఘటన వ్యక్తి జీవితచరిత్రను గూర్చి రాసినవి. ఇలువంటి వ్యాసాలు 14 ఇందులో కలవు.

3. వివరణాత్మక వ్యాసాలు - వస్తు ప్రదానమైన విషయాలు, సామెతలు, జాతీయాలు మొదలైన వానిని వివరించే వ్యాసాలు. ఈ కోవకు చెందిన వ్యాసాలు 56 వరకు ఈ సంకలనంలో ఉన్నాయి.

4. భావనాత్మక వ్యాసాలు - వ్యాసకర్త భావనా బలముచే ఊహించి రాసే వ్యాసాలు. ఈ తెగకు చెందిన 14 వ్యాసాలిందులో ఉన్నాయి.

5. వివాదాత్మక వ్యాసాలు - భిన్నాభిప్రాయాలు కల అంశాలమీద రాసే వ్యాసాలు. ఇటువంటివి ఐదు వ్యాసాలిందులో ఉన్నాయి. ఇది ఐదు విధాలుగాక సంక్షిప్త వ్యాసాలనే శీర్షికతో 17 వ్యాసాలను 'సమ్మెలనుండి - సమసమాజము' వరకు ఇందులో పొందు పరిచారు. ఈ వ్యాసాలన్నీ విద్యార్థుల పరీక్షలను దృష్టిలో పెట్టుకుని రచించినవి. వీటిలో కొన్నింటిలో సాహితీ విలువలు కూడా చోటుచేసుకున్నాయి. విద్యార్థులు వ్యాసాలు ఏవిధంగా రాయాలో తెలియజేస్తూ కొన్ని సూచనలు లక్షణాలు కూడా వ్యాసావళి ఉపోద్ఘాతంలో అవధానిగారు వివరించారు. తరువాతి కాలంలో విద్యార్థులను దృష్టిలో ఉంచుకుని వ్యాసాలు రాసిన వారికీ వ్యాసావళి మార్గదర్శకంగా నిలిచింది. అధ్యాపకులెందరో దీనినాదర్శంగా పెట్టుకొని విద్యార్థులకు వ్యాసరచనా విధానాన్ని నేర్పుతున్నారు.

## సాహిత్యపు విలువలున్న వ్యాసాలు

దివాకర్ల వేంకటావధానిగారు 1924వ సంవత్సరం నుండి వివిధ సందర్భాలలో వివిధాంశాలమీద వివిధ పత్రికల కోసం, వ్యాస సంకలనాల కోసం, సంచికల కోసం, ఉపన్యాసాల కోసం రాసి ప్రచురింపబడిన వ్యాసాలు 646 ఉన్నాయి. వీటిని తొమ్మిది విధాలుగా విభజింపవచ్చు.

| | |
|---|---|
| 1. తెలుగు సాహిత్య వ్యాసాలు | 303 |
| 2. సంస్కృత సాహిత్య వ్యాసాలు | 23 |
| 3. చందోవ్యాసాలు | 6 |
| 4. అలంకార శాస్త్ర వ్యాసాలు | 25 |
| 5. భాషాశాస్త్ర సంబంధ వ్యాసాలు | 38 |
| 6. అనువాద వ్యాసాలు | 17 |

| | |
|---|---|
| 7. చారిత్రక వ్యాసాలు | 19 |
| 8. సాంఘిక, సాంస్కృతికాంశాలమీద రాసిన వ్యాసాలు | 195 |
| 9. ఆంగ్ల భాషావ్యాసాలు | 20 |
| మొత్తం | 646 |

నేను విభజించి చూపిన ఈ వ్యాసాలు ప్రచురింపబడిన వివరాలు హైదరాబాద్ విశ్వవిద్యాలయంవారి ఎం.ఫిల్ పట్టా కోసం పి.శ్యామలగారు 1987లో సమర్పించిన ''దివాకర్ల వేంకటావధాని వాఙ్మయసూచి'' అనే సిద్ధాంత వ్యాసంలో పొందుపరిచారు. మరల నేను ఇక్కడ చెప్పుట అనవసరమని భావించి మానివేశాను. అవధానిగారు 1924 నుండి 1986 వరకు వివిధ సందర్భాలలో రాసిన ఈ వ్యాసాల పరిశీలన వలన తెలుగు సాహితీ లోకానికెంతో ఉపకారం జరుగుతుంది. ఈ శతాధిక వ్యాసాలమీద ఎవ్వరైనా ఒక పిహెచ్‌డి పట్టాకై సిద్ధాంత వ్యాసం సమర్పిస్తే అమూల్య విషయాలెన్నో వెలుగుచూడగలవు.

అవధానిగారు వ్యాసరచన ఒక ప్రణాళికాబద్ధమై ఉంటుంది. ఒక సందర్భంగా ఆచార్య సి.నారాయణరెడ్డిగారు అవధానిగారి ఉపన్యాసాన్ని తిరిగి రాస్తే ఒక వ్యాసం. అవధానిగారి వ్యాసాన్ని ధారణ పెట్టి చదివితే ఒక ఉపన్యాసం అవుతుంది అని చమత్కరించారు. ఇది యదార్థం. అవధానిగారి ఉపన్యాసాలెన్నో వ్యాసాలుగా రూపొందాయి. అందులోనూ యువభారతి సాహితీ సాంస్కృతిక సంస్థ కోసం ఆయన 1971నుండి 1985 వరకు చేసిన ఉపన్యాసాలు నిరుపమానాలు. అవన్నీ వ్యాసాలుగా యువభారతి ప్రచురించిన లహరుల పరంపరలో ప్రచురింపబడ్డాయి. ఆయన ప్రజావక్త, విద్యార్థులకు కల్పతరువులాంటి వ్యాసకర్త, ఆయన వ్యాసరచనా పద్ధతి ఒక క్రమపద్ధతిలో ఉంటుంది.

ఒక కావ్యాన్ని గురించి ఆయన వ్యాసం రాసేముందు ఆ కావ్య ప్రశస్తిని నిర్వచిస్తారు. రెండవ అంశంగా కవి కాల జీవితాదులను వివరిస్తారు. మూడో అంశంగా కావ్య వస్తువును సంగ్రహంగా తెలియజేస్తారు. నాలుగో అంశంగా అది అనువాద కావ్యమైతే కావ్యకర్త అనువాదంలో పాటించిన ఔచిత్యాన్ని నిరూపిస్తారు. ఐదవ అంశంగా కావ్యంలోని వర్ణనాచమత్కృతిని సోదాహరణంగా వివరిస్తారు. ఆరవ అంశంగా రసపోషణను గురించి చర్చిస్తారు. ఏడవ అంశంగా పాత్ర పోషణను గురించి ప్రస్తావిస్తారు. ఎనిమిదవ అంశంగా అలంకార ప్రయోగాలు వ్యాకరణ విశేషాలు చూపెడతారు. తొమ్మిదవ అంశంగా శైలీ విశేషాలను వివరిస్తారు. ఇదీ ఆయన వ్యాసరచనకై నిర్మించుకొన్న మార్గము. ఉదాహరణకు కావ్యలహరిలో అవధానిగారు శృంగార నైషధాన్ని గురించి రాసిన ఈ వ్యాస రచన క్రమాన్ని పరిశీలిద్దాం.

కావ్యప్రశస్తి!

సంస్కృత పంచ కావ్యాయలలో చివరదిగా తెలుగు పంచకావ్యాలలో మొదటిగా ప్రసిద్ధికెక్కింది నైషధ మహాకావ్యం. దీనిని సంస్కృతంలో రచించినవాడు శ్రీహర్షుడు. ఇతడు కాశ్మీర దేశంలోని శారదా పీఠంనందలి శేషాహివంశంలో జన్మించిన శ్రీ హీర పండితుని పుత్రుడు, మామల్లదేవి ఇతని తల్లి. ఇతడు 12వ శతాబ్దంలో కన్యాకుబ్జమును పాలించిన జయచంద్రుని ఆస్థానంలో ఉండెను. దమయంతీ స్వయంవరమును, నలుని గుణగణములను తన కాలంలో జరిగిన సంఘటన రాణి సంయుక్త స్వయంవరము పృధ్వీరాజు గుణగణములను దృష్టిలో పెట్టుకొని వర్ణించెనని విమర్శకుల అభిప్రాయం. ఇది అసంభావ్యం కాదు.

కవిని గురించి -

ఇటువంటి నైషధకావ్యాన్ని శ్రీనాధ మహాకవి చంపూరూపంలో ఆంధ్రీకరించి మామిడి సింగ నామాత్యునకంకిత మొనర్చెను. శ్రీనాధుని తల్లిదండ్రులు భీమాంబామారయా మాత్యులు, తాత కమలనాభామాత్యుడు. జన్మస్థానాన్ని గూర్చి విమర్శకులింకా నిశ్చితాభిప్రాయానికి రాలేదు. అతని తాత కమలనాభామాత్యుడు కాల్పట్టణాధీశుడని చెప్పబడి ఉండుటచేత అదియే ఊరో నిర్ణయించుటకు పలువురు విమర్శకులు ప్రయత్నించారు. నెల్లూరి జిల్లాలోని కొత్తపట్టణమని కొందరు, కృష్ణాజిల్లా లోని కాళీపట్టణమని కొందరు, కలపట గ్రామమని కొందరు, నెల్లూరేనని మరికొందరు అభిప్రాయాలు వ్యక్తం చేశారు. అదియేవూరైనా పాకనాటి యందు సముద్ర తీరమునందుండినదై ఉండవలయును. వీరు పాకనాటి నియోగి బ్రాహ్మణులు భారద్వాజ గోత్రులు. ఆపస్తంభసూత్రులు. శ్రీనాధుడు, క్రీ.శ. 14వ శతాబ్ది చివరిపాదంలో జన్మించి 15వ శతాబ్ది పూర్వార్ధం చివరిదాకా సుమారు 70 సంవత్సరాలు జీవించి ఉండెనని చెప్పవచ్చును. విద్యాధికారిగా పదవి నిర్వహించి కనకాభిషేకగౌరవం పొంది కవిసార్వభౌముడై రాజోచిత భోగములననుభవించి చరమదశలో దారిద్ర్యమునకు గురియై దీన స్థితిలో మరణించెనని అతని సీస పద్యంద్వారా తెలుస్తున్నదని అవధానిగారు తెలియజేశారు. అతని రచనలను పాండిత్యాన్నిగురించి కూడా తెలియజేశారు.

నైషధవస్తువు :

వస్తువు ప్రఖ్యాతం కాబట్టి విషయ సంగ్రహం నేను ఇక్కడ చూపలేదు.

అనువాద విధానం

శ్రీనాధుడు నైషధకావ్యాన్ని శృంగార నైషధంగా అనువదించుటకు అనుసరించిన

పద్ధతులను సోదాహరణంగా వివరించి శ్రీనాథుని అనువాదం కవిత్రయం వారి అనువాదం వలె అత్యంత స్వతంత్రమైనది కాదని ఆధునికుల అనువాదం వలె పదానువాదం కాదని అతనిది భావాను వాద పద్ధతి అని వివరించారు.

**వర్ణనాచమత్కృతి :**

శృంగార నైషధం వర్ణనా ప్రధానమైన కావ్యం. ఆయా సందర్భాలలో ఆయా వర్ణనలు కావించుటలో కవి ప్రదర్శించిన భావనా శక్తి, పాండితీ శౌండీర్యము, లోకశాస్త్రాధ్యవేక్షణ పాటవము అప్రతిమానములై పఠితలనాశ్చర్యచకితులను చేయును- అని వర్ణనలను గురించి వివరించారు.

**రసపోషణ :**

ఈ కావ్యమున శృంగార రసమును పోషించుటలో శ్రీనాథుడు చూపిన నేర్పు అనన్యసామాన్యమైనది. ఇందు వియోగ సంయోగ శృంగారములు రెండు వర్ణింపబడినవి. శ్రీనాథుడు వేశ్యాసక్తుడను ప్రతీతి లోకమునందున్నది. అది యెంతవరకు సత్యమో మనం చెప్పజాలము. కాని శృంగార రసపోషణమున నాతని కభినివేశమున్నదని చెప్పుటలో మాత్రమతిశయోక్తి లేదు. అని అవధానిగారు పేర్కొన్నారు.

**పాత్రపోషణ :**

పాత్ర పోషణను గురించి కవియిందు నాయికా నాయకులైన నలదమయంతులయు కలిరాజాదుల యొక్కయు శీలస్వభావాలను చక్కగా చిత్రించి ఉన్నాడు. నలుడు సౌజన్య సౌందర్య సారస్యములకు నెలవైనవాడు అని నలుని గుణగణములను సోదాహరంగా వివరించారు.

**అలంకారాలు వ్యాకరణ విశేషాలు - శైలి:**

చివరగా అలంకార ప్రయోగాలను వ్యాకరణ విశేషాలను శైలిని గురించి విశ్లేషించుట అవధానిగారి పద్ధతి. శ్రీనాథుని శైలి గురించి వివరిస్తూ పద్యమును నిరాఘాటముగాను ధారాళముగను నడిపించుట యతనికి వెన్నతో నలవడిన విద్య. అతడు సంస్కృతమున కూడా మహా పండితుడగుటచే తన రచనలో ఎక్కువ సంస్కృత పదములనే వాడెను. అయినను అతడు ఎడనెడ వాడుచుండు రమ్యములైన తెలుగు జాతీయములు నుడికారములును తెలుగుపై నాతనికిగల యధికారమును ఆసక్తిని వెల్లడించుచు చదువరుల హృదయములకపారమైన యానందము నావహించుచుండును. అతని రచన అర్థశబ్దాలంకార పూరితమై మిక్కిలి ప్రౌఢముగా నుండును. నైషధములో శ్లేష అనుప్రాస మొదలైన

శబ్దాలంకారాలు కనిపించునని తెలియజేశారు. ఇది అవధానిగారి వ్యాస రచనకు రేఖామాత్ర పరిచయం మాత్రమే.

ఈ పద్ధతిలో ఆయన వ్యాసరచన సాగుతుంది. ఏ వ్యాసాన్ని పరిశీలించినా ఒక క్రమం కనిపిస్తుంది. మనుచరిత్ర, పారిజాతాపహరణము, ఆముక్తమాల్యద, పాండురంగ మహాత్మ్యము, వసుచరిత్ర, విజయ విలాసము మొదలగు ప్రబంధాలను కావ్యాలహారి ఉపన్యాస సంపుటిలో గూర్చి చేసిన ప్రసంగాలు లోకాదరణ పాత్రములైనవి - అవియే ప్రసిద్ధములైనాయి. ఇవన్నీ కూడా పై పద్ధతిలోనే ఉన్నాయి. ఈ అంశాలన్నీ చర్చిస్తే తప్ప ఉపన్యాసంలోగానీ వ్యాసంలోగానీ ఆయనకు తృప్తి ఉండేది కాదు.

అవధానిగారి వ్యాసాలలో ఒక ప్రసన్న గుణం ఉంటుంది. వాక్య నిర్మాణం పటిష్టంగా ఉంటుంది. విశ్లేషణాత్మకంగా ఈయన వ్యాసాలుంటాయి. స్పష్టత ఉంటుంది. ఉదాహరణలు హృదయరంజకంగా ఉంటాయి. హేతుబద్ధంగా ఉంటాయి. ప్రాచీన లాక్షణికుల దృక్పథంతో అవధానిగారు వ్యాసరచన చేస్తారు. అవధానిగారి వ్యాసాలు పరిశోధకులకే కాక విద్యార్థి లోకానికెంతో ఉపయోగకరంగా ఉంటాయి.

ఆయన రాసిన వ్యాసాల్లో ముఖ్యంగా ఆత్మీయత, సరళత, వివరణాత్మకత అనే గుణాలు అంతటా కనిపిస్తాయి. ఆయన వ్యాసం అనాయాసంగా రాయగలరు. అంతకంటే అనాయాసంగా పాఠకుని హృదయాన్ని ఆకట్టుకోగలరు. ఆయన వ్యాసప్రక్రియ ద్రాక్షాపాక సమన్వితం. ఎంత క్లిష్ట విషయాన్నైనా ఆయన సుస్పష్టంగా పారాన్ని పాఠకులకు రుచి చూపించే తత్త్వం ఆయనది. వ్యాస విషయాన్ని పరిశీలించి తానునుభవించి ఆయనుభూతిని సరళశైలిలో వ్యక్తీకరించే సాహితీ వ్యక్తిత్వం ఆయన వ్యాసాల్లో దర్శనమిస్తుంది. ఆయన వ్యాసాలు ఉపన్యాసాలు తెలుగు వారినెంతో ప్రభావితులను చేస్తాయి. చేశాయి.

## 2. పీఠికలు

పీఠికలు కావ్యప్రాంగణంలో ప్రవేశించడానికి కవాటాలవంటివి. ఇవి కావ్యాలకు నాందీ ప్రస్తావన లాంటివి. కొందరు గ్రంథాలను సమగ్రంగా ఆకళించుకొని ఆ అనుభూతులను మాటలుగ మార్చి పీఠికలు రాస్తారు. అవి ఉత్తమ పీఠికలుగా సాహితీ చరిత్రపుటల్లో నిలుస్తాయి. మరికొందరు తమ భావాలకు ప్రతీకలుగా ప్రతిబింబాలుగా పీఠికలు రాస్తారు. మరికొందరు అదను దొరికిందని తమ సిద్ధాంతాలను పాఠకులమీద రుద్దే ప్రయత్నం చేస్తారు. కొంతమంది పండితులు సమదృష్టితో సమీక్షిస్తారు. ఇక కొంతమంది ప్రశంసలతో పేజీలు నింపేస్తారు. ఆధునిక కాలంలో గ్రంథాలకు పీఠికలు వ్రాయుట, వ్రాయించుకొనుట ఒక సంప్రదాయంగా మారింది. పీఠిక లేకుండా పుస్తకాలు బయటికి రావడం లేదు. కొందరు ఐదారుమంది దగ్గర కూడా పీఠికలు అభిప్రాయాలు రాయించుకుంటున్నారు.

చాలా పీఠికల్లో కవి పరిచయాలు కవి ప్రశంసలు కవిత్వ గుణ పరిశీలన వస్తువును సంగ్రహించి చూపుట కనిపిస్తాయి. కొన్ని పీఠికల్లో గ్రంథంలోని విషయ విశేషాలను రేఖామాత్రంగా చూపుట గమనించవచ్చు. కొన్ని పీఠికలు గ్రంథంలోని గుణాలను గుదిగుచ్చి అందించే ప్రయత్నం చేస్తాయి. మొత్తంమీద కొన్ని పీఠికలను చదివితే గ్రంథమంతా చదవాలనిపిస్తుంది. మరికొన్ని పీఠికలను చదివితే గ్రంథం జోలికి పోకూడదనిపిస్తుంది. ప్రత్యేకమైన వ్యక్తిత్వంగల పీఠికలు కూడా కొన్ని ఉంటాయి.

దివాకర్లవారు ఆధునిక సాహిత్యంలో వెలువడుతున్న అన్ని ప్రక్రియలకు సంబంధించిన గ్రంథాలకు పీఠికలు రాశారు. ఇందులో సాహితీ విలువలున్న పీఠికలు రెండు వందలకు పైగా ఉన్నాయి. ఎంతోమంది ఆయన రాసిన పీఠికతో గ్రంథం ప్రచురించుట ఒక గొప్పగా భావించారు. ఆయన మీద పండితులకేర్పడినగౌరవమాలాంటిది. ఆయన సాహితీ వ్యక్తిత్వం అటువంటిది.

**ఆచార్య సి.నారాయణరెడ్డిగారి మాటల్లో -**

''అసంఖ్యాక గ్రంథాలకు వారు చేకూర్చిన పీఠికలు సహస్ర సంఖ్యను మీటినవి. ఈ పీఠికా రచనా కాలాన్నే వారు గ్రంథ రచనకు వినియోగిస్తే మరెన్ని మణిపూసలు వెలువడేవో, అయినా ఈ పీఠికల్లో కొన్నిటినైనా ఏరి పుస్తకంగా సంకలనంగా చేస్తే పీఠికారచనా ప్రక్రియకే అది కలికితురాయిగా నిలిచిపోతుంది''

అవధానిగారి సాహితీ విలువలున్న పీఠికలను సంకలనం చేయవలసిన అవసరం ఎంతైనా ఉంది. అందులో గ్రంథ పరిష్కారాలకు రాసిన పీఠికలెంతో పరిశోధనాత్మకంగా ఉన్నాయి. సిద్ధాంత గ్రంథాలకు, విమర్శ కృతులకు రాసిన పీఠికలెంతో సాహితీ విలువలకు నిలయాలు.

''తెలుగు పీఠిక'' అనే అంశంమీద పి.హెచ్.డి చేసిన డా. డి. చంద్రశేఖరరెడ్డిగారు కూడా ఈలాంటి అభిప్రాయాన్ని వెలిబుచ్చారు.

తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి, విశ్వనాథ సత్యనారాయణ, దివాకర్ల వేంకటావధాని, కె.వి.రమణారెడ్డి, చేకూరి రామారావు, కె.కె.రంగనాథాచార్యులు మొదలైన వారి పీఠికలు ప్రత్యేక గ్రంథాలుగ రావాల్సిన అవసరం ఉంది''

శ్రీశ్రీ మొదలైన వారి పీఠికలమీద ప్రత్యేక పరిశోధనలు జరుగుతున్న ఈ సమయంలో అవధానిగారి పీఠికలమీద ఒక ప్రత్యేక పరిశోధన జరగవలసిన అవసరం ఎంతైనా ఉంది.

అవధానిగారు తాను రాసిన పీఠికలకు, తొలి పలుకులు, ఉపోద్ఘాతాలు, ముందు మాటలు, ప్రవేశిక అశంసన, పీఠిక మొదలైన పేర్లు పెట్టారు. పేరు ఏది పెట్టినా చెప్పే విషయం మాత్రం పుస్తకాన్ని రచయితను పరిచయం చేయుట, ముఖ్యంగా కనిపిస్తుంది. అవధానిగారు రాసిన

పీఠికల్లో కనిపించే అంశాలు -

1. గ్రంథకర్తతో తనకు గల పరిచయాన్ని తెలియజేయుట
2. కవిని ప్రశంసించుట
3. కావ్య ప్రశంస
4. వస్తువును సంగ్రహంగా పరిచయం చేయుట
5. గ్రంథకర్త ఉద్దేశాన్ని వివరించుట
6. ఉత్తమ గుణాలను ఉల్లేఖించుట
7. కవిని అభినందించుట
8. గ్రంథకర్తను ప్రోత్సహించుట
9. ఆశీస్సులు, లేక శుభాకాంక్షలు తెలియజేయుట.

సర్వసాధారణంగా ఈ అంశాలు ఆయన పీఠికల్లో చోటు చేసుకుంటాయి. ఆయన రచయితను ప్రోత్సహించుట ముఖ్యోద్దేశంగా పీఠికలు రాస్తారని కొంతమంది అభిప్రాయం. దీనిని అవధానిగారు కూడా అంగీకరించారు. అందుకాయన చెప్పిన సమాధానం కూడా సమంజసంగా ఉంది. ''ఏ పుట్టలో ఏ పాముందో ఎవరికి తెలుసు. ప్రోత్సహిస్తే వారి ప్రతిభ బైటికి వస్తుంది. రచనా రంగంలో అతను అభివృద్ధి సాధించగలడు'' అని ఆయన సమర్థించుకున్నారు. అవధానిగారు రాసిన సాహితీ విలువగల గల పీఠికలను ఈ క్రిందివిధంగా విభజించవచ్చు.

| | |
|---|---|
| 1. కావ్యాలకు రాసిన పీఠికలు | 63 |
| 2. ఖండకావ్యాలకు కవితా సంపుటాలకు | 35 |
| 3. విమర్శ గ్రంథాలకు రాసిన పీఠికలు | 47 |
| 4. అనువాద గ్రంథాలకు రాసినవి | 13 |
| 5. చిన్నకథా సంకలనానికి రాసినవి | 1 |
| 6. వ్యాస సంకలనాలకు రాసినవి | 2 |
| 7. వ్యాకరణ గ్రంథాలకు రాసినవి | 4 |
| 8. నిఘంటువులకు రాసినవి | 1 |
| 9. సిద్ధాంత గ్రంథాలకు రాసినవి | 19 |
| 10. నాటకాలకు రాసినవి | 3 |
| 11. నవలలకు రాసినవి | 1 |
| 12. శతకాలకు రాసినవి | 7 |
| 13. స్తోత్రాలకు రాసినవి | 15 |

| | | |
|---|---|---|
| 14. | సంచికలకు రాసినవి | 5 |
| 15. | ఆంగ్ల గ్రంథాలకు రాసినవి | 4 |
| 16. | ఆంగ్ల గ్రంథానికి తెలుగు పీఠిక | 1 |
| 17. | తెలుగు గ్రంథానికి ఆంగ్ల పీఠికలు | 2 |
| 18. | హిందీ గ్రంథాలకు రాసిన పీఠికలు | 2 |
| 19. | సంస్కృత గ్రంథానికి రాసిన ఆంగ్ల పీఠిక | 1 |
| | మొత్తం | 226 |

(ఈ పీఠికల పట్టిక అనుబంధం (2)లో చేర్చబడినది)

## 3. ఉపన్యాసాలు

తిరుపతి వేంకటకవులు అవధాన ఆశుకవితా ప్రదర్శనలతో తెలుగువారిని ఉర్రూతలూగిస్తే దివాకర్ల వేంకటావధానిగారు తమ ఉపన్యాసాలతో తెలుగువారినెంతో అలరించారు. ఉపన్యాస కళకు వన్నె తెచ్చారు. ఒక వరవడిగా నిలిచారు. ఆయన ఉపన్యాసాలలో కొన్ని గారడీలు చేసి శ్రోతల్ని మంత్రముగ్ధుల్ని చేసేవారు. ఆయన జనాన్ని కడుపుబ్బ నవ్వించేవారు. తాను మాత్రం పల్లెత్తి నవ్వేవారు కారు. ఆయన ధారణాశక్తి ఆయన ఉపన్యాస కళనెంతో రాణింపజేసింది. ఆయన ఉపన్యాసాలలో వందలాది పద్యాలు ఉదాహరించేవారు. జనానికి విసుగు రాకుండా చెణుకులు విసరేవారు. ప్రసన్న వదనంతో గంభీరమైన గళంతో ఆయన ఉపన్యసించే టప్పుడు ఆయన వాణిలో వాణి నాట్యమాడేది. ఆయన ఉపన్యాసాల బాణి ఒక ప్రత్యేకత కలిగి ఉండేది.

ఆచార్య సి.నారాయణరెడ్డిగారి మాటలో''హిందూ మతానికి ఆనాడు స్వామి వివేకానందులు ఎంత సేవ చేశారో, ఆంధ్ర సాహితికి ఈనాడు ఆచార్య వేంకటావధానిగారు అంతటి సేవ చేస్తున్నారు. ఆచార్యులు హిందూ మతాత్మను అఖిల ప్రపంచంలోని అగ్ర నగరాలలో ఆవిష్కరింపజేశారు. ఈ ఆచార్యులు ప్రాచీనాంధ్ర భారతి పసిడి తలపులను, మిసిమి పలుకులను తెలుగున్న ప్రతిచోట, విలువెరిగిన ప్రతి పీట ప్రసరింపజేస్తున్నారు. అవధానిగారు తెలుగు నాట పిలువబడని చోటు లేదు. పరిషద్వాటికలు మొదలుకొని ప్రాథమిక పాఠశాలల ముంగిళ్ల వరకు వారి ఉపన్యాస వాణి పరవళ్లు తొక్కింది తరతమ భేదాలు లేని, పారపచ్చాలెరుగని సమదర్శి కాబట్టి అంతటా వారి వాక్కులో అదే వడి, అదే వరవడి. అసంఖ్యాకసమకాలీన వక్తలకు అదే ఒక ఒరవడి. ఆ మధ్య ఆంధ్ర సారస్వత పరిషత్ ప్రాంగణంలో యువభారతి ఆధ్వర్యంలో ప్రాచీనాంధ్ర కవులను గూర్చి వారిచ్చిన ఉపన్యాసాలు విజ్ఞాన వినోద బావతుందిల మరందికోశాలు అందుకు సాక్షులు ఆ సభల్లో

దశసహస్రాధిక సంఖ్యలో మూగిన సభ్యమధువ్రతాలు. రానురాను తన కన్నబిడ్డలే తనను మరచిపోతున్నారని తబ్బిబ్బై ప్రాచీనాంధ్ర మాతృభారతి స్వయంగా పంపిన దూతయేమో ఈ వాగ్విధాత అస్తు''[3]

ఇందులోని ప్రశంసలు అవధానిగారి ఉపన్యాసాలు విన్నవారెవరైనా ఒప్పుకోక తప్పదు. సంఖ్యాపరంగా వీటిని లెక్కకట్టుట అసాధ్యం. ఆయన రాసిన పీఠికలకంటే వ్యాసాల సంఖ్య ఎక్కువ. వ్యాసాలకంటే ఉపన్యాసాల సంఖ్య అధికం. అంతకంటే చెప్పిన పాఠాలు అపరిమితం. వీటిలో ధ్వనించే గుణాలు.

1. ప్రాచీన సాహిత్యంపై ప్రజలకు అభిమానం కలుగజేయుట.

2. హైందవ సంస్కృతిని వేదధర్మాలను పునరుజ్జీవింపజేయుట అనేవి ముఖ్యం. ఇవి అంతస్సూత్రంగా సర్వత్రా గోచరిస్తాయి. ఉపన్యాస కళలో ఎందరో ఆయననునుకరించడానికి యత్నిస్తున్నారు. కానీ ఆయన ధారణ, అసాధారణమైనది. ఆయన ఉపన్యాసాలు తెలుగువారిపై చెదరని ముద్ర వేశాయనుటలో అతిశయోక్తి లేదు.

## 4. సంస్కృత వ్యాకరణ సంగ్రహము

దివాకర్ల వేంకటావధానిగారు వ్యాకరణ పాఠాన్ని కూడా ఎంతో మనోజ్ఞంగా చెప్పేవారు. సాధికారికంగా సరసమైన ఉపమానాలతో ఆయన వ్యాకరణ పాఠం బోధించేవారు. ఆయనకు వ్యాకరణమంటే ప్రత్యేకాభిమానం ఉండేది. వ్యాకరణ సూత్రాలు ఆయన జిహ్వాగ్రాన నాట్యం చేసేవి. తెలుగునకు వ్యాకరణ గ్రంథాలు మాత్రం ఆయన రాయలేదు. కానీ 'తెలుగు అకాడమీ' వారి కోరిక మేరకు 'సంస్కృత వ్యాకరణ సంగ్రహము' అనే గ్రంథాన్ని రచించారు. ఈ గ్రంథానికి సంపాదకత్వం వహించినవారు ఆచార్య గంటి సోమయాజిగారు. ఇది 1974వ సంవత్సరంలో ప్రథమ ముద్రణ 1985లో ద్వితీయ ముద్రణ పొందింది.

సంస్కృతాన్ని అభ్యసించే కళాశాల విద్యార్థుల కోసం రచింపబడిన గ్రంథమని ఈ గ్రంథ ప్రవేశికలో ఈ విధంగా పేర్కొనబడినది.

'చిరకాలమునుండి సంస్కృతము కళాశాలలో నాంగ్లభాష ద్వారముననే బోధింప బడుచున్నది. ఇటీవల నితర విషయములవలెనే దానిని కూడా ప్రాంతీయ భాషలలో బోధించుటకు ప్రయత్నం జరుగుచున్నది. బహు గ్రంథములు పరిశీలించి దీనిని సంగ్రహ రూపమున రచించినాము. సంస్కృత వ్యాకరణసారము, నవసరమైనది. అందుచే విద్యార్థుల కవసరమని తోచిన విషయములనే యిందొసంగినాము''[4] - ఇదీ దీని రచనోద్దేశ్యము.

కళాశాలలో సంస్కృతం ఐచ్ఛికాంశంగా తీసుకొని సంస్కృతాన్ని అభ్యసించే

విద్యార్థులకిదియెంతో ఉపయోగకరంగా ఉంది. సులభశైలిలో సరసమైన ఉదాహరణలతో ఈ గ్రంథ రచన సాగింది. సంస్కృత వ్యాకరణాలకు తలమానికమని చెప్పదగిన పాణినీయమము. దానికి ఇంగ్లీషులో ఇతర భారతీయ భాషల్లో కూడా ఎన్నో అనువాదాలొచ్చినాయి. తెలుగులో కూడ చాలా అనువాదాలు వచ్చినాయి. దివాకర్లవారి ఈ సంస్కృత వ్యాకరణ సంగ్రహం విద్యార్థులకెంతో ఉపయుక్తంగా సుబోధకంగా ఉంది. సంస్కృత భాషనభ్యసించాలనుకొనే తెలుగువారికెవరికైనా ఇది ఎంతో ఉపయోగపడుతుంది.

దీనిని పది ప్రకరణములుగా విభజించారు. మొదటిదైన 'సంజ్ఞాప్రకరణం'లో భాషానిర్వచనవము దేవనాగరలిపి అనగా నేమిటి ఈ లిపిలో ఎన్ని అక్షరాలున్నాయి. వాటిలోని వర్గలను, అనుస్వార, విసర్గ, అంతస్థములు, ఊష్మములు మున్నగువానిని గురించి చెప్పుట జరిగింది.

రెండవదైన సంధి ప్రకరణంలో స్వరసంధి, హల్సంధి, విసర్గసంధులను గురించి వివరించారు.

మూడవదైన సుబంత ప్రకరణంలో లింగవివక్షను గురించి తెలియజేశారు.

నాలగవదైన సమాసప్రకరణంలో తత్పురుష, కర్మధారయ ద్విగు, ప్రాది, గతి, బహువ్రీహి, ద్వంద్వ సమాసాలను గురించి వివరించారు. ఇదేవిధంగా ఐదవ ప్రకరణంలో స్త్రీ ప్రత్యయాల గురించి ఆరవ ప్రకరణంలో తద్ధితాలగురించి అవ్యయాల గురించి తెలియజేశారు.

ఏడవ ప్రకరణంలో క్రియా పదాలను కర్మణి ప్రయోగాలను ణిజంతములను, సన్నంతములను, నామధాతువులను సోదాహరణంగా వివరించారు.

ఎనిమిదవ ప్రకరణంలో కృదంతాలను గూర్చి చర్చించారు. తొమ్మిదవ ప్రకరణంలో వాక్య నిర్మాణ విశేషాలను పదవ ప్రకరణంలో కారకాలను గురించి విశ్లేషించారు. ఈ ప్రకరణ విభాగం ఒక క్రమపద్ధతిలో రచించబడినది.

రచనా విధానం విద్యార్థులే స్వయంగా చదువుకొని అవగాహన చేసుకొనుటకనువుగా ఉంది.

మచ్చునకు సమాస పరిచ్ఛేదంలోని ప్రాది సమాసాలను వివరించిన విధానం చూడండి-

## ప్రాది సమాసాలు :

307. ప్ర మొదలగు నుపసర్గలు పూర్వపదముగా గల తత్పురుషములు ప్రాది సమాసములనబడును. (కుగతి పాదయః) ఈ ప్రాదులు కొన్ని ప్రథమాద్వితీయాది విభక్త్యంతములకు నామవాచకములతో సమసించును.

1. ప్రాదులుగతాద్యర్థములందు ప్రథమా విభక్త్యంతములో సమసించును. (ప్రాదయః గత్యాద్యర్థే ప్రథమయా)

ఉదాహరణకు: ప్ర (గతః) ఆచార్యః - పాచార్యః గొప్ప ఆచార్యుడు - ప్రకృష్టోవాత్య - ప్రవాతః (పెద్దవాయువు)

2. అత్యాదులు క్రాంతాద్యర్థములందు ద్వితీయావిభక్త్యంతములో సమసించును.
(అత్యాదయ, క్రాంతాద్యర్థేద్వితీయయా)

ఉదాహరణకు : అతి, (క్రాంతో) మాలామ్ - అతిమాలః (సువాసనలో గాని సౌందర్యంలోగాని మాలనతిక్రమించినది) అతి క్రాంతో రథమ్ రథినంవా - అతిరథ (ప్రతిరథ ప్రతిలేని యోదుడు) అతిమాత్రః (పరిమితినతిక్రమించినది).

3. అవాదులు క్రుష్టాద్యర్థములందు తృతీయా విభక్త్యంతముతో సమసించును.
(అవాదయ) క్రుష్టాద్యర్థేతృతీయయా)

ఉదాహరణకు : అవ (క్రుష్ట) కోకిలయా - అవకోః (కోకిలచే నాహ్వానింపబడినవాడు)

4. పర్యాదులుగ్లానాద్యర్థములందు చతుర్ధ్యంతముతో సమసించును
(పర్యాదయోగ్లానాద్యర్థేచతుర్ధ్యా)

ఉదాహరణకు : (గ్లానః) అధ్యయనాయ) అధ్యయనమునకై అలసినవాడు)

5. నిరాదులు క్రాంతాద్యర్థములందు పంచముతో సమసించును. (నిరాదయః క్రాంతా ద్యయర్థేపంచమ్యా)

ఉదాహరణకు: నిరీ (క్రాంతః) - విష్క్రాంతః కౌశాంబ్యాం - నిష్క్రాశాంభిః) కౌశాంబినుండి వెడలినివాడు) నిర్లంక, మొద

6. కర్మప్రవచనీయములగు నుపసర్గలతో గూడిన సమాసములు లేవు. (కర్మప్రవచన యానాంప్రతిషేథ)

ఉదాహరణకు : వృక్షం ప్రతి.

ఇటువంటి ఎన్ని ఉదాహరణలైనా చూపవచ్చును.

ఈ విధంగా సరళ సుందరంగా వ్యాకరణ శాస్త్రాన్ని అనువదించుట అందరికి సాధ్యమయ్యే పని కాదు. సంస్కృత సూత్రాలను తెలుగులో కూడా సూత్రీకరించుటకు చేసిన ప్రయత్నం ఇందులో కనిపిస్తుంది. సంస్కృత సూత్రాలను వ్యాఖ్యానించగలరు కానీ సూత్రీకరించుట అంత సులభం కాదు. అవధానిగారు సూత్రీకరణలో సంక్షిప్తిత చోటుచేసుకున్న వైనం ఈ

సంస్కృత వ్యాకరణ సంగ్రహంలో కనిపిస్తుంది. సూత్రీకరణకు సంక్షిప్తీకరణ ప్రాణం లాంటిది.

## 5. విశాలాంధ్రోదాహరణము

తెలుగు కవిత ఆశుకవిత, మధురకవిత, చిత్రకవిత విస్తర కవిత అని నాలుగు విధాలు. అందులో ఉదాహరణ కృతులు మధురకవిత కోవకు చెందుతాయని పండితాభిప్రాయం. ఉదాహరణ లక్షణాలు ఉన్న పద్యాలు కొన్ని ప్రాచీన శాసనాలలో కనిపించుటచే క్రీ.శ. 10వ శతాబ్దినుండి ఈ లక్షణాలున్న పద్యాలు తెలుగులో ఉన్నాయని శ్రీ నిడదవోలు వెంకట్రావు గారు తన ఉదాహరణ వాఙ్మయ చరిత్రలో చెప్పినారు. ఇప్పటివరకు తెలుగులో సుమారు పాతికదాకా ఉదాహరణ కృతులు వెలువడినాయి. తెలుగులోనూ సంస్కృతంలోనూ మొట్టమొదట ఉదాహరణ కృతులు రాసినవాడు పాల్కురికి సోమనాథుడే. అతని బసవోదాహరణమే రెండు భాషలలోనూ మొదటిది. ఆ తరువాతది త్రిపురాంతకోదాహరణం రచింపబడింది.

ఈ లక్షణాలన్నీ దివాకర్లవారు రాసిన విశాలాంధ్రోదాహరణంలో ఉన్నాయి. పద్యాలు కళికలు ఉత్కళికలు మొత్తం 25 వరకు ఉన్నాయి. మరియొక విశేషమేమనగా ఇప్పటివరకు దైవపరంగాను వ్యక్తులపరంగాను ఈ ఉదాహరణ కృతులు వెలసినవి. దివాకర్లవారు రాష్ట్రపరంగా ఉదాహరణ కృతిని రచించి ఒక కొత్త మార్గానికి నాందీ పలికారు. ఇది ఒక వినూత్న పద్ధతి. దివాకర్లవారికి గల రాష్ట్రాభిమానానికిది ఉదాహృతి.

### ఉదాహరణ కావ్య లక్షణాలు

ఉదాహరణ కావ్యాలు మార్గదేశి పద్ధతుల మేళనంలో ఉంటాయి. ఇవి స్తోత్ర రూపమైన లఘుకృతులు. దైవపరంగా కాని మానవ పరంగా కానీ వుంటాయి. ఉదాహరణ కృతులలో వృత్తాలు - కళికలు, ఉత్కళికలు, సార్వవిభక్తిక పద్యము, కవికృతనామాంకిత పద్యము, అనే విభాగాలుంటాయి.

ప్రతి విభక్తికి ఒక వృత్తము, ఒక కళిక, ఒక ఉత్కళిక నియతములు.

ప్రతి పద్యం తరువాత ఒక కళిక ఒక ఉత్కళిక రాయాలి. కళిక అనగా మాత్రాచ్ఛందస్సుకు సంబంధించిన రగడభేదం. ఇందులో ఎనిమిది పాదాలుంటాయి.

ఉత్కళిక అనగా కళికలో సగభాగం. ఇందులో కూడా ఎనిమిది పాదాలుంటాయి.

కళికలో ప్రతి పాదంలో విభక్తి ప్రత్యయం భాసించాలి. ఉత్కళికలో చివరి రెండు పాదాల్లో విభక్తి ప్రత్యయం భాసిస్తే చాలు.

కవికృత నామాంకిత పద్యం కొన్ని ఉదాహరణ కావ్యాల్లో కనిపిస్తుంది. కొన్నిటిలో లేదు. ఈ ఉదాహరణ కావ్యాలకీపేరు వచ్చిన విధానాన్ని గురించి శ్రీ నిడదవోలు వెంకటరావుగారీ విధంగా వివరించారు.

ప్రథమాదిసప్తవిధ విభక్తుల నుదహరించుచు నియతములగు నక్షర గణములతో కూడిన యొక వృత్తమును, లేక పద్యమును ననియతములగు మాత్రాగణములతో కూడిన యొక పద భేదమును గూర్చి చెప్పబడినవి కావుననే వీనికి యుదాహరణములని పేరు వచ్చింది.

ఈ విశాలాంధ్రోదహరణాన్ని దివాకర్లవారు 1956 సంవత్సర ఆంధ్రరాష్ట్ర అవతరణ సందర్భంగా రచించారు. రాష్ట్ర వైభవం, చారిత్రకాంశాలు, నదుల ప్రశంస, ఆంధ్రులు చేసిన త్యాగాలు ప్రసిద్ధ రాజుల సంస్కృతి, కవుల ప్రస్తావన, ఆంధ్ర రాష్ట్రం కోసం చేసిన పోరాటం, తెలంగాణా విమోచనకై జరిగిన సంఘర్షణ. వనరుల గురించి యుగంధరాది మంత్రుల గురించి, త్యాగరాజు, సంగీతాన్ని, కూచిపూడి నృత్యాన్ని వీరుల శౌర్యాన్ని వర్ణిస్తూ రాసిన పద్యాలు కళికోత్కళికలు ఇందులో చోటుచేసుకున్నాయి.

ఉదాహరణకు ప్రథమావిభక్తిలో చెప్పిన పద్యం రాష్ట్ర వైభవ ప్రస్తావన చూడండి.

> ''శ్రీలకు నాలవాలము నశేష జనస్తవనీయ వృత్తమున్
> శాలిముఖ ప్రసిద్ధ బహుసస్యసమృద్ధము శాస్త్ర శిల్పవి
> ద్యాలసితమ్ము, వైభవ నిధానమునైన మహాంధ్రరాష్ట్రము
> ద్వేలయశః ప్రమోదనిరతింగల కాలమెసంగు గావుతన్'' [6]

ఇందులో ఆంధ్ర రాష్ట్ర వైభవం సూత్రప్రాయంగా చెప్పబడింది. కవితాధార కమనీయంగా ఉంది. శ్రీకారంతో ప్రారంభింపబడింది. శుభకామమన చోటు చేసుకొంది. 'ము' అనే ప్రథమా విభక్తి ప్రత్యయం వాడుట ఇందులో ద్యోతకమవుతుంది. ద్వితీయాభక్తి పరంగా చెప్పిన కళికలో 'మరియు శాతవాహన నృపమౌళిగుప్తమైన దాని నిరత కృతాధ్వఘామా న్విత పరిసరమ్మైనదాని చిర మిక్ష్వాకూర్వీపులచే బాలితమ్మైన దాని గురునాగార్జున కమ్రోక్తులసారము గొన్నదాని చాళుక్యాధిప బాహాశ్రయ సంపదమన్నదాని పాలిత వేదోక్తనిధి ప్రకరాంచితమ్మైనదాని కాకతీయ నృపతి పరాక్రమ రక్షితమ్మైనదాని ప్రాకట కీర్తి జ్యోత్స్నా ప్రభువు సడిసన్నదాని'' [7]

ఇందులో శాతవాహన ఇక్ష్వాకు, చాళుక్య, కాకతీయ రాజులచే పరిపాలింపబడి కీర్తిచంద్రికలను వెదజల్లినదని చారిత్రక వైభవాన్ని చాటిచెప్పారు. 'ని' అనే ద్వితీయా విభక్తి ప్రత్యయం ప్రతిపాదించి చివర వచ్చే విధంగా చెప్పారు.

షష్ఠీవిభక్తిలో చెప్పిన ఉత్కళిక ఈ విధంగా ఉంది -

''క్రొత్త మత్తాశ్వముల ద్రోలుచు
బిత్తరయమెసగంగ బోవుచు
రథము యువకునిపై డరల్చిన
ప్రథమ పుత్రుని స్మృతి వచించిన
మరణదండన పాలుచేసిన
రాజుపాలన గన్నధరణికి
తేజమెరసిన పుణ్యసరణికి'' [8]

షష్ఠీవిభక్తి ప్రత్యయమైన ''కి'' చివరి రెండు పాదాల్లో వాడబడినది.

శాతవాహన చక్రవర్తి తనయునకు మరణదండన విధించి చేసిన ధర్మపాలన ప్రస్తుతించ బడింది.

కొన్ని ఉదాహరణలలో వలె కవికృతనామాంకిత పద్యం ఇందులో కనిపించదు. మిగిలిన ఉదాహరణ కావ్యలక్షణాలన్నీ ఇందులో సంపూర్ణంగా ఉన్నాయి. విశాలాంధ్ర రాష్ట్రం కోసం పొట్టి శ్రీరాములు చేసిన ప్రాణత్యాగము తెలుగువారు చేసిన పోరాటము విశాలాంధ్ర రాష్ట్రం సంపాదించుకొన్నప్పుడు తెలుగువారు పొందిన ఆనందం ఇందులో వర్ణింపబడింది. దివాకర్ల వారికిగల రాష్ట్రాభిమానానికి ప్రతిబింబం ఈ విశాలాంధ్రోదాహరణం.

విద్యారణ్యుల తపోమహిమ, అరి భయంకరుడైన తిమ్మరుసు ప్రజ్ఞ, వీరభామిని రుద్రమాంబ పవిత్ర యశము బాలచంద్రుని పరాక్రమము, బృహస్పతితో సమానుడైన యుగంధరుని ప్రతిభలను కూడా వర్ణించి వీరినందరిని కన్నతల్లిగ, వితతరసముల కావ్య సుమముల నెల్వరించినమంజువల్లిగా ఆంధ్ర రాష్ట్రాన్ని దివాకర్లవారు వర్ణించారు. ఇది ఆయన కవితాధారకు చక్కని తార్కాణం.

## 6. సుందర సందేశం - గేయ సుందర కాండము

దివాకర్ల వేంకటావధానిగారు 1978 డిసెంబరులో ఒకసారి భద్రాచలం వెళ్లారు. అక్కడ పదిమంది వైష్ణవులు సుందరకాండను పారాయణం చేస్తుండగా విన్నారు. అప్పుడే సుందరకాండగేయ రచనకు ప్రేరణ కలిగింది. వెంటనే శ్రీ వాల్మీకి మునీంద్రులు దయతో తెల్పిన రాముని దివ్యకథా అను మకుటం స్ఫురించిందట. అప్పటినుండిగేయఛందస్సులో సుందరకాండ రాయడానికి పూనుకున్నారు. గేయకవితలో కూడా యతిప్రాసలు-వాడటం విశేషం. 1979 మార్చి 7వ తేదీ నాటికి పూర్తిచేశారు. పూర్తిచేసిన వెంటనే సత్యసాయి బాబాగారు కలలో కనిపించారు. ఆయనకు కలలోనే ఈ గేయ సుందరకాండను అంకితం

చేశారు. మరల 1979 మార్చి 16వ తేదీ సత్యసాయిబాబాగారు హైదరాబాద్‌కు వచ్చారు. అప్పుడు అవధానిగారు తాను రాసిన సుందరకాండ వ్రాత ప్రతిని అంకితం చేశారు. అదే సంవత్సరం ఏప్రిల్ 17వ తేదీ శ్రీరామనవమి వరకు దీని ప్రచురణ పూర్తిచేశారు.

ఇది వాల్మీకి రామాయణ సుందరకాండకు గేయ అనుసరణం. ఈ అనుసరణ విధానాన్ని గురించి అవధానిగారీ విధంగా తెలియజేశారు.

''ఇది శ్రీమద్వాల్మీకి మహాముని విరచిత శ్రీ మద్రామాయణమునందలి సుందరకాండమునకు ఆంధ్రగేయ రూపమైన అనుసరణము. సన్నిహితాంధ్రీకరణము కాదు. కాని ఆదికవి రచనయందలి ముఖ్యములైన కథాంశములను కాని, ఉపమానాదులను కాని ఇందు విడువలేదు. 'నామూలంవిఖ్యతేకించి'' త్తనునట్లు మూలమునందులేని దానిని ఇందు చేర్చలేదు. దీనిని చదివి యెల్లరును శ్రీమద్రామాయణ సుందరకాండము నందలి పరమార్థము నెరుంగవచ్చును. తత్పఠన పారాయణ ఫలమును కూడా పొందవచ్చును. ఆదికవి రచన ననుసరించియే యిందు శ్రీ గాయత్రీ మహామంత్రమందలి సుందర కాండమున వచ్చు బీజాక్షరములు కూడా యథాస్థలమున చొప్పింపబడినవి'' [9]

సుందరకాండను పరిశీలిస్తే ఇది యథార్థం అని తెలుస్తుంది. అవధానిగారు అనుసరణం అని వాడిన ఈ మాటలో ఇది అనువాదం కాదని తెలియుచున్నది. అనువాదానికి అనుసరణకు కొంత భేదం ఉంది. అనుసరణలో కవికి కొంత స్వేచ్ఛ ఉంటుంది. స్వతంత్ర భావాలను సొంత అభిప్రాయాలను చెప్పడానికి అవకాశం ఉంటుంది. సుందరకాండను అవధానిగారు నిత్యం పారాయణ చేసేవారు. ఆయనకు సుందరకాండ మీద ఎంతో భక్తిశ్రద్ధలుండేవి. అందుకే దీనిని పఠించిన వారికి పుణ్యం కలుగుతుందని పేర్కొన్నారు. సుందరకాండ ఇతివృత్తాన్నే 'మధువనము' అనే పేరుతో నిర్వచన పద్యకావ్యంగా కూడా రచించారు. ప్రక్రియాభేదం తప్ప ఈ రెండు కృతులలోని ఇతివృత్తం ఒకటే.

సుందరకాండ రామాయణంలో తాత్త్విక మహిమయందే కాకుండా కవితా కౌశలంలో కూడా అద్వితీయమైనది. కావ్యదృష్టితో చూసినా కూడా సుందరకాండ నవరసపోషణతో హృదయంగమ వర్ణనలతో ఉదాత్త భావాలతో కూడి ఉంది. సముద్ర నగర, ఆరామా వరోధస్త్రీ, యుద్ధ విరహ చంద్రోదయాదులిందులో సుందరంగా వర్ణింపబడినాయి. వాల్మీకి లంకానగరాన్ని నాగరిక సుసంపన్నమైన రాజధానిగా వర్ణించాడు. రసపోషణ విషయంలో రావణుడు సీతతో మాట్లాడేటప్పుడు శృంగార రసాభాస పరాకాష్ట పొందింది. వానరులు మధువనంలో చేసిన చేష్టలు వర్ణించే సందర్భంలో హాస్యరసము, లంకాదహన సందర్భంలో భయానక బీభత్సరసాలు, హనుమంతుడు సముద్రాన్ని దాటేటప్పుడు అద్భుత రసం, హనుమంతుడు రావణునితో యుద్ధం చేసేటప్పుడు వీరరౌద్ర రసాలు, సీత

దుఃఖంలో కరుణ రసము పోషింపబడినాయి. సుందరకాండలో పేరుకు తగినట్లే సుందరం కానిదేదీ లేదు. సుందరకాండ ఆద్యంతము సుందరమైనది. దీనిని అవధానిగారు చతురస్ర గతికి చెందిన గేయాలతో ఆదినుండి అంతం వరకు రచన సాగించారు. చతురస్రగతి అనగా ఒక్కొక్క పాదంలో నాలుగేసి మాత్రలగణాలు నాలుగుంటాయి. 16 మాత్రలు ప్రతి పాదంలో వుంటాయి. ఎనిమిదేసి పాదాలున్న గేయాలిందులో వున్నాయి. ఇటువంటివి 460 గేయాలున్నాయి. 3680 చతురస్ర గతి గేయపాదాలిందులో ఉన్నాయి. ప్రతి గేయం చివర మకుటం ఉండుట గమనార్హం. వాల్మీకి 58 సర్గలలో శ్లోకాలలో సుందరకాండను రచించారు. హనుమంతునికి సుందరుడనే పేరు కూడా ఉంది. ఇది హనుమంతునిపై భక్తితో సుందరకాండ శుభావహమైనదన్న నమ్మకంతో చేసిన రచన. ఈ సుందర సందేశమును గురించి డా. సి.రాజేశ్వరిగారు (అవధానిగారి కుమార్తె) ఇలా ప్రవచించారు.

''వేంకటావధానిగారికి సుందరకాండ పఠనము ప్రతిదిననియతి. రామాయణంలో సుందరకాండమునకుంది ప్రత్యేకద్యుతి. ఆ కాండమునందలి ప్రత్యంశమును సమగ్రముగ సమీక్షించింది వారి పాండితీద్యుతి. ఆ కాండమునందలి సుందరత్వమునకు కరదీపిక అనదగిన అనేకాంశములను ప్రకటించింది వారి పరిశోధనాప్రతి. అంతేకాక 'మధువనము' అను సుందరకాండ కథాకావ్యమును 'సుందర సందేశము' అను గేయ సుందరకాండమును వెలువరించి తెలుపుకున్నారు తమకా కాండమునగల ఆసక్తి'' [10]

## అనువాద నాటకాలు

### 7. కౌముదీ మహోత్సవము

క్రీ.శ. 7వ శతాబ్దికి చెందిన 'విజ్జిక' అను కవయిత్రి సంస్కృతంలో రచించిన నాటకాన్ని (కౌముదీ మహోత్సవం) దివాకర్ల వేంకటావధానిగారు 1943వ సంవత్సరంలో తెలుగు లోనికి నాటకంగా అనువదించారు. ఇది మూలానికి సన్నిహితానువాదమని అవధానిగారే పేర్కొన్నారు. సంస్కృతంలో రచించిన నాటకకర్తను గురించి మాత్రం కొన్ని అభిప్రాయభేదాలున్నాయి.

సంస్కృత నాటకంలో నాలుగవ అంకంలో పందొమ్మిదవ శ్లోకంలో 'విజయా' శబ్దం ప్రముఖంగా వాడబడినది. విజ్జశబ్దం విద్యా శబ్దానికి ప్రాకృతరూపం. దీనికి విజయాశబ్దానికి ఎలాంటి సంబంధము లేదు. ఈ పందొమ్మిదవ శ్లోకంలోనే 'అనంత నారాయణ' పదం కూడా కలదు. అనంత నారాయణుడు తిరువనంతపురంలో ముఖ్యదైవం. సంస్కృత కవుల్లో అనంత నారాయణుడను పేరుగల కవి ఒకడు కలడు. ఇతడు చంద్రికా జనమేజయమును రచించాడు. ఈ శబ్ద ప్రయోగాన్ని బట్టి 'కౌముదీ మహోత్సవము' విజయా కర్తృకమని

కొందరు, అనంత నారాయణుని కర్తృకమని కొందరు ఊహించుచున్నారు. ఈ విధంగానే భరతవాక్యంలో నీలకంఠ పదం ప్రముఖంగా వాడబడింది. కాబట్టి ఈ నీలకంఠుడే కౌముదీ మహోత్సవ నాటకాన్ని రచించాడని మరికొందరూహించుచున్నారు. నీలకంఠ కవి క్రీ.శ. 850 ప్రాంతం వాడని చెప్పవచ్చు. కానీ ఈ నాటక శైలికి అనంత నారాయణ కవి శైలికి కౌముదీ మహోత్సవ నాట శైలికి సంబంధమంతగా కనిపించకపోవుటచే ఈ ఊహలు సరియైనవి కాదనవచ్చును. అని పీఠికలో పేర్కొనబడి ఉంది.

అవధానిగారు మాత్రం 'విజ్జికారచిత నాటకానువాదము'గానే దీనిని పేర్కొన్నారు. సంస్కృతనాటకాంతంలోగాని ప్రస్తావనలోగాని నాటకకర్త పేరు నాటకం పేరు పేర్కొనలేదు. తాళపత్ర లేఖకుడు నాటకాంతంలో కౌముదీ మహోత్సవమని పేర్కొనుటచే దీనికీ పేరు స్థిరపడి ఉండవచ్చునని శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు అభిప్రాయపడినారు. సంస్కృత మూలానికి ఈయన ఉపోద్ఘాతం రచించారు. అవధానిగారు కూడా ఈ అభిప్రాయంతో ఏకీభవించారు. ఇందులోని వస్తువు మగధ రాజైన సుందరవర్మకు దండనాధుడుగా ఉండిన చండసేనుడు లిచ్ఛవులతో కుట్రపన్ని పాటలీపుత్రంపై దండెత్తెను. ఆ యుద్ధంలో సుందరవర్మ మరణించెను. చండసేనుడే మగధరాజయ్యెను. సుందరవర్మకు మంత్రి అయిన చంద్రగుప్తుడు రాజకుమారుడైన కళ్యాణవర్మను వింధ్యపర్వత ప్రాంతంలో పంపాతీర సమీపంలో ఉంచి పెంచి తాను రకరకాల మారువేషాలతో రాజకుమారుని సింహాసన మెక్కించుటకు యత్నించెను. కొన్ని యేండ్లు గడిచిన తరువాత సైన్యాన్ని సమకూర్చుకుని చండసేనుని సంహరించి మగధ రాజ్యానికి కళ్యాణవర్మను రాజునుగా చేసెను. ఇందులో ఒక ప్రణయగాథ కలిసి ఉన్నది.

శూరసేనాధిపుడైన కీర్తిసేనుని కూతురు కీర్తిమతి తండ్రి ఆజ్ఞననుసరించి వింధ్యాపర్వత వాసియైన వింధ్య వాసినీ దేవిని ఉపాసించుటకై యోగసిద్ధి అను ఒక పరివ్రాజికతో ( ఈమె సుందరవర్మ పరిచారికులలో ప్రథమురాలు) వచ్చి వింధ్య పర్వతమందు గల కళ్యాణవర్మను చూసి మోహించెను. కళ్యాణవర్మ కూడా ఆమెను ప్రేమించెను. వీరిద్దరికి కళ్యాణము చేయాలని పరివ్రాజిక ప్రయత్నించెను. ఇందులో మంత్రగుప్తుని కృషి ఫలించి రాజ్యం కళ్యాణవర్మకు దక్కెను. కీర్తిసేనుడు తన కుమార్తె కళ్యాణ వర్మకు మనసిచ్చిన విషయం తెలిసి అతనికిచ్చి వివాహం చేయడానికి నిశ్చయించి కబురంపెను. కళ్యాణవర్మ అందుల కానందంతో ఒప్పుకొనెను. నాటకం వారి కళ్యాణముతో శుభాంతమగును''

**నాటక** వస్తువు సర్వసాధారణమైనది. కానీ కొన్ని చారిత్రకాంశాలిందులో చోటు చేసుకున్నాయి. లిచ్ఛవులను వారు మగధపై దండెత్తుట చరిత్రలో క్రీ.శ. 2వ శతాబ్దినుండి 6వ శతాబ్ది వరకు శతాబ్దికొకసారి అయిన మగధరాజ్యం అన్యాక్రాంతమగుట సంభవిస్తూ

వచ్చింది. లిచ్ఛవుల యొక్క మాగధుల యొక్క చరిత్ర ఇంకా పూర్తిగా విస్తృతం కాలేదు. అందువలన ఈ నాటకంలోని పాత్రలకు చారిత్రక వ్యక్తులతో గల సంబంధం నిర్ణయించుటకు వీలు కలుగుట లేదు అని అవధాని గారభిప్రాయపడినారు. ఇది ఐదంకాల నాటకం. అనువాద నాటకం కాబట్టి సంస్కృత నాటకంలో ఉన్న నాటక లక్షణాలే ఇందులో చోటుచేసుకున్నాయి. భాష సరళంగా ఉంది విషయం సర్వసాధారణమైనదైనా అవధానిగారు రచించిన కొన్ని పద్యాలు మాత్రం ప్రశంసనీయంగా ఉన్నాయి.

ఉదాహరణకు :

ప్రథమాంకంలో కళ్యాణవర్మ కీర్తిమతిని తొలిసారిగ చూసిన సందర్భంలో -

''సిరిమధితాబ్ధి నూర్వశికుశేశయ జాతుని యూరువందు దా
శరధి కళత్రమాజనక జామణినాగటిచాలునందు గ్ర
ష్ణరుచిరవేది మధ్యమున సంభవ మొందిరటంద్రుకాని చూ
పఱకనులన్ సుధంజిలుకు పద్మిని యెయ్యెడ నీమెపుట్టెనో'' [11]

- అని తలపోయును. ఇందులో పూర్వగాథలను తడివిన వైనం చూపరుల కనులలో అమృతాన్ని కురిపించే పద్మిని అని వర్ణించుట ఎంతో ముదావహంగా ఉంది. ఈ పద్యాన్ని విన్నప్పుడుగానీ పఠించినప్పుడుగానీ ఊర్వశిని సీతను ద్రౌపదిని గుర్తుచేసుకొని కీర్తిమతి రూపాన్ని ఊహించుకోవలసి వస్తుంది. వర్ణనలో ఇది ఒక విధమైన చమత్కారం.

పంచమాంకంలో కౌముదీ మహోత్సవాన్ని వర్ణించే సందర్భంలో -

''సదమల మున్నమతమ్మయిన సౌధము నగ్రమునెక్కి భూవిభుం
డుదిత విశేష సంభ్రమసమత్వుట మౌపురి జూడగోరెడిన్
ఉదయ నగేంద్ర కూటమున నుండి శశాంకుడుదీయ మానుడై
ముదమున నుచ్చలోర్మియయి పొంగులు వారు సముద్రమున్వలెన్'' [12]

ఇందులో చక్కని ఉపమాలాంకారాన్ని ప్రయోగించి సందర్భోచితంగా రాజును రేరాజుతో నగరాన్ని సముద్రంతో ఉపమించి చెప్పిన విధానం ఎంతో సమంజసంగా ప్రశంసనీయంగా ఉంది.

ఈ నాటకంలో గద్యాలకంటే పద్యాల సంఖ్య ఎక్కువగా ఉన్నాయి. కౌముదీ మహోత్సవంలో ప్రధాన రసం శృంగారం. వీరహాస్యరసాలు అంగరసాలుగా సందర్భోచితంగా పోషింపబడినాయి. కీర్తిమతి కళ్యాణ వర్మల ప్రణయంలో శృంగార రసం పోషింపబడింది. లలితమైన పదజాలంతో శృంగారరసోచితమైన ఛందస్సు హృద్యంగా ఉంది.

మంత్రగుప్తుడు తన తంత్రంతో చండసేనుని వధించిన సందర్భంలో వీరరసం పోషింపబడి ఉంది.

విదూషకుని పాత్రలో సున్నితమైన హాస్యరసం పోషింపబడి ఉంది.

దృశ్యకావ్యమైనను పద్యాలు వర్ణనాత్మకమై అవధానిగారి పద్యశిల్పాన్ని చాటుచున్నాయి. అనువాద నాటకమైనను పాత్ర పోషణ సజీవంగా ఉంది. సంభాషణలెంతో సరసంగా సహృదయకరంజకంగా ఉన్నాయి.

అవధానిగారీ నాటకాన్ని తన ముప్పై ఒకటవ యేట రచించారు. 1943 ప్రాంతంనాటి రాజకీయ సాంఘిక ప్రభావాలు ఈ నాటకంలో కనిపించవు. అనువాద నాటకాల్లో కూడా కొందరు రచయితలు సమకాలీన రాజకీయ సాంఘిక ప్రభావాలను సంభాషణల్లోనో వర్ణనల్లోనో చొప్పించుటకు యత్నిస్తారు. కానీ అవధానిగారటువంటి ప్రయత్నం చేసినట్లు కనిపించదు.

ఉదా: చెలినెదుట గాంచుచున్నను
గలుగదు ప్రత్యయము వింతగలగెడు నాకున్
బలుసారులు తలపులచూ
పుల బడియును నామె మోసపుచ్చిన కతనన్'' [13]

ఈ పద్యం సంస్కృత కవుల భావనకు దగ్గరగ ఉంది. ఈలాంటి పద్యాలు కొన్ని ఈ నాటకంలో ఉన్నాయి.

## 8. నాగానందము

సంస్కృతంలో విశ్వవిఖ్యాతి చెందిన నాటకం హర్షుని నాగానందము. దీనిని తెలుగులో నాటకంగా శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు దివాకర్ల వేంకటావధానిగారు అనువాదం చేశారు. ఇది ఐదంకాల నాటకం. అందులో మొదటి రెండంకాలు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు అనువాదం చేసి దివంగతులు కాగా మిగిలిన మూడంకాలను దివాకర్లవారనువదించారు. ఇది 1954వ సంవత్సరంలో ముద్రింపబడింది. ఇందులో ఇతివృత్తం ప్రఖ్యాతం. అహింసా సిద్ధాంతాన్ని ప్రబోధించుట ఈ నాటక ముఖ్యోద్దేశం. అదే ఇందులోని సందేశం.

ఇందులో దయావీరం ప్రధానరసం. శృంగారం అంగరసం. ఇందులోని జీమూత వాహనుని పాత్ర పాషాణహృదయాన్నైనా ద్రవింపజేస్తుంది. ప్రభాకర పరిశోధకమండలి వారు దీనిని ప్రచురించారు.

జీమూతవాహనుడు విదూషకుడు మలయపర్వతానికి ప్రయాణమౌతారు. నాయకుడైన జీమూతవాహనునికి కుడికన్నదరుతుంది. అక్కడ మలయవతిని చూస్తారు. మలయవతి జీమూతవాహనులు పరస్పరానురాగ యుక్తులవుతారు. వారిద్దరికి వివాహం జరుగుతుంది.

కుసుమకరోద్యానవనానికి విహారానికి వెళ్లినప్పుడు మిత్రావసువు జీమూతవాహనుని రాజ్యాన్నపహరించిన మతంగుని హతమార్చడానికి అనుజ్ఞ కోరును. మలయవతి తల్లి రక్తాంబరాలను దంపతులు పదిరోజులు ధరించడానికి పంపుతుంది. మిత్రావసువు జీమూతవాహనుడు సముద్ర తీరం చూడటానికి వెళ్లుతారు. అక్కడ గుట్టగా ఉన్న పాముల ఎముకలను చూసి జాలిపడతాడు. ప్రతీహరి వచ్చి మిత్రావసువును తీసుకొని వెళ్లను ఒంటరిగా ఉన్న జీమూతవాహనునికి శంఖచూడుడు, అతని తల్లి దుఃఖంలో కనిపిస్తారు. శంఖచూడుని రక్షించడానికి తాను గరుడునికాహారంగా వెళుతాడు. గరుత్మంతుడాతనిని భుజించేటప్పుడు అతని నిబ్బరాన్ని చూసి యదార్థం అడిగి తెలుసుకొని పశ్చాత్తాప పడతాడు. ఇంతలో శంఖచూడుని వలన విషయం తెలిసికొని జీమూతవాహనుని తల్లిదండ్రులు మలయవతి అందరూ అక్కడికి వస్తారు. గరుత్మంతుడు అమృతం తెచ్చి నాగులను బ్రతికిస్తాడు. భవానీదేవి ప్రత్యక్షమై జీమూతవాహనుని జీవింపజేస్తుంది. ఇదీ సంగ్రహంగా ఇందులో ఇతివృత్తం.

ఈ ఐదంకాలలో చివరి మూడంకాలు అవధానిగారి రచన. ఇందులో గద్యలలోని భాషలో వ్యావహారిక భాషాచ్ఛాయలు కనిపిస్తాయి. ప్రభాకరశాస్త్రిగారు రెండంకాలు అలాంటి భాషలోనే అనువదించారు. కనుక అవధానిగారు కూడా ఈలాంటి భాషలోనే అనువాదం చేశారు. కానీ పద్యాలలో మాత్రం గ్రాంధికమే వాడబడింది.

అవధానిగారు చక్కని పద్యాలు రచించారు. అనువాదంలో కూడా ఎంతో వైశిష్ట్యం కనిపిస్తుంది.

పంచమాంకంలోని ఈ పద్యానువాదం (20-ప) ఎంత చక్కగా కుదిరిందో గమనించండి.

''ఆత్మీయః పర ఇత్యయం ఖలు కుతః సత్యం కృపాయాం క్రమః
కిం రక్ష్యాబహనః కిమేక ఇతి తేజాతాన చింతాకథమి'' [14]

లార్హాత్ త్రాతుమహిం స్వజీవిత పరిత్యాగం త్వయాకుర్వతా యేనాత్మా పితరౌ వధూరితె హతం నిశ్శేషమేతత్త్యులమ్. తండ్రి జీమూత కేతువు కుమారుడు జీమూతవాహనుని గురించి దుఃఖిస్తూ దయచూపడంలో నావాడు పరుడు అనే భేదభావం ఎందుకు? రక్షించాల్సిన వాళ్లు చాలా మందా ఒక్కడా అనే చింత ఎట్లా ఉంటుంది. గరుడుని వల్ల ఒక సర్పాన్ని రక్షించుటకు నీ జీవితాన్నే త్యాగం చేస్తూ నిన్ను, తల్లిదండ్రులను కోడలినే కాదు

సర్వవంశాన్నే నిశ్శేషంగా నాశనం చేశావు అని విలపించి జీమూతవాహనుని పరోపకార బుద్ధిని ప్రశంసించారు. దీనికి అవధానిగారి అనువాదం.

''మ''పరుడాత్మీయుడు నని క్రమంబు కరుణం బాటిల్లదౌ నిక్కమొ
క్కరుడా పల్కరే? రక్ష్యులన్యతపుకలన్ లేదునీ కౌటి, కీ
యురగున్ దార్క్ష్యుని నుండి ప్రోచుటకు మైనుజ్జించునీ చేత
పరియొంగాదె పితృప్రియాత్మమయ మీయావత్కులంబక్కటా'' [15]

ఇంకొక శ్లోకానువాదం -

''నతభాసుల యతిమన్యే
మలయవతీ మలయచంద నరసార్ద్రా
అభివాంచితార్థ సిద్ధై
వధ్య శిలేయం యథాశ్లిష్టా'' [16]

కోరిన కోరిక సిద్ధించుటకై ఆలింగనం చేసుకొన్న ఈ వధ్యశిల ఎట్లా సంతోష పెట్టుతుందో మలయ గంధం పూసుకున్న మలయవతి కూడా అంతటి సుఖాన్నిస్తుందనుకొనను - అని ఈ శ్లోకానికి అర్థం. ఈ అర్థాన్ని అవధానిగారు -

''ఇష్టకార్య సిద్ధి నెనయుటకై సమా
శ్లిష్ట మొదటి వధ్యశిలయు బోలె
మలయబార్ద్రమైన మలయ వతియు గూడ
హాయినొసగ జాలదనుచు దలతు'' [17]

సంస్కృతంలో ఉన్న యథాతథా ఎట్లో అట్లు అనే సంబంధ వాచక పదాలకు బదులుగా 'పోలే' అనే ఉపమాన వాచక పదం అనువాదంలో చేరింది. ''కూడా'' అనే మరో వైశిష్ట్యమైన పదాన్ని ఊతగా గ్రహించాల్సి వచ్చింది. మూలభాషలోని నుడికారాలను జాతీయాలను యథాతథంగా అనువాదం చేయుట భాషా స్వభావాన్ని బట్టి సరిపడదు. కాని అభిప్రాయం భిన్నం కాకూడదు. ఈ పద్యంలో సంస్కృత మూలాభిప్రాయాన్ని చక్కగా అవధానిగారు వివరించారు. అనువాదం తగిన విధంగా హృద్యంగా ఉంది.

## 9. కవితలు

అవధానిగారి కవితలు సుప్రసిద్ధ తెలుగు పత్రికలలో అన్నిటిలో ప్రచురింపబడినాయి. సన్మాన సంచికలకు, కవి సమ్మేళనాలకు, కళాశాలల వార్షికోత్సవ సంచికలకు, ఉగాది మొదలైన పండుగల సందర్భాలలో రాసిన కవితలు సుమారు 159 వరకు లభ్యమైనాయి.

వీటి వివరాలు శ్యామలగారు తమ ఎంఫిల్ సిద్ధాంతవ్యాసంలో ఇచ్చారు. ఇవిగాక త్రింశతి పేరుతో ముప్పై కవితా ఖండికలు సంకలనంగా ప్రచురితమైనవి. ఈ సంకలనాన్ని గురించి పద్య రచనల విభాగంలో చర్చించాను. నవరత్నాలు, నక్షత్రమాలలు, స్తుతిపద్యాలు స్వాగతపద్యాలు వంటివి 15 దాకా ఉన్నాయి.

అవధానిగారు రాసిన కవితలు ఎంతో భావగర్భితంగా హృద్యంగా ఉన్నాయి. ఛందోబద్ధమై చక్కని కవితా ధారతో ఉన్నాయి. వీటినన్నిటిని సంపుటీకరిస్తే ఒక మంచి పద్య కవితా సంకలనం వెలుగుచూడగలదు.

మచ్చుకు కొన్ని పద్యాలు -

'శరన్మేఘము' అనే శీర్షికతో 1929లో భారతిలో ప్రచురింపబడిన పద్యాలు -

1. ఎనలేని సంతోషమును దాల్చి పాడునే కవి బర్హిణంబు నిన్గనినయంత
భగదాగమంబును వాంఛించి నిల్చునే యాచక చాతకంబహరహంబు
విపులమై సర్వదిగ్విశదమై వెలయునే శ్రితఘనస్తోత్ర గర్జితముజగతి
అశాంతములదాక వ్యాపింపజాలునే యుదయించి కీర్తివిద్యుత్ప్రకాశ

మేమియును లేక బ్రతికెదవేమిబ్రతుకు
దానధారలు లేని లుబ్ధప్రసక్తి
గనిన నీవల్ల లోకోపకారమున్నె?
ఆకృతినేమిలే శరదంబురంబ!

2. సాధుజనాపకారమును సల్పినదాననె యే ను మీకున్
బాధ ఘటిల్లెనంచనన భాసిలునాశల గుప్పుచున్ జగ
న్నాథ దివాకరార్చుల ఘనంబగు తేజమునబ్బిలెచు నీ
బాధమవృత్తితో మెలగు నట్టి భవచ్చరితంబు నచ్చునే''

ఈ రెండు పద్యాలు అవధానిగారు తన 17వ ఏట రచించారు. ఇవి ఎంతో లోతైన భావాలతో ఉపమానాలతో చక్కటి ధారాశుద్ధితో ఒప్పుచున్నాయి. తొలిదశలో కూడా చక్కటి కవితలు రాసే వారనడానికి తార్కాణంగా ఉన్నాయి.'' [18]

1930 నవంబరు భారతిలో ప్రచురింపబడిన పద్యాలనుండి - శీర్షిక ''ఒక శరద్రాత్రి''

''పొంగి పొరలిన యనురాగమునకు గొంత
మొదటి యుద్ధతి తగ్గినా? పూరుషుండు
నలసియుండియొ? పారవశ్యమ్మొగాని
కాంత యెడిలోన గాంచె సుఖప్రసుప్తి
హద్దునుపద్దులేక హృదయంబున బుట్టెడు భావపంక్తితో
నిద్దుర వోవుచున్న ప్రియునెమ్మొగమున్ దిలకించుచుండె న
మ్ముద్దియ నిర్నిమేషయయి పూర్ణశశాంకుడు తొంగి తొంగి వా
రిద్దరివంక గన్గొనగ నెంచి తొలంగుచునుండె గ్రమ్మరన్'' [19]

- వంటి పద్యాలు ఈ దశలో రాశారు. నూనూగు మీసాల నూత్న యవ్వనంలో రాసిన పద్యాలు కాబట్టి శృంగార రసస్ఫోరకంగా ఉన్నాయి.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారి షష్టిపూర్తి సందర్భమున రాసిన పంచరత్నాలనుండి ఒక పద్యం -

తన సౌఖ్యంబు దలంపకార్తజన సంతానంబు సేమంచె నె
మ్మనమునందెంచుచు లోభమోహమదకామక్రోధమాత్సర్య శ
త్రుని కాయంబు నడంచి యార్యగణ సంస్తుత్యంబుగాదేశ సే
వ నమ్ముంసేసెడి కర్మయోగివని సంభావింత్రునిన్నెల్లరున్'' [20]

ఈ పద్యంలో వావిలాల గోపాలకృష్ణయ్యగారి గుణగణాలు ప్రతిబింబిస్తున్నాయి.

## 10. అవధానాలు

అవధానమనగా మనోయోగము. అనగా మనస్సును చెదరకుండ ఆయా విషయాలలో నిలుపుట, చిత్తైకాగ్రత అనునది విదితమే.

అవధానాలలో అష్టావధానం, శతావధానం, సహస్రావధానం, నేత్రావధానం, నాట్యావధానం మొదలైనవి చేరుతాయి. తెలుగు సాహిత్యంలో అవదానం ఒక విశిష్ట ప్రక్రియ. ఇతర భాషల్లో ఈ ప్రక్రియ అంతగా కనిపించదు.

'అవధాని' అనగా అవధానము కలవాడు. బుద్ధి చెదరకుండా అనేక విషయాలు ధారణ చేయువాడు అని అర్థం. క్రమ ఘనా బటాది వేద పాఠ పాఠన విధానాలలో ఆరితేరిన వ్యక్తిని మౌలికంగా అవధాని అని వ్యవహరించుట సంప్రదాయము.

వైదిక పరిభాషలో ఒక నిర్దుష్టార్థంలో ప్రయుక్తమైన అవధాని శబ్దం తెలుగులో చిత్తైకాగ్రతతో కూడిన ఒకానొక సాహిత్య ప్రక్రియకు పేరే అవధానవిద్యగా మారినది.

సూర్యరాయాంధ్ర నిఘంటువులో అవధాన శబ్దానికి ఇచ్చిన అర్థాలు ఇలా ఉన్నాయి.

అవధానము - సం.వి.అ.అ - మనస్సు ఇతర విషయములపైనుండి మరలి యొక విషయముపై నిలిచి యుండుట, ఎచ్చరిక ఏకాగ్రత.

వీటినన్నిటినిబట్టి స్పష్టమయ్యే విషయం, అవధానానికి ఏకాగ్రత ఎంతో అవసరమని తిరుపతి వేంకటేశ్వర కవులు అవధానం చేయువారిని గురించి ఈ విధంగా వివరించారు.

''చదివినవారు లక్షలుగల్గినను నందు పండితుడొక్కడు బయలుదేరు. అట్టి పండితులలో నరయు వేయికి నొక్కరుండు కవీశ్వరుండునేమొ. అట్టి కవీశ్వరులందు నూటికి నొక్కరుడుండవధానియై యుండునేమో'' [21] అన్నారు. అవధానులు అంత అరుదుగా పుట్టుదురు. అవధాన విద్య అంత కష్టతరమైనది. అసాధారణ ప్రజ్ఞగలవారే అవధానాలు చేయగలరని దీనివలన తెలియుచున్నది.

ఇంకా ఈ అవధాన విద్యను గురించి - శ్రీమాన్ వంగిపురం కృష్ణమాచార్యులుగారు ఇలా పేర్కొన్నారు.

అవధానమనగా మనస్సు అనెడి పంజరములో పదములనెడి చిలుకలను దాచిపెట్టి విషయాంతరమనెడి పిల్లి ప్రవేశించకుండా భద్రముగానుంచి ధారణశక్తితో అవసరమైనప్పుడు దానిని బయుటకు తీయుట వంటిదని అలంకారయుతంగా రచించారు. ఇంకా అవధానమునునది కవియొక్క నాలుకయనెడి రంగస్థలముమీద రమణీయమైన నాట్యమొనర్చుచు సభ్యుల చిత్తములను రంజిల్లునట్లు చేయు కవికి కీర్తికలిగించు కళావిశేషముగ వారు తలంచిరి'' [22]

ఆచార్య దివాకర్ల వేంకావధానిగారు అవధాన సభను రక్తి కట్టించడానికి కవికి కావలసిన సాధన సామగ్రిని ఈ విధంగా తెలియజేశారు.

> ''అసమానంబగు పాండితీగరిమ, సద్య స్ఫూర్తి హాస్యోక్తిని
> వ్యసనం, బాశుకవిత్వదక్షత, పురాణోక్తి ప్రబోధక్రియో
> ల్లసనం, అద్భుత ధారణా మహిమ అత్యావశ్యకంబుల్ సుధీ
> రసికుల్మెచ్చ, వధాన కార్యము సభారమ్యంబుగా జేయగన్'' [23]

ఈ లక్షణాలు దివాకర్ల వేంకటావధానిగారు చేసిన అవధానాలలో పుష్కలంగా ఉంటాయి.

అవధానం అనేది ఒక విలక్షణమైన సాహితీ ప్రక్రియ బహుశః ఈ ప్రక్రియ సంస్కృతంలో తప్ప మరే ప్రపంచ సాహిత్య శాఖలలోనూ లేదనే చెప్పాలి. క్రీ.శ. 13, 14 శతాబ్దాల నుండి తెలుగుదేశంలో ఈ అవధాన విద్య ప్రచారంలో ఉన్నట్లు తెలుస్తోంది.

చతుష్షష్టి కళా ప్రపంచానికి చెందిన చమత్కార చారువులైన సాహితీ వినోదాలలో అవధాన విద్య ఒకటి. ఇది సంస్కృతంలో దృశ్యాదృశ్యంగా కనిపించినా చాలావరకు తెలుగువారు తీర్చిదిద్దుకొనిన విద్య ఘటికా శతగ్రంథ కల్పాదులూ, శతలేఖినీ పద్యసంధాన ధౌరేయులూ, గడియకునూరు పద్యాలు ఘంటము లేకుండా రచించగల ఆశుకవులూ, చాలామంది క్రిందటి దినాలలో కూడా తెలుగుదేశంలో ఉండినట్లు చరిత్ర సాక్ష్యమిస్తున్నది.

ఆధునిక యుగంలో అవధాన విద్యకు ఆద్యప్రవర్తకులు మాడభూషి వేంకటాచార్యులనీ, ముఖ్య ప్రవర్తకులు తిరుపతి వేంకటకవులని చెప్పవచ్చు. అవధాన విద్య తిరుపతి వేంకటకవుల కాలంనుండి తెలుగు దేశంలో మూడు పువ్వులారుకాయలుగ వర్ధిల్లుతున్నది. అవధానం చేసేవారికుండవలసిన లక్షణాలను స్థూలంగా ఈ విధంగా చెప్పుకోవచ్చు.

1. అవధానమనునది ఒకానొక మేధాజనిత పద్య విద్యావిశేషం

2. అవధానికి అఖండమైన ధారణాశక్తి అతి ముఖ్యం

3. సంగీతంలో ప్రజ్ఞ ఉంటే మంచిది. ఒకవేళ సంగీతంలో ప్రవేశం లేకపోయినా స్వర మాధుర్యం ఉండాలి.

4. అవధానానికి ఆశుకవితాధారమణిమయాలంకారం.

5. యుద్ధంలో వీరుని కత్తిమొన వలె అవధానం చేసేవారి కుశాగ్రబుద్ధి పనిచేయాలి.

6. అవధానం చేసేవారు సభ్యుల ఉల్లములను ఉల్లాసోన్ముఖం చేయగల హాస్య వాక్చతురాస్యులై ఉండాలి.

7. అవధానం చేసేవారికి తప్పనిసరిగా పాండితీగరిమ ఉండాలి.

8. అవధానం చేసేవారికి సమయస్ఫూర్తి ఎంతో అవసరం. ఇది అవధానాన్ని రాణింపజేస్తుంది.

అనగ మేథ, ధారణాశక్తి, స్వరమాధుర్యం, అశుకవితాధార, కుశాగ్రబుద్ధి, హాస్య వాక్చాతుర్యం, పాండితీగరిమ, సమయస్ఫూర్తి అనే గుణాలు అవధానం చేసే వారికి అత్యంతావసరం అని చెప్పవచ్చు.

పై గుణాలుంటేనే సభారంజకంగా అవధానం సాగుతుంది. ఈ లక్షణాలు కొందరికి పూర్వజన్మ సుకృతంవల్ల లభిస్తే కొందరు సాధన చేసి సాధించుకొంటారు.

## అవధానంలో ఉండే అంశాలు

1. నిషిద్ధాక్షరి - పృచ్ఛకుడు ఒక వృత్తంలో ఒక విషయాన్ని వర్ణింపమని కోరగా అవధాని ఆ వృత్తంలో ఆ విషయాన్ని వర్ణింప మొదలుపెట్టును. పృచ్ఛకుడు తనకు యే అక్షరము

అవసరం లేదో చెప్పి ఆ అక్షరమును నిషేధించుచుండును. నిషిద్ధాక్షరాన్ని వదలి అవధాని పద్యాన్ని నడిపించును.

2. సమస్య - ఒక పద్యపాదమునిచ్చి మిగిలిన పాదాలను పూరింపమనుట. ఈ సమస్యాపూరణ చమత్కారవంతంగా ఉంటుంది.

3. దత్తపతి - పృచ్ఛకుడు నాలుగు పదాలనిచ్చును. అవధాని ఆ పదాలువచ్చునట్లు పద్యం చెప్పును.

4. వర్ణన - పృచ్ఛకులడిగిన విషయాన్ని లోకోత్తరంగా వర్ణించుట, వర్ణన.

5. అప్రస్తుత ప్రసంగం - అప్రస్తుతమైన విషయాలను అడిగి అవధానియొక్క యేకాగ్రతను పరీక్షించునది అప్రస్తుత ప్రసంగం.

6. వ్యస్తాక్షరి - పృచ్ఛకుడు అవధానికి ఒక అక్షరమిచ్చి ఇది పద్యపాదంలో ఫలానాచోట రావలయునను అవధాని అట్లే చేయును.

7. వారకథనము - ఒక తేదీ ఇచ్చి ఇది యే వారమున వచ్చును లేక వచ్చి యుండెను అని పృచ్ఛకుడు అడుగగా అవధాని లెక్కగట్టి వారం పేరు చెప్పును.

8. పుష్పగణనము - ఘంటాసాధము, అవధానం చేసేటప్పుడు పృచ్ఛకుడు అప్పుడప్పుడు ఇచ్చిన పువ్వులనుగాని కొట్టిన ఘంటలను గాని లెక్కపెట్టి చెప్పుట.

9. శాస్రార్థము - శాస్త్రార్థ విచారణ అనగా వ్యాకరణ, అలంకార ఛందోశాస్త్రాది విషయాలను పృచ్ఛకుడు ప్రశ్నించుచుండును.

10. సహపఠనం - సంపాఠ్యమనబడునదే సహపఠనం.

11. ఆకాశపురాణం - పృచ్ఛకుడు ఏదో ఒక ప్రసిద్ధ కథ సూచించి దానిపై పురాణమును అల్లి చెప్పమనును.

12. పురాణము - అష్టాదశ పురాణాలలో వర్ణింపబడిన విషయాలలో ఏదో ఒక దానికి అర్థం చెప్పుట.

13. న్యస్తాక్షరి లేక నిర్దిష్టాక్షరి - పృచ్ఛకుడు కోరుకున్న వృత్తాన్ని నిర్దిష్టస్థానంలో దత్తములైన అక్షరాలను న్యస్తముగావించి కోరిన విషయాన్ని చెప్పమనుట.

14. ఛందోభాషణము - పృచ్ఛకుడు అడుగడుగున అడ్డు తగులుతూ ఛందస్సంబంధమైన ప్రశ్నలు వేయుచుండుట.

15. కావ్యపాఠము - దీనిని తిరుపతి వేంకట కవులు కావ్యోక్తియన్నారు.

సుప్రసిద్ధ కావ్యశ్లోకాలు చదివి పదచ్ఛేదము అర్థం, ఆకాంక్ష శబ్దరూప సమాసాల వ్యాఖ్య చెప్పబడును. ఇవీ అవదానంలో ఉండే ముఖ్యాంశాలు. దివాకర్ల అష్టావధానాలలో సమస్యాపూరణం, దత్తపది, వర్ణన, నిషిద్ధాక్షరి, పురాణ పఠనం, ఘంటానాథం, వారక ^సం, అప్రస్తుత ప్రశంస, పురాణ పఠనం అనే అంశాలుండేవి. వీటిలో పురాణ పఠనం ఉంటే న్యస్తాక్షరిని గాని, న్యస్తాక్షరి ఉంటే పురాణ పఠనంగాని తీసివేసేవారు.

ఆయన అవధానాలు చేయుట 1970 ప్రాంతంలో మొదలుపెట్టారు. ఆయన తన పేరులోని అవధానశబ్దం నేతిబీరకాయలోని నేయి కాకూడదని పేరును సార్థకం చేసుకోవాలని అవధానాలు చేయుట మొదలుపెట్టినానని'' అనేవారని ఆయన అవధానాలలో పాల్గొన్న డా. కె. రాజన్నశాస్త్రిగారు తెలియజేశారు. ఆయన చేసిన అవదానాలు సుమారు 15 దాకా ఉంటాయని డా. తిరుమల శ్రీనివాసాచార్యులుగారు తెలియజేశారు. అందులో అతికష్టంమీద నేను సేకరించగలిగినవి 9 అష్టావధానాలు.

ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు చేసిన అష్టావధానాలనుండి కొన్ని పద్యాలిక్కడ ఉదహరిస్తున్నాను.

1973వ సంవత్సరం ఏప్రిల్‌నెల నాల్గవ తేదీ ఉగాది పండుగ సందర్భంగా సికిందరాబాద్‌లో దివాకర్లవారు అష్టావధానం చేశారు. పృచ్ఛకులుగా ప్రసిద్ధ పండితులు పాల్గొన్నారు. (పృచ్ఛకుల వివరాలు లభించలేదు) అందులో సమస్యాపూరణకిచ్చిన పద్యపాదం ఇలా ఉంది.

'మంగలవాడె భర్తయగు మానుము దుఃఖము రాజనందినీ'' ఇది ఉత్పలమాలా పద్యపాదం. ఇందులోని అర్థం మంగలి కులానికి చెందిన వాడు భర్తకాగలడు దుఃఖము మానుము ఓ రాజకుమారీ అని. దీనిని విశిష్టమైన అర్థంలో ఇలా పూరించారు -

''చెంగటనున్న యట్టి యొక చన్నటి వాని కట్టి బెట్ట నీ
మంగళ మూర్తికిన్ పితయు మారయు లోపము చేయ రమ్మ నీ
కుంగల యోగ్యతాగరిమకున్ తగువానిని తెత్తునమ్మ యో
మంగలవాడే భర్తయగు మానుము దుఃఖము రాజనందినీ''

''యోమంగలవాడు'' అని కవి ఈ పూరణకు విశిష్టార్థాన్ని కలుగజేశాడు. మంగలవాడు యోమంగలవాడుగా మారిపోయాడు. (ఓ మంగలవాడు అనగా రక్షింపగలవాడు). ఆ అవధానంలోనే దత్తపదికిచ్చిన పదాలు- శాపము, తాపము, పాపము, కోపము, రామాయణార్థంలో పద్యం చెప్పాలి.

శాపమొసంగె కోసల నిశాపతికిన్ మునిపుత్రు బాపు సం
తాపము గూర్చి ఆ విధి విధానము గోరెను కైకయున్ మహో
పాపమటంచు నెంచకిన వంశమణిన్ వన వాసి చేయగన్
కోపముచేసుమిత్ర యనుగుల కొడుకుగ్రము దాల్చెనంతటన్

మునిపుత్రుడైన శ్రావణకుమారుని శాపముచేతకైక రాముడరణ్య వాసానికి వెళ్లాలనే వరం కోరింది. అది కైక చేసిన పాపం కాదు ఆ విషయం తెలియక సుమిత్ర ప్రియపుత్రుడైన శత్రుఘ్నుడు కైకమీది కోపంతో ఉగ్రుడైనాడు. అనే రామాయణార్థంలో ఈ పద్యం చెప్పబడింది. పురాణాల్లోని సూక్ష్మాతి సూక్ష్మమైన విషయాలు తెలిసి వుంటేనే అవధానం చేసేవారు రాణిస్తారు. వేంకటావదానిగారికి పురాణవిషయాలు కరతలామలకాలు.

చాలామంది రామాయణం రాసిన కవులు రాముణ్ణి అరణ్యావాసానికి పంపిన తప్పు మంధరకు కైకకు అంటగట్టారు. కానీ వాల్మీకిని అర్థం చేసుకొన్న కొంతమంది కవులు మాత్రం కైక నిమిత్తమాత్రురాలనే విషయాన్ని ధ్వనింపజేశారు. అవధానిగారు అటు వాల్మీకిని ఇటు విశ్వనాథ సత్యనారాయణను బాగా అర్థం చేసుకొన్న వారు కనుక ఈ పద్యంలో కైక నిమిత్తమాత్రురాలనే భావం కలిగేటట్లు చెప్పారు. ఇంత లోతైన విషయాలను అవధానపద్యంలో అందులోను దత్తపదిలో ఇమిడ్చి చెప్పుట అంత సులభమైన విద్య కాదు.

1973వ సంవత్సరం డిసెంబరు నెల 6వ తేదీ ప్రభుత్వ జూనియర్ కళాశాల, నాంపల్లి, హైదరాబాద్‌లో అవధానిగారు చేసిన అష్టావధానంలోనుండి రెండు పద్యాలు -

సమస్య : మీసలు ముంగురుల్ పొడమె మీనదృగంచకల మేల్మిబుగ్గలన్

మీన నేత్రయైన ఆమె మేలిమిబుగ్గల మీద మీసాలు ముంగురులు కనిపించాయి. అవి ఈ పాదానికి అర్థం. ఇది చాలా జటిలమైన సమస్య - ముఖాలకు పసుపు పూసుకోక పోవుటచేతనో మరే కారణం చేతనో కొంతమంది చంచలాక్షుల ముఖం మీసాలు తరచుగా కనిపిస్తుంటాయి. కానీ అవధానిగారు ఇంకా సరసంగా శృంగార రసవత్తరంగా ఈ సమస్యను పూరించారు.

''శ్రీసతిమీద ప్రేముడి కుశేశయ నేత్రుడు చేరదీసి సం
తోషముతోడ నిర్మల మృదూక్తులు పల్కుచు శయ్య చేరినీ
కోసమె వచ్చినాడనిన కూర్మిని ముద్దిడి అదరించుచోన్
మీసలు ముంగురుల్ పొడమె మీనదృగంచల మేల్మి బుగ్గలన్''

దత్తపది కిచ్చిన పదాలు - కరణము, చరణము, హరణము, మరణము.

కరణములందు పాటవము కల్గినెరింగెడి వేళయందు మీ
చరణములన్ మదిన్నిలిపి సజ్జనులాంతరవై రివర్గసం
హరణము చేసి మోక్ష పదమందగ యత్నము చేయగావలెన్
మరణము దగ్గరైన జతనంబులు వ్యర్థముగావెఈశ్వరా!

- అని చంపకమాలావృత్తంలో భక్తిపరంగా ఒక జీవిత సత్యాన్ని వ్యక్తంచేసే విధంగా చెప్పిన వైనం ఈ పద్యంలో కనిపిస్తుంది. దత్తపదిలో ఇచ్చిన పదాలకు న్యాయం చేకూర్చారీ పద్యంలో అవధానిగారు.

1974వ సంవత్సరం ఫిబ్రవరి 25వ తేదీ రావుబహద్దూర్ వెంకట్రామారెడ్డి మహిళా కళాశాల హైదరాబాద్‌లో చేసిన అష్టావధానంనుండి -

దత్తపదికి ఇచ్చిన పదాలు, సీత, గీత, భీత, మాత. అవధానం జరుగుతున్నది మహిళా కళాశాలలో. ప్రేక్షకులందరూ మహిళలే. అందులో సీత ఉండవచ్చు, గీత ఉండవచ్చు, మాత ఉండవచ్చు, అందుకే దత్తపదిలో ఈలాంటి పదాలు ఇచ్చి ఉండవచ్చు. పృచ్ఛకుని సమయస్ఫూర్తికిది చక్కని ఉదాహరణం. అవధానిగారు చెప్పిన పద్యం -

''సీతలు యాజ్ఞాసేనులు శచీ సతులై ముదమున్ ఘటింపను
ద్గీతచరిత్ర సంపదయు తేజముగల్గి చరింప నేర్పినన్
భీతమృగేక్షణల్ సకల విద్యలసారమెరింగి శారదా
మాత యనుగ్రహంబున సమంచిత సంవిదసాధ్యలైరిలన్''

పృచ్ఛకుడు పెండ్లికాని సీత గీత దాటితే భీత అవుతుంది. ఆ తరువాత మాత అవుతుంది అనే భావాన్ని ఆశించి ఉండవచ్చు కానీ అవధానిగారు శిష్టార్థంలో భీత మృగేక్షణలు శారదామాత దయవల్ల విద్యాధికలవుతున్నారనే భావాన్ని చెప్పారు. పృచ్ఛకున్ని దెబ్బతీసి ప్రేక్షకులను తనవైపుకు తిప్పుకొనే యత్నం చేశారు.

సమస్య - తన మోముంగని ఆతడంతకుని చెంతన్ జేర్చె దానింతన ముఖాన్ని యమధర్మరాజు చెంతకు తృటిలో చేర్చినని ఈ సమస్యకు అర్థం. దానిని అవధానిగారు -

''తనుజంపన్ జనియించినట్టిహరి నందస్వామి గేహంబునన్
ఘనరీతిన్ పెనుపొందుచుంటవిని యాకంసుండు పంపన్ విష
స్తనియై సుందరివోలె వచ్చి తన దుగ్ధంబీయ చేనెత్తు పూ
తన మోముంగని ఆ తడంతకుని చెంతన్ జేర్చెదానింతృటిన్''

భాగవతార్థంలో పూరించిన ఈ సమస్య 'తన'కు 'పూ' చేర్చుట వలన పూతన అనే

రాక్షసిని బాలకృష్ణుడు యముని దగ్గరికి పంపినాడనే అర్థం వచ్చింది. ఇది ఒక విధమైన చమత్కారం.

1974 మార్చి నాల్గవ తేదీ సర్దార్ పటేల్ కాలేజీ సికిందరాబాద్‌లో అవధానిగారు చేసిన అష్టావధానంలోని సమస్యాపూరణ పద్యం చాలా చమత్కారవంతంగా ఉంది.

సమస్య - మదగజయానకున్ రవిక మాత్రము చాలదె చీరయేటికిన్

- అవధానిగారి పూరణ -

''మదిగల కోర్కె దీరగ అమర్త్యవిభు ప్రతిముండు రాజు, స
మ్ముదమున వీధిబోవ అరమోడ్పు కనుంగీవ, తల్పుచాటునం
దొదిగి విశాలనేత్రముల ఊహలు నెమ్మది పొంగజూచున
మ్మదగజ యానకున్ రవిక మాత్రము చాలదె చీర యేటికిన్''

జటిలమైన సమస్యను సరసంగా పూరించిన విధానం ఇందులో ద్యోతకమవుతుంది.

ఈ అవధానంలోని వర్ణన పద్యం కూడా సమకాలీన సాంఘిక పరిస్థితిని అద్దంలో చూపినట్లుంది -

''ఎన్నికలంద నాదృతి పరీక్షల యందవి నీతి వింత తా
వన్నెల దుస్తులందు రతి పాఠ్యములందు విరక్తి వర్ధిలన్
మన్నగ బోధకాళియెడ మత్సర భావము, చిత్ర తారలం
దెన్నగ రాని ప్రీతి, వెలయించెడు నిప్పటి భ్రాతృ బృందముల్''

సమకాలీన సమాజంలో పేరుకపోతున్న అవలక్షణాలను ఎత్తిచూపి చురకలంటించిన వైనం కనిపిస్తుంది. ఎన్నికల్లో పరీక్షల్లో అవినీతి వన్నెల దుస్తులపై మోజు పాఠ్యభాగాలపై ఇష్టం లేక పోవుట ఉపాధ్యాయుల ఎడ మాత్సర్యం సినిమాతారలమీద ప్రేమకురిపించే ఇప్పటి విద్యార్థినీ విద్యార్థులమీద విసిరిన చురకలివి.

1974 మార్చి 24వ తేదీ ఉగాది సందర్భంగా ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రం వారు నిర్వహించిన అష్టావధానంలో సమస్యాపూరణ పద్యం ఎంతో చమత్కారవంతంగా ఉంది చూడండి.

సమస్య - అంగము చేత బట్టికొని ఆడిరి మేదిని పండితోత్తముల్ - దీని భావం చెప్పనవసరం లేదు. ఈ సమస్యను అవధానిగారు ఈ విధంగా పూరించారు.

''జంగమభూత సంతతియు స్థావరవస్తుచయంబు కాంతిపూ
రాంగములయ్యె ఎల్లెడ పికాళి రవంబు లెసంగె వల్లికా
సంగత భూజముల్ చెలగె చారు సుమ ప్రకరంబు తోప పం
చాంగము చేతబట్టుకొని యాడిరి మేదిని పండితోత్తముల్''

అంగాన్ని కాస్తా పంచాంగంగా మార్చి ఉగాది పండుగ వర్ణన చేశారు అవధానిగారు.

1979 ఆగస్టు 8వ తేదీన అవధానంలోని దత్తపది ఈ విధంగా ఉంది. కోడి, పాడి, లేడి, వేడి అనే పదాలతో రామాయణార్థంలో -

కోడిగ కూసి గౌతముని కూరిమి భార్యకు హానిచేసి యే
పాడియు లేక వజ్రి, దశవక్త్రుడు నట్టులె శాతకుంభపుం
లేడిని తోడుగా గొనుచు లేమను సీత హరించెనంతటన్
వేడి వెలుంగు వంగడగపు పెన్నిధి రాముడు ద్రుంచెనాతనిన్''

దేవేంద్రుడు చేసిన తప్పుకు పెద్ద శిక్ష పడలేదు. కానీ రావణాసురుడు చేసిన తప్పుకు మాత్రం అతనికి చావు తప్పలేదు. అని ఈ పద్య భావం. ''వేడి వెలుంగు వంగడపు పెన్నిధి'' అనే అచ్చ తెలుగు పదాలు పద్యానికెంతో వన్నె తెచ్చాయి. భావగర్భితంగా కూడా ఉన్నాయి. ఈ అవధానంలో పూరించిన సమస్య ''ఖరపద సేవలన్ సుతుడు గల్గెనొకానొక సుందరాంగికిన్'' గాడిదను సేవించినందువల్ల ఒక సుందరాంగికి కొడుకు పుట్టాడని భావం. ఇదెట్లు సాధ్యం? అనడానికి సాధ్యం కానిదేదీ ఉండదు.

''వరుడును తాను గూడి భహు భంగులనెన్ని వ్రతాలు చేసినన్
వరతనయుండుపుట్టని ఘనంబగువేదనచేత దంపతుల్
గురుతర భక్తితో తుదకు గొల్చిరి శంభుని, నంతచంద్ర శే
ఖర పదసేవలన్ సుతుడు గల్గె నొకానొక సుందరాంగికిన్''

ఖరపదసేవ చంద్రశేఖర పదసేవగా మారిపోయింది. అవధానిగారి ప్రతిభాపాటవం వలన.

1982 నవంబర్ 14వ తేదీ మరొక అవధానం చేశారు దివాకర్లవారు. అష్టావధానానికి పృచ్ఛకులుగా డా. కె.రాజన్నశాస్త్రిగారు ఉత్పల సత్యనారాయణాచార్యులుగారు, డా. ముదిగొండ శివప్రసాద్‌గారు మొదలైన పండితులు వ్యవహరించారు.

అందులో డా. కె.రాజన్న శాస్త్రిగారిచ్చిన సమస్యలు ఇలా ఉన్నాయి. ''అరసివచ్చె పంగువురయంబున కాశిగయాప్రయాగముల్'' అనగా ఒక కుంటివాడు కాశీ గయ ప్రయాగ క్షేత్రాలు తిరిగి వచ్చాడని భావం.

''భూరి వివేక వైభవ విభూషితులైతగు శాస్త్ర పారగుల్
దూరము పోవగా క్షణములో కనిపెట్టిన గాలి యోడపై
గారవమొప్ప పుత్రులు సుఖాసనమందు నిషణ్ణు చేయగా
ఆరసివచ్చె పంగువురయంబున కాశిగయాప్రయాగముల్''

పంగువు అనగా కుంటివాడు. గాలి ఓడ అనగా విమానం. విమానమెక్కి కాశీప్రయాగ గయలను ఒక కుంటివాడు చూసి వచ్చాడని భావం. ఈ అవధానంలో ఉత్పల సత్యనారాయణాచార్యులు వారిచ్చిన దత్తపది పద్యాలు - పట్టి, పొట్టి, గిట్టి కట్టి రామాయణార్థంలో చెప్పిన పద్యం -

''పొట్టి దిదాసిమంధర ఏవో వచనంబులు పల్కికైక రా
పట్టిని కాననంబులకు పంపగజేసెను వృద్ధభర్తచే
కట్టడి రావణుండు జనక ప్రభుకూతుహరింపరాముడున్
గిట్టికనీశు నాబి నరొగెల్చి అయోధ్యకు వచ్చె భార్యతోన్''

ఈ పద్యంలో రామాయణ కథనంతా చెప్పారు. మందర విషయంనుండి రావణుని సంహరించి శ్రీరాముడు సీతతో అయోధ్యకు వచ్చిన విషయమంతా ఈ నాలుగు మాటల్లో ఇమిడ్చారు.

ఈ అవధానంలో వర్ణన పృచ్ఛకులు డా. ముదిగొండ శివప్రసాద్‌గారు.

''ఆగమ గుప్తమైన పరమార్థము బాహిరవెట్టి సర్వలో
కాగము రూపుమాపిన మహాత్ముడు తిక్కన యజ్ఞతత్వల
క్షగత నామధేయమును చేతమునన్ గయిచేసి జన్మ జ
న్మాగత పాపసంహతి వినాశము సల్పితరించి పోయెదన్''

వేదాల్లోకి పరమార్థాలను విప్పిచెప్పి పాపము రూపుమాపిన తిక్కనను స్మరించి తరిస్తానని దీని భావం.

1983వ సంవత్సరం మే నెల 8వ తేదీ ఆదివారం సాయంకాలం ఐదు గంటలకు సికిందరాబాద్‌లో శ్రీ కన్యకాపరమేశ్వరి దేవాలయంలో శ్రీ బూరుగు సూర్యప్రకాశరావు గారి అధ్యక్షతన దివాకర్ల వేంకటావధానిగారు అష్టావధానం చేశారు. పృచ్ఛకులుగా డా. కె.రాజన్నశాస్త్రిగారు నిషిద్ధాక్షరి, మల్లంపల్లి సుబ్రహ్మణ్యశర్మగారు, దత్తపది, మూలారామమూర్తిగారు, న్యస్తాక్షరి, డా. ముదిగొండ శివప్రసాద్‌గారు - వర్ణన, విద్వాన్ జె.మురళీధరగారు - సమస్య, ఉత్పల సత్యనారాయణాచార్యులవారు కావ్యపఠనం నిర్వహించారు.

ఇందులో నిషేధాక్షరి పద్యం ఈ విధంగా ఉంది.

''ఘనధీ శ్రీలందంగా
మనముల ననయంబు తీవ్రమై సొంపగు భ
క్తిని చూపు నాశ్రితావళి
ఘృణ రక్షణ చేయ కన్యాకేశ్వరి గొల్తున్''

అవధానం చేస్తున్నది కన్యకాపరమేశ్వరి ఆలయంలో అందుకే ఆమెను స్తుతిస్తూ ఈ పద్యం చెప్పిన తీరు కనిపిస్తున్నది.

సమస్యాపూరణ పద్యం ఇలా ఉంది.

''భోజనమందు ప్రీతిగల పుణ్యులు దుర్జనమైత్రి సంగతుల్
గాజులు దాల్చువారల నెగాదిగ జూచెడి వ్యర్థ కాముకుల్
రాజిత కార్యసారము కరంబెరుగంగలవారికైవడిన్
మోజులు చూపజాలుదురె మోహన కావ్యకళాలతాంగిపై''

వ్యర్థ కాముకులు యేమీ చేయజాలరనే భావం ద్యోతకమవుతుంది.

ఈ అవధానంలో దత్తపదికివ్వబడిన పదాలు - అందము, కందము, చందము, చిందము, భారతార్థంలో చెప్పిన పద్యం.

''చిందము కౌరవాగ్రణుని చింతగు మాటల నేమె నమ్మరో
కందము తండ్రి తాతయును కర్ణుడు తానును పైనికార్య పుం
చందము నిశ్చయింతమని సర్వ సదస్సులు పాండవుల్ ముదం
బందమురాసురాంతకుడు హస్తినకేగెను రాయబారియై''

కౌరవుల అభిప్రాయం తెలిసికొనిన తరువాత కార్యాన్ని నిశ్చయించవచ్చునని శ్రీకృష్ణుడు రాయబారానికి వెళ్లినాడనే భావాన్ని ఈ దత్తపదిలో చెప్పారు.

ఆయన అవధానాలను పరిశీలించి చూస్తే కుశాగ్ర బుద్ధి వలెనె, ఆశుకవితాధార హాస్య వాక్చాతుర్యం ప్రస్ఫుటంగా గోచరిస్తున్నాయి. దివాకర్ల వేంకటావధాని అనే పేరులోగల అవధాని శబ్దాన్ని సార్థకం చేసుకొన్నారు. తన అవధాన కుశలతతో దివాకర్లవారు తన తాత దివాకర్ల తిరుపతిశాస్త్రిగారి పేరును నిలబెట్టారు. వేంకటావధానిగారు అమేయమైన ధారణాశక్తి సమన్వితులు, ఆయన సాహితీ రూపకాలకు వెచ్చించిన సమయాన్ని వాటిపై చూపించిన అభిమానాన్ని అవధానాల మీద చూపి వుంటే తాతకు ఏమాత్రం తీసిపోకుండా అవధాన విద్యలో రాణించి ఉండేవారు. అవధానాలు చేయుట ఆలస్యంగా ప్రారంభించినా

రాసిలో తక్కువైనా వాసిలో మాత్రం సమకాలీనులైన అవధానుల అవధానాలకు ఏమాత్రం తీసిపోవు అని చెప్పవచ్చు.

## సాహిత్య రూపకాలు

దివాకర్ల వేంకటావధానిగారికి ప్రబంధ సాహిత్యంపై చెప్పలేనంత అభిమానం, విద్యార్థులకు సామాన్య ప్రజలకు ప్రబంధ కవుల కవితా వైభవాన్ని పరిచయం చేయాలనే కోరిక ఆత్మదఘ్నంగా ఉండేది. ఈ తపన యొక్క తపః ఫలమే భువన విజయ సాహిత్య రూపక రూపకల్పన, ప్రదర్శనల పరంపర. ఈ ప్రయోగం సత్ఫలితాన్నివ్వడంతో ''భారతా వతరణము, కనకాభిషేకం, కవిబ్రహ్మ, ఇందిరా మందిరము, శ్రీమద్రామాయణా వతరణము'' అనే సాహిత్య రూపకాలను సృజించి ప్రదర్శించారు. ఈ ప్రదర్శనలు అన్ని ప్రాంతాల వారిని ఆకర్షించాయి. పండితులను పామరులను కూడా అలరింపజేశాయి. దివాకర్లవారి బృందం ఆంధ్ర రాష్ట్రంలోనే కాక మద్రాసు, బొంబాయి, ఢిల్లీ వంటి మహానగరాలలో కూడా ప్రదర్శనలిచ్చారు. రాష్ట్రేతరులు కూడా ఈ సాహితీ రూపకాలను అభిమానించి ఆదరించి ప్రోత్సహించారు.

## 11. భువన విజయం

దివాకర్లవారు సృజించిన సాహితీ రూపకాలలో మొట్టమొదటిది భువన విజయం. 1956వ సంవత్సరంలో గుంటూరులో కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు అల్లసాని పెద్దనగా, జమ్మలమడక మాధవరాయశర్మగారు తిమ్మరుసుగా ఇంకా కొంతమంది పండితులు కలిసి ఈ భువన విజయాన్ని ప్రదర్శించారు. ఈ బృందంలో అవదానిగారు లేరు అది ప్రేరణగా అప్పుడు విద్యార్థి దశలో ఉన్న జి.వి.సుబ్రహ్మణ్యంగారు వంటి వారు కోరగా దివాకర్లవారు భువన విజయ రూపకల్పన చేశారు. అదే సంవత్సరం కోఠిలో ఉన్న ఉస్మానియా విశ్వవిద్యాలయ మహిళా కళాశాలలో దర్బారు హాలులో మొదటిసారిగ దీనిని దివాకర్లవారు బృందం ప్రదర్శించారు. కృష్ణదేవరాయలుగా కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, తిమ్మరసుగా జి.వి.సుబ్రహ్మణ్యం, అల్లసాని పెద్దనగా కేశవపంతుల నరసింహశాస్త్రి, నంది తిమ్మనగా వేటూ ఆనందమూర్తి, భట్టుమూర్తిగా దివాకర్ల వేంకటావధాని, పింగళి సూరనగా ఉత్పల సత్యనారాయణాచార్యులు, తెనాలి రామకృష్ణుడుగా దాశరధి, ధూర్జటి మాదయ్యగారి మల్లన, అయ్యలరాజు రామభద్రుల పాత్రలను వరుసగా సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి, పాడిబంట మాధవశర్మ చెలమచర్ల రంగాచార్యులు పోషించారు. అప్పటినుండి 10-3-1985వ తేదీ ఆదివారం తాడేపల్లిగూడెంలో జరిగిన ప్రదర్శన నాటికి మూడువందల (300) ప్రదర్శనలైనాయని ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యంగారు తెలియజేశారు.

ఈ ప్రదర్శనలలో దివాకర్లవారి బృందంలో శ్రీ పి.వి.నరసింహారావుగారు ప్రస్తుతం భారతదేశ ప్రధానమంత్రి, శ్రీ గుంటూరు శేషేంద్రశర్మగారు, కోకా రాఘవరావుగారు, శ్రీ అయ్యదేవర పురుషోత్తంరావుగారు, డా. తిరుమల శ్రీనివాసాచార్యులుగారు మొదలైనవారు శ్రీకృష్ణదేవరాయల పాత్రను ధరించేవారు. తిమ్మరసుగ డా. ముదిగొండ శివప్రసాద్, డా. ఇరివెంటి కృష్ణమూర్తి, శశాంక నటించేవారు. ఆయా సమయాల్లో అష్టదిగ్గజ కవులుగా శ్రీ నోరి నరసింహశాస్త్రి, డా. తిరుమల శ్రీనివాసాచార్యులు, ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం, డా. కె. రాజన్నశాస్త్రి, డా. పి.వి.చలపతిరావు, అక్కిరాజు సుందర రామకృష్ణ, మూలారామమూర్తి, తిరుమల శేషాచార్యులు, సుబ్బారావు మొదలైనవారు పాత్రపోషణ చేసేవారు.

భువనవిజయ కార్యక్రమంలో మొదట దివాకర్లవారు అలనాటి శ్రీకృష్ణదేవరాయల భువన విజయ సభావైభవాన్ని, ఆంధ్ర సాహిత్యంలో దాని ప్రాముఖ్యతను ప్రశంసాపూర్వకమైన పరిచయం చేసేవారు. ఒకవిధంగా ఇది ప్రస్తావన లాంటిది. తరువాత భట్టులు బహుపరాకులు పలుకుతూ ఉండగా శ్రీకృష్ణదేవరాయలు ప్రవేశించి అందరికీ స్వాగతం చెబుతారు. తరువాత కవులు ఒక్కొక్కరు లేచి రాజుకు ఆశీస్సులు అందజేస్తారు. అనంతరం ఉపోద్ఘాతంలాంటి తిమ్మరసు ఉపన్యాసం, ఇందులో సమకాలీన రాజకీయ, సాంఘికాది విషయాల ప్రస్తావన, గోష్ఠి ఉద్దేశం, కవుల పరిచయం ముఖ్యంగా ఉంటాయి. కొన్ని ప్రదర్శనలలో రాజనర్తకి నృత్యం కూడ ఉంటుంది. ఆ తరువాత శ్రీకృష్ణదేవరాయలు అల్లసాని పెద్దనను మనుచరిత్ర వినిపింపుమనుట మనుచరిత్ర అంకితం అల్లసాని పెద్దనను రాజు సన్మానించడం కవుల వర్ణనాత్మకమైన ప్రశంసలు. తెనాలి రామకృష్ణుని హాస్యోక్తులతో కూడిన ఆక్షేపణ, అల్లసానివారి సమాధానం, కవుల సమస్యాపూరణంలు, కవులు తమ తమ ప్రబంధాలనుండి రసవంతమైన కొన్ని పద్యాలు రాగయుక్తంగా పఠించడం రాజుకూడా కొన్ని పద్యాలు తన కావ్యంనుండి పాడుట, కవులకు సన్మానం చేయడం ఉంటాయి. చివరగా ముఖ్య అతిథి రాజును మంత్రిని సన్మానించుటతో ఈ కార్యక్రమం ముగుస్తుంది. సుమారు మూడు గంటల సమయం ప్రదర్శింపబడుతుంది. అలనాటి శ్రీకృష్ణదేవరాయల దర్బారును కన్నులకు కట్టేటట్లు, ప్రబంధ సాహిత్య ప్రాముఖ్యతను చాటిచెప్పే విధంగా రాయలనాటి సాహితీ రసికతను సంస్కృతిని ప్రతిబింబించే విధంగా ఈ ప్రదర్శనలు చేశారు. సరససంభాషణలతో సాహిత్య సంగీత సమ్మేళనలతో ప్రేక్షకులను ఎంతో ఆకట్టుకున్నాయి.

ఈ రూపక వస్తువును మొదట అవధానిగారు రూపొందించారు. కానీ ఇది మారుతూ ఉండేది. దేశకాల పరిస్థితుల కనుగుణంగా ఇందులోని సంభాషణలు మారుతూ ఉండేవి. తరువాత ఇందులో పాల్గొనే పాత్రధారులే పాత్రోచిత సంభాషణలు రూపొందించుకున్న

సందర్భాలు కూడా ఉన్నాయి. అందువల్ల భువనవిజయం వ్రాతప్రతి ఒకచోట లభించలేదు. ఇది ముద్రితం కాలేదు. ప్రదర్శనకనువుగా పాత్రధారులు ఆయా కవుల గ్రంథాలలోని పద్యాలతో పాటు తమ సొంత పద్యాలు కూడా రచించి రాగయుక్తంగా పాడి ప్రేక్షకులను రంజింప చేసేవారు. కానీ ఇవన్నీ అవధానిగారి ఆధ్వర్యంలోనే జరిగేవి. పద్య విద్యను ప్రజలకు పరిచయం చేయాలనే ప్రగాఢమైన వాంఛ ఇందులో అంతస్సూత్రంగా ఉండేది. దివాకర్లవారు పద్యాలు పఠించే పద్ధతి ప్రేక్షకులను బాగా ఆకర్షించేది. మంచి స్పందన లభించేది. ఆయన లెక్కలేనన్ని పద్యాలు ధారాళంగా పఠించేవారు. పాత్రధారులందరు కూడా ప్రేక్షక రంజకంగా ఈ రూపకాన్ని ప్రదర్శించేవారు.

రసవత్తరమైన పద్యపఠనంతో చమత్కారవంతమైన సంభాషణాచాతురితో ప్రదర్శింపబడే ఈ భువన విజయ ప్రదర్శన ప్రేక్షకుల హృదయాలలో చెదరని ముద్రవేస్తుంది. రాయలనాటి కవితా రసజ్ఞతను, సాహితీ సాంస్కృతికవైభవాన్ని చాటిచెప్పే విధంగా ఈ రూపక ప్రదర్శనలు సాగినవి. ఇప్పుడు కూడా ఆయా సందర్భాలలో ఈ భువన విజయ ప్రదర్శనలు దివాకర్ల వేదిక పేరున డా. ముదిగొండ శివప్రసాద్ సారథ్యంలో జరుగుతూనే ఉన్నవి.

## 12. భారతావతరణం

రాజరాజనరేంద్రుని పట్టాభిషేకం జరిగి ముప్పై సంవత్సరాలు నిండిన సందర్భంగా ఏర్పాటుచేసిన ఉత్సవాలకు విద్వద్గోష్ఠికి నారాయణభట్టును ఆహ్వానించడం సోమేశ్వర సార్వభౌముని మంత్రియైన నారాయణభట్టు రాజసందేశాన్ని రాజరాజు సభలో వినిపించుట దానిలో దాయాదుల ప్రమాదం తప్పినదని అందరూ సంతోషించుట కానీ హిందువులంతా జైన బౌద్ధ మతానుయాయులుగా మారుతున్నారని చర్చించుట దీనికి పరిష్కారంగా వ్యాసుడు రచించిన అష్టాదశ పురాణాలను పురాణసారం మహాభారతాన్ని ఊరూర ప్రచారం చేయాలని భావించుట కానీ సంస్కృతం అందరికీ అర్థం కాదు. అన్ని పురాణాలను ప్రచారం చేయకపోయినా పంచమవేదమైన భారతాన్ని తెలుగులోనికి అనువదించితే కొంత మేలు జరగగలదని రాజరాజు, పండితులు అభిప్రాయపడుట, ఈ కార్యం నెరవేర్చమని నన్నయను రాజరాజు కోరుట, నన్నయ ఇది ఇప్పుడున్న పరిస్థితులలో అంత సులభతరం కాదు భారతాన్ని అనువాదం చేయడానికి తగినంత భాషా సామగ్రి తెలుగులో లేదని తెలియజేయుట, రాజరాజు పండితులు ప్రయత్నం చేస్తే నన్నయ తప్పక సఫలీకృతుడు కాగలడని అందుకు అందరి సహకారం వుంటుందని ప్రోత్సహించుట, క్షేమేంద్రుడు మాత్రం దానిని వ్యతిరేకించుట తుదకు ఆయన కూడా సహకరించుట నన్నయ నారాయణభట్టు సహాయం అవసరమని అతను అడుగుట, నారాయణభట్టు అందుకు

అంగీకరించుట నన్నయభట్టు భారతాంధ్రీకరణకు పూనుకొనుట ప్రారంభించుట ఇందులోని ఇతివృత్తం.

నన్నయ సమకాలీన పండితులైన నారాయణభట్టు క్షేమేంద్రుడు, వేములవాడ భీమకవి, భేతనభట్టు చిన్నమల్లన్న పెద్దమల్లన్న రాజరాజు కుమారుడు కుళోత్తుంగచోళుడు మంత్రి వద్దియ ప్రగడ పాత్రలతో ఈ రూపకాన్ని దివాకర్లవారు రచించారు. ఇందులో సుమారు 60 పద్యాలున్నాయి. ఇందులోగల చారిత్రకాంశాలు, రాజరాజనరేంద్రుని పట్టాభిషేకం జరిగిన ముప్పై సంవత్సరాలకు భారతరచన ప్రారంభింపబడినదనీ, అప్పుడాతనికి దాయాదులవలన ప్రమాదం ఉండేదని నారాయణభట్టు తన ప్రభువైన సోమేశ్వర రాజునుండి తెచ్చిన సందేశంవల్ల ఆ ప్రవాదం తప్పిందని మతపరంగా జైనులు బౌద్ధులు విజృంభిస్తున్నారని మహాభారతం తమిళ, కన్నడ భాషలలోకి పేరిందేవనాయనారు పంప మహాకవి అనువదించారని తెలుగులో కూడా ఆ ప్రయత్నం జరగాలనే తపన కవిపండితులకు రాజుకు కూడా ఉండేదని, కానీ అది కొంత శ్రమతో కూడుకున్న విషయమని కూడా ఈ రూపకంవల్ల తెలుస్తున్నది. అయినా నన్నయ ఆ బృహత్కార్యానికి పూనుకొని కవులు రాజరాజు కృతకృత్యులయినారనే విషయం సరసంగా రూపొందింపబడిన సాహితీ రూపకమిది. చిన్నమల్లన గణిత శాస్త్ర పండితుడు క్షేమేంద్రుడు సంస్కృత కవి, నారాయణభట్టు నన్నయ సహాధ్యాయి అయినా కన్నడ కవి అయిన మంత్రి తన ప్రభువు దగ్గర మంచి పలుకుబడి కలిగిన మంత్రిగా చిత్రింపబడినది. ఈ రూపకంలో ఇతని పాత్రకు చాలా ప్రాముఖ్యం ఉంది. నందంపూడిని అగ్రహారంగా కూడా రాజరాజు ఇతనికి దానం చేస్తాడు. భారతాన్ని తెలుగులోనికి అనువదించుట పాపమనే అభిప్రాయం క్షేమేంద్రుడు వ్యక్తీకరిస్తాడు. ఇటువంటి భావం ఎంతో కొంత ఉండబట్టే భారతాంధ్రీకరణ అంత ఆలస్యంగా జరిగిందని కూడా భావించవచ్చు. అందులో నన్నయ నాటికి తెలుగులోకి భారతాన్ని అనువదించుటకు కావలసినంత పదజాలం కూడా లేదనే విషయం ఈ రూపకంవల్ల తెలుస్తుంది.

రాజరాజనరేంద్రుని పాత్రను అయ్యదేవర పురుషోత్తమరావుగారు మంత్రి వద్దియప్రగడగ ముదిగొండ శివప్రసాదుగారు నన్నయ పాత్రను దివాకర్ల వేంకటావధానిగారు నారాయణభట్టు పాత్రను జి.వి.సుబ్రహ్మణ్యంగారు యువరాజైన కుళోత్తుంగ చోళుని పాత్రను ఉత్పల సత్యనారాయణచార్యులు సంస్కృత కవి క్షేమేంద్రుని పాత్రను సంస్కృతంలో మంచి పాండిత్యమున్న డా. కె.రాజన్న శాస్త్రిగారు వేములవాడ భీమకవిగ డా. తిరుమల శ్రీనివాసాచార్యులుగారు భేతనభట్టుగ తిరుమల శేషాచార్యులుగారు చిన్న మల్లన్న పాత్రను అక్కిరాజు సుందరరామకృష్ణగారు పెద్దమల్లన్న పాత్రను ముదిగొండ వీరభద్రమూర్తిగారు

పోషించేవారు. దీని వ్రాతప్రతిని అవధానిగారే తయారుచేశారు. దీని ప్రతిని డా. కె. రాజన్న శాస్త్రిగారు నాకిచ్చారు. మిగిలిన సాహితీ రూపకాలకు పూర్తిపాఠమున్న వ్రాతప్రతులుకానీ కాపీలుగానీ లభించలేదు. ఇటీవలే దివాకర్ల వేదికవారు దీనిని ప్రదర్శించారు. డా. కె. రాజన్నశాస్త్రిగారు నన్నయ పాత్రను పోషించి రక్తికట్టించారు.

ఈ రూపకంలోని సంభాషణలు చాటు పద్యాలనుండి, ప్రాచీన కావ్యాలనుండి గ్రహించినవి. పద్యాలొక్కొక్కప్పుడు ఈ కవులవి (పాత్రధారులవి) అయి ఉండవచ్చు, కాకపోవచ్చు. కానీ సందర్భోచితంగా కలపటం ఈ రూపకాలన్నిటిలో కనిపిస్తుంది. సొంతంగా రచించిన పద్యాలు, ఆశువుగా చెప్పిన పద్యాలు కూడా వీటిలో చోటుచేసుకొన్న సందర్భాలున్నాయి. ప్రదర్శన రసవత్తరంగా సాగడమే ముఖ్యం.

## 13. కవి బ్రహ్మ

క్రీ.శ. 12వ శతాబ్దంలో ఆంధ్రదేశంలో శైవ వైష్ణవ మతాల వ్యాప్తి జరిగింది. దానితో పరస్పర వైమనస్యాలు కలిగాయి. పరస్పర దర్శన, భాషణాదులను వదులుకొని ద్వేషించుకోవడం హింసించుకోవడం తీవ్ర స్థాయికి చేరుకొంది. ఈ రెండు మతాల మధ్య సామరస్యం కోసం యత్నించిన వారిలో తిక్కన ముఖ్యుడు. ఆయన తాను రాసిన భారతం పదిహేను పర్వాలను హరిహరనాథునికి అంకితం చేసి శివకేశవులకు భేదం లేదని సాటి చెప్పాడు. హరిహరాద్వైతాన్ని ప్రతిపాదించాడు. మనుమసిద్ధి రాజు కొలువులో మహామంత్రిగా గురుతర బాధ్యత నిర్వహించారు. నెల్లూరు సీమను పరిపాలించిన మనుమసిద్ధికి నిర్వచనోత్తర రామాయణ రాసి అంకితం చేశారు. మనుమసిద్ధిచే మామా అని పిలిపించుకొన్నాడు. యజ్ఞం చేసి సోమయాజి అయినాడు. తిక్కన ఇతివృత్తాన్ని దివాకర్లవారు రూపకంగా రూపొందించారు. ఇందులో మనుమసిద్ధిగా అయ్యదేవర పురుషోత్తమరావు ఒకసారి ఎం. ఆర్. అప్పారావుగారు కూడా వేశారు. తిక్కనగా దివాకర్లవారు మారనగ డా. జి.వి.సుబ్రహ్మణ్యంగారు కేతనగ ఉత్పల సత్యనారాయణాచార్యులుగారు అధర్వణా చార్యులుగా డా. తిరుమల శ్రీనివాసాచార్యులు సాధారణంగా పాత్రదారణ చేసేవారు. వీరిలో ఎవరికైనా వీలు లేనప్పుడు వేరేవారు కూడా అభినయించేవారు. ఇందులో చెప్పుకోదగ్గ విశేషం ఒక వ్యక్తి హరహరనాథునిగా వేషం వేసి సగం విష్ణువు, సగం శివుని ఆకృతితో దర్శనం ఇచ్చేవారు. తిక్కన దర్శించిన ఈ హరిహరనాథుని ప్రాముఖ్యం ఈ రూపకంలో ప్రధానమైనది కనుక దీనికి హరిహరనాథ సందర్శనం అనే పేరుకూడా పెట్టారు. శివకేశవ అభేదతత్వాన్ని తిక్కన కవిత్య తత్వాన్ని సమకాలీన వాతావరణాన్ని తెలియజెప్పుట ఈ రూపకం యొక్క ముఖ్యోద్దేశం.

## 14. కనకాభిషేకం

ఈ విధంగానే 'కనకాభిషేకం' సాహిత్య రూపకం కూడా రక్తికట్టే విధంగా ప్రదర్శించేవారు. శ్రీనాధుడు తన అసమాన్య పాండితీ ప్రతిభలతో, నిరర్గళ ప్రౌఢ కవితాధారతో ప్రౌఢ దేవరాయల ఆస్థానకవి అయిన గౌడ డిండిమభట్టును ఓడించి అతనికంచుడక్కను పగులగొట్టించి ప్రౌఢదేవరాయల ముత్యాలశాలలో కనకాభిషేకగౌరవం పొందుట దీనిలోని ఇతివృత్తం.

ఇందులో ప్రౌఢ దేవరాయలుగ అయ్యదేవర పురుషోత్తమరావు శ్రీనాధుడుగా, దివాకర్ల వేంకటావధానిగారు గౌడ డిండిమభట్టుగా, డా. జి.వి.సుబ్రహ్మణ్యంగారు, చంద్రశేఖర క్రియాశక్తి (డిండిమభట్టుకు శ్రీనాధునికి జరిగిన వాదనలో న్యాయనిర్ణేత)గా పాటి బండమాధవశర్మగారు, దగ్గుపల్లి దుగ్గనగా డా. పి.వి.చలపతిరావుగారు పిల్లలమఱ్ఱి పినవరభద్రుడుగా డా. తిరుమల శ్రీనివాసాచార్యులు, నంది మల్లనగా ముదిగొండ వీరభద్రమూర్తి ఘంటసింగనగా డా. కె.రాజన్నశాస్త్రి అక్కిరాజు సుందర రామకృష్ణగారలు పాత్రధారణ చేసి రక్తికట్టించేవారు. కొన్ని సందర్భాలలో ఈ పాత్రలను ధరించే అవకాశం కొత్తవారికి కూడా లభించేది. ఏ పాత్రను ఎవరు ధరించినా నిర్వహణా బాధ్యత మాత్రం దివాకర్లవారే చేపట్టేవారు. ఆనాటి చారిత్రకాంశాలు ఈనాటి రాజకీయాంశాలు కూడా ప్రతిబింబించే విధంగా ఈ ప్రదర్శనలుంటాయి.

## 15. ఇందిరా మందిరం

దీనికింకా శారదాధ్వజమనే పేరుకూడ ఉన్నట్లు ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యంగారు తన 'కలంతో కాలం' అనే వ్యాస సంకలనంలో పేర్కొన్నారు.

తంజావూరు నాయకరాజులలో సాసితీ పోషణలో అభినవ కృష్ణదేవరాయలుగా పేరుపొందినవాడు రఘునాథ భూపాలుడు. ఇతడు తంజావూరు సామ్రాజ్యాన్ని క్రీ.శ. 1614నుండి 1633 వరకు పాలించాడు. ఇతడు సుమారు వంద గ్రంథములు రచించెనట. కానీ వాటిలో రామాయణము, వాల్మీకి చరిత్ర అనేవి రెండు మాత్రం లభిస్తున్నాయి. ఇతని ఆస్థానంలో దక్షణాంధ్ర కవులకందరికి తలమానికమనదగిన చేమకూర వేంకటకవి, ఇతడు రచించిన సారంగధర చరిత్ర, విజయవిలాసము అను రెండు ప్రబంధాలు రఘునాథ భూపాలునకే అంకితం ఇవ్వబడినాయి. ఇంకా కృష్ణాధ్వరి, కాళయ్య కవి మొదలైనవారు కూడా రఘునాధుని ఆ స్థానాన్ని అలంకరించారు. రఘునాథ నాయకుని కుమారుడైన విజయ రాఘవుడు కూడా కవియే. వీరందరి పాత్రలతో రూపొందించిన రూపకమే ఇందిరా మందిరం, కృష్ణదేవరాయల సభా భవనానికి భువన విజయమనే పేరున్నట్లు రఘునాథ

భూపాలుని సభా భవనానికి ఇందిరా మందిరమనే పేరున్నది. అక్కడే విద్వద్గోష్ఠులు జరిగేవి. కనుక ఈ రూపకాలకు ఇందిరా మందిరమనే పేరుకూడా వ్యవహారంలో ఉంది. చేమకూర వేంకట కవి చమత్కారరస మంచితములైన పద్యాలెన్నో ఈ సాహితీ రూపకంలో చోటు చేసుకున్నాయి. మధురవాణి రంగాజమ్మ కవి చౌడప్ప పాత్రలు కూడా ఇందులో ఉంటాయి. మధురవాణి, రంగాజమ్మల పాత్రలను డా. పి. యశోదారెడ్డి, నాయని కృష్ణకుమారి, రావి భారతి పోషించేవారు.

## 16. శ్రీమద్రామాయణావతరణం - వాల్మీకి మహాకవి

సంస్కృతంలో రామాయణాన్ని రచించుటకు పూనుకొన్నప్పటి వాతావరణం దీనికి ఇతివృత్తం. వాల్మీకి చరిత్ర కూడా ఇందులో చోటుచేసుకున్నది. ఇందులో దివాకర్లవారు వాల్మీకి పాత్రను ధరించి అపర వాల్మీకిగా రాణించారు. 1985వ సంవత్సరంలో శృంగేరీ పీఠాధిపతి సమక్షంలో హైదరాబాద్‌లోని శంకరమఠంలో ఈ రూపకం ప్రదర్శింపబడింది. ఇది ఒకే ఒక ప్రదర్శనకు చోటుచేసుకున్నది. ఇందులో విష్ణువుగా అయ్యదేవర పురుషోత్తమరావుగారు బ్రహ్మగా డా. కె. రాజన్నశాస్త్రిగారు పాత్ర ధారణ చేశారు. రచన నిర్వహణ అంతా దివాకర్లవారిదే. నారదుడు బ్రహ్మ మొదలైనవారు వేటగాడు ఇందులో ప్రధాన పాత్రలు. వాల్మీకి శోకం శ్లోకంగా రూపుదాల్చిన ఘట్టాన్ని కరుణరసాత్మకంగా ఈ రూపకంలో రూపొందించారు. దివాకర్లవారు వాల్మీకి పాత్రను సజీవంగా పోషించారని పురుషోత్తమరావుగారు తెలియజేశారు. సాహితీ రూపకాలలో దివాకర్లవారి చివరి పాత్ర పోషణ ఇదే.

భారతావతరణం, కవిబ్రహ్మ, ఇందిరామందిరం, కనకాభిషేకం పదేసి ప్రదర్శనలకు లోపే ప్రదర్శింపబడినాయి. భువనవిజయం మాత్రం మూడు వందల ప్రదర్శనలను దాటింది. అవధానిగారి తరువాత కూడా ఈ ప్రదర్శన 'దివాకర్ల వేదిక' పేరుతో ఈ బృందం ప్రదర్శిస్తూనే ఉంది.

సాహిత్య రూపకాల గురించి ముఖ్యంగా భువనవిజయాన్ని గురించి ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యంగారి మాటల్లో -

''తెలంగాణంలో సాహిత్యచైతన్యం కలగడానికి భువన విజయ సాహిత్య రూపకం సముచిత పాత్ర నిర్వహించిందనటం చారిత్రక సత్యం. ఒకనాడు తెలంగాణ రచయితల సంఘం కవి సమ్మేళనాలను జరిపి యువతరంలో కవితా చైతన్యాన్ని మోసులెత్తింపజేసింది. ఆ తరువాత దివాకర్లవారి ఉపన్యాసపరంపర సాహితీ సదవగాహనను జాగృతం చేసింది. ఆ తరువాత వారి ఆధ్వర్యంలో నిర్వహింపబడుతున్న భువన విజయ సాహిత్య రూపకం సాహితీ రసికత్వాన్ని ప్రజలలో వ్యాపింపజేయడానికి బలంగా తోడ్పడింది. తెలుగు పద్యంలోని

ఒడుపులు, పద్యం భావయుక్తంగా చదవటంలోని చెణుకులు తెలుగువారి హృదయాలను ఈనాటికి ఉర్రూతలూగింపజేస్తున్నది''[24]

డా. ముదిగొండ శివప్రసాద్‌గారి మాటల్లో -

''భువనవిజయవ్యాప్తి ఆంధ్రదేశమంతటా సాగింది. ప్రవాసాంధ్ర ప్రాంతాలకు కూడా ప్రాకింది. మద్రాసు, బొంబాయి, హోసూరు, హంపి, బరంపురం మొదలైన ఎన్నో ప్రాంతాలలో ప్రదర్శనలివ్వడం జరిగింది. గురువుగారితో కలిసి 23 సంవత్సరాలు మేము కనీసం 300 ప్రదర్శనలైనా ఇచ్చి ఉంటాము. నాకు తెలిసినంతవరకూ ఒక సాహిత్య రూపకం ఇన్ని ప్రదర్శనలందుకోవటం మన తెలుగు జాతి చరిత్రలో అపూర్వము. భువనవిజయం వలననే దివాకర్లవారు మాచేత రాజరాజుదర్బారు, మనుమసిద్ధి దర్బారు, ప్రౌఢ రాయల దర్బారు, రఘునాథరాయల దర్బారులకు రూపకల్పన చేశారు. అయితే ఇవి ఒక్కొక్కటి పది ప్రదర్శనలకు మించి ఇవ్వలేదు''[25]

వీరి అభిప్రాయాలు అనుభవపూర్వకమైనవి. వీరిద్దరు ఇందులో ప్రధానపాత్రధారులుగా సూత్రధారులుగ వ్యవహరించినవారే.

ఈ సాహిత్య రూపకాలు తెలుగులో ఒక నూతన ప్రక్రియగా స్థిరపడినాయి. సాహితీ తత్త్వాలన్నీ బోధించాయి. శ్రవణానందం నేత్రానందంతోపాటు ఆలోచనామృతాన్ని అందించే ప్రయత్నం చేశాయి. వీటిలో చారిత్రకాంశాల చిత్రీకరణకంటే రసవద్ఘట్టాల చిత్రీకరణకే ప్రాధాన్యం హెచ్చుగా కనిపిస్తుంది. అష్టదిగ్గజ కవులందరూ సమకాలికులు కాదని, శ్రీకృష్ణదేవరాయల దర్బారులో వారు కాదని చారిత్రకుల, పరిశోధకుల అభిప్రాయం కానీ భువనవిజయంలో వీరందరూ కృష్ణదేవరాయల ఆస్థానంలోని వారనీ స్పష్టంగా చిత్రించుట జరిగింది. జనంలో కూడా ఈ భావం బలంగా నాటుకొని ఉంది చిన్నప్పుడు చదువుకొన్న పాఠ్యపుస్తకాల వల్ల కావచ్చు లేక జనశ్రుతుల వల్ల కావచ్చు. ఈ భావం స్థిరపడి ఉంది. జనానికి పద్య నాటకాలపై పద్యకావ్యాలపై అభిమానాన్ని ఆదరణను కలిగించే ప్రయత్నం ఈ సాహిత్య రూపకాలు చేశాయి. వీటి ప్రభావంతో 1965 జనవరి 27వ తేదీ వివేకవర్ధనీ సాయం కళాశాల ఆంధ్ర సారస్వత సమితి ''ఆంధ్ర సాహితీ దర్శనం'' పేరుతో ఆంధ్ర వాఙ్మయ చరిత్రను చిత్రించే సాంస్కృతిక ప్రదర్శనను నిర్వహించారు. ఆదికవి నన్నయ నుండి దక్షిణాంధ్రయుగ సాహిత్యం వరకు ఇందులో చోటుచేసుకొంది. అదేవిధంగా ఆధునిక యుగ సాహిత్యంపై నాగభైరవ కోటేశ్వరరావుగారు 'కవనవిజయం' పేరుతో ఒక రూపకాన్ని రూపొందించి ప్రదర్శనలిస్తున్నారు. ఇందులో నామసామ్యం కొంత వుంది కాని వస్తు సామ్యం అంతగా కనిపించదు. ఇవన్నీ అవధానిగారి సాహితీ రూపకాల ప్రేరణ వలననేనని చెప్పవచ్చును.

సాహిత్య రూపకాలు నిర్వహించిన అవధాని గారిని గురించి సాహితీ లోకంలో ప్రశంసలు బహుళంగా ఉన్న విమర్శలు కూడా ఒకటి రెండు లేకపోలేదు. సాహిత్య రూపకాల్లో ఆహార్యం అవసరం లేదని, ప్రబంధ కవుల పద్యాలకు బదులు పాత్రధారుల స్వీయకవితలు ప్రవేశపెడితే బాగుంటుందని కొందరి అభిప్రాయం.

ఈ అభిప్రాయాలకు అవధానిగారు ఆయా సభల్లో ఉపన్యాసాల్లో సమాధానాలు చెప్పి ఉన్నారు. ఆచార్య అవధానిగారు అభిప్రాయంలో -

విశ్వవిద్యాలయ ఆచార్యులు తరగతి గదుల్లో సాహిత్యాన్ని బోధించుటమే కాకుండా సమాజంలో సాహిత్య చైతన్యాన్ని కలిగించుట కూడ తమ బాధ్యతగా భావించాలని పేర్కొన్నారు.

తెలుగు సాహిత్యాన్ని సామాన్య ప్రజలకు అందుబాటులో వుండే ప్రక్రియలలో సమాజంలో ప్రచారం చేయాలి అంటే ఉపన్యాసం, రూపకం అనేవి శక్తివంతమైన సాధనాలుగ అవధానిగారు భావించారు. వాటిని రూపొందించారు. స్వయంగా ప్రయోగించారు. సాటి అధ్యాపకులను కూడా ఈ ఉద్యమ చైతన్యంతో ముందుకు నడిపించారు.

అవధానిగారి దృష్టిలో ఉపన్యాసం సాహిత్య రూపకం అనేవి సమాజ సేవకుపయోగించే సాహిత్య సాధనాలు. ఆయన ఆ భావంతోనే సాహిత్య రూపకాలను నిర్వహించారు. ఆయన ఎన్నడూ సన్మానాల కోసం సాహితీ రూపకాలను నిర్వహించలేదు. ఇక్కడ ఒక విషయం గమనించాలి. భువనవిజయ ప్రదర్శనాలలో కొన్ని అవధానిగారు వారి బృందం సొంత ఖర్చులతోనే నిర్వహించిన విషయం చాలామందికి తెలియదు.

అవధానిగారే ఒక సందర్భంలో అన్నారు ఈ సాహిత్య రూపకాలు ఒక సాహిత్య ఉద్యమం లాంటివి. ఇందులో పాల్గొనడం అదృష్టంగా భావిస్తున్నాను. భారతి సేవగా భావిస్తున్నాను. ఈ మాటలు అవధానిగారి ఆదర్శాల్ని వ్యక్తం చేస్తున్నాయి.

అవధానిగారి సాహిత్య రూపకాల్లో వేషధారణం తప్పకుండా ఉంటుండేది. శ్రీకృష్ణదేవ రాయలు తిమ్మరుసు పాత్రలకు పూర్తిగాను మిగిలిన కవుల పాత్రలకు సముచితంగాను వేషధారణ ఉండేది. దీనికి కూడా అవధానిగారు త్యాగరాజగానసభలో మాట్లాడుతూ సమాధానం చెప్పారు. ఈ సాహిత్య రూపకం సాహిత్యపరులకెంత ఉద్దేశింపబడిందో సామాన్య జనులకు కూడ అంతే ఉపయోగపడుతుంది. రాయలు అష్టదిగ్గజ కవులు అంటే తెలుగువారి హృదయంలో ఒక తియ్యని రూపకల్పన సజీవంగా నిలిచివుంది. రాయలవారి భువనవిజయ సభ నాటి వాతావరణం ప్రజల హృదయాలలో ప్రాదూపాలుగ నిలచిన పాత్రల రూపుకట్టేటట్లు ప్రత్యక్షమైనట్లు ఉన్నప్పుడే సాహిత్య రూపకం చూసిన తృప్తి ప్రజలకు

